# భగవాన్ రమణ మహర్షి

---

మధుర దగ్గిర వున్న వున్న తిరుచులి గ్రామంలో 1879 డిశంబరు 30 తేదీన వెంకట్రామన్ పుట్టారు. ఆయనే తరవాత భగవాన్ రమణ మహర్షి అనే పేరుతో విశ్వ విఖ్యాతి పొందారు. ఆ రోజే ఆర్ద్రదర్శనం పుణ్యదినం.

వెంకట్రామన్ మధురలో మిషన్ హైస్కూలులో చదువుకుంటూ వుండగా, తన పదహారో ఏట, ఓ సారి ఎవరో అరుణాచలం నించి వొస్తున్నానని చెపుతూ వుండగా విన్నారు. ఆ పేరు ఆ అబ్బాయిని ఏవో స్మృతులలో కలవర పెట్టింది.

17 ఏట కొద్ది నిమిషాలలో అతనికి ఆత్మసాక్షాత్కారం జరిగింది. ఒకరోజు అతను ఒంటరిగా మేడమీద కూచుని వుండగా, మృత్యువు సంగతి గట్టిగా మనసులోకి వొచ్చింది. చావు అంటే ఏమిటి? అని ప్రశ్నించుకుని, 'ఇదే కదా చావు'అని, చచ్చిపోయినట్టు పడుకుని శ్వాస నాపేశాడు.

"సరే, ఈ దేహం చచ్చిపోయింది. దీన్ని కాల్చి

బూడిద చేస్తారు. దాంతో నేను అంతమేనా? 'నేను' ఇంకా తెలుస్తోనే వుంది. కనక నేను ఈ దేహం కాదు. నాకు మృత్యువు లేదు'' అనుకునేప్పటికి అతని జ్ఞానోదయమయింది. 'నేను'అనేది మనసు ఆలోచనగాక, అది అనుభవమైపోయింది.

త్వరలోనే ఆయన ఎవరితోనూ చెప్పకుండా అరుణాచలానికి బైలుదేరి, సరాసరి ఆలయంలో గర్భగుడిలోకి వెళ్ళి తనతండ్రి అరుణాచలేశ్వరుడి దర్శనం చేసుకున్నారు. ఆ నాటి నించి ఆమరణాంతమూ అరుణాచలం వదలలేదు ఆయన. మొదట ఆలయంలోనూ, తరవాత వివిధ ఏకాంత స్తలాలలోనూ, ఆయన సమాధిలో గడిపారు కొన్నేళ్లు. త్వరలోనే ఆయన తల్లికి తెలిసి వొచ్చి ఇంటికి రమ్మని ఎంత ఏడ్చినా ఆయన కదల్లేదు. ఊళ్ళో ఆయన సంగతి తెలిసి, ఆయన ఉపదేశానికై మనుషులు వొస్తున్నారు.

1908 లో మహాకవి, పండితులు గణపతిశాస్త్రిగారు స్వామిని సందర్శించి, ఆయన సాక్షాత్తూ సర్వేశ్వరుడని తెలుసుకొని, ఆయన నించి ఉపదేశాన్ని అడిగి పొందారు. ఆయనే వెంకట్రామన్‌కి 'భగవాన్ రమణ మహర్షి' అని పేరు పెట్టి ప్రకటించింది. ఆయన మూలంగానే భగవాన్ కీర్తి దేశమంతా వ్యాపించింది.

1916 లో భగవాన్ తల్లీ, తమ్ముడూ అరుణాచలం వొచ్చి ఆయనతో స్తిరపడ్డారు. 1920 లో భగవాన్ తల్లి చచ్చిపోయింది. ఆమె దేహాన్ని కొండమీద నించి తీసుకుని



వొచ్చి పాలితీర్థం దగ్గిర సమాధి చేశారు. త్వరలో భగవాన్, ఆయన తమ్ముడు చిన్నస్వామి, శిష్యులూ కొండ దిగి వొచ్చి ఆ సమాధి దగ్గిరే స్తిరపడ్డారు. అప్పటి నించి లోకంలో అన్ని దేశాలలోనూ ప్రసిద్ధి కెక్కిన శ్రీ రమణాశ్రమం ప్రారంభమయింది.

ధనం కురిసింది, కీర్తి వ్యాపించింది. తీర్థ ప్రజలవలె దేశ దేశ ప్రజలు ఆయన్ని ప్రతి దినమూ దర్శించుకున్నారు. ఆయన రచించిన పుస్తకాలు ఎన్నో భాషల్లోకి తర్జుమాలైనాయి.

1950 ఏప్రిల్ 14 న రెండు సంవత్సరాలుగా ఆయన్ని బాధిస్తున్న సార్కోమావల్ల ఆయన నిర్యాణం చెందారు.

——

# స్మృతులు...



# ప్రస్తావన

ఆత్మసాక్షాత్కారం పొందిన మహాత్ముల స్థితి ఎట్లా ఉంటుందో, తక్కినవారు గ్రహించలేరు. వారి జీవితపు నడక పద్ధతి కూడా భేదంగా వుంటుంది. అంతేకాదు, ఆ జ్ఞానులలోనే, ఒకరి జీవిత పద్ధతీ, వారు బోధించే సాధనా పద్ధతీ ఒకరినుంచి ఇంకొకరికి వేరుగా ఉంటాయి. వారిలో కొందరు మనుష్యుల మధ్య వుండిపోయి, ఆశ్రమాలలో నివసించి, శిష్యుల్ని తయారు చేస్తారు. కొందరు నిలకడ లేకుండా తిరుగుతూ వుంటారు. కొందరు పాడతారు. కొందరు వాదిస్తారు, కొందరు బోధిస్తారు. కొందరు మౌనులు. కొందరసలు కంటికి కనపడరు. కొందరు రొష్టుపడి, ప్రజల ఆగ్రహంవల్ల కంటకబడతారు. కాని, వారికి కంటకం అంటదు. ఒకే మాట మాట్లాడి, ఒకే చర్య చూపినవారే కొందరు పూజనీయులై, చివరివరకు మన్ననలందుకుంటారు. కొందరు నిందపడతారు.

విచక్షణతో చూస్తే ఈ విభేదమంతా వారు వారు కల్పించుకున్నది కాదనీ, వారి మాటల, చేతల, ప్రోద్బల

మంతా ఈశ్వర చోదితమని తెలుస్తుంది. వారి చుట్టూ ఏం జరిగినా, వారికేం జరిగినా వారికి అంటదు. వారు మనుషులకి అర్థంకారు. ఎందుకంటే, మనుషులు మనసులతో ఆలోచించి చేస్తారు. అందువల్ల ఒకరికొకరు కొంతవరకన్నా అర్థమవుతారు. కాని ఈ జ్ఞానులకు మనోనాశనమవుతుంది. అందువల్ల వారి నడకలే వేఱు. వారి జీవిత సందర్భాలలో, సంబంధాలలో పరస్పర విరుద్ధాలెన్నో కనపడతాయి. వారి పనులలో కొన్నింటికి కారణాలు వున్నట్లు కనపడతాయి. కొన్నింటికి కనపడవు. పిచ్చివాడి పనులలాగో, పొగరెక్కి నిరంకుశుడైన నియంత పనులలాగో తోస్తాయి. వారి పనుల Consequences వారి నంటవు. నక్కలంక యోగి, తనని సమీపించినవారి గుండెల్లో దభేలని తన్నేవారు. తిరిగి ఎవరూ ఆయనని తన్నరు. తిట్టరు. తన్నులు తిన్నవాడికి బాధా, అవమానమూ. కాని ఆ యోగిని తంతే, తనని తన్నినట్టుకూడా తెలీదు అతనికి.

అట్లానే భగవాన్ జీవితంలో ఎన్నో విషయాలు అర్థంకావు - ఆయన ఈ ద్వంద్వాలు దాటిన మహర్షి అనీ, సర్వేశ్వరుడే అనీ నమ్మని వారికి, ఆయన యేమాత్రమూ అర్థంకారు, ఆయన మానవాతీతుడు గనక. ఆయనలో కనపడే వైరుధ్యాలకి మానవుల్లో వెతికినట్లు కారణాలు వెతకటం కాని, విమర్శించడంగాని అజ్ఞానం. ఏ మనిషికి, ఏ పరిస్థితికి, ఏ Situation కి అవసరమైనట్టు ఆ విధంగా మాట్లాడేవారు, ఆచరించేవారు ఆయన.



తన చుట్టూ ఆశ్రమంలో జరిగే వాటిలో ఆయనకి ఎంత సంబంధం వుందో చెప్పలేము. సంబంధం వుండనూ వుంది; ఉండనూ లేదు. లోకంలో జరిగే అత్యాచారాలకీ, ఈశ్వరుడికీ సంబంధం వున్నట్టా, లేనట్టా? ఆశ్రమాధికారులూ, ఆశ్రమవాసులూ తరచు ఆయనని అడక్కుండానే ఎన్నో చేసేవారు, భగవాన్‌కి ఇష్టం కాదని తెలిసికూడా. ఆ పనులు భగవాన్ కంటనో, చెవినో పడితేనేగాని, భగవాన్ వాటిని నోటీసు చేసేవారుకాదు. గమనించినప్పుడు ఒక్కొక్కసారి పిలిచి చీవాట్లు వేసేవారు. ఒక్కొక్కసారి యేమీ అనేవారు కారు. చీవాట్లేకాక ఆశ్రమాధికారి వీపుమీద మూడు కర్రలు విరిగాయని భగవాన్ అన్నట్లుగా చెప్పుకునేవారు. ఆశ్రమాధికారి మాత్రం భగవాన్ కంటపడకుండా, నిరంతరం నేరస్థుడివలె ఇటూ అటూ తప్పుకు తిరిగేవాడు.

భగవాన్ని దర్శించవచ్చినవారు ఆశ్రమంలో జరిగే ఘోరాలు, అన్యాయాలు, పక్షపాతాలు, డబ్బు గుంజడాలు- ఇవి భగవాన్‌తో చెప్పితే, "మీరు ఎందుకు వొచ్చారు? ఈ ఆశ్రమంలో జరిగే లోపాల్ని యెంచి సంస్కరించేందుకా అంతదూరంనుంచి వచ్చారు? మీ దేశంలో ఏమీ లేదా సంస్కరించేందుకు? మీరు వచ్చిన పని ఏదో అది చూసుకొని వెళ్ళరాదా?" అనేవారట.

ఆశ్రమ ధనం దుర్వినియోగమవుతోందనీ, ధనార్జనే ముఖ్యంగా వుందనీ భగవాన్‌తో అంటే, "వాళ్లు ధనంకోసం

చేరారు. నీకూ ఆ ఆశ ఉంటే వాళ్ళలో చేరి చూడు, భాగం పెడతారేమో?'' అన్నారట.

తన పేర నెల నెలా వసూలవుతున్న ధనం యెట్లా వినియోగమౌతోందో భగవాన్ పట్టించుకోలేదు. తన పేర యాచించడం భగవాన్‌కి యెన్నడూ ఇష్టంలేదు. లక్షలు కర్చు పెట్టి కట్టించిన ఆశ్రమాలయానికై యాచించపోతే, గట్టిగా నిషేధించారు భగవాన్. కాని, విన్నదెవరు?

అయినా, తన ఆజ్ఞను మీరి చందాలు పోగుచేసి కట్టిస్తున్న ఆలయాన్ని, అర్ధరాత్రులు భగవాన్ టార్చి వేసుకొని రాళ్లన్నీ పరీక్షించేవారట. అంతా తయారయిన తరువాత ఓ రాత్రి వెళ్ళి అక్కడ ప్రతిష్ఠించిన శ్రీచక్రంపైన చెయ్యివుంచి పదినిమిషాలు నుంచున్నారట. కుంభాభిషేకం మొదలైన పూజలన్నింటికి అభ్యర్థనపై మౌనాధ్యక్షత వహించారు.

పూజలూ, ఊరేగింపులూ, ఉత్సవాలు - ఏవీ లక్ష్యం లేవు భగవాన్‌కి. ముఖ్యంగా తనమీద పువ్వులు వెయ్యడం, తన ముందు కొబ్బరి కాయలు కొట్టడం, హారతులివ్వడం మొదలైనవి ఇష్టంలేదు. పుట్టిన జయంతి చేసినా, చేస్తున్నారు గనుక చూస్తూ కూచునే వారు—కూచోమంటే. ఆయనా దేవతా విగ్రహాల కిచ్చిన హారతి తెచ్చి యిస్తే అందరికి మల్లేనే కళ్ళ కద్దుకుని, విభూతి పెట్టుకునేవారు.

ఆయన జబ్బుగా వున్నప్పుడు ఆయన ఆయుస్సుకోసం గ్రహశాంతి, హోమాలు చేశారు. దాంట్లోవుండే Anomaly



ఏమీ తోచలేదు, ఆయన ఆయుస్సు కోరేవారికి. ఆ హోమాల, హారతులు, తీర్థం తీసుకున్నారాయన.

తనకు జబ్బు చేస్తే, మందు అవసరం లేదంటారు భగవాన్. కాని, భక్తులు దిగాలు పడ్డా, మందు తీసుకోమని బతిమాలినా, "సరే, తెండి'' అని, ఏ మందిచ్చినా అట్లా మింగుతూనే వుండేవారు.

వొచ్చిన ప్రజలు సాష్టాంగపడి నమస్కరించేవారు. కాని, భగవాన్ తల తిప్పి కూడా చూసేవారు కారు. కాని, ఎందుకో ఎప్పుడో ఎక్కడో శూన్యంలోకి చూస్తున్నవారు కాస్తా, చప్పున తనకి నమస్కరించే వారివంక చూసేవారు. ఒక్కొక్కరిని పలకరించేవారు కూడా. నవ్వేవారు. ఎన్నో కుశల ప్రశ్నలు వేసేవారు. దూరదేశాల నించి వొచ్చిన వారిని, పసి పిల్లలని, నడవలేని వృద్ధుల్ని ప్రత్యేకంగా చూసేవారు.

అధికారులు, బిచ్చగాళ్ళు, ధనవంతులు, సన్యాసులు, భక్తులు, రూపవంతులైన స్త్రీలు-ఎవ్వరూ ఆయన దృష్టిని తీసుకోలేక పోయేవారు. కొందరు ఎన్నో ప్రశ్నలతో వచ్చి, అడగడం ప్రారంభిస్తే ఎంతకీ పలికేవారు కారు. ఒకర్ని పిలిచి పలకరించి, ఎన్నో విషయాలు చెప్పేవారు. కొందరిని ఏ కారణం లేకుండా, తనని పలకరించగానే కసిరి కొట్టేవారు. కొందరిని గట్టిగా తిట్టేవారు. హాస్యం పట్టించి, వెక్కిరించి, అందరూ నవ్వేటట్లు చేసేవారు.

కొందరు భక్తులు ఆశ్రమం నుంచి వెళ్ళిపోయిన తరువాత భగవాన్ కలల్లో కనపడి రమ్మంటారు. లేదా, ఆ

భక్తుడికే యెంతో నిలువలేని ఆతృత కలుగుతుంది, భగవాన్ని యెప్పుడు చూస్తానా అని. దూరాల నుంచి, ఇబ్బందుల్లోనుంచి ఏదీ లక్ష్యం చేయక యెప్పుడు యెప్పుడు అంటూ వొస్తాడు ఆశ్రమానికి. అతను వొచ్చేప్పటికి భగవాన్ తల రెండో వేపు తిరిగి ఉంటుంది. అటు చూడరు. పలకరించరు. చిదునవ్వు నవ్వరు కొన్ని రోజులు. ఈ లోపల యెందర్ని పలుకరిస్తారో; ప్రేమగా పిలచి, మాట్లాడి, కుశల ప్రశ్నలు వేస్తారో!

కొందరు వుండేవారు. వారికి అందరి ముందూ భగవాన్‌తో మాట్లాడడం గొప్ప. అందరి వంకా చూస్తో. కాయితాలో పుస్తకమో పట్టుకుని, ఏదో సందేహాన్ని కల్పించుకుని వెళ్ళి భగవాన్ని పలకరించి మాట్లాడతారు-మధ్య మధ్య చుట్టూ వున్న వారి వంక గర్వంగా చూస్తో అంత స్వల్పమైన విషయాన్ని యెంతోసేపు మాట్లాడతారు, వాళ్ళతో భగవాన్. దూరం నుంచి వొచ్చి; త్వరలో వెళ్ళవలసిన ఇంకోరు తమ సందేహాలతో రోజులకి రోజులు వుండిపోవలసిందే. యెవ్వరికేది అవసరమో, ఏది వారిని తనకి కట్టివేస్తుందో, ఏది వారి అహాన్ని అణుస్తుందో—ఆ విధంగా జరిగిపోయేది భగవాన్‌ద్వారా.

ఆశ్రమంలో తనకి ఇష్టంలేని పని కాని, తను వొద్దన్న పని కాని జరుగుతూ వుంటే, పిలిచి చీవాట్లు వేసేవారు. కాని, అప్పటికి వినకపోతే మాట్లాడకుండా వూరుకొనేవారు. చాలాసార్లు భగవాన్ మీదే ఆంక్షలూ, ఆజ్ఞలూ పెట్టేవారు ఆశ్రమాధికార్లు.



మధ్యాహ్నం 12 నుంచి 2 గంటలదాకా భగవాన్ని ఎవరూ చూడకూడదని నిర్ణయించి, భగవాన్ని అడగకుండానే హాలు తలుపులు వేయించి వేశారు.

భగవాన్ "ఇదేమిటి?" అని అడిగితే, "మీ ఆరోగ్యము కోసం" అన్నారు. తలుపులు ముయ్యడానికి వీల్లేదనీ, 24 గంటలూ తలుపులు తెరిచి వుండాలనీ భగవాన్ అన్నా, వినిపించుకోలేదు అధికార్లు. అందుకని ఆయనే హాల్లోంచి బైటికి వొచ్చి కూర్చున్నారు. కాని, అప్పటికీ ఆశ్రమంవారు ఆయనమాట వినలేదు. ఒకటే బతిమాలారు. చివరికి అట్లాగే కానీ అని హాల్లోనే వుండిపోయినారు భగవాన్.

అనేకమంది భగవాన్‌కని ఫలహారాలు తెచ్చి పెట్టేవారు, వేళగాని వేళల కూడా—ఆయనకి అవి జీర్ణమవుతాయా, లేదా అనే ఆలోచన కూడా లేకుండా. చాలా సార్లు తిని బాధపడేవారు భగవాన్. ఒకరు యెంత తెచ్చి పెట్టినా తినేవారు. ఇంకోరు యెంతో భక్తితో విలువైన ఫలహారాలు పెట్టి తినమంటే-అటు తల త్రిప్పి కూడా చూసేవారుకారు. కొందరు ఆయన ముందు ఫలహారం పెట్టి, ఆయన పలక్కపోతే, అట్టానే చేతులు కట్టుకుని నించుని నించుని, ఇంక గతిలేక వెళ్లిపోయేవారు. ఒకరి చేతినుంచి ఇవాళ తిని ఇంకోసారి వాళ్లు తెస్తే, వాళ్ల వంక చూడనే చూడరు.

భగవాన్ Demeanour ఎప్పటికప్పుడు మారేది. ఆయన ఏ ఆనంద నిబిడీకృతమైన తేజోశూన్యంలోకో కిటికీలోంచి దిక్కుల అంచుల్ని దాటి చూస్తున్నప్పుడు, ఆయన ధ్యానముద్రలో కూచున్న సాక్షాత్ దక్షిణామూర్తి

అనిపించేవారు. పోజులేని ఆ శాంభవీ ముద్ర యెంతో ఆర్టి
స్టిక్‌గా వుండేది! ఆ అందంనించి కళ్లు తిప్పుకోలేక పోయే
వాళ్లం. కదలని మారని సూర్యోదయాన్ని చూసినట్లుండేది.
ఆయన ముఖంకాని, ఆయన దేహంకాని, మామూలుగా
అందాలు అలవాటైన నా కళ్ళకి, అందంగా కనపడేవి కావు.
కాని, ఆయన నిశ్చలంగా, గంభీరంగా కూచున్నారా-(ఆయన
దేహం అట్లాగే వుండేది.) కాని, మరి ఏమిటో యింత అందం,
ఇంత లావణ్యం! అవేంకాదు; ఏదో మనకు అలవాటైన
సౌందర్యాలకి art కూడా అందుకోలేని దేదో ఆయన్ని వెలి
గిస్తున్నట్టుండేది. ఒక్క కౌపీనం పెట్టుకున్న ఆయన, చక్రవర్తి
దుకూలాలు కట్టుకుని, రాజలాంఛనాలతో, నవరత్న సింహాస
నంపై కూచున్నట్లుగా వుండి దిగ్భ్రమ చెందేవాళ్లం. ఆ
స్థితిలోనైనాసరే, ఎవరన్నా "భగవాన్!" అన్నారూ -
ఎక్కడనించి దిగివొచ్చేదో ఆయనకి ఈ లోకస్మృతి. కాని
సర్వాంతర్యామి అయిన ఆయన దృష్టి దిగిరావడమేముంది!

భగవాన్ని పలకరించడమంటేనే యెంతో భయం.
ఏ అధికారమూ, పరివారమూ లేని, బలంలేని ఆ వృద్ధ
స్వరూపం ముందు, గొప్ప పదవుల్లో, అధికారాలలో వుండే
వారు, అతి గర్విష్టులు, సైన్యాధికారులు నమస్కరించడానికి
వొణికిపోయినారు.

రోజుకి మూడు నాలుగు సార్లు, ఆశ్రమంనించి కొండ
మీదికి వెళ్ళేవారు భగవాన్. ఆయన ముందు నడుస్తో, వెనక
కమండలం పట్టుకుని శిష్యుడూ, ఒకొక్క మెట్టే ఎక్కుతూ
వుండేవారు. అప్పుడప్పుడు కొండని ఇటూ అటూ చూసి,



వెనక్కి తిరిగి శిష్యుడితో చల్లగా మాట్లాడుతూ వుండేవారు.
కింద నుంచున్న నాబోటివారు తదేక దృష్టితో ఆయనవంకే
చూస్తో నుంచునేవారు, వారు కనుమరుగయిందాకా. ఏమని
పించేదంటే-అట్లా ఒకొక్క మెట్టే యెక్కుతో కొండ
చివరికి వెళ్లి, అక్కడనించి అట్లా ఆకాశంలోకి మాయమై
ఇంక తిరిగి రారేమోననిపించేది ప్రతిసారీ.

భగవాన్ చివరి రోజుల్లో కురుపులేచి ఆపరేషన్లు
అయి, శరీరం బలహీనమైన తరువాత ఆయన సోఫామీదనించి
లేవడానికి చేసే ప్రయత్నం చూస్తే చుట్టూ కూచున్నవారికి
ఆ బాధ తమ దేహాలలో పలుకుతున్నట్లుండేది. అట్లా బాధ
పలకడానికే ఆయన ఆ నెప్పిని పోగొట్టుకునేవారు కారేమో!
ఆయన పొందిన మహోన్నత స్థితీ, అనిర్వచనీయమైన ఆనం
దమూ, అవేకాదు,ఆయన శరీరానికి తటస్థించిన బాధలుకూడా
ఈ ప్రజలకోసమే గావును! కొన్ని ఏళ్ళు ఆయనకు మోకాళ్లు
నెప్పులు వుండేవి. ఎవరో ఒకరు పంపిన మందు తైలాన్ని
మర్దన చేస్తోనే వున్నారు, పిసికేవారు. సోఫామీదనించి లేస్తో
భగవాన్ తన మోకాళ్లని పిసుక్కునేవారు. ఎవరన్నా పిసక
బోతే "వుండవయ్యా! అంత పుణ్యమూ మీకేనా, ఈ
మోకాళ్లని పిసికి నన్ను కొంచెం పుణ్యం సంపాయించుకోనీ"
అనేవారు. ఆయన లేచి నుంచుని కర్ర నానుకుని ఒకొక్క
అడుగు వేస్తోవుంటే, భక్తుల్లో ప్రతివారి వూపిరి యెగిరిపోతూ
వుండేది-ఆయన వేసే ప్రతి అడుగుకీ.

ఆశ్రమాధికార్లు కట్టించిన కొత్త హాలు రాతి గుమ్మం
దాటడం అతి ప్రయాస అయ్యేది భగవాన్‌కి. చూసేవారికి,

చిన్నపిల్లలకికూడా యెట్లానన్నా ఆయన్ని పట్టుకుని దాటించా లనిపించేది. కాని, తమ బుజాల్ని పూతగా ఇవ్వాలని వెళ్ళే పరిచారకుల్ని విదిలించి పంపించేవారు భగవాన్. ఒక్కొక్క సారి ఆయన పడిపోయేవారుకూడా. కాని, సహాయంమాత్రం తీసుకునేవారుకారు.

మానవోద్ధరణకై ఈశ్వరుడు ఏ రూపంలోనో భూమిపై అవతరించి, తాను అనేకమందిని శిష్యులుగా తీసుకొని, వారిని సాధనలో పెట్టి పునీతుల్ని చేస్తారు. ప్రతి గురువు పద్ధతీ, తక్కినవారినుంచి ప్రత్యేకంగా వుంటుంది. కాని, ప్రతిగురువుకూడా తనను విశ్వసించి, తాను నియమించిన ప్రకారం ప్రశ్న లేకుండా నడవమనే ఆజ్ఞ ముఖ్యమైనది. వారు యే ప్రజలమధ్య అవతరిస్తారో వారి మతాలకీ, ఆచారాలకీ, పురాతన ధర్మాలకీ, కరుడు కట్టిన నీతులకీ కూడా చాలాసార్లు వారి బోధ విరోధంగా, విపరీతంగా వుండ వచ్చును. తాము నమ్మిన సిద్ధాంతాలకు వ్యతిరేకంగా నడచుకునే గురువుని భరించలేక చాలామంది వొదిలి పోతారు. కొందరు ఆ గురువుని వొదలలేక, ఆయన మాట వినలేక "ఆయన అంతేలే" అని తప్పుకు తిరుగుతూ వుంటారు.

భగవాన్ ఏ ఆచారాలూ పాటించేవారు కారు. తన దగ్గర చేరిన ఆచారవంతుల్ని, ఆ ఆచార బంధనాలనుంచి తప్పించాలని చాలా ప్రయత్నించారు. అంతటి గురువుని యెదురుగా పెట్టుకొని; ఆయన్ని సాక్షాత్ ఈశ్వరావతారమని స్తుతిస్తో-గర్వపడుతూనే, వారి దేవతార్చనలు, వ్రతాలు, మొక్కు-బళ్ళు, తీర్థయాత్రలు – సమస్తమూ చేస్తోనే వుండే



వారు భక్తులు. భగవాన్ని అడిగితే, "ఏదీ వొద్దు. నిశ్చలంగా కూచో. అది ఉత్తమమైన యాత్ర... కాశీకి పోతావా? ఇది కాశీకాదా? అరుణాచలంకన్నా పుణ్యక్షేత్రం యెక్కడ వుంది? ఇదే హిమాచలం. ఇదే కైలాసం" అంటూన్నా పోతూనే వుండేవారు.

ఆయన గొప్ప భక్తురాలు, ఎచ్చెమ్మ. ఒకసారి లక్ష తులసీ పత్రి వ్రతంచేసి, అలా చేశానని భగవాన్‌తో గొప్పగా చెప్పుకుంది. "ఆ చెట్టుని అన్నిసార్లు గిల్లడంకన్న, లక్షసార్లు నిన్ను నువ్వు గిల్లుకోకపోయినావా?" అన్నారట.

ఏది ఏమైనా, ఏది ఎటుపోయినా పట్టించుకోని భగవాన్, హాల్లో అద్దాల బీరువాకి ఆనుకునే పిల్లవాడితో అతి ఆత్రతగా "అద్దం, అద్దం పగులుతుంది" అని హెచ్చరించే వారు. తల్లి చచ్చిపోయిన ఉడత పిల్లని పెంచి; క్రిందపడి బీటలుపడ్డ పిచిక గుడ్డును తాను స్వయంగా జాగ్రత్త చేసి, పిల్ల ఐతే అందరికి చూపి ఆనందించేవారు భగవాన్. కాని, ఆయనకి చాలా ఆత్మీయులని అందరూ అనుకునేవారు చచ్చి పోతే, "అట్లాగా" అని వూరుకునేవారు. పుస్తకాలు బైన్డు చేస్తూ వుంటే, అలమారు చేస్తో వుంటే, ఆ చేసేవారిని విసిగించి, బలవంతం చేసి, పావు అంగుళంలో పదో వంతు కొలతలు కూడా సరిచేయించేవారు. వంటలూ అంతే. ఎట్లా వుండాలో, ఎన్నో Details చెప్పి, చేయించి, సరిగా చేస్తున్నారో లేదో లేచి వెళ్లి చూస్తో వుండేవారు. మళ్ళీ యెంత విలువైనవి కనపడ లేదన్నా, పాటైనా ఆయన వినుపించుకోనన్నా వినుపించుకోరు.

ఆయన ముందే హాల్లో స్త్రీలను గడకర్రలు పెట్టి నెట్టేవారు సేవకులు; స్థానం కోసం పోట్లాడుకునేవారు ఘరానా పెద్దలు; భోజనం దగ్గర కూచున్న కొత్త వాళ్లనిబైటికి గెంటేవారు. అయినా అట్లా చూస్తో వుండేవారు భగవాన్. కాని, ఒక పిట్టకు, ఒక చెట్టుకు ఏ హాని కలిగినా జాగ్రత్తగా నయం చేసేవారు; హాని చేసేవారిని చూసి ఉగ్రులయ్యేవారు.

ఆశ్రమంలో ఏది జరుగుతున్నా అవి ఏమి పట్టించుకోరనీ; అన్నిటికీ ఆయన అతీతులనీ అనిపించేది. ఇంకోప్పుడు ప్రతి చిన్న విషయమూ పట్టుకుని సాగదీస్తో వుంటే, ఆశ్చర్యం వేసేది. ఎంత గొప్పతనము, ఐశ్వర్యము, అందము, అధికారము, లోకంలో ఔన్నత్యము, ఆధ్యాత్మిక సాధన, తపస్సు, కీర్తి, లోకోపకారము, స్వార్థ రాహిత్యము ఆయన ముందు ఏ difference చెయ్యదు. తలెత్తి చూడరు. ఎవరన్నా introduce చేసినా పలుకరు. ఒకర్ని చూచి నిష్కారణంగా పలకరిస్తారు. నవ్వి ఆదరిస్తారు. వారినే మళ్ళీ indifferentగా చూస్తారు. ఒకరు యెంత Silly ప్రశ్నలు వేసినా సావధానంగా జవాబు చెప్పుతారు, వాళ్ల level కి వచ్చి. ఇంకొకరికి అసలు జవాబు చెప్పరు—ఒకటే ప్రశ్నయినా. "ఇంకా లోకాలున్నాయా? జన్మలున్నాయా?" అంటే- "ప్రశ్నించేవారెవరు?" అంటారు. ఇంకొకరికి తక్కిన లోకాల సంగతి, చావు అంటే ఏమిటో- అంతా detailedగా explain చేస్తారు.

వారిని దర్శించడానికి వచ్చేవారు కూడా వారిని చూడగానే అనేక విధాల reactions చూపేవారు.



ధ్యానంలో పడేవారు. indifferentగా లేచి పోయేవారు. నవ్వేవారు. పాపులమని ఏడ్చేవారు. అరచేవారు. హిస్టీరియాలోకి పోయేవారు. వెనక్కు విరుచుకు పడేవారు. స్తుతించేవారు. శ్లోకాలు చదివేవారు. అశుకవిత్వంలోకి break అయ్యేవారు. ఆయన్ని కౌగలించుకోవాలని ఆయనవేపు పరిగెత్తేవారు. ఒకటే అంతులేని నమస్కారాలు పెట్టేవారు. ఆయన పాదాలు అద్దుకోవాలనుకునేవారు. తిట్టేవారు. ధిక్కరించేవారు. నువ్వెంత అని ప్రశ్నించేవారు. పాడేవారు. సోఫా దిగి, లోకాన్నుద్ధరించమనేవారు. మూర్ఛలు పోయేవారు. ఒళ్ళు తెలియక తన్నుకునేవారు.

ఆశ్రమంవారు భోజనం పెట్టముపొమ్మంటే, ఒక్కొకరు సరాసరి భగవాన్ దగ్గరికివచ్చి భోజనం పెట్టించమని అడిగేవారు. భగవాన్ కొందరితో అసలుమాట్లాడరు. కొందరితో "నాకువీళ్లు పెడుతుంటే తింటున్నాను. వీళ్లు పొమ్మంటే నేనూ పోవాలి. నాకేం అధికారముంది?" అని వూరుకునేవారు. ఇంకొకరు అడిగితే, దగ్గరవున్న వాళ్లని పిలిచి అన్నం పెట్టించమని పంపేవారు. ఒక్కొకరిని పిలచి "భోజనం చేశావా? వెళ్ళి చెయ్యి" అనేవారు.

ఆశ్రమానికి డబ్బు కూడిన మొదటి రోజుల్లో, ముందు వాకిట్లో కాచుకొని వున్న బీదలకి, ఆవులకి, తక్కిన ప్రాణులకు భోజనం పెడితేనేకాని భగవాన్ భోజనానికి లేచేవారు కారు. ఆశ్రమంవారు బీదలకి వేరే పల్చని సాంబారు వొండితే, వారితో పోట్లాడి, తానా పల్చని సాంబారు వేసుకొని, వారికి

మంచి సాంబారు పోయించేవారు. తను తినే యిడ్లీలు ఆవులకు పెట్టించేవారు. ఆశ్రమం వారికి ఆ పనులు చాల కష్టంగా వుండి, యెట్లాగన్నా ఆయన కన్ను కప్పాలని చూసేవారు. విసుగు పుట్టి ఆయన ఆ విషయమై కల్పించుకోవడం మానేశారు. తన భక్తులకి భిన్నంగా తనకేమి అధికంగా పెట్టినా ఉగ్రులయ్యేవారు. తనకి జబ్బుగా వున్నా తనకి తెచ్చిన పళ్ళు పాలు అందరికీ పంచాల్సిందే. ఆ విధంగా తనకు ప్రత్యేక చూపినందుకు కోపించి - కాఫీ, పాలు మానేశారు భగవాన్, చాలకాలం.

భగవాన్‌కి ఎప్పుడూ ఏదో జబ్బు చేస్తునే వుండేది. మందు లిప్పించ చూసేవారు. ఎప్పుడూ భగవాన్ మందులు వద్దనేవారు. కాని, వొత్తిడిచేస్తే మీ ఇష్టం కానిమ్మనేవారు. తరువాత ఏ మందులు యెంత కాలం పోసినా మింగేవారు. చివరదశలో ఆయన దేహాన్ని అంతం చేసిన కురుపు లేచినపుడు ఏ మందూ, ఏ కోతా వద్దన్నారు. ఎట్లా వచ్చిందో అట్లానే పోతుందన్నారు. కాని, రెండు మూడేళ్లు దానికోసం పోసిన మందల్లా తాగారు; కోసిన కోతల్లా కోయించుకున్నారు.

ఏది ఏమైనా ఈ జ్ఞానులందరూ ప్రేమమయులు. వారు ఏది చేసినా - యెట్లా చేసినా అది వారినాశ్రయించిన వారి పురోభివృద్ధికే జరిగేది.

—చలం

---

# సాధుని శాంతమ్మ

నామరూపరహితమైన దేదో
అద్వైన నీవు
భక్తుల్ని రక్షించడానికై రూపం ధరించి
అరుణాచలంలో దర్శనమిచ్చావు.
ఓ జగత్కర్తా, రమణా!
విషయవాసన లన్నిటినీ పోగొట్టి
ఏ వృత్తులూ లేకండా చేసి
కరుణాస్వరూపుడవై
నా హృదయాన్నధిష్టించావు.
నీ పాదార విందాలకు
అడుగడుగునా నమస్కరిస్తున్నాను.

(శాంతమ్మగారి తమిళగీతం నించి.)

నా అన్న అల్లుడికి రామనాథపురంనుంచి దగ్గర వున్న పల్లెటూరికి బదిలీ అయింది. భార్య పుట్టింట్లో ఉండడంవల్ల అతను వొక్కడే వెళ్లి వంట చేసుకోలేక, నాకు కబురంపాడు. నాకప్పుడు నలభై యేళ్లు. వెళ్లాను, సామాన్లన్నీ వెంటతీసుకొని. బియ్యం పొయ్యిమీద పెట్టి కూర్చున్నానో లేదో, ఏ కారణం లేకుండానే నాలోంచి పెద్ద ప్రశ్న బయలుదేరింది.

"ఏమిటిది? నువ్వు చేస్తున్న పని! ముగ్గురు కొడుకులూ పోయినారు. భర్త పోయినాడు. కూతురికి పెండ్లి చేసి, ఆ కూతుర్నీ అల్లుణ్నీ అమితంగా ప్రేమించి నీకున్నదంతా వాళ్ళకోసం ఖర్చు చేశావు. ప్రసవించి పిల్లతో సహా కూతురు వచ్చింది. కూతురు పోయి ఆరు మాసాలయిందో లేదో, ఈ లోపలనే అన్న కూతుర్నీ అల్లుణ్నీ తెచ్చుకొని రామనాథపురం రాజుగారిని యాచించి, అతనికి ఉద్యోగం యిప్పించి, నీకు మిగిలిన దేదో వాళ్లిద్దరికీ ఖర్చుచేస్తో వండి పెడుతున్నావు. ఇందుకేనా నువ్వు పుట్టింది? ఎవరిమీదో ఒకరిమీద మమకారం తగిలించుకోకుండా నిలవలేవా? ఇతనెవరు? నువ్వెవరు? ఈ చాకిరీకి, ఈ ఖర్చుకి అర్థమేమిటి? ఇట్లాగే నీ కాలం

గడిస్తే, చివరికి నీ గతేం కాబోతుంది?" అని అడిగారు నాలో ఎవరో.

ఒక్కసారిగా నా కళ్లు వాస్తవానికి గట్టిగా తెరుచుకున్నాయి.

నేను వెంటనే నా అన్న అల్లుడి దగ్గరకు వెళ్లి "నేను రామేశ్వరం బయలుదేరుతున్నాను" అన్నాను.

"ఎప్పుడు?"

"ఇప్పుడే."

"అదేమిటి?"

"అది అంతే. నేను వెడుతున్నాను."

అతను ఆశ్చర్యంతో, అయిష్టంతో "నాకు తిండి ఎట్లా?" అని సణుగుకున్నాడు.

"అదంతా నాకు తెలీదు, నేను వెళుతున్నాను. పొయ్యిమీద అన్నం వుంది, చూసుకో" అని ఖచ్చితముగా చెప్పి, రైలెక్కాను.

ఆ ముందు రోజు అతను, అతని భార్య నా లోకం. వాళ్ళు తిన్నారా, లేదా? వాళ్లకి యిష్టమయ్యేట్లు వంట చేశానా? ఇంకా ఏం పెట్టను వాళ్లకి? ఇదే నా బతుకు. ఆలోచించితే వాళ్లెవరో, నే నెవరో!

రామేశ్వరం వెళ్లాను. ఒకటే వేదన. నాకు మోక్షమార్గం యెవరు చూపుతారు?

అక్కడ పురాణం చదివే ఒకామె వుంటే ఆమెకి సేవ చేస్తో వారింట్లో వున్నాను మొదట్లో. ఆమె నడిగాను,



పరమార్థం అర్థం కావాలంటే ఏం చదవమంటావని. 'కైవల్యం' అనే పుస్తకం చదవమంది ఆమె. అది యెక్కడ దొరుకుతుందంటే నాగస్వామిగారని ఒక స్వామి వున్నారు, ఆయన్నడగమంది. నాగస్వామిగారిని చిన్నతనంనుండి యెరుగుదును. వెళ్లి ఆయన్ని అడిగాను.

"ఎందుకు 'కైవల్యం' నీకు?"

"అది చదివితే మోక్షమార్గం స్పష్టమౌతుందన్నారు."

"'పుస్తకం చదివినంత మాత్రాన మోక్షమార్గం తెలుస్తుందా?"

"అంతకన్న ఏం చెయ్యను స్వామి?"

"నీ కా మార్గం తెలుసుకోవాలని గట్టికోర్కెవుందా?"

"అవును."

"మోక్షం తప్ప ఇంక దేనిపైనా ఆశ లేదా? అది సత్యమేనా?"

"అవును."

ఆయన నన్ను పరీక్షిస్తూ చూచారు. "సరే. రేపు పౌర్ణమినాడు రా" అన్నారు.

ఆ పౌర్ణమినాడు నాకు మహామంత్రం వుపదేశం చేశారు. ఆ వుపదేశం పొందుతూ వుంటేనే, ఆయన సాక్షాత్తూ పరమేశ్వరుడివలె కన్పించారు. ఆ మంత్రం వుచ్చరించడంతోనే వొళ్లు తెలీక, తన్మయురాలనై, యెంతోసేపు అట్లానే కూర్చుండిపోయినాను. నాకు యింత సులభంగా సద్గురువు దొరికారే అని చాలా సంతోషమయింది. ఆ నాటి

నుంచి ఒక సంవత్సరం కైవల్యం చదవడ మయ్యేవరకు ఆ దంపతుల్ని సేవించుకుని వుండిపోయినాను.

తరవాత రామనాధ పురానికి వెళ్ళి లోక వ్యవహార సంబంధాలు వదిలి నేను తెలుసుకున్న వేదాంత గ్రంథాలు చదివి వినేవారికి చెబుతూ ఆ మంత్రం జపించుకుంటూ కాలం గడుపుతున్నా.

అట్లా తొమ్మిది సంవత్సరాలు గడిచాయి. నాకు యాభై ఏండ్లు నిండాయి. రామనాధ పురవాసులైన మురుగనార్ (భగవాన్ శిష్యుడు) నా పఠన కాలక్షేపానికి వస్తూ వుండేవారు. వారి దగ్గర భగవాన్ శ్రీ రమణ మహర్షుల వారి చిత్ర పఠాన్ని ఒకనాడు చూచాను.

అప్పటి నుంచి భగవాన్ దర్శనం చేసుకోవాలని గట్టి కోర్కె కలిగింది. మురుగనార్ అప్పటికే అన్నీ వదలి భగవాన్ పాదాల్ని ఆశ్రయించుకొని అరుణాచలంలో ఉంటున్నారు. నేను ఎప్పుడూ బాగా బీదదాన్ని కావడంవల్ల అనుకున్నప్పుడు కొంచెం దూరం ప్రయాణం చెయ్యగల సామర్థ్యం నాకు లేదు. కొంత డబ్బు సమకూర్చుకోడానికి సంవత్సరం పట్టింది. నేను, మురుగనార్ గారి అక్క, మరి ఇంకా ముగ్గురు స్త్రీలు కలిసి అరుణాచలానికి బయలుదేరాము గంపెడాశతో; అది 1927 కార్తీక మాసం.

అప్పటికే భగవాన్ కొండ దిగి వచ్చి పాలి తీర్థం ప్రక్కన తల్లి సమాధిపైన వేసిన ఒక పాకలో ఉంటున్నారు. ఆ పాక తప్ప ఇంకేమీ లేదు. చుట్టూ అడవి. మేము ఊళ్ళో



ఒక ఇల్లు అద్దెకు తీసుకొని స్థిరపడ్డాము. మర్నాడు భగవాన్ దర్శనానికి వెళ్లినప్పుడు, వారు ఆ పాకలో ఓ నులక మంచం పైన కూర్చుండి ఉన్నారు. ప్రక్కన మురుగనారు. వారిని చూడగనే తెలిసింది, వారు గురు రూపంలో ఉన్న ఈశ్వరుడని. నేను తెచ్చిన పళ్లు వారి ముందు పెట్టి నమస్కరించి, "ఎన్నాళ్ళ నుంచో తమ దర్శనం చేసుకోవాలనే నా కోర్కె ఈ నాటికి తీరింది. ధన్యురాలనైనాను" అని చెప్పి, "స్వామి, నాకు ఈ మనసు అనేది లేకుండ చేసి కటాక్షించండి" అని అడిగినాను.

దానికి స్వామి మురుగనార్‌తో "ఆమెను కనుక్కోండి – మనసు అనేది ఒకటుందంటే, ఆ మనసు ఆకారమెటువంటిదో, ఆ మనసుగారికి మీసాలూ, గడ్డాలూ వున్నాయేమో చూడమనండి" అన్నారు.

ఆ మాటకి ఏమి సమాధానం చెప్పాలో తెలీలేదు నాకు. మురుగనార్ నన్ను చూచి "నీకు దీక్ష అయింది" అన్నారు. రమణ స్తుతి పంచకం నుంచి నేను ఒక పద్యం చదివాను అరవంలో. "నీవు స్వర్ణజోతి స్వరూపం. నీవు సర్వ పరిపూర్ణుడవు. నీవు పొందిన ఆత్మానుభూతి పరిమళమై సర్వ జగత్తును ఆవరించింది. ఆ రసాన్ని ఆస్వాదించి అందరూ నీ దగ్గరకే పరుగెత్తుకొని వస్తున్నారు. నేను ఆ పరిమళాన్ని రుచి చూచి నిలవలేక 'ఎక్కడ? నువ్వెక్కడ?' అని వెతుక్కుంటూ వచ్చాను" అని పాడాను.

అది విని "ఈ పద్యం ఈ అమ్మకి యెట్లా తెలిసింది?" అని అడిగారు భగవాన్.

దానికి మురుగనార్ నన్ను రామనాథ్‌లో తాను యెరుగుదునని, రమణ స్తుతి పంచకం కాపీ నాకు తాను ఇచ్చిన సంగతీ చెప్పారు.

ఆ విధముగా మేము ఐదుగురము నలభై రోజులు వున్నాము అరుణాచలంలో. ఊళ్ళో వండుకొని భోజనం చేసి; మాలో మేము చందాలు వేసుకుని మధ్యాహ్నం పన్నెండింటికి రోజూ ఏదో ఫలహారం తయారు చేసుకొని ఆశ్రమానికి చేరుకొనేవాళ్లము. మూడు గంటలకు స్వామికీ, అక్కడ ఉన్న భక్తులకీ మేము తెచ్చిన ఫలహారాన్ని పంచి పెట్టేవాళ్లము. అందరికి ఎంత ఇస్తామో అంత మాత్రమే స్వామివారికూడ ఇవ్వాలి. అంతకన్న యెక్కువ తీసుకోరు. కనుక అందరికి సరిపోయేటట్టే తయారు చేసేవాళ్లం. ఆ రోజుల్లో ఆశ్రమంలో చిన్నస్వామే వంట. గోపాలరావు అనే భక్తుడు ఊళ్ళో దొరికిన బియ్యం-అవీ ఆశ్రమానికి పంపేవారు. భక్తురాలు ఎచ్చమ్మ కూడా ఏదో ఒకటి పంపేవారు. ఆ వచ్చినవాటిని వంట చేసేవారు చిన్నస్వామి. నెయ్యిగాని, కూరలుగాని సరిగా ఉండేవి కావు. స్వామికి చారు అన్నమే చాలా రోజులు. చారు కూడా లేక ఉత్త ఊరగాయ ముక్కతో తిన్న రోజులు చాలా వున్నాయి.

ఇంతలో కార్తీకదీప ఉత్సవం దగ్గరకు వచ్చింది. ఆ రోజుల్లో కూడా దీపానికి వచ్చిన ప్రజలు గుంపులు గుంపులుగా ఉండేవారు, భగవానుని చూడడానికి. అందుకని తెల్లవారగట్ట మూడింటికే ఫలహారం తీసుకుని కూర్చునేవారు.



తెల్లవారిందా—లేవడానికీ, కదలడానికీ వీలు వుండేది కాదు భగవాన్‌కు. ఆయన చుట్టూ కర్రలు కట్టేవారు, గుంపు తోసుకుని మీద పడకుండా. దాంట్లో స్వామి, మురుగనారు, తక్కిన భక్తులు కూర్చునేవారు. అందుకని స్వామి నాతో "ఈ దీపం పదిరోజులు నువ్వేమీ ఫలహారం చేసి తీసుకొని రావద్దు. గుంపువల్ల ప్రయోజనం ఉండదు" అన్నారు. నేను ఏ పళ్లో తెచ్చి గుంపులో చొరబడి ఆ కర్రల సందు నుంచి స్వామివేపు ఆ పళ్లు పెట్టి వెళ్లిపోయేదాన్ని.

కార్తీకదీప ఉత్సవం ఐనాక నాతో వచ్చినవారు చిదంబరం వెళ్ళాలనుకుంటున్నారు. నాకేమో భగవాన్ జయంతి (పుట్టినరోజు) వరకు అరుణాచలంలోనే ఉండాలని ఉంది. కాని వాళ్లు వెళ్ళిపోతున్నారు కదా, నేను వెళ్ళాలని సెలవు తీసుకుందామని భగవాన్ దగ్గరకు వెళ్లాను. ఆయన నన్ను ఇంకో రోజు ఆగమన్నారు. భగవాన్ రచించిన 'ఉపదేశ సారం' అనే పుస్తకాలు అచ్చై మర్నాడు వస్తాయనీ, నన్ను ఓ కాపీ తీసుకొని వెళ్ళమనీ అన్నారు. మర్నాడు శలవు తీసుకోడానికి వెళ్లినపుడు 'ఉపదేశ సారం' కాపీ ఇచ్చి శలవిచ్చారు భగవాన్.

నేను ఆయనను వదిలి కదలలేక ఏడ్చాను. భగవాన్ నాతో చాలా దయగా, నాతోపాటు ఆయనా దిగులు పడుతున్నట్లుగా "నువ్వు రామనాథ్ వెళ్ళడం లేదు. ఎక్కడికీ వెళ్ళడం లేదు. అరుణాచలం వెళ్లుచున్నావు. ఇక్కడికి వచ్చిన వాళ్ళకి తిరిగి వెళ్ళడమంటే కష్టంగానే ఉంటుంది.

దిగులు పడకు. వెళ్ళిరా" అన్నారు. ఆ మాటలతో నాకు ఓదార్పు కలిగింది. ఆ రోజే చిదంబరం వెళ్లి, అక్కడ్నించి రామనాథపురం చేరుకున్నా.

నేను రామనాథ పురంలో తిరిగి అమ్మవారి పూజలు చేసుకుంటూ గ్రంథ పఠనం చేస్తో వున్నాను. ఏడాది గడిచింది. తిరిగి భగవాన్ జయంతి వస్తోంది. 'పోయిన జయంతికి వుండలేక పోతినే. ఈ జయంతికైనా వెళ్లగలనా?' అనే చింతలో వున్నాను. బీదదాన్ని; రైలు చార్జి కూడా లేదు నా దగ్గర. ఎక్కడన్నా అప్పుచేసి ఐనా సరే శనివారం బయలు దేరి తీరాలని నిశ్చయించుకున్నాను. శుక్రవారంనాడు టపాలో నాకు జయంతికి ఆహ్వానం వచ్చింది, భగవాన్ ఫొటోతో సహా. నాకెంతో ఆనంద మయింది. కరుణామయులు, ఈ క్షుద్రురాలిని జ్ఞాపక ముంచుకొని ఆహ్వానం పంపించారు. అరుణాచలం వెళ్ళిం తరువాత తెలిసింది; భగవాన్ స్వయంగా గోపాలరావుతో "శాంతమ్మకి ఒక ఆహ్వానపత్రిక పంప" మని చెప్పి పంపించారని.

## సర్వేశ్వరుడి కృప

నేను సద్గ్రంథాలు చదివి వినిపిస్తున్న సంగతి విని రామనాథపురం రాజావారి అంతఃపుర స్త్రీలు నాకు కబురంపి, వేదాంత గ్రంథాలు చదివించుకునేవారు. ఆ నాడు నేను నా కందిన ఆహ్వానం తీసుకొని ఆ రాణులకు చూపాను. భగవాన్ ఫొటో చూచి అందరూ ఆనందించారు. నాకు



జయంతికి వెళ్లాలని ఉందని చెప్పాను. వాళ్ళలో వాళ్లు చందాలు వేసికొని 30 రూపాయలు ఇచ్చారు. భగవాన్ నన్ను రప్పించుకోడానికి డబ్బు కూడా సమకూర్చారు. అనుకున్న నాటికి బయలుదేరి అరుణాచలం చేరుకో గలిగాను.

నేను ఆశ్రమానికి వెళ్ళేటప్పటికి ఒక హాలు కట్టారు. దాంట్లో భగవాన్ మామూలు మంచం మూల వేశారు. దానిపైన దిళ్లు వేసుకొని భగవాన్ కూర్చున్నారు. దండపాణి స్వామి "ఉల్లత్ నార్పత్" (భగవాన్ వ్రాసిన నలభై శ్లోకాలు) చదువుతూ ఉంటే భగవాన్ వాటికి వ్యాఖ్యానం చేసి చెబుతున్నారు.

భగవాన్ నన్ను చూడగానే "ఉల్లత్ నార్పత్ (పుస్తకం) నీకు రాలేదా? మురుగనారును నీకు పంపమన్నానే" అన్నారు. జయంతికి ఆహ్వానం కూడా స్వామి నా పేరు చెప్పి పంపమని జ్ఞాపకం చేశారట. సర్వేశ్వరుడే నా పైన అంత శ్రద్ధ వహించి, నా కట్లా సందేశాలు పంపుతే ఇంక వారిని విడవడం ఎట్లా సాధ్యమౌతుంది? నే నెంత? అజ్ఞానురాలిని, ఆడదాన్ని, అంత కృప నాపై కలగడానికి నేను చేసిం దేమున్నది?

## ఆశ్రమంలో స్థిరపడడం

అట్లాగే ఆశ్రమములో భగవాన్‌తో భోజనం చేసి ఆశ్రమంలో ఉండిపోయాను, నా స్వంత ఇల్లులాగ. రాత్రులు మాత్రం ఊళ్ళోకి పోయి భగవాన్ భక్తులు మొదలియార్ పాటి ఇంట్లోనో, ఎచ్చమ్మపాటి ఇంట్లోనో నిద్రపోయే దాన్ని.

కార్తీక ఉత్సవమూ, జయంతీ గడిచాయి. "ఇంక ఎంతకాల ముండగలను వీరి మీద భారమై? వెళ్లాలి గదా?" అని దిగులు పడుతూ ఓ రోజు భగవాన్ సముఖాన నిలిచి "ఇక్కడ ఉన్నంత కాలమూ శాంతంగా, తృప్తిగా, ఇంకేమీ అక్కర్లే కుండా ఉంటుంది. ఇంటికి వెళ్లానా, శాంతి ఉండదు. నేనేం చెయ్యను? భగవాన్‌ని వదిలి కదలలేకుండా ఉన్నాను" అన్నాను.

"నీ మనస్సు స్థిరపడ్డ దాక ఇక్కడ వుండు. తరువాత నువ్వు ఎక్కడికి వెళ్లినా శాంతి నీతోనే ఉంటుంది" అన్నారు. కానీ, ఎక్కడుండను? బైట ఉందామంటే బీదదాన్ని. జయంతి కాగానే ఆశ్రమానికి వచ్చిన అతిథులు వెళ్ళిపోతు న్నారు. నేనూ వెళ్లాలి కద? ఐనా, ఆశ్రమం వారికే తిండి పుష్కలముగా లేదే! నేను భారము కదా వీరికి? ఏమైనా నేను కదలలేను. ఏ విధంగానో నేను ఆశ్రమములో ఉండగలిగితే? అనుకుంటూ భోజనానికి వెళ్లాను.

వంటింట్లో చిన్నస్వామి, రామకృష్ణస్వామి మాట్లాడు కుంటున్నారు. చిన్నస్వామికి ఒళ్లు బాగాలేదు. వైద్యానికి మద్రాసు వెళ్ళుచున్నారు, ఓ రెండు నెలలపాటు. ఈ లోపల శాంతమ్మ వంట చేస్తూ ఆశ్రమంలో ఉంటుందా అని ఆలో చించుకుంటున్నారు. నన్ను చూడగానే అడిగారు. నా కంత కన్నా ఏం కావాలి? కరుణామూర్తి, నా కోర్కెని యెంత సులభంగా వెంటనే తీర్చారో స్వామి! అంతే. అప్పటి నుంచి



ఆశ్రమములో స్థిరపడి పోయినాను—నే నట్లా ఉండడం భగ వానుని ఆజ్ఞగా, ఆయన ఇచ్ఛగా, ఆయన వరంగా.

వంటింట్లో

నేను వంటింట అధికారిణిని ఆ నాటినుంచి. ఎల్ల ప్పుడూ భగవాన్ నా వెంట వుండి కూరలు తరగడమూ, అందివ్వడమూ, వంటకి సహాయము చెయ్యడమూ, ఎట్లా ఏమి వండాలో చెప్పడమూ, వండి చూపించడమూ—అంత కన్న ఏం కావాలి నాకు?

అట్లా స్వామి సన్నిధిలో గడిచింది కాలం. ఎంత పని చేస్తున్నా ఏమీ లక్ష్యం వుండేది కాదు. అంతసేపూ ఈశ్వ రుని సమక్షంలో ఈశ్వరుని సేవ చేస్తూ ఉన్నాననే భావమే హృదయాన్ని ఆనందంలో నింపేది. ఏ పూర్వ సుకృతమో నన్ను పరమేశ్వరుడి సన్నిధిలో నిలిపింది అని ఆశ్చర్య పడే దాన్ని.

భగవాన్ ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూనే ఉండే వారు. వంటింటిలో పనికాక, కర్రలు చెక్కడం, కట్టెలు కొట్టడం, పొట్లు తీయడం, అటుకులు ఏరడం, విస్తళ్లు కుట్టడం- ఇట్లా పనులు చేస్తూనే మాకు యెన్నో కబుర్లు, ఉపదేశాలు, [illegible]డాలు. ఆ పనుల్లోంచే మాకు వేదాంతం చూపేవారు. ఏమైతేనేం? అన్ని గంటలూ నా మనస్సు సులభంగా భగ వాన్‌పై నిలచేది. ఎప్పుడూ ఆయన సమక్షంలో ఉండడం వల్ల ఏదో విధంగా దృష్టి ఆయనపైన ఉండక తప్పదు. ఎప్పుడూ ఆయన సేవే, ఆయన ఆజ్ఞలే, ఆయన బోధనలే కావడం

వల్ల ఆయన నుంచి మనస్సు చెదరడానికి వీల్లేదు. మా ప్రయత్నాలు, ఉద్దేశాలు, ఆలోచనలూ అవసరం లేదు. అంతా ఆయన చూచుకుంటారు. నేను చేసే సేవ ఈశ్వరుడికి: ఈశ్వర భక్తులకే కదా?

## స్టోర్

చిన్నస్వామి ఆశ్రమాధికారి కాగానే అన్నారు: "ఇంక మంచి భోజన సామగ్రి తెప్పించి నిలవయుంచి భగవాన్‌కి మంచి భోజనం పెట్టించాలి" అని. ఆ మాటలు భగవాన్ చెవిని పడ్డాయి. "ఇంకేం? తెప్పించు, తెప్పించు. నెల్లూరి నుండి బియ్యం, వీడుపట్టు నుంచి పప్పూ—అన్నీ తెప్పించు" అని అన్నారు. ఆ నాటి నుండి యెన్నడూ తరగని సామాను కొట్టు ఏర్పడ్డది ఆశ్రమములో.

## దేవీ పూజ

ఆ మరుసటి సంవత్సరం నేను దసరాకి దేవీ పూజలు చెయ్యాలని రామనాథపురం వెళ్ళతానన్నాను. కాని, చిన్నస్వామి నన్ను వెళ్ళడానికి వీల్లేదన్నారు. అయినా వెళ్లాలనే కోర్కె నాలో బలంగానే పనిచేస్తోంది. మర్నాడు నేను భగవాన్ హాల్లో ధ్యానంలో కూర్చుండి ఉండగా వెళ్ళాను, ఆయనకి నా కోర్కె తెలియజేయాలని. నాకు అక్కడ భగవాన్ మాయమై, ఆయన కూర్చున్న స్థానంలో దివ్య తేజస్సుతో రెండేళ్ళ పిల్ల కనిపించింది. ఆమే, నేను పూజ చెయ్యడానికి రామనాథపురం వెళ్లాలనుకునే పరమేశ్వరి అనిపించింది. ఆనాటి



నుండి వేరే దేవతల్ని కొలవవలసిన అవసరం నాలోంచి పోయింది. అందరు దేవతలూ ఎవరినుంచి ఉద్భవించారో, ఆ ఈశ్వరుణ్నే ప్రతి దినము సేవిస్తుంటే ఇంకా వేరే పూజా విధానంతో దేవతల్ని కొలవవలసిన అవసర మేముంది?

## దీక్ష

ఒకరోజు ప్రొద్దున్న ఒక యూరపియను జట్కాలో నుంచి ఆశ్రమం ముందు దిగి, సరాసరి భగవాన్ దగ్గరకు వచ్చి కాగితం పైన ఏదో వ్రాసి చూపాడు. దానికి భగవాన్ ఏమీ జవాబు చెప్పక ఆయన వంక రెప్ప వాల్చకుండా చూచారు. ఆ చూపు తగలడంతో ఆయన చూపు భగవాన్ పైన దీక్షగా నిలిచింది. భగవాన్ కళ్లు మూసేశారు; అతని కళ్ళు మూతలు పడ్డాయి. కదలకుండా అట్లా ఇద్దరూ వుండి పోయినారు.

పదకొండు గంటలయింది. భగవాన్ భోజనానికి లేచే వేళయింది. మామూలుగా విస్తట్లో అన్నం వడ్డించి సాంబారు గిన్నె పట్టుకుని మరీ పిలుస్తాము, భగవానుని భోజనానికి. వెళ్లి భగవాన్ కమండలాన్ని పట్టుకుంటాడు మాధవ స్వామి. అదే పిలుపు. ఆ నాడు భగవాన్ దగ్గరకు పోవడమే భయంగా వుంది. పెదిమలు బిగించి, కళ్లు మూసికొని ఆయన కూర్చుండి వుంటే, ముఖం గొప్ప జ్యోతితో వెలిగిపోయింది. ఎవరమూ [illegible] వెళ్ల సాహసించలేదు.

పొద్దెక్కి పోయింది. చివరికి మాధవ స్వామి వెళ్ళి కమండలాన్ని ఎత్తినా భగవాన్ కదల లేదు.

భోజనం చల్లారిపోయింది. వడ్డించిన విస్తళ్ళ ముందు కూర్చున్న ఆశ్రమవాసులు అట్లానే కూర్చుని వున్నారు. చిన్నస్వామి ఇటు అటు తిరుగుతున్నాడు. ప్రొద్దెక్కిందని బిగ్గరగా అంటాడు. చెంబులు చప్పుడు చేస్తాడు. వాళ్ళకి వీళ్ళకి పనులు చెప్పుతాడు. మాధవస్వామి వెళ్లి కమండలము ఎత్తి చూచాడు, కాని, భగవాన్ కదల్లేదు.

చివరికి గడియారం పన్నెండు కొట్టినప్పుడు విని భగవాన్ కళ్లు తెరచారు. ఎర్రగా చింతనిప్పులవలె మండిపోతున్నాయి ఆయన కళ్లు. ఆ సంగతి ఎట్లా తెలిసిందో వచ్చిన ఆయనకూడా కళ్లు తెరచాడు. అదే సమయాన మాధవస్వామి కమండలం చేతపట్టాడు. భగవాన్ లేచారు. దొర భగవాన్‌కి నమస్కరించి లేచాడు. ఆయనని కూడా భోజనానికి ఉండమన్నారు. ఉండనని తల వూయించి జట్కా ఎక్కి వెళ్లిపోయినారు. ఆయన వూరూ తెలీదు, పేరూ తెలీదు. మళ్ళీ యీనాటికీ కనపడలేదు. ఆశ్రమంలో అందరూ అతనెవరో, ఎంత అదృష్టవంతుడో, భగవాన్ అంత శ్రద్ధచూపి సద్యోదీక్ష నివ్వడానికి ఎంత పుణ్యాత్ముడో అని ఆశ్చర్యపడ్డారు.

కల

ఆ రోజుల్లోనే నాకో కల వచ్చింది. గొప్ప కాంతి గల స్త్రీ ఒకామె సోఫాలో భగవాన్ ప్రక్కన కూర్చుండి వుంది. భగవాన్ స్వయంగా ఆమెకు అలంకారం చేస్తున్నారు. ఇంకొకామె ఇటూ అటూ తిరుగుతూ ఆశ్రమములో పనులు చేస్తోంది. నేను భగవాన్‌తో "అదేమిటి,



అంత సేవ చేస్తున్న ఆమెవంక చూడనన్నా చూడరు? మీ ప్రక్కను కూర్చున్న ఆమెను అంత ముద్దు చేస్తున్నారు!" అన్నాను. అంతలో సోఫామీది దేవిని మేళతాళాలతో పెద్ద వూరేగింపు చేస్తున్నారు. నాకు మెలుకువ వచ్చింది.

ఆ కల అంతా మురుగనారుతో చెప్పాను. ఆయన చెప్పారు. 'నేను సోఫాపైన చూచిన ఆమె మోక్షలక్ష్మి' అని. ఆమె ఎప్పుడూ భగవాన్ ప్రక్కన వుంటుందనీ, ఆ విషయం తాను యిదివరకే పాటల్లో వ్రాశాననీ చెప్పి, ఆ పాటలు నాకు వినిపించారు. మధ్యాహ్నం భగవాన్, నేను, మురుగనార్ పెద్ద పళ్లెం ముందు కూర్చుండి లడ్లు కడుతున్నాము. అప్పుడు నేను మురుగనారుతో నా స్వప్నం భగవాన్‌కి చెప్పమన్నాను. మురుగనారు ప్రారంభించారో లేదో "ఆ అమ్మకోసం నీవేమైనా వకాలత్ పుచ్చుకున్నావా? ఎవరికి కల వచ్చిందో వారినే చెప్పమను" అన్నారు.

నేను కల చెప్పాక భగవాన్ అన్నారు: "నాకు చేత [illegible]నే తల దువ్వడము, జడ వెయ్యడము, అలంకారం చెయ్యడము, మొగలి పువ్వులు జడలో పెట్టి కట్టడము అన్నీను. నేను కొండమీద వున్నప్పుడు నాకు ఒకామె భోజనం తీసుకొని వచ్చేది. ఆమె నాకో విస్తరి, నా ప్రక్కను ఖాళీగా రెండో విస్తరి వేసి వడ్డించేది. ఎవరికంటే–అది తల్లికనేది. ఆ అమ్మకి ఆ విధంగా దర్శనం అయింది" అన్నారు.

## మైసూరు మహారాజా

ఒకసారి ఆశ్రమములో అనుకుంటున్నారు, మైసూరు మహారాజా వస్తున్నారనీ, ఆయన భగవాన్‌ని హాలులో దర్శించరనీ, ప్రత్యేకంగా ఎవ్వరు లేకుండా దర్శనం ఏర్పాటు చేయమన్నారనీ. ఎట్లా? భగవాన్ ఏమి మాట్లాడరే? చివరికి భగవాన్ స్నానానికి వచ్చినప్పుడు అక్కడ ఏర్పాటు చేశారు. ఆ మహారాజుగారు ఎన్నో పళ్లాలల్లో, ఎన్నో పదార్థాలు తెచ్చి భగవాన్ పాదాలముందు పెట్టారు. మేము దూరంగా నిలబడి చూస్తున్నాము. పది నిమిషాలు నిలబడి భగవాన్ వంక చూస్తో వుండి చప్పున కాళ్లు పట్టుకున్నారు ఆయన. ఆయన కళ్ళవెంబడి ధారలు భగవాన్ పాదాలకి అభిషేకం చేశాయి. ఏదో దీనంగా మాట్లాడారు భగవాన్‌తో. అంతే. వెళ్ళిపోయినారు.

తరువాత కొద్ది రోజులలో తిరువాన్కూరు మహారాణి వచ్చారు ఆశ్రమానికి. ఆమెకోసం రోడ్లన్నీ బందోబస్తు చేశారు. ఆమె వచ్చి భగవాన్‌ని ఎన్నో ప్రశ్నలడిగి వెళ్లారు. మర్నాడు భగవాన్ భోజనం చేసి యింకా లేవకుండా విస్తరిముందు కూర్చున్న సమయంలో నేను అడిగాను: "తిరువాన్కూరు మహారాణి వచ్చారే! ఏమన్నారు?" అని.

"ఏదో వచ్చిందిలే - ప్రశ్నలడిగి వెళ్లింది. అంతకన్న ఏముంది?"

"మైసూరు మహారాజా...?"

"అతనా? అతనికేం? పండిన పండు" అని భగవాన్



ఏమి జరిగిందో, అతనేమన్నారో - అంతా అనుకరించి చూపారు, అతని మాటలూ, నమ్రతా, ఆపుకోలేని అతని దుఃఖమూ అన్నీ.

"'నన్ను ఓ మహారాజా అని కూర్చోపెట్టారు. అందువల్ల నేను మీవద్ద ఒక పరిచారకుణ్ణయి మీ సేవచేసే భాగ్యం నాకు లేకపోయింది. ఇక్కడ వుండను వీలు లేదు; మళ్ళీ మిమ్మ చూడడానికి రానూ లేను. ఈ పది నిమిషాల్లో నాకు సంపూర్ణానుగ్రహం దయచెయ్యండి' అన్నాడు" అని ఎంతో కదిలిపోయి మాట్లాడారు భగవాన్.

అటు తరువాత మైసూరు మహారాజా స్వదస్తూరితో పెద్ద ఉత్తరం రాశాడు భగవాన్‌కి. ఆ ఉత్తరం చివర భగవాను దగ్గర వెలిగించే పూదువత్తులు ఎక్కడ దొరుకుతాయో చిరునామా రాయించమన్నారు. అవి మైసూరు వత్తులే. ఆ మహారాజా అంతకన్న పరిమళమైన, విలువైన అగరువత్తుల్ని అనుభవించలేదా? కాని, ఎంత చేసినా భగవాన్ హాలులో పరిమళం ఏ వత్తులకి, ఎట్లా వస్తుంది? ఆ పరిమళం ఆ వత్తులదైతే కద?

## ఆవు దూడ

ఎవరో పల్లెటూరి ఆయనకు కల వచ్చింది: "నీ ఆవుకి పుట్టబోయే దూడను రమణాశ్రమానికి అర్పించు" మని. అట్లానే ఆవునీ, దూడనూ తెచ్చి భగవాన్‌కి అర్పించుకున్నాడు. కాని, ఇక్కడ అంతా అడవి. పెద్దపులులు తిరి

గేవి. హాలు తప్ప ఇంకో గట్టి ఇల్లు లేదు. అందుచేత ఆశ్రమం వారు "మా చేతకాదు. ఆవునీ; దూడనూ తీసుకొనిపో" అన్నారు. కాని, అతను "నాకు స్వప్నం వచ్చింది, తీసుకొని పో" నన్నాడు.

అందుచేత అతని అర్పణని స్వీకరించి, వూళ్ళో ఒక అతనికి పెంచమని ఇచ్చారు ఆవునీ, దూడనూ. ఆ దూడే గోవు లక్ష్మి. అది పెద్దదై మూడు దూడల్ని పెట్టేదాకా అతని దగ్గరే వుంది. ఈ లోపల ప్రతిరోజూ స్వామిని చూడ డానికి ఆశ్రమానికి వచ్చి - రాత్రులు వూళ్ళోకి వెళ్ళేది, తక్కిన స్త్రీల మల్లేనే. ప్రొద్దున్నే రావడం - ఆశ్రమంలోనే ఉండడం గడ్డి మేసుకుంటూ; మధ్యాహ్నం ఆశ్రమంలో భోజనం చెయ్యడం, మధ్య మధ్య స్వామిని దర్శించుకోవడం- యివి లక్ష్మిగారి కార్యక్రమం.

లక్ష్మికి అప్పుడు నిండు చూలు. మధ్యాహ్నం రెండు గంటలకు భగవాన్ పత్రిక చదువుచున్నారు. బి. వి. నర సింహ స్వామిగారు తాము రాయబోయే భగవాన్ జీవిత చరిత్ర కోసమై భగవాన్‌ని ఒకటే ప్రశ్నలు వేస్తున్నారు. ఆవు లక్ష్మి హాలులో ప్రవేశించి భగవాన్ చదువుతున్న పత్రికను నాకుతోంది. భగవాన్ లక్ష్మి వంక చూచి "కొంచెం ఆగు" అని పత్రిక చదువుకుంటున్నారు. కాని, లక్ష్మి విన లేదు. మళ్ళీ పత్రిక నాకుతోంది. భక్తవత్సలుడైన భగవాన్ పత్రికను అవతల పడేసి తన చేతిని లక్ష్మి కొమ్ముల మధ్య పెట్టి తన తలనుకూడ తన చేతిమీదికి వంచారు. అంతే. ఇద్దరూ కదలకుండా అట్లా వుండిపోయినారు.



నేను చూస్తూ పక్కన నుంచున్నాను. పది నిమిషా లయింది. భగవాన్ నా వైపు తిరిగి "లక్ష్మి ఏం చేస్తోందో నీకు తెలుసునా? లక్ష్మి సమాధిలో ఉంది" అన్నారు. నేను లక్ష్మి వంక చూచాను. ఒళ్లూ, కళ్లూ అన్నీ నిశ్చలంగా ప్రాణం లేనట్టు నుంచుని ఉంది, భగవాన్ కేసి గుడ్లు నిలిపి. కళ్ల వెంబడి ధారలగా నీళ్లు కారుతున్నాయి.

"ఏం, లక్ష్మి! యెట్లా ఉంది?" అని అడిగారు భగ వాన్. లక్ష్మి అట్లానే భగవాన్‌కి తోక చూపడం ఇష్టం లేనట్టు వెనక్కి వెనక్కి జరిగి గుమ్మంలోంచి వెళ్లి, హాలుకి ప్రదక్షిణం చేసి వెళ్లిపోయింది.

నాలుగు రోజుల తరువాత లక్ష్మి దూడని కన్నది. లక్ష్మిని పెంచుతున్న మనిషి పరిస్థితులు బాగుండక, ఆ ఆవుల్ని పెంచలేక, లక్ష్మినీ, మూడు దూడల్నీ ఆశ్రమంలో వదలి, కన్నీళ్లతో వెళ్లిపోయాడు. లక్ష్మి మూడు దూడలతో వచ్చి హాలులో భగవాన్ సోఫా ప్రక్కని పడుకుంది. దానిని చూచి భగవాన్ అన్నారు, "ఇన్నాళ్లూ లక్ష్మి స్వామిని వదిలి పోలేక అని సాయంత్రాలు ఏడుస్తూనే ఇంటికి పోయేది. ఇప్పుడు తన స్వంత యింటికి వచ్చి చివరికి చేరుకున్న సంతో షంతో పడుకుంది-తన సంసారమూ, తానూ. 'నేను, నా బిడ్డలు నీకు శరణాగతి. ఇంక నీదే భారం' అని పడుకుంది, చూశారా?" అన్నారు.

తృప్తి అయింది

ఒక రోజు ఒక సన్యాసి వచ్చి మూడు పళ్ళాలు ఆశ్ర

మంలో వుంటానన్నాడు. భగవాన్ అనుజ్ఞ యిచ్చారు. ఆయన్ని బాగా చూచారు ఆశ్రమంవారు. చివరి రోజున ఆయన భగవాన్ దగ్గరికి వచ్చి "స్వామీ! ఇన్ని రోజులు ఆశ్రమములో నన్ను చాలా ప్రేమతో చూచారు. సర్వవిధాలా తృప్తి అయింది. ఇంక నాకు ఆత్మ తృప్తిని ప్రసాదించండి" అని అడిగారు.

భగవాన్ సోఫా మీద నుంచి లేచి నుంచుని ఆయన చేతుల్ని పట్టుకున్నారు. అట్లా ఇద్దరూ నిశ్చలంగా నుంచున్నారు చాలసేపు. చివరకు ఆ స్వామి "తృప్తి అయింది. ధన్యోస్మి" అంటూ వెళ్ళిపోయినారు. ఈ విధంగా స్పర్శతో, మాటతో, మౌనంతో, చూపుతో, చూపుకూడ లేకుండ యెందరికి దీక్ష ఇచ్చారో భగవాన్!

ఆశ్రమంలో ఆ రోజులలో భగవాన్ భోజనానికి కూర్చుంటారనగా ముందుగా ఆశ్రమంలో ఆశ్రయం తీసుకున్న జంతువులకి ఆహారం పెట్టారో లేదో చూస్తారు. పిల్లులు, కుక్కలు, పిట్టలు మొదలైన వానికి భోజనమయిందో, లేదో స్వయంగా చూస్తారు. తరువాత పశువులకి ఇడ్డెన్లతో సహా పెట్టవలసిందే! యెక్కువమంది వచ్చి ఆశ్రమములో వండిన ఇడ్డెన్లు పశువులకు మిగలకపోతే భగవాన్‌కి జడిసి వూళ్ళోకి మనిషిని పరుగెత్తించి ఇడ్డెన్లు కొని తెప్పించేవారు.

మృగాలకి అయిన తరువాత బిచ్చానికి వచ్చిన మనుష్యులకి భోజన పంచి పెట్టాలి. ఎంత వుంటే అంతా ఇవ్వవలసిందే. వాళ్ళ తరువాతనే తన భోజనం. ముష్టివాళ్ళు కదా అని వాళ్ళకి, ముక్కల పులుసు కాచేదాన్ని. రోజు ఒక పులుసు



వాళ్ళకి, ఆశ్రమానికి సాంబారు వండేదాన్ని. ఆ పలచని పులుసు పేదవాళ్ళకు పొయ్యడం భగవాన్ చూచారా, "సాంబారు నా కెందుకు? ఆ పప్పు సాంబరు వాళ్ళకి పోసి, వండిన నీళ్ళ పులుసు నాకు పొయ్య"మని పట్టుపట్టేవారు. ఆయనతో పడలేక చారుకట్టు తియ్యగా మిగిలిన పప్పు వాళ్ళ పులుసులో వేసి కాచేదాన్ని.

కార్తీక దీపం రోజుల్లో ఉత్సవానికి వచ్చిన ముష్టివాళ్ళు చాలామంది వచ్చేవారు ఆశ్రమానికి. జయంతికి చెప్పనక్కర్లేదు. ఆ యేడు సుబ్రహ్మణ్యస్వామి భోజనం పంచిపెడుతూండగా గలాటా జరిగింది. తనకు అలవికాక అన్నం గిన్నెని అక్కడే పారేసి వచ్చేశారు. ఆ మరునాడు ఇక నుంచి ముష్టి వారికి భోజనాలు లేవన్నారు, ఆశ్రమాధికారులు.

ఆ రాత్రే నాకు కల వచ్చింది: భగవాన్ హాలులో భక్తులందరు కూర్చుని యున్నారు. భగవాన్ సోఫామీద చిన్నది, మృగం మాదిరిది ఒకటి వుంది. ఆ చిన్న మృగం వెంటనే ఒక అద్భుతమైన ఎర్రని మహాశ్వంగా ఎదిగింది. అది వచ్చి ప్రతి భక్తుణ్ణి వాసన చూస్తోంది వరుసగా. నా దగ్గరకు వస్తుందేమో అని నా గుండె దడదడ లాడుతూంది. ఆ గుర్రం వెళ్ళి భగవాన్‌ని వళ్ళంతా నాకి, మాయమైంది. భగవాన్ నన్ను దగ్గిరికి పిలిచి యెందుకట్లా భయపడతానని అడిగి, గుండెలపైన చెయ్యి వేశారు. నా వణుకు వెంటనే ఆగింది. భగవాన్ దేహంలోంచి ఒక దేవతా పరిమళం బైలుదేరింది. అట్లాంటిది నే నెన్నడూ వాసన చూచి ఎరుగను.

అప్పుడు అన్నారు: "అదిమామూలు గుర్రమనుకోకు.

కార్తీక ఉత్సవానికి అరుణాచలేశ్వరాలయంలో ధ్వజ మెత్త
గానే ఆ ఉత్సవములో పాల్గొనటానికి పై నుండి దిగివచ్చి,
అనేక దేవతలు అనేక రూపాలలో ప్రజలతో కలిసి తిరుగు
తుంటారు. ముష్టికి వచ్చిన గుంపులో ఎవరు కలిసి ఉంటారో
ఎట్లా తెలుసుకోగలరు? ముష్టివాళ్లకీ, సాధువులకీ భోజనం
వెయ్యడం ఆపకండి. ఎంత ఉంటే అంతలోనే పెట్టండి. తిండి
లేదు పొమ్మనకండి'' అన్నారు.

నాకు మెలకువ వచ్చింది. పొద్దున్నే ఆ కల చిన్న
స్వామికి చెప్పాను. నా కల విని ఏడు పళ్ళ బియ్యం వార్చ
మన్నారు. ఆ రోజున మరల బీదవాళ్ళకి భోజనాలు సాగిం
చారు. నాకు ఎట్లా వచ్చేదో ఆ బలం- పెద్ద పెద్ద గుండిగలు
వార్చి అవలీలగా ఎత్తిపెట్టేదాన్ని!

### భూమధ్యంలో వెలుగు

మొదటిసారి భగవాన్ దగ్గర్నించి వెళ్లినప్పుడు పెద్ద
సూర్యబింబం, దానిమధ్య భగవాన్ రూపం కనపడ్డది.
పూజలో ఓ సారి భూమధ్యంలో వెలుగు కనపడ్డది. ఆ సంగతి
భగవాన్‌తో చెప్పితే, "అంతే-అట్లాంటివి కనపడతాయి.
అవేవీ బయటినుంచి వచ్చినవి కావు. అన్నీ మనసు లోప
లివే. 'ఆ వెలుగు వెనక ఉండే వెలుగు ఏది? ఆ వెలుగును
చూచేది ఏది?' అని ప్రశ్నించుకో'' అన్నారు.

ఓ సారి భగవాన్‌ని అడిగాను: నాకు ఎప్పుడూ
ధ్యానంలో కూర్చోవాలని ఉందనీ, నేను ఆశ్రమంలో
చేస్తున్న పని దానికి అభ్యంతరంగా ఉందనీ. దానికి భగవాన్



"నీ మనసుని ఉండవలసిన స్థలంలో నిలుపు. నీ దేహాన్ని పని
చెయ్యనీ'' అన్నారు. ఆ నాటినుంచీ ఏ పని చేస్తున్నా,
ధ్యానంవల్ల కలిగే శాంతి నాతోనే ఉండేది.

నాతోనే ఉండి భగవాన్ తానూ వంట పనులు
చేస్తూ, అందిస్తూ, సరిదిద్దుతూ, ఏది ఎట్లా వుండాలో
చెప్పుతూ వంటింటిలోనే ఉండేవారు. వండినవన్నీ ప్రక్కగా
పెట్టేదాన్ని, భగవాన్ ముందు రుచి చూచి సరిగా ఉన్నవో
లేదో చెప్పేందుకు.

"ఇట్లా వంటలు రుచి చూచేవారిని పెద్ద పెద్ద జీతా
లిచ్చి పెట్టుకుంటారు మహారాజులు-నాకు నువ్వేం ఇయ్యబోతు
న్నావో?'' అన్నారు ఓ సారి.

"నా సర్వస్వము మీకు అర్పించాను కదా స్వామీ!
ఈ బికారిదానిదగ్గర ఇంకేం మిగిలింది?'' అన్నాను. గొప్ప
దయతో నవ్వారు భగవాన్.

ఒక భక్తుడు వూరికి వెళ్లుతూ భగవాన్‌తో యిట్లా
అన్నాడు: "స్వామీ! నేను దూరంగా వెళ్లిపోతున్నాను.
మళ్లీ ఎప్పటికో రాగలగడం. మీ చుట్టూ ఉండడానికి
నోచుకున్న ఈ భక్తులందరు ప్రతి నిమిషం సాన్నిధ్యమనే
అమృతాన్ని రుచి చూస్తూ ఉంటారు. ఎంతో దూరంలో
ఉన్న ఈ దాసుడు జ్ఞప్తిలో ఉంటాడా? భాగ్యమంటే ఏరిది.
నన్ను కూడా మీ మనసులో ఏ మూలో ఉంచుకొని సదా
రక్షించాలని ప్రార్థిస్తున్నా.''

ఆ ప్రార్థనకి భగవాన్ అన్నారు: "నీ ప్రార్థన సరే.
అతను అక్కడ ఉన్నాడు. అతన్ని రక్షించాలి' అనే తలంపు

అనేది ఉంటే అతను జ్ఞాని యెట్లా అవుతాడు? మనసు లేని వాడు దేన్ని కాని యెట్లా మనస్సులో ఉంచుకోగలడు? ఇక్కడ మనవి చేసికొన్నావు. అంతే కావలసింది. నీ మనవిని ఈశ్వరుడికి నివేదించాను. ఆయన చూచుకుంటారు" అని చెప్పి శెలవిచ్చి పంపి, మాతో అన్నారు: "అందరూ అనుకుంటారు, జ్ఞానిని సేవించుకుని వారి చుట్టూ ఉన్న భక్తులకి ఏదో ప్రత్యేకమైన అనుగ్రహం లభిస్తుందని. అట్లాంటి ప్రత్యేకత ఉంటే ఆ గురువు జ్ఞాని యెట్లా అవుతాడు? లోకంలో యెక్కడ యెంత దూరాన వుంటేనేం...యెవడు గురువుకి తాను సంపూర్ణంగా అర్పించుకుంటాడో, ఎవడు సమస్తమూ గురువేననీ-తానేమీ కాదనీ అహంకారాన్ని వర్జిస్తాడో, అట్లాంటి అతనిని ఉద్ధరించడం ఈశ్వరుని విధి. అట్లా అర్పించుకున్న వాడు ఏ ప్రార్థనా చెయ్యనక్కరలేదు. ఈశ్వరుడే పరుగెత్తుకొని వెళ్లి, సదా అతని వెంట ఉంటాడు. పద్మం ప్రక్కను కప్ప నివసిస్తూ ఉంటుంది. ఏ దూరాన్నుంచో తుమ్మెద వచ్చి మకరందం తాగిపోతుంది" అన్నారు.

## భోజనాల ముందు

నేను వచ్చిన కొత్తరోజులవి. రాత్రి అన్నం తప్ప తక్కినవన్నీ మధ్యాహ్నం వండినవే రాత్రికి అట్టే పెట్టి, వడ్డించేవాళ్ళము. ఆ రాత్రి బంగాళా దుంపలూ, చామ దుంపలూ కలిపి వేయించి వుంచిన కూరని రామనాథం అనే కుర్రాడు అందరికీ ముందే విస్తళ్లలో వడ్డించి వుంచాడు. అందరి విస్తళ్లలోనూ మూడు నాలుగు ముక్కలే ఉన్నాయి.



స్వామికి ఇష్టమని ఆయన విస్తట్లో అయిదారు ముక్కలు వడ్డించాడు. స్వామి విస్తరివంక చూస్తారు. తక్కిన విస్తళ్ల వంక చూస్తారు. వడ్డించే మా ముఖాలవంక చూస్తారు. చారు గిన్నె పట్టుకుని నేను పక్కనే నుంచుని ఉన్నాను. తిరిగి తిరిగి కోపంతో నిండిన కళ్లతో నా ముఖంవంక చూచారు. ఎవరు ఏమి లోపం చేశారో, ఆగ్రహం కలిగించారు అనుకున్నాను. నావల్ల అపకారం కలిగి వుండవచ్చుననే అనుమానం కూడా కలుగలేదు నా మనస్సులో.

భోజనాలైనాక స్వామి హాలులో గోడవైపు తిరిగి పడుకున్నారు. రోజూ మేము రాత్రి పనినంతా ముగించుకొని వూళ్లోకి వెళ్ళేముందు శెలవు తీసుకోడానికి హాలులోనికి వెళ్ళినప్పుడు యెప్పుడు శెలవడిగినా సాధారణముగా ముసుగు తీసి మా వంక చూచి "మీ వెంట యెవరు వస్తున్నారు? లాంతరు వుందా?" అంటూ అట్లాంటివి అన్నీ జాగ్రత్తగా కనుక్కుంటారు. ఆ రాత్రి నేను శెలవు అడగగానే ముసుగు తీసి నా వేపు తిరిగి "ఇట్లారా" అన్నారు. నేను దగ్గరకు వెళ్ళాను.

"ఏం చేశావు రాత్రి? తక్కినవాళ్లకన్న స్వామికి యెక్కువ కూర వడ్డించావు."

ఇదేమిటి నిందిస్తున్నారు; స్వామిపైన ఉన్న ప్రేమ వల్ల, మా భక్తివల్లనే కదా నేను యెక్కువ వడ్డించింది? నాలోని ఆ భక్తి చూచి స్వామి సంతోషిస్తారనుకున్నాను. తక్కినవాళ్లు, స్వామి నాకు ఒకటి యెట్లా అవుతారు? మా

ఇళ్లల్లో అంతేకద? పైగా, నాకెట్లా వుంటుంది? ఈ చివాట్లూ నలుగురిలో వుండగానామె. సిగ్గువేసింది.

"ఇది నేర్చుకోడానికా ఇంతదూరం వచ్చింది నువ్వు? అందరికీ యెక్కువ వేసి నాకు తక్కువ వెయ్యి, నాకు సంతోషం" అన్నారు.

"నాకు చేతులెట్లా వస్తాయి?"

"ఎక్కువ కూరవేస్తే నాకు సంతోషమనుకున్నావా? కూరతో అనుగ్రహం సంపాయిద్దామనుకున్నావా?"

"స్వామిపైన ప్రేమతో నేను చేసిన పని అది. నా అపరాధాన్ని మన్నించండి. ఇకమీద భగవాన్ చెప్పినట్లే నడుచుకుంటాను" అన్నాను.

"నా భక్తులందరినీ నువ్వు యెంత ప్రేమతో చూస్తే, (వాళ్లందర్ని నువ్వు నన్నుగానే చూస్తే) నా మీద అంత ప్రేమ కలుగుతుంది" అని చెప్పి, సెలవిచ్చారు. ఆ మాటలు మాట్లాడుతుంటే ఆయన కళ్లు మండిపోతున్నాయి.

దాంతో నాకు మంచి పాఠం జరిగింది. ఆ నాటినుంచీ ప్రతి భక్తుణ్ణి నా హృదయంలోకి తీసుకొని, ప్రతివారికీ తల్లినైనాను. ఎవరికే పత్యం కావలసినా, ఎవరికి వళ్లు బాగుండకపోయినా ఎంతో శ్రద్ధతో సేవ చెయ్యడం నేర్చుకున్నాను. భగవాన్ నన్నే పిలిచి, ఎవరు ఎట్లా వున్నదీ అడుగుతూ వుండేవారు.

తద్విజిజ్ఞాసస్వ

ఒకరోజు భగవాన్ హాలులో ధ్యానంలో కూర్చుండి



యుండగా స్వామి తలలోనుంచి ఒక వెలుతురు బయలుదేరి హాలంతా ఆవరించినట్లు అయింది. ఆ వెలుతురులో హాలూ, నేనూ, భగవాన్ - అన్నీ కరిగిపోయినాము. నేను అనేది మాత్రం వుత్త ఆకాశంలో తేలుతున్నట్లయింది. 'ఇదేమిటి? భగవాన్ కనపడ్డంలేదు?' అనే ఆలోచన వచ్చేటప్పటికి మళ్ళీ లోకం నా ముందు ప్రత్యక్షమయింది.

ఆ సంగతి భగవాన్‌తో చెప్పితే, "తమో రజో గుణాలు అణిగి, సత్వగుణం ప్రధానమవుతున్నప్పుడు ఇట్లాంటి అనుభవాలు వస్తూంటాయి. మొహం ఎట్లా వున్నదో తెలుసుకోడానికి అద్దంలో చూచుకుంటాము. అంతేకాని, అద్దంలో కనపడేది ప్రతిబింబమేకాని, మన సొంత ముఖం కాదు కద! అట్లానే నీ ఇంద్రియాలకీ, మనసుకీ తెలిసేది ఏదీ వాస్తవం కాదు. ఎంత గొప్ప దృశ్యాలు కనబడినా, అవేవో నీ ఆత్మదర్శన మనుకున్నా లేక, నాకే కదా యింత గొప్ప అనుభవం వచ్చిందనుకున్నా అంతటితో నీ అభివృద్ధి ఆఖరు. ఎవరికి కనిపిస్తుందో ఇదంతా అని తర్కించుకొని, వీటి నన్నిటిని తెలుసుకునేది ఏదో - ఆ తెలివిని పట్టుకోడానికి చూడు. నీకు పనిచెయ్యకుండా, ఏ ఆలోచనా లేకుండా ఏది వుందో, అదీ నువ్వు. దానినుంచి కదలకు" అని చెప్పారు.

ఎప్పుడైనా, ఏ పనిలోనైనా, ఏ దృశ్యంలోనైనా 'నేను చేస్తున్నాను' అనే అహంకారము కనపడ్డదా, స్వామి నుంచీ ఓ మొట్టికాయ తగిలిందన్నమాటే!

అసలు - వడ్డీ

విలక్షణానంద స్వామి అనే యోగి శిష్యులు - భార్యాభర్తలు చిదంబరం నుంచి వచ్చారు,. భగవానుని చూడడానికి. ఆమె నాతో చెప్పింది: ఆ యోగి, వాళ్ళని రోజుకి రెండు వేల రామనామ జపంచేసి, ఆ ఫలితాన్ని అంతా గురువుకే అర్పించమన్నారని. వాళ్ళకి భగవాన్‌తో యీ సంగతి చెప్పడం బెరుకై నన్ను చెప్పమన్నారు. నాకు అప్పటికి బాగా చనువు భగవాన్ దగ్గర. చెప్పాను.

కులాసాగా భగవాన్ అన్నారు: "రెండు వేల నామాల ఫలితమూ గురువుకే అర్పిస్తే వీళ్ళకేం మిగులుతుంది? అయినా, ఆయన తీసుకునేది వడ్డీయే కదా" అని.

"అంటే-జపంచేసే మనసు వీళ్ళకి మిగిలే వుంటుంది కదా. పై జపమే కదా గురువుకి" అని అక్కడ ఉన్న మురుగనారు అన్నారు.

"అవును. ఆ స్వామి వడ్డీ తీసికొని తన భక్తులకి అసలునన్నా వదులుతారు, ఇక్కడ యీ పెద్దస్వామి వున్నారే-వీరు అసలూ, వడ్డీ అన్నీ మింగేస్తారు. తీరా చూచుకుంటే మనది అనేది ఏమీ మిగలదు" అంటూన్నప్పుడు మురుగనారు కళ్ళనుండి చంపలమీద ధారలుగా ఆనంద బాష్పాలు దొర్లాయి.

మాటలతో పండితులు

ఇంకొక్కప్పుడు కుంభకోణం నుండి యిద్దరు స్త్రీలు వచ్చారు. వాళ్ళలో ఒకామె గురువు, యింకో ఆమె చేలా.



వాళ్ళే భోజనం వండుకొని, దాంటో సగం భగవాన్‌కి ప్రసాదం కింద అర్పించారు. ఆ సాయంత్రమే రైలుకి వెళ్ళాలన్నారు. గురువును భగవాన్ హాలులోకి తీసుకొని వచ్చి ఓ చోట భక్తిగా కూర్చోపెట్టింది శిష్యురాలు, తానూ కూర్చుంది. ఉండుండి శిష్యురాలు భగవాన్‌తో "ఆమె ఉండే-అంతా మీ రకమే" అనీ, ఇంకోసారి "ఆమెదీ అంతా మీ స్థితే" అనీ - ఇట్లా అంటూ వుంది. "తమ ఆశీర్వచనం కావాలి మాకు" అంది మళ్ళీ. "శీఘ్రంగా మోక్షం అందుకోగలిగేట్టు ఏదన్నా ఉపదేశించండి" అంది ఒకసారి.

ఆ మాటలకి దేనికీ భగవాన్ పలకలేదు. "ఏదో అంటారు. మమకారం అంటారు. మాయ పోవాలంటారు. కనుక భగవాన్ మాకేమన్నా ఉపదేశిస్తే బాగుంటుంది" అంది.

మధ్యాహ్నం దాటుతోంది. ఆమెకి తొందర పుట్టింది. "ఊఁ, కానీయండి మరి - టైమవుతోంది" అని, మళ్ళీ "కానీండి, ఉపదేశించండి. మేము రైలుకి వెళ్ళాలి" అంది.

"మేము రైలుకి వెళ్ళాలి, కానీండి" అని ఇట్లా హెచ్చరిక చేస్తోంది; స్వామి మాట్లాడలేదు. చివరికి కొంచెం తగ్గి "స్వామీ! ఆమెకి ఏదన్నా చెప్పండి. అజ్ఞానం అదీ అంటారు-అదేమిటో కొంచెం ఉపదేశించండి. ఆ అజ్ఞానం అదీ ఏమిటో కొంచెం వివరించండి. మేము వెళ్ళాలి, రైలు టైమయింది" అంది.

కరుణామూర్తి భగవాన్ ఏమీ కోపించకుండా

మురగనార్‌తో "అజ్ఞానం ఎవరికో అది తెలిసికోమనండి" అన్నారు.

"మీకు కావలసిన ఉపదేశం అయింది. ఇంక మీరు రైలుకి వెళ్ళవచ్చును" అన్నారు మురుగనార్.

వాళ్ళు వెళ్ళాక భగవాన్ అన్నారు: "తొందర. ఆలస్యమవుతూంది రైలుకి వెళ్ళి తీరాలి. వీలైతే ఆ కాసేపట్లో శీఘ్రంగా మోక్షమూ వెంట తీసికొని వెళ్ళాలి స్వామినుండి. మోక్షమేమన్నా అంగట్లో దొరుకుతుందా? అవీ, ఇవీ పుస్తకాల్లో అర్థంకానివన్నీ చదివి, ఆ మాటలతో పండితులమైనా మనుకుంటున్నారు" అన్నారు.

నేను ఆశ్రమానికి వచ్చిన తరువాత నా దేవి పూజలు, మంత్ర జపాలు అన్నీ కట్టుబడిపోయినాయి. నా సేవే నా సాధన, నా పూజ. సాక్షాత్తు భగవంతుడే నా ప్రక్కన నాతో కలిసి పనిచేస్తో ఉంటే, దినమంతా ఆయన సేవలోనూ, ఆయన భక్తుల సేవలోనూ గడుపుతూ ఉంటే, వేరే పూజలూ, జపాలతో నా కవసరమేముంది?

## చివాట్లు

తన చుట్టూ ఉన్నవాళ్ళను ఏ మాత్రం ఏ నిమిషం "పోనీలే" అని ఉపేక్షచేసి వదలరు, భగవాన్. తనకు ఎంత సేవ చెయ్యనీ - దానిలో ఏ మాత్రం అహంకారమున్నా, వెంటనే ఏదో ఓ సందర్భంలో తీవ్రంగా ఖండిస్తారు. వంటింటో పనిచేస్తూంటేనే అందరికీ ఎప్పుడూ హెచ్చరికలు, బోధనలూ; చివాట్లు, నవ్వులూ; వేదాంతమూ, హాస్యమూ, వైరాగ్యమూ; పురాణాల్లోంచి, వేదాంత గ్రంథాలలోంచి, భక్తుల చరిత్రలలోంచి కథలూ-అన్నీ, ఉపదేశాలుగా స్వామినించి మాకు చెవుల పడుతూనే ఉండేవి.



మా మనస్సుల్లో ఏం జరుగుతుందో మాకు తెలీకుండే ఆయన గుర్తెరిగి సద్యోచికిత్స చేసేవారు. మేమేమి తప్పు చేసినామో తెలియకుండానే చివాట్లు తగిలేవి. ఎన్నతో చేసినదానికి, చేయబోయేదానికి, అసలు చెయ్యనిదానికీ కూడా శిక్షణ జరిగేది. ఎవరైనా వచ్చి నేను చేస్తున్న వంట చూచి ఆనందించి 'మహాతల్లివి. నీ వల్ల కద ఇంత వంట అందరికి సదుపాయమౌతోంది. స్వామి సన్నిధానంలో నీకింత సేవ లభించింది. ఎంత అదృష్టవంతురాలివో!', అన్నారా, నా మనసు కొంత కాకపోయినా కొంత ఉబ్బేది కదా!

స్వామే నా కంత శక్తి నియ్యకపోతే—ఒక్క చెంబు నీళ్ళు అవతల పెట్టే ఓపిక లేనిదానికి గుండిగలు లెక్క లేకుండా ఓర్చే శక్తి నిచ్చి నా చేత సేవ చేయించి నన్నాడిస్తుంది స్వామేననీ, అంతా ఆయనేననీ, నేనేమీ లేదనీ తెలిసినా కూడా కొంత కర్తృత్వమో లేక, నా సుకృతం పైన అభిమానమో నాకు తెలియకుండానే మనసున పడేది కదా? వెంటనే ఎట్లాగో ఎవరి మీదనో పెట్టి తగిలేవి చీవాట్లు.

## అహం

"ఇక్కడకు వచ్చేముందు ప్రతివారు మోక్షం కావాలి, దానికోసం తపస్సు చెయ్యాలనే వస్తారు. కాని, త్వర

లోనే అహంకారం నెత్తికెక్కి ఆడిస్తుంది. ఎందుకు వచ్చారో మరచి పోతారు. మీరు చేసే సేవకోసం, మీరు రుచిగా వండి పెట్టేవి తినడంకోసం ఆశించి, సంతోషిస్తారనుకోకండి. ఎవరిలో అహంకారం తక్కువో వారిమీదే నాకు ప్రేమ. 'నేనే కదా స్వామికి ఇంత సేవచేసి సుఖపెడుతున్నాను' అనే అహం వున్నదా, సేవ అంతా నిష్ఫలం. మరిట్లా నా చుట్టూ సేవ చేస్తూ పడివుంటారు, ఎక్కడో లోకంలో ఏ మూలనో నా పేరన్నా వినని నిరహంకారి దగ్గిర వాకిట్లో కూర్చుంటాను నేను ఎగిరిపోయి. నమ్రత వల్లనే అహం చస్తుంది.

"అహంకారం ఈశ్వరుడికి చాలా దూరం చేస్తుంది సాధకుణ్ణి. ఎదురుగా గుమ్మం తెరిచే వుంది. లోపలికి వెళ్లాలంటే బాగా వంగాలి. తల ఎత్తి, నా అంతవాడు లేడని నడిచావా—తల బద్దలవుతుంది. నా సేవ దొరికింది కదా - ఇంకేం కావాలి, మా అంత గొప్పవారు లేరు అనుకోకండి. మీరేం? పె-కంటె గొప్పవారా! వాడికంటే నా సేవ చేశారా? వాడికన్న భక్తి గలవారా? ఏళ్ళకి ఏళ్ళు నా వంటి ముదికిని దోసిళ్ళతో ఎత్తి పారబోశాడు. చివరికి ఏమయింది? నా మీదికే కేసు తెచ్చి, నా ఎదుట కుర్చీలో కూర్చుండి చర్య జరిపించాడు. అహం చావకపోతే చేసిన సేవంతా అట్లా బూడిదైపోతుంది" అన్నారు ఆ రోజు.

జా డ లు

నేను వంట చేస్తున్న కొత్తలో వంటింట్లో ఏమీ సామాను లుండేవికావు. నూనె, నెయ్యి-ఇల్లాంటివి సీనారేకు



డబ్బాలో ఉండేవి. ఆ మగవాళ్ళు నిర్లక్ష్యంగా తియ్యడంలో నూనె, నెయ్యి అంతా కింద వొలికి, నేలంతా జిడ్డు జిడ్డుగా జారుతూ ఉండేది. నేనదంతా తోమి, కడిగి, అలికి, ముగ్గు పెట్టాను. భగవాన్ అది చూచి "చాలా మంచిపని చేశావు. బావుంది ఇప్పుడు" అన్నారు.

"ఏం లాభం స్వామి? మళ్ళీ వలుకుతాయి. ఈ డబ్బాలు కాదు. వీటికి సరైన జాడీలు ఉంటే బాగుంటుంది" అన్నాను.

"సరి సరి" అంటూ వెళ్లారు స్వామి.

పది రోజులు తిరిగాయో లేదో, నా కోసం కబురు వచ్చింది, హాలులోంచి స్వామి రమ్మంటున్నారని. వెళ్లాను. భగవాన్ ముందు పెద్ద జాజికాయపెట్టె ఉంది. రైలు స్టేషను నుండి వచ్చిన ఆ పెట్టెలో స్క్రూ మూతల జాడీలు నాలుగు పెద్దవి, రెండు చిన్నవి ఉన్నాయి.

"జాడీలు కావాలన్నావుగా, తీసుకో" అన్నారు నవ్వుతో స్వామి. ఎవరో స్టేషన్ మాష్టరు ఎందుకు పంపారో తెలీదు; ఆశ్రమానికి అని రైలులో వేశారట!

ఆ విధముగా దిన దినమూ ఎన్ని జరిగేవో ఆశ్రమములోనూ, భక్తుల జీవితములోనూ. ఇప్పుడు చెప్పితే క్రొత్తవాళ్ళు వాటిని ఓ మహాత్మ్యలకింద నమ్మడం కష్టం.

అప్పటిదాకా ఎందుకు? నిన్న ఆశ్రమంలో హోమం జరుగుతోంది. నాకు ఆశ్రమ భోజనం సహించలేదు. ఆకలి వేస్తోంది. ఇంటికిపోయి రెండు గోధుమ రొట్టెలు చేసుకోవా

లని ఉంది. ఈ వయస్సులో ఎండా కాలంలో ఇంటికి పోయి
పొయ్యి దగ్గిర వండుకోటం ఒక శ్రమ. పైగా ఈ లోపల
హోమం అయిపోతుంది. మళ్లీ యెండలో రావాలి. అలాగే
కూర్చున్నాను నీరసంగా కదలలేక.

సుబ్బలక్ష్మమ్మ ఆశ్రమంలో భోజనం చెయ్యలేదు.
ఇంటికిపోయి రొట్టెలు చేసుకుంది. తనకు కావలసిన వాటి
కన్న రొట్టెలు యెందుకు ఎక్కువ చేసుకున్నదో ఆమెకే తెలి
యదు. ఆ మిగిలినవి శాంతమ్మ కియ్యాలి అనుకుందిట.
ఎందుకు నాకు రొట్టెలు అవసరమౌతాయనుకుందో ఆమెకే
తెలియదు. తెచ్చి ఇచ్చింది హోమం మధ్య.

కరక్కాయలు

భగవాన్ నేను రాకముందు కొండమీద ఉండగా
వారి తల్లి కళ్ళకి పట్టేసుకోడానికి కరక్కాయ కావాలన్న
దట. ఆ యెండలో వూళ్ళోకి కొండ దిగి యెవరు పోతారు?
కరక్కాయ కొనడానికి కానీ డబ్బు యెవరికున్నది ఆ
రోజుల్లో? ఊరుకున్నారు స్వామి.

మధ్యాహ్నానికి యెవరో ఆ దారిని పోవుచు ఓ
మూకెడు కరక్కాయలు పడేశారు. స్వామి తల్లిని పిలిచి
"కరక్కాయలు కావాలన్నావుగా, ఇవిగో వచ్చాయి.తీసుకో"
అన్నారుట.

మూకెడు యెట్లా వచ్చాయంటే తెచ్చిన అతనికే
తెలీదు. ఎక్కడ నుంచో బస్తాలతో కరక్కాయల బండి తిరు
వన్నామలై రోడ్డుమీద వెళ్ళుతోంది. బస్తాలతో కరక్కా



యలు రెండెడ్లబండి నిండ! వాటిలో ఓ బస్తాకి చిల్లి ఉండి
రోడ్డు వెంబడి ధారగా కరక్కాయలు పడ్డాయి. బండి అతను
గమనించనే లేదు. ఈ మనిషి రోడ్డు మీద పడ్డ కరక్కాయ
లను పై పంచెలోకి తీసుకున్నాడు. కాని అన్ని కరక్కాయలని
ఏం చేసుకోవాలో అతనికే తెలీదు. ఎందుకో తోచిందట-
కొండమీద ఆశ్రమములో ఏదన్నా ఉపయోగం వుండ
వచ్చుని; తెచ్చి పడేశాడు.

ఓ సారి నా చేతులో కానీకూడా లేదు. 'ఎట్లా
రమణా! నాకెక్కడనుంచి వస్తుంది?' అని వూరుకున్నాను.
అంతే. నాలుగు రోజుల్లో మనీయార్డరు వచ్చింది - అయిదు
రూపాయలు, డాక్టరు శ్రీనివాసరావు అనేవారినుంచి. ఆయన
రమణ చరిత్ర చదువుచున్నారు. దాంట్లో శాంతమ్మ అనే
పేరు వచ్చింది. ఆ పేరు వినగానే ఆమెకేమైనా పంపాలని
బుద్ధి కలిగిందట.

ఇట్లాంటివి ఎన్ని వందలో!

బోధ

ఓ సారి నేనూ, భగవాన్ కలిసి పొట్లకాయ కూరని
గిన్నెలో వేయిస్తున్నాము. పొట్లకాయలోని నీళ్ళు పిండ
కూడదు. ఆశ్రమానికి వచ్చింది ఏదీ వృధా కాకూడదు.
పొట్లకాయల్ని తరిగి అట్లానే వేసి నీరు పోయిందాకా
ఉంచాలి. చాల పెద్ద బాణలి. పొయ్యికి ఒకవేపు స్వామి,
ఇంకోవేపు నేను కూర్చుండి, పెద్ద గరిటెలతో కూరని
మాడకుండ తిప్పుచున్నాము. చాలవరకు వేగింది.

అప్పుడు ఎందుకో స్వామి చప్పున గరిటని అట్లానే వదిలి చలనం లేకుండా ఆగిపోయినారు. తలెత్తి ఆయన్నీ, చలనం లేని ఆయన చూపుల్నీ చూచి నేనూ అప్రయత్నముగా ఆగిపోయాను, మనసు ఆగిపోయింది. చుట్టూ ఎవరూ కనబడలేదు.

కొంచెంసేపట్లో భగవాన్ కదిలి "కూరలోంచి శబ్దం ఆగిపోయింది. ఇదీ సమయం పొడి వెయ్యడానికి" అన్నారు. పొడి అంటే కూరపైన చల్లడానికి సిద్ధంగా కొట్టి వుంచుకున్న కూరపొడి.

అక్షరమణమాలలో అన్నారు భగవాన్:

"పొడిచే మైకపరచి
నా బోధ హరియించి
నీ బోధ గనిపించితివి
అరుణాచలా," అని.

అట్లాగే "కూరశబ్దం ఆగిపోయినప్పుడు పొడి చల్లడానికి సమయం" అన్నారు, స్వామి. అంటే, మనసులోని శబ్దం ఆగి నిశ్చలమైపోయిన స్థితి మనిషికి వచ్చినపుడు గురువు ఉపదేశం చెయ్యవలసిన సమయం.

శంకరమ్మ అని ఆశ్రమం వంటింటిలో సహాయం చేసే భక్తురాలు, భగవాన్ ఇడ్లీ తీసికొని అందరి మధ్య భోజనాల హాలులో కూర్చున్న సమయంలో వారికి నమస్కరించి అడిగింది: "నాకు వుపదేశం కావాలి స్వామి!" అని.

భగవాన్ నవ్వుతో హాలులో అందరికి చూపి, "శం[illegible] అమ్మకి వుపదేశం కావాలట" అన్నారు. అని, శంకరమ్మతో



'కైవల్యం' అనే పుస్తకంలోంచి రెండు పద్యాలు చదివారు. వాటి అర్థం "తాను పరబ్రహ్మను అని మరచి తాను జీవుడని అనుకోగానే ఈ జీవన్మరణ పరంపరలలో పడుతున్నావు. 'నే నెవరిని?' అనే ప్రశ్నవల్ల నీవు సత్యాన్ని తెలుసుకుంటే, నీవు జీవుడవనే అజ్ఞానం చెదిరి నీ సత్య స్వరూపం తెలుసుకుంటావు. అప్పుడు నీవు పరబ్రహ్మ కాక వేరు కావనీ స్పష్టమౌతుంది. అదే మోక్షం. నీవు నన్ను అడిగావు కనుక నీకీ వుపదేశం చేస్తున్నాను" అని.

అంతే. భగవాన్ ఎప్పుడూ, ఎవరికీ, ఏ మంత్రాన్నీ ప్రత్యేకంగా వుపదేశించలేదు. ఆయన యిచ్చే దీక్షగాని వుపదేశంగాని మౌనంలో జరిగేది. ఏదన్నా చెప్పితే 'నే నెవరు?' అనే విచారణే మహామంత్రం అని చెప్పేవారు. వారి నుంచి ఒక్కమాట, ఒక్క చూపు మహా మంత్రోపదేశం కన్న ప్రజ్వలమైన శక్తిగా, జ్ఞానంగా తరింపచేసేది.

[illegible]ంకం

ఒకసారి భగవాన్ భక్తులు ఒకరు తీర్థయాత్రలు చేసి [illegible]. సాయిబాబా మఠం మొదలైనవి దర్శించి, సాయిబాబ [illegible]ములకు పారవశ్యులై తిరిగి భగవాన్ దగ్గరకు వచ్చి ఆ [illegible] చెప్పుతున్నారు. అప్పుడు భగవాన్ అన్నారు:

"ఒక్కసారి ఎవరన్నా ఇక్కడకు వచ్చారా, తరువాత [illegible] వెళ్ళినా, ఎన్ని దర్శించినా, ఇక్కడ-ఈ గేటులో [illegible] చెల్లించుకుంటేనేగాని లోపలికి పోవడానికి వీలు [illegible]. ఒకసారి ఇక్కడకు వచ్చారా, తరవాత ఎక్కడకి

పోయినా, చివరికి ఇక్కడకు చేరుకోవలసిందే. ఈ ద్వారం లోంచి తప్ప మోక్షానికి ప్రవేశార్హత లేదు."

## కరుణ

ఒకసారి ఒక భక్తుడు ఆశ్రమంలో భిక్ష చేస్తున్నారు. అప్పుడు భగవాన్‌కి గట్టి జలుబుగా వుంది. జలుబుగా వుంటే కాఫీ త్రాగరు, మజ్జిగ, పాలును వాడరు - చారు తప్ప. ఆ రోజు పోళీలు చేయించారు. వాటిలోకి బాదంపాలు చేశారు. 'స్వామి తినరే' అని మనసులో విచారంగానే వుంది. కాని చిన్న స్వామి 'పరవాలేదు. స్వామికి కూడా వెయ్యండి' అన్నారు.

రాజా అయ్యరు భగవాన్‌కి ఓ పోళీ వెయ్యబోయి నాడు. భగవాన్ దాంట్లో తీపి వేశారా అని అడిగారు. రాజయ్యరు లేదు అన్నాడు. చక్కెర వేసింది ఆ పోళీ. దాంట్లో కొంచెం చారు పోసుకొని మాట్లాడకుండా తింటు న్నారు స్వామి. నాకేమో స్వామి పాలు పోసుకోలేదే అని వున్నది. చిన్నస్వామి పోళీ పాలుకూడా భగవాన్‌కి వడ్డించ వచ్చునని చెప్పారు. నేను బాదంపాలు అందరికీ వడ్డిస్తున్నాను. భగవాన్‌కి చారు కావలసి వచ్చింది. చేతిలో ఆ గిన్నెతోనే వెళ్ళి కొంచెం పాలు భగవాన్‌కి విస్తట్లో పైన పోశాను.

ఆ పాలు పడగానే భగవాన్ తలెత్తి నా వంక చూశారు. కళ్ళు జ్యోతులవలె మండిపోతున్నాయి. "నేను చారు పొయ్యమంటే ఇంతలో పాలు ఎక్కణ్ణించి వచ్చాయి? నేను పాలు అడిగానా; చారు అడిగానా? చారు తీసుకురా"



అని రాజయ్యర్‌ని పిలిచి ఇంకో పోళీ వేయించుకొన్నారు; ఇంత చారు పోయించుకున్నారు. చారు, పోళీ, బాదంపాలు అన్నీ పిసికి తింటున్నారు.

గుండెలు గబ గబ కొట్టుకుంటున్న నేను తల వంచు కొని అందరికీ వడ్డిస్తున్నాను. నేను అటువేపు వచ్చినప్పుడల్లా భగవాన్ "నేను పాలు అడిగానా? చారు అడిగితే, ఇంతలో పాలు ఎట్లా తెచ్చావు?" అని గద్దిస్తున్నారు. "పోళీలో తీపి ఉందా అంటే లేదంటాడు రాజా. చారు పొయ్య మంటే పాలు పోస్తావు. అయితే, మీరేది తినమంటే స్వామి అది తినాలి. స్వామికి యేం కావాలో స్వామి కాదు చెప్పేది; మీరూ నిర్ణయించేది. మీరేది విస్తట్లో వేస్తే అది తినాలి స్వామి" అని కోపంగా మాట్లాడుతున్నారు. ఏమి చెప్పటానికి తోచక తల వంచుకున్నాను.

మర్నాడు స్వామి కాఫీ త్రాగలేదు. నా మూలంగా కాఫీ మానివేశారు. నేనూ, ఓ నెల మానివేశాను. ఒక్క పూట కూడా కాఫీ లేకపోతే నిలవలేను. ఓ రోజు ఏడ్చాను భగవాన్ ముందు, "స్వామీ! తప్పు జరిగింది. దానికి ఇంత శిక్షా? మీరు కాఫీ త్రాగా" లని.

"నే నందుకు మానలేదే? నా వంటికి పడదు. కావ లిస్తే డాక్టరుగారిని అడుగు. అడిగి చూడు!...ఏమండీ డాక్టరుగారూ! కాఫీ నా వంటికి మంచిదికాదని చెప్పారు గాదూ? నా కెప్పుడూ పడదు కాఫీ. కొండమీద అంతే. నేను కాఫి మానితే వీరందరూ తాగరు. వాళ్ళ మనస్సులు

కష్టపడిపోతాయి. స్వామి మూలంగా మనకి కాఫీ పోయిందే అని తిట్టుకుంటారు'' అన్నారు.

కొద్ది రోజుల్లో చెంబెడు కాఫీ తెచ్చింది స్వామికోసం జానకమ్మ. ''చూడు, కాఫీ తెచ్చింది జానకి. ఇప్పుడింకేం చెయ్యను? కాఫీ తాగుతున్నాను'' అన్నారు నాతో.

ఆ విధంగా తనకులేని కోపాన్ని మా కోసం నటించే వారు స్వామి. ఒక్కొక్కప్పుడు యెన్ని తప్పులు చేసినా ఏమనరు. 'అమ్మో, స్వామినించి యెన్ని చివాట్లు!' అనుకుంటూ వుంటే వారి నుండి కరుణ తప్ప ఏమీ కురియదు. కాని, ఎప్పుడో-ఏ చిన్న తప్పుకో ఒక్కసారిగా విరుచుకుపడతారు. కారణం ఆ నిమిషాన చేసిన చిన్న పొరబాటులో వుండదు. మాలో దాక్కుని వున్న ఏ కలుషాన్నో వెతికి పైకి తీసి మంట పెట్టాలనో, లేక పెరిగిపోతున్న అహాన్ని అణచాలనో, లేక-లేని ఆగ్రహాన్ని నటించి లోపల్నించి మా స్వభావాన్నంతా కెలికి శుభ్రం చెయ్యాలనో, ఒకసారి మండిపడి తిట్టి వూపి వదిలి పెట్టేవారు. ఆయన ఆగ్రహమంతా ఆయన అపార కరుణ అని తెలుసుకున్న భక్తులు, ధన్యులు.

---

# వారణాసి సుబ్బలక్ష్మమ్మ

నాకు పదహారేళ్ళప్పుడే భర్త పోయినాడు. నా భర్తగారి వల్లనే నేను కృష్ణమంత్రోపదేశం పొందాను. నేను నా తల్లిగారి వద్దనే ఉండేదాన్ని. ఆమె భక్తురాలు. ఎప్పుడూ ఆధ్యాత్మిక చింతలోనే వుండేవా రామె. మే మిద్దరమూ కావేరీ పుష్కరాలకి వెళ్ళి తిరిగివస్తూ, దోవలో అరుణాచలేశ్వరుడి దర్శనానికై తిరువన్నామలై వచ్చాము. ఒక సత్రంలో దిగాము అక్కడ ఒక రెడ్డి అబ్బాయి, మాతో "ఒక అబ్బాయి స్వామి వచ్చి పదేళ్ళయింది. ఆయన కొండమీద ఉంటున్నారు. ఆయన దర్శనం చెయ్యండి" అని చెప్పి వెళ్ళాడు.

మా తల్లికి పుణ్యక్షేత్రాలకి వెళ్ళడం ప్రీతి. అంతకన్న ముఖ్యం సాధు సందర్శనం. మేము కొండమీదికి వెళ్ళి స్వామిని చూడాలని నిశ్చయించుకున్నాం. మాతో నెల్లూరు నుంచి వొచ్చిన రెడ్ల స్త్రీలు కూడా కొందరు వున్నారు. మర్నాడు కొండమీదికి వెళ్ళి అక్కడే వంటలు చేసుకొని స్వామివారిని దర్శించాలని అనుకున్నాము. సామానులు తీసుకొని కొండమీది మలపాల తీర్థం దగ్గరకి చేరుకున్నాము. కొండమీదనే మధ్యలో వుంది చెరువు. అక్కడ వొండుకొని తిని, పడుకుని మధ్యాహ్నం మూడింటికి స్వామివారిని వెతు



క్కుంటూ వెళ్లాము. ఆయన విరూపాక్ష గుహలో వుంటున్నారు అప్పుడు. ఆ గుహకు ఇటూ అటూ దూరంగా సాధువులు యెవరో తిరుగుతున్నారు, మేము వెళ్ళి చూసేటప్పటికి,

విరూపాక్ష గుహ వాకిటికి పక్కన అరుగుమీద, ఏదో ఆసనముమీద, పద్మాసనం వేసుకొని చిన్ముద్రలో కూచుని వున్నారు, ఈ రమణమహర్షులవారు. ఆయన్ను చూడగానే నాకు ఆయన సాక్షాత్తూ ఆ ఆకారంలో వున్న అరుణాచలేశ్వరుడే, మనలను కడతేర్చను మహాత్ప్రకాశ రూపముగా దర్శనమిచ్చారనిపించింది.

## ప్రథమ దర్శనం

అప్పుడు ఆయనకు ముప్పైఏళ్ళు ఉంటాయి. మెరుగు పెట్టిన బంగారమల్లే ఆయన దేహం వెలుగుతోంది. కమల రేకులమల్లే ఈ మూల నుంచి ఆ మూలకి ఉన్నాయి ఆయన నేత్రాలు. ఏమీ కదలకండా ప్రతిమమల్లే కూచుని ఉన్నారు. నేను చిన్నదాన్ని; ఏమీ యెరుగనిదాన్ని. ఆయన్ని చూస్తూ అట్లాగే నిలబడ్డాను. అందరమూ నమస్కరించాము. అందరి వంకా ఆయన ఒక్కసారి తేరిపార చూశారు. అటువంక ఇంకా యెత్తుగా, మా తలలపైన అరుణాచల శిఖరం; మాకు దిగువగా పర్వతపాదంలోనే అరుణేశ్వరాలయ శిఖరాలు, వాటి చుట్టూ కొంచెంగా మాకు వినవచ్చే జనుల సందడి, స్వామివారి చుట్టూ నిశ్శబ్దం.

మాతో వచ్చినవారిలో ఒకామె, తన కోడలికి

సంతానం కావాలని స్వామివారితో చెప్పుకోవాలనుకుంది. ఇంకొక ఆమె, "ఆయన ఎంతో ఎత్తున వున్నారు. వారికి ఇట్లాంటివి ఏవీ పట్టవు" అన్నది. కాని ఆ అత్తగారు మాత్రం ఆశను వదలక, స్వామివారిని అడగమని మా తల్లిగారిని బ్రతిమాలింది. మా తల్లిగారు స్వామివారికి తన మిత్రురాలి కోర్కెను విన్నవించారు. ఆయన విని, చిరునవ్వు నవ్వి, తన దోసెటతో ఆకాశానికి చూపారు. అంటే, "ఆ విషయం ఆ పరాత్పరుడి ఇచ్ఛ" అన్నట్లు మేము అర్థం చేసుకున్నాము.

అక్కడితో వారి శలవు తీసుకుని, ఆ రాత్రికే మా వూరు నెల్లూరు వెళ్ళాము. ఆనాటి నా దర్శనానికి ఆనాడు నా మనసులో ఏ ప్రాముఖ్యతా లేదు. జీవితం శాశ్వతంగా ఆ పాదాల అర్పణం కాబోతోందనే అనుమానమూ నాకు కలగలేదు.

## ద్వితీయ దర్శనం

మేము కాశీకి వెళ్ళిన తొమ్మిది నెలలకి మా తల్లిగారు కాలధర్మం పొందారు. నేను ఇంటికి వచ్చి కృష్ణ జపం చేసుకుంటూ వున్నాను. నా ముప్పై ఒకటో ఏట కొంతమందితో కలిసి రామేశ్వర యాత్రకు వెళ్ళి తిరిగి వచ్చే సమయంలో, అరుణాచలానికి తిరిగి వచ్చాను. శ్రీ అరుణాచలేశ్వరుల దర్శనం చేసుకొని, సత్రములో వంటచేసుకొని భోజనానంతరము శ్రీ రమణులవారి విషయమై విచారించగా, వారి ఆశ్రమము అప్పుడు కొండకింద పాలితీర్థము పక్కన వున్నదనీ,



తల్లిగారిని అక్కడ సమాధి చేసినారనీ, మహర్షిగారు అక్కడే వుంటున్నారనీ తెలిసింది.

నిద్రపోయి లేచి మధ్యాహ్నము, నాతో వచ్చిన వారితో కలిసి ఆయన ఆశ్రమానికి వెళ్లాను. ముందు తల్లిగారి సమాధిని చూశాము. దానిపైన ఓ పూరి కట్టడం వుంది. దాని పక్కన వంటకు ఓ పూరి కట్టడము, దాని పక్కన పెంకుటి హాలు. దానిలోనే రమణ భగవానులు ఒక సోఫా పైన కూచుని వున్నారు. నేలమీద ఒక పదిమంది భక్తులు నిశ్శబ్దంగా కూచుని వున్నారు. మేమున్నూ వెళ్ళి ఓ పక్కగా పది నిమిషాలు కూచున్నాము. తరువాత లేచి, నేను ఆయన దగ్గిరగా వెళ్ళి, శలవు తీసుకుని వస్తానని చెప్పి నమస్కరించి వచ్చేశాను.

నేను నా వూరికి వచ్చిన తరువాత, సదా ధ్యానముగా వుండడానికి సదుపాయము వెతుకుతున్నాను. కాని ఏ తలపులూ లేకుండా నిలకడగా వుండడము కష్టంగానే వుండేది. ఏదో ఒక పెద్ద దగ్గరికి పోయి, సేవ చేసుకుంటూ వుండాలనే తలపు మాత్రం లేదు.

ఇట్లా ఓ సంవత్సరం పొట్టేపాలెం రామమందిరంలో వున్నాను. నన్ను ఆదరిస్తున్న రెడ్లు అరవిందయోగి దర్శనార్థం వెడుతున్నారు. వారి ఆడవాళ్లు నన్నుకూడా తమ వెంట రమ్మని బలవంతం చేసి, పుదుచ్చేరిలో అరవిందయోగి దర్శనానికి తీసుకుని వెళ్ళారు. వారి దర్శనానికి వెళ్ళినవారు వారి పాదాలనూ, "మదర్" పాదాలనూ, తాకి నమస్కారము చెయ్యాలిట. బ్రాహ్మలకేగాని నమస్కరించడం నాకు అల

వాటు లేదు. ఇదెట్లాగా అనుకుంటో వారిని సమీపించేప్పటికి తెలిసింది - ఆసారి 'మదర్' ఉత్తరువు ప్రకారం స్త్రీలు గుమ్మం ముందరే నమస్కరించుకుని వెళ్ళాలనీ, లోపలికి వెళ్ళగూడదనీ.

స్వప్నంలో......

ఆ రెడ్ల కుటుంబం పుదుచ్చేరిలో వారం రోజులు వుంటారు. ఈ లోపల నేను అరుణాచలం వచ్చి వెడితే బావుంటుందని వొచ్చాను. తిరిగి మహర్షి వారిని హాలులో సందర్శించి, మధ్యాహ్నంనించి సాయంత్రంవరకూ ఆయన సమక్షంలోనే వుండి, మర్నాడు గిరి ప్రదక్షిణం చేసుకుని కాళహస్తికి బైలుదేరి వెళ్ళాను. ఆ వూళ్లో మఠంలో నిద్ర పోతూ వుండగా నాకు ఒక స్వప్నము వచ్చింది. ఆ స్వప్నములో నాకు తెలిసిన ఒక శాస్త్రిగారు కనబడి, "నీవు పుదుచ్చేరి యెందుకు పోయినావు? తిరువన్నామలై పోయి నది సరి. శ్రీ రమణమహర్షులవారిని నమ్ముకో. వారు నిన్ను కడతేర్చి రక్షిస్తారు. వారు శ్రీ రామావతారము; కృష్ణావతారము; వారు సర్వజ్ఞమూర్తి" అని చెప్పినారు.

అంతవరకు, నాకు వీలైన వెంటనే కాశీకి పోయి నా జీవితము అక్కడే గడపవలెనని వుద్దేశము. కాని ఆ స్వప్నం వచ్చిన తరువాత, నేను చేస్తున్న ధ్యానం విషయమై శ్రీ రమణమహర్షులవారిని అడిగి కొంత తెలుసుకుని, ఇంకా ఆయన ఏమైనా చెపితే, అవీ తెలుసుకుని, ఓ నెల్లాళ్ళుండి, కార్తీక దీపం చూసుకుని కాశీకి పోవాలనుకున్నాను. ఆ ప్రకారమే కార్తీకమాసం రాగానే నెల్లూరులో నా మిత్రు



రాలు కొండ్రాజు పార్వతమ్మను తీసుకుని అరుణాచలం వొచ్చాను. మేమిద్దరమూ, అరుణాచలేశ్వరాలయం దగ్గర ఇల్లు అద్దెకు తీసుకుని కాపురం వున్నాము. ఆ రోజే కలకండా, కుంతమామిడి పప్పూ తీసుకుని శ్రీ స్వామివారి దర్శనానికి వొచ్చి, అక్కడవున్న చిన్న బల్లమీద పెట్టి, నమస్కారం చేసి నిలబడి ఉన్నాము. ఇంతలో అక్కడే పడుకుని వున్న గోవు లక్ష్మి వచ్చి మేము తెచ్చినవన్నీ తింటో వుంది. భగవాన్, వారి సేవాపరుడు మాధవస్వామీ చూస్తోవున్నారు. ఆ ఆవుని తరమకూడదు కాబోలని మేమూ వూరికే వున్నాము. కొంచెం చూసి నేను, "ఆవునించి వాటిని తీయండి" అన్నాను మాధవస్వామితో. ఆయన "ఆ నైవేద్యము మీరు లక్ష్మికే ఇచ్చారనుకున్నాను" అన్నారు.

ఏది ఆత్మ?

మర్నాడు మేము ఆశ్రమానికి వచ్చేటప్పటికి భగవాన్ భోజనం చేస్తున్నారు. భోజనమై భగవాన్ వచ్చి సోఫాపైన కూచున్న తరువాత, మేమూ హాలులోకి వెళ్ళాము. శ్రీ భగవానుల వారు భగవద్గీతలోంచి శ్లోకం చదివి తెలుగులో రామయోగికి అర్థం చెపుతున్నారు. వారిద్దరే తప్ప హాలులో ఎవరూ లేరు. అప్పుడు నేను పోయి భగవాన్ దగ్గర కూర్చుని, "స్వామీ, ఆత్మ అంటే అఖండాకాశమా, లేక అఖండాకాశాన్ని తెలుసుకునేది ఆత్మా?" అని అడిగినాను. దానికి శ్రీ భగవాన్ రామయోగిని చూసి "ఇక్కడే [illegible] సంశయాలు వొస్తాయి" అని, నాతో "ఇది ఆత్మ,

అది ఆత్మ అనే సంశయ రహితంగా, నివృత్తిగా వుండటమే ఆత్మ" అని చెప్పి నా వంకే చూస్తూ మౌనంగా వున్నారు. నేనూ వారినే చూస్తూ కూచున్నాను. ఆ స్థితిలోనే నా మనసు లయించినది. నా సంశయము తీరిపోయినది. చాలాసార్లు ఆనాటి స్థితి నా జ్ఞాపకంలోకి వస్తూవుంటుంది. అట్లా ఆ ఇంట్లోనే ఆ వూళ్లో కాపరం వుండి, ప్రతి దినమూ స్వామి దర్శనానికి వొచ్చిపోతూ వుండే వాళ్ళం. ఎవరో ఒకరు ఆయన్ని ప్రశ్నిస్తూ వుండేవారు. వాటికి భగవాన్ చెప్పే సమాధానాన్ని వింటూ వుండేదాన్ని.

## వంట ఇంటి ప్రవేశం

నాకు తత్వజ్ఞానము కలిగినా, వాసనాక్షయము కాలేదే అని చింతగా వుండేది. ఆశ్రమవాసులు నన్ను వచ్చి ఆశ్రమంలో వుండమని చాలాసార్లు అడిగేవారు. కాని నాకు చాలా ఆచారము; అభ్యంతరంగా వుండేది.

ఒకరోజు భగవాన్ చెల్లెలు నాతో, "నేను శివరాత్రి తరువాత వూరికి వెడుతున్నాను. ఆశ్రమంలో వంటకు అవసరమైన రుబ్బడం మొదలైన పనులు, స్వాములవారే చెయ్యాల్సి వస్తుంది. ఆ పనులు మనమెవరమో చేసి పెడితే మంచిది. నువ్వు వచ్చి ఆ పనులు ముందు నాతో చేస్తూవుండు. నేను వూరికి వెళ్ళిన తరువాత నీవే చూసుకో. శాంతమ్మ వంట చేస్తుంది, పై పనులు నువ్వు చెయ్యి" అని చెప్పింది.

నేను ఆశ్రమంలో చేరాను. ఆమె వూరికి వెళ్ళింది.

భగవాన్‌తో కలిసి వంటింట్లో పనులు చెయ్యడం



చాలా ఆనందంగా వుండేది. నాకు సరిగ్గా చేతగాని పనులన్నింటినీ ఎట్లా చెయ్యాలో భగవానే స్వయంగా చెప్పేవారు; తానే చేసి చూపేవారు.

పగలంతా ఆశ్రమంలో వుండి రాత్రులు అరుణాచల దేవాలయం వద్ద ఒక అవ్వ ఇంట్లో నిద్రపోయేదాన్ని.

మనసు మరీ శుద్ధంచేసే పదార్థాలు తినాలి; మనసుని అపరిశుభ్రం చేసే పదార్థాల్ని వర్జించమని చెప్పేవారు శ్రీవారు. "ములక్కాడలు, ముల్లంగి మొదలైన కూరల్ని మీ బోంట్లు తినరు. మీరు స్త్రీలు; అబలలు; మీకు మనోబలం తక్కువ అని పెద్దలు ఆ నిబంధనల్ని పెట్టారు" అని చెప్పారు.

అంత ఖులాసాగా శ్రీవారితో కలిసి పనులు చేస్తున్నా, నాకు మా వూరికి వెళ్ళాలని అనిపించేది. ఎందుకంటే, ఇక్కడ అంతా ఎక్కువ పని. పైగా ఆశ్రమంలో పనులు నా మడికీ, ఆచారానికి సరిపడేవి కావు.

అంతేకాక, నాకు నిదానంగా పని లేకుండా కూచుని ధ్యానం చేసుకోవాలని వుండేది. దానికి ఆశ్రమంలో తీరుబడే వుండేదికాదు. అందుకని నేను తెగించి మా వూరికి వెళ్ళి ఓ సంవత్సరం వుండిపోయినాను. అక్కడ పని లేకండా, దినమంతా ధ్యానంలో గడిపేదాన్ని. కాని, ధ్యాస అంతా ఆశ్రమం మీదనే వుండేది. 'ఆశ్రమంలో నేనా, అంతటా భగవాన్ లేరా?' అని మనసుకి ఎంత సమాధానం చెప్పుకున్నా, నా మనసు నిలవలేదు.

ఆశ్రమంలో పని చెయ్యకుండా, హాలులో సోఫాపైన కూచున్న భగవాన్‌కి ఎదురుగా ఆయన సన్నిధిలో కూచో వాలని వుండేది. అది వీలులేదు గనక, మా వూళ్ళోనే వుండి ధ్యానం చేసుకుందామని ఎంత ప్రయత్నించినా, నా మనసు ఆగదు. పని చేస్తానో, ఎట్లానో భగవాన్ని చూస్తో వుండా లనే కాంక్ష బలంగా లాగింది. అట్లాగే భగవాన్ కూడా నేను లేని సంగతిని తలుచుకుంటూనే వుండేవారు.

### పునర్వసు పొంగలి

శాంతమ్మ నేను లేని కాలంలో, ఓ రోజు పెణ్ పొంగలి చేస్తున్నది పునర్వసుకి. భగవాన్ శాంతమ్మని చూసి, "అక్కడ వున్నా, సుబ్బలక్ష్మికి ఇవాళ పొంగలి చేశారో, లేదో అని అనిపిస్తూ వుంటుంది" అన్నారట.

పునర్వసు అంటే భగవాన్ జన్మ నక్షత్రం.

ఇంకో పునర్వసునాడు–"సుబ్బలక్ష్మి ఇవాళ వస్తుంది. పొంగలి చేసిపెట్టి వుంచండి" అన్నారు. ఆ రోజే నేను వచ్చాను ఆశ్రమానికి!

### కట్టేసుకున్నారు

ఈ విధంగా ప్రత్యేకమైన శ్రద్ధ చూపించి తనని విడవ కుండా కట్టేసుకున్నారు భగవాన్. నా కెంతకీ పోవాలనే కాని, ఆయన ఇన్నేళ్ళూ నన్ను కదలనీయలేదు,

నా పైన ఆయనకి మార్జాల కిశోర న్యాయం.

ఆశ్రమానికి వచ్చానన్న మాటేగాని మళ్ళీ మా వూరు



పోయి ధ్యానం చేసుకోవాలనే వుండేది. గట్టిగా పోవాలను కుని చిన్న స్వాముల (భగవాన్ తమ్ముడు; ఆశ్రమానికి సర్వాధి కారి) వారికి చెపితే వారు పోవడానికి వీల్లేదనేవారు.

'వీరితోనే ఏమిటి, సరాసరి భగవాన్‌తో చెప్పి మనపాటికి వెళ్ళిపోదాము' అనుకుని, వొచ్చి వుదయాన నమస్కారం చేసి, ఆయన అనుజ్ఞ అడుగుదామనుకుంటూ వుంటే, భగవాన్ తానే నన్ను పిలిచి "ఇదుగో—అరుణా చలాష్టకము తెలుగులో వున్నది; రాసుకో" అన్నారు.

ఏ రాత్రికో తీరుబడి అయినప్పుడు దాన్ని రాసుకోడం కొన్నాళ్ళు; తప్పులు దిద్దించుకోడం కొన్నాళ్ళు; అర్థం చెప్పించుకోవడం కొన్నాళ్ళు; నల్లైవేయడం కొన్నాళ్ళు. మా వూరికి వెళ్ళడం పడేదికాదు. ఎప్పుడు వెళ్లాలని నిశ్చయించు కొని అనుజ్ఞకోసం వెళ్ళినా, ఏదో ఒకటి యిట్లాంటిదే జరిగి ప్రయాణం ఆగిపొయ్యేది.

నాకు మాత్రం ధ్యానం లేకుండా పనులతోనే సరి పోతోందే అనే విచారం మనసులో వుండనే వుండేది.

### భగవాన్ వివరణ

ఒకనాడు భగవాన్ నాతో "నీకు సదా ధ్యానం కాదనే మనస్సు వున్నట్టుందే!" అన్నారు.

దానికి నేను "ఇక్కడ వంటపనులే కదా నాకు" అన్నాను.

దానికి భగవాన్ "ఏమి? ఈ కాలూ, చేయీ పనులు చేస్తే వుండనీ; నువ్వు కాలూ, చెయ్యీ కాదుగా; ఏమీ

చెయ్యక తటస్థంగా వుండే వస్తువు నువ్వు. అది తెలీనంత సేపే కష్టం. అది తెలుసుకుంటే ఇంక కష్టమేమీ లేదు. ఈ దేహమే నువ్వనుకున్నంత కాలమూ రాగమూ, ద్వేషమూ వుంటాయి. పనీ కష్టంగానే కనబడుతుంది. ఈ దేహం నేను అనుకున్నంత కాలమూ, ఏ పనీ లేకుండా కూచుంటే మాత్రం మనసు ఊరుకుని నిలకడగా కూచుంటుందా? మనం నిద్ర పోయేటప్పుడు కూడా వూరుకోదే; కలలలో తిరుగుతూనే వుంటుంది కదా!'' అన్నారు.

దానికి నేను "అవును స్వామీ! తాను దేహంకాదు అనుకోడం స్వామికి సులభం. మాకు మేము దేహమనుకోడం సులభం. మొన్న కలలో తామే ఈ సంగతే విశదం చేశారు. ఆ స్వప్న మేమిటంటే - మీరు ఆ మూల స్నానం చేస్తున్నారు. ఆ వేళకే నేను వచ్చి దడి యివతల పప్పు రుబ్బుతున్నాను. మీరు 'ఎవరది?' అనడిగారు.

"నేను 'ఎవరని చెప్పను?' అన్నాను.

" 'ఆ చెప్పను వీలుకాని వస్తువే నువ్వు; మరవవద్దు' అని మీరు చెప్పారు. ఇదీ ఆ కల. అవును. ఆ వస్తువు మేమని మరవకుండా వుండడం మాకు కష్టం. శ్రీ భగవాన్లకు అన్నీ సులభం'' అన్నాను నేను భగవాన్‌తో.

దానికి వారు నవ్వి వూరికే నా వంక చూశారు. అదే నాకు ఉపదేశం అనుకున్నాను నేను.

నేను చాలా సార్లు ఉపవాసాలు చేస్తోండే దాన్ని. కాని, అలా ఉపవాసాలు చెయ్యడం భగవాన్ దృష్టిలో



అనవసరమన్నట్లు తోచేది నాకు. కాని, వేదాంత పుస్తకాలలో వేరు విధంగా ఉండేది. విచార సంగ్రహమనే పుస్తకంలో- 'దేహ పోషణ చేస్తూ వేదాంత విచారం చేసే వాడు, మొసలిని నమ్మి నది దాటచూచినట్లు' అని వుంది. 'ఇట్లా వుందేమి టిది?' అని భగవాన్‌ని ప్రశ్నించాను ఓ రోజు.

దానికి శ్రీవారు—"అట్లా రాశారని, అన్నం తినవద్దు, నీళ్లు తాగవద్దు అని అర్థంకాదు. శరీరానికి వుపద్రవము చేసేటట్లు వుపవాసాలు కాని, ఇంకేమీ కానీ చెయ్యకుండా మితంగా భోజనం చేసి, ధ్యాననిష్ఠకి భంగం లేకుండా సంప్రాప్తమైన ఆహారం తీసుకుని లక్ష్యమంతా ధ్యానంమీద వుంచమని అర్థం'' అని చెప్పారు.

## పులిసిన మజ్జిగ

ఆ రోజుల్లోనే ఒక విశేషం జరిగింది.

భగవాన్ ఎండాకాలంలో తప్ప మజ్జిగ అన్నంలో పోసుకోరు. అదీ తియ్యని మజ్జిగే. పెరుగుని కాని, పాలను కాని ఉపయోగించరు. చారూ అన్నంలోనే ఒక్క గరిటెడు తియ్యని మజ్జిగ పోసుకుంటారు. ఆ తియ్యని మజ్జిగని ఆశ్రమంలో అందరికీ పొయ్యాలి. అందరికీ చాలకపోతే తామూ తీసుకోరు.

ఓ రోజు రాత్రి మజ్జిగ పులిసింది. "సరే, పులిసింది [illegible]ంచునల్లనో? ఎవరిని అనేదేముంది? పోసుకోకుండా వుంటే [illegible]తుంది'' అని వారు మజ్జిగ పోసుకోలేదు. ఎంత జాగ్రత్త

తీసుకున్నా మర్నాటి రాత్రికీ పులిసింది మజ్జిగ. ఏమి చెయ్యడానికీ తోచలేదు. ఆ మర్నాటికీ అంతే అయింది.

ఆ మధ్యాహ్నం ఆశ్రమంలో పనిచేసే మనిషి అరపడి పాలు ఎక్కడినుంచో తెచ్చి యిచ్చాడు. దాన్ని తోడు పెట్టి వుంచిన సంగతి నాకు జ్ఞాపకము వచ్చింది. అది తియ్యని పెరుగుగా వుంది. ఆ పెరుగును తియ్య మజ్జిగ చేసి అందరికీ పోయాలంటే అది అందరికీ సరిపోదు. అందరికీ పోస్తేనే కాని స్వామి తీసుకోరు. తక్కిన వాళ్ళంతా సంవత్సరం పొడుగునా పాలూ పెరుగూ తాగుతారు గదా, ఈ రాత్రికి వాళ్ళకి లేకపోతేనేం? స్వామి ఎప్పుడూ పాలూ, పెరుగూ, మజ్జిగా తాకరే— ఈ కాస్త తియ్యని మజ్జిగ తప్ప! అదీ ఈ నాలుగు నెలలే. పులిసిపోయిందని ఈ రెండు రోజుల నుంచీ మజ్జిగే పోసుకోలేదు. తక్కినవారు తాగుతూనే వున్నారు. కనక స్వామివారికి తెలీకుండా అయినా సరే ఆయనకి తియ్యని మజ్జిగ వెయ్యాలని నిశ్చయించుకున్నాను.

ఆయన అన్నంలో చారు కలుపుకుని తింటున్నారు. నేను కుడి చేత్తో ఒక గరిటలో ఆ తియ్యని పెరుగు తీసుకుని, ముందుగా ఆ గరిటెడు పెరుగూ స్వామివారి చారూ అన్నంలో పోశాను. పోసి; నేను తడిక పక్కగా నుంచుని ఆయనవంకే చూస్తున్నాను. ఆయన నోట్లో అన్నము పెట్టుకుని కళ్ళెత్తి నా వంక చూశారు. ఆ చూపు ఈశ్వరుడు మన్మథుణ్ణి చూసిన చూపుమల్లే మండిపోయింది! నా వొళ్ళు గడ గడ వొణికింది. భరించలేక లోపలికి వెళ్ళిపోయినాను.



భగవాన్ లోకమ్మను పిలిచి మజ్జిగ పోయించుకుని "అందరూ యిక్కడికి అంత దూరం నుంచి సమత్వం నేర్చుకోడానికి వచ్చారు. నా దగ్గిరికి వొస్తే, అందరూ ఒకేమాదిరి" అంటో అందర్ని కలిపి కోప్పడి సోఫామీద కూచున్నారు. మేము మా పని కాగానే ఆయనకు నమస్కరించి వూళ్ళోకి వెళ్ళడానికి భగవాన్ దగ్గిరికి వచ్చినప్పుడు, ఆయన నన్ను చూడగానే మొహం అటువేపు తిప్పుకున్నారు. అప్పుడు నే నేమై పోయినానో ఆయనకే తెలియాలి.

## పా దా ల మీ ద ప డ్డా ను

మరునాడు వుదయం, భగవాన్ తేనమ్మతో "నేను ఇంక భోజనములో మజ్జిగ పోసుకోను" అన్నారు.

"అదేమిటి స్వామీ?" అంటే—

"నాకుగాను మజ్జిగ పైన గడ్డగా పేరుకుంటోంది. అందుకని" అన్నారు. ఆ మధ్యాహ్నం మజ్జిగ పోసుకోలేదు. అది చూసి, నేనూ మజ్జిగ పోసుకోడం మానేశాను. నాకు మజ్జిగ ముఖ్యం భోజనంలో. అన్ని కాలాలలో, అందులో ఎండాకాలం మజ్జిగ లేనిదే నిలవలేను. కాని, స్వామి మజ్జిగ పోసుకోకపోతే, నే నెట్లా మజ్జిగ పోసుకుంటాను? అందులోనూ నా అపరాధంవల్ల కద!

మామూలుగా పనులు చేస్తున్నాము.

భగవాన్ నవ్వుతో నాతో మాట్లాడుతున్నారు. నా తప్పు క్షమించమని ఆయన్ని అడగడానికి నాకు సమయం దొరక లేదు. నాలుగో రోజున అవియల్ చేస్తున్నాము,

భోజనానికి. భగవాన్ దగ్గర నుంచుని ఎట్లా తయారు చేయాలో చూపిస్తున్నారు. అవియల్ లో పెరుగు పోయమన్నారు నన్ను.

ఆ సమయంలోనే వారి పాదాలమీద పడి, "స్వామీ! నేను తప్పు చేశాను,అందరమూ పెరుగూ పాలూ బాగా తాగుతున్నాము. భగవాన్లు బాధలో ఒక్క గరిటెడే గదా పోసుకుంటారని, పుల్ల మజ్జిగపోయ చేతులురాక, తియ్య పెరుగు పోసినాను. అందులో అది మన వీరడు తెచ్చిన పాలు. ఇక మీద నాకు అటువంటి బుద్ధి పుట్టకండా చేసి. భగవాన్లు ఇవాళ నుంచీ మజ్జిగ పోసుకోవలసింది. భగవాన్లు మజ్జిగ పోసుకోవడం లేదని నాకు కడుపులో వేదనగా వుంది" అని చెప్పాను.

"నేను మజ్జిగ పోసుకోవడం అందువల్ల మానలేదు. నాకు జలుబుగా ఉంటోంది. అందుకని మానా" నన్నారు.

"వీలులేదు, మీరు మజ్జిగ పోసుకు తీరాలి". అని పట్టు పట్టాను నేను. ఆ రోజు మధ్యాహ్నము భోజనంలోకి ఎచ్చెమ్మ భగవాన్‌కి పెరుగన్నం తెచ్చింది. ఆ అన్నం తింటో, భగవాన్ "ఇదుగో, నేను పెరుగన్నం తింటున్నాను. నేను మజ్జిగ పోసుకోవడం లేదని ఆ అమ్మకు వేదనగా వున్నదట" అని చుట్టూ వున్న వారితో అన్నారు. నాకు సంతోషమయింది. అప్పటినించి భగవాన్ మళ్ళీ మజ్జిగ వాడుతున్నారు.

ఒకనాడు శ్రీవారితో "నేను కావిడి కట్టుకుని భిక్షకు పోయి సన్న్యాసంగా వుంటాను" అన్నాను.



దానికి వారు, "భిక్షం ఎత్తిన వారందరూ సన్న్యాసులా? అంతటితో జ్ఞానులైనారా? సన్న్యాసమంటే దాని అర్థం ఏమిటో ముందు తెలుసుకో" అన్నారు.

## వంకాయ కూర రుచి

ఒకసారి గిద్దలూరి నారాయణరావుకు వొళ్ళు జబ్బుగా వుండి ఆశ్రమానికి వచ్చి వుంటున్నాడు. వారికి వుప్పుడు పథ్యం గంజి చేసి ఇమ్మని భగవాన్ చెప్పారు. నేను ఆ గంజిని తయారు చేస్తో వుండగా భగవాన్ వంట ఇంట్లోకి వచ్చి చూచి గాడి పొయ్యి దగ్గిర నేలమీద కూచున్నారు. పొయ్యిమీద వున్న వంకాయ కూరని కొంచెముగా తీసి ఆకులో పెట్టి శ్రీవారి ముందు పెట్టింది సంపూర్ణమ్మ. వారు రుచి చూస్తున్నారు. దాని పుణ్యమేమో, శ్రీవారికి కూర స్వయంగా పెట్టగలిగింది అనుకుని, మళ్ళీ 'నేనైనా వారి భక్తులకే గదా గంజి చేస్తున్నాను? ఆయనకి చేసినా, భక్తులకు చేసినా వొకటే కదూ?' అని సమాధానం చెప్పుకున్నాను.

వెంటనే ఆ కరుణామూర్తి నా వంక చూసి "ఇదుగో, కొంచెం మంచినీళ్ళు ఇయ్యి" అన్నారు. ఇచ్చాను. ఆయనకి నీళ్ళు ఇవ్వగలగటం నాకెంతో తృప్తి నిచ్చింది. భగవాన్ తనకి ఆకలి, భోజనము కావాలనిగాని, దాహము, నీళ్ళు కావాలనిగాని ఎన్నడూ అడగరని అందరూ ఆశ్రమంలో చెప్పుకునేవారు. నాకది జ్ఞాపకం వచ్చి 'నన్ను తృప్తి పరచ

డానికే కదా దాహమనీ, మంచి నీళ్ళిమ్మనీ అడిగారు? ఎంత భక్తవత్సలులు!'' అని కరిగిపోయినాను.

## ఆరు నెలల బిడ్డ మనస్సు

ఒకనాడు హాలులో అయిదారుమంది బ్రాహ్మణులు వచ్చి అనేక గురు స్తోత్రాలు చేసి, చాలా శ్లోకాలు చదువుతున్నారు. నేను అక్కడే వున్నాను.

"ఎన్ని చదివినా గురువీక్షణము లేక, జ్ఞానము కలగదు'' అంటో భగవాన్ లేచి వెళ్ళిపోయినారు. నాకు సంతోషమైనది. నాకు ఎన్నిసార్లు భగవాన్ కృపావీక్షణము కలిగిందో! ధ్యానంలో చూపులు, అనుగ్రహంగా చూపులు, ఆగ్రహంతో చూపులు–యెన్ని నా భాగ్యం కొద్ది దొరికాయో!

కాని, ఇంకో రోజున "జ్ఞాని మనసు ఆరుమాసాల బిడ్డ మనసు మాదిరిగా ఉండా''లని చెప్పారు. అప్పుడు నాకు చాలా విచారమయింది. సాక్షాత్తు అరుణాచలేశ్వరుడే ప్రత్యక్షంగా వచ్చి వున్న ఇటువంటి స్వామివద్ద వారి పాదధూళికి పాత్రురాలినై కూడా ఇంకా నా మనసు ఆ విధంగా కాలేదే, ఈ మాయా చిత్రమేమో అని చింతించాను.

ఒకనాడు శ్రీవారు భక్త విజయంలోని భక్తుల చరిత్రల్ని గురించి మాట్లాడుతున్నారు. అప్పుడు నేను "ఆ భక్తుడికి భగవంతుడు కనపడ్డారు, ఈ భక్తుడికి అనుగ్రహం చూపారు అని భక్త విజయంలో వుంటుంది. ఆ సంగతులు నిజమేనా?'' అని అడిగాను.



దానికి వారు "అట్లా సందేహ పడకూడదు. భక్తి చెడిపోతుంది. ఇప్పుడు నువ్వు ఇక్కడ మాట్లాడుతున్నది ఎంత నిజమో, అదీ అంత నిజము'' అన్నారు.

## ఒక కొత్తకాంతి

ఒకనాడు మధురి అలమేలు అనే ఆమె శ్రీవారి దర్శనానికి వచ్చి వుపదేశం కావాలని అడిగింది. దానికి భగవాన్ సోఫా మీద కూర్చుని తన పాదాల వద్ద కింద కూచున్న ఆమె కేసి తిరిగి, అరవంలో తిరుపుఘల్ నుంచి పాటలు ఎత్తి ఎత్తి చెపుతుంటే, ఏం చెపుతున్నారో భాష అర్థంకాక పోతేనేం, ఆయన ఆకారమే మారిపోయి, ఓ కొత్త కాంతి ఆయనలోంచి ప్రకాశిస్తున్నట్లు అయింది.

నా కళ్ళ ముందు ఆ బొజ్జ, ఆ మూర్తి, నవ్వు, దయ, తమలపాకులు నములుతూ ఆయన మాట్లాడ్డము, ఆ సాన్నిధ్యము, ఆ దర్శనం – ఎన్నేళ్ళకీ కళ్ళకు కట్టినట్లు వుంటుంది. అట్లా మాట్లాడుతూనే లేచి వాకిట్లోకి వెళ్ళి వుమ్మేసుకుని తిరిగి వచ్చి, హాయిగా ఇటూ అటూ పచార్లు చేస్తూ [illegible] వుంటే, ఇంతలో ఆయన రూపమే మారింది. ఆయన్ని [illegible]వుంటే పెద్ద ఆనందము, ఆయన పాదాల వద్ద కూచునే భాగ్యం దొరికింది కదా నావంటి దానికి కూడా అనే అదృష్టము–ఇట్లా పరిపరి విధాల యోచనల్లో మునిగిపోయినాను.

అప్పుడే కాదు. ఎప్పుడూ అంతే. ఎవరు తన దర్శనానికి [illegible] వారి అధికారానికి, వారి ఆత్మస్థితికి తగినట్టుగా ఆయన రూపమూ, మాటా, వునికీ మారేవి. చిన్న పిల్లలతో

చిన్నవాడు, సంసారులతో సంసారి, వేదాంతులకు గురువు, యోగులకు సాక్షాత్ సర్వేశ్వరుడు. స్త్రీలలో స్త్రీ- ఈ విధంగా అయి, వాళ్ళ స్థితికే తానూ వచ్చి వాళ్ళ మనసుల్ని కట్టేసుకునేవారు.

ఎవరు వచ్చినా ఆయన సౌందర్యానికి, దయకి, ఐక్యానికి ముగ్ధులై కట్టుబడి వొదలలేక వొదలలేక కదలేవారు. ఒక్కొక్కరికి ఎవరికీ తెలియకుండా వారికి మాత్రమే ఒక్కొక్క దర్శనము, ఒక్కొక్క అవతారము ప్రదర్శించేవారు. హాలులో వున్న ప్రతివారికీ వారి వారి అభిరుచుల్ని, తాహతునుపట్టి ప్రత్యేకమయిన దర్శన మయ్యేది ఒకేసారిగా.

ఆయన ఫోటోలూ అంతే గద! ఒక ఫోటోకి ఇంకొక దానికీ సంబంధమే లేదు. తెలిసిన వాళ్లు తప్ప ఇవన్నీ ఒక్కరి ఫోటోలే అని నమ్మలేరు. వారి రూపమే కాక, వాక్కులు, అభిప్రాయాలు, ఆదరం-అన్నీ ఎప్పటి కప్పుడు ఎన్నో విధాలుగా మారేవి. అన్నీ కనిపెట్టి నిలిచి చూసేవారికి అమితాశ్చర్యంగా వుండేది.

మో క్షం కా వా లి

ఒక రోజు మధ్యాహ్నం కుంభకోణం నుంచి వొకామె వచ్చి, "స్వామీ! ఎన్నో రోజులనుంచో మిమ్మల్ని దర్శనం చేసుకోవాలని ఆశ. ఇప్పటికి మీ దర్శనము దొరికింది. నాకేమీ వద్దు. ఒక్క మోక్షమిస్తే చాలు" అని నమస్కారము చే వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళగానే—భగవాన్ సోఫా అంతా కదిలి



పోయేటట్టు శరీరం అంతా ఆడుతో ఒకటే పెద్ద నవ్వు నవ్వారు. అట్లా నవ్వుతూనే అక్కడ వున్న మమ్మల్నందర్నీ చూసి "ఆమెకు ఒక్కటీ ఒద్దుట. ఒక్క మోక్షమిస్తే చాలునుట" అన్నారు.

అందుకు నేను "అవును, మేము కూడా అందుకే కదా వొచ్చి వున్నాము" అన్నాను.

అందుకు శ్రీవారు "అవును, మోక్షమనేది ఒక మూటా ఇవ్వడానికి! ఆ మూటని నేను నా దగ్గిర దాచుకుని కూచున్నట్లు అడుగుతారు. ఇంక ఏమీ వద్దు అని నిజంగా వొదిలి వేస్తే, మిగిలేది మోక్షమే. ఆ సర్వ త్యాగమే మోక్షము. ఇంక నేను వేరుగా ఇచ్చేదేముంది?" అన్నారు.

జే గ ం ట బ హు మ తి

ఒకనాడు ఎవరో, ఆశ్రమంలో కోవిలలో హారతి సమయంలో వాయించడానికి ఒక జేగంటని తెచ్చి భగవాన్‌కి అర్పించారు. వారు ఆ జేగంటని చేతులతో పట్టుకొని చాలా సేపు ఇట్లా వాయించి అట్లా వాయించి ఆ నాదం విని నవ్వుతూ "ఈశ్వరుడు అడిగేది సంచితమనే కర్పూరాన్ని వెలిగించి హారతి ఇవ్వమని. కాని, వీరు కాలణాకి కర్పూరం కొని తెచ్చి, వెలిగించి హారతి ఇచ్చి ఈశ్వరుణ్ణి ఏమార్చాలని చూస్తారు. ఇదంతా కన్ను తుడిచే వ్యాపారం. వీటి కన్నిటికీ లొంగేవాడు కాడు ఈశ్వరుడు. తాము చావకూడదు, తాము ఈశ్వరుణ్ణి మింగాలని వీరికి. అబ్బా! ఎంత ఆశరా!" అని నవ్వుతున్నారు.

ఇంకా అన్నారు యిలా: "కొంతమంది తాము ఈశ్వరుడికి అంతా అర్పణ చేశామని గొప్పగా చెప్తూవుంటారు. వారిదేముంది? వారిది అని ఏముంది ఈశ్వరుడికి అర్పణ చేసేందుకు? ఈశ్వరుడిది ఈశ్వరుడికి ఇవ్వడమేగా, బెల్లంతో చేసిన వినాయకుడికి నైవేద్యంగా ఆ వినాయకుడినించి కొంచెం బెల్లం గిల్లి పెట్టినట్టు. సర్వమూ ఆ ఈశ్వరుడే అని వూరికే వుండడమే అసలు ఈశ్వరుడికి మీరు చేయగల శ్రేష్టమైన అర్పణ; వూరికే ఉండడమంటే ఏ ఆలోచనలూ లేకుండా ఉండడం."

## ఇడ్లీ తినని వేణమ్మ

ఒకనాడు పొద్దున్న భగవాన్ బాదంచెట్టు కింద కూచుని ఉన్నారు. అప్పుడు వేణమ్మ పడుకుని వుంది. భగవాన్ శాంతమ్మని పిలిచి వేణమ్మకి ఇడ్లీ పెట్టమన్నారు. శాంతమ్మ "అది ఇడ్లీ తినదు" అంది. ఎందుకు తినదని అడిగారు భగవాన్. ఇడ్లీ వుప్పుడు బియ్యంతో చేస్తామని, ఆచారం గనక తినదు అన్నది శాంతమ్మ.

దానికి భగవాన్, "అదేమిటి? చేతులో పెట్టినది తినవలసిందే. 'అదేమిటి? ఇదేమిటి? అది తినను, ఇది తినను' అంటూ ఈ చేష్టలన్నీ పనికిరావు" అని కోపంతో గద్దించారు.

నేనూ అంతే. ఆశ్రమానికి వచ్చి పది నెల లయింది. ఇడ్లీ నేనూ తినడంలేదు—ఉప్పుడు బియ్యంతో చేస్తారనీ, ఆచారానికి లోపమనీ.



నేను శాంతమ్మతో "నేనూ తినడం లేదని భగవాన్‌తో చెప్పకేం!" అని లోపలికి వెళ్ళి చప్పున ఇంత ఇడ్లీ తీసుకుని తినేశాను.

ఆశ్రమానికి నేను మొదట వచ్చి ఉన్నప్పుడు, కొద్దిమంది మనుషులు మాత్రమే ఉండేవారు. భగవాన్ తమ్ముళ్ళు (శ్రీ) నిరంజనానందస్వాములవారే వంట. వంటకు పైపని; చింతపండు పిసికి ఇవ్వడమూ, పప్పులు రుబ్బడమూ—ఇదంతా స్వాములవారే చేసి, తరువాత హాలులోకి పోయి సోఫా మీద కూచునేవారు. నేను వచ్చిన తరువాత కూడా నాతో కలిసి భగవాన్ పప్పు రుబ్బడమూ, కూరలు తరగడమూ, వంటకు అందివ్వడమూ—ఈ పనులన్నీ చేసేవారు; తెల్లవారగట్ల నాలుగింటికే లేచి, తన చుట్టూ వుండే సాధువులతో కలిసి కూరలు ముందు తరిగి సిద్ధంగా పెట్టేవారు. వంటకు శాంతమ్మా, పై పనులకు నేనూ, తేనమ్మా.

## మూడింటికి హాజరు

రాత్రి ఊళ్ళో పడుకుని తెల్లారి ఆరుగంటలకు ఆశ్రమానికి వచ్చేవాళ్ళం. ఈలోగా ఇడ్లీ శ్యామయ్య చేసిపెట్టేవారు. ఇడ్లీలోకి ఏవో ఆకులన్నీ కలిపి పులుసు తయారు చేయించేవారు భగవాన్. మేము ఆరింటికి వస్తోవుంటే, ఈలోగా ఇడ్లీ వాళ్ళు చెయ్యడం చూసి మేము తెల్లారకట్ల నాలుగింటికే ఆశ్రమానికి రావడం ప్రారంభించాము. మేము నాలుగు గంటలకు రావడం ఏ మాత్రం ఆలస్యమైనా, భగవాన్ తాను ఇంకో [illegible]ళ్ళది సహాయం తీసుకుని దోసెలూ, కాఫీ తయారు చేసే

వారు. అది చూచి మేము తెల్లవారుఝామున మూడింటికే వచ్చి యిడ్లీ, కాఫీ తయారుజేసి, భగవాన్ సన్నిధిలో కూచున్నాము.

"ఇదుగో చూడు, స్వామి పొయ్యిదగ్గిర పనిచేస్తున్నారని, నాలుగు గంటలల్లా పోయి మూడు గంటలకే వచ్చారు వీళ్ళు" అని భగవాన్, తను పొయ్యి దగ్గిరికి వెళ్ళడంవల్ల, మేము తొందరగా రావడ మవుతోందని తలచి, మాపై కరుణవల్ల ఆనాటి నుంచీ కాఫీ పొయ్యిదగ్గిరికి రావడం మానుకున్నారు. మేము బద్ధకించి ఆరు గంటలదాకా రాకపోయినా, మాకోసం ఎదురు చూస్తూ కూచునేవారు స్వామి. అంత దయామూర్తి ఆయన!

ఎవరికి కష్టం కలగచెయ్యడమన్నా ఆయన కేమాత్రం ఇష్టం వుండదు. చాలా స్వల్ప విషయాల నించి పెద్ద విషయాల వరకు అంతే. ఎన్ని తప్పులు చేసినా, 'దానికేమిలే' అని సమాధానం చెప్పి దయ చూపించే వారు. కాని, ఎంతో కోపం చూపికుండా తన ఆజ్ఞల్ని నెరవేర్చేటట్లు చూచే వారు. ఆయనకి ఏం కావాలి? ఎవరు చేసేదేముంది ఆయనకి? కాని, వారి వారి సంస్కార క్షయానికే, వారిని ఒక మార్గంలోకి తీసుకు వచ్చేందుకే కోపమూ, కఠినత్వమూ నటించే వారు భగవాన్.

చాలా పప్పు రుబ్బవలసిన పనివస్తే, ఎవరికి భారమౌతుందోనని తామూ వచ్చి కూచుని పప్పు రుబ్బుతారు. "అదేమిటి స్వామీ, తమకీ శ్రమ?" అంటే, వారు కోపము చూపేవారు. అందరూ సమంగా పని చేయాలని, ఒక్కరు



ఎక్కువ అని, తక్కువవారు ఆయన్ని కూచోపెట్టి పని చేయడము అంటే వారికి ఏమాత్రమూ గిట్టదు.

ఇట్లా మాతో వంటా పనులూ చేసే మా సహచారి వెళ్ళి సోఫాపైన కూర్చున్నారా; పరమ శివుడు కైలాసం పైన కూచుని దర్శనం యిచ్చినట్టు కనిపించేది.

తెలుగు పద్యం రాశారు!

ఒకరోజు భగవాన్ వాశిష్ట రామాయణంలోని ఒక శ్లోకాన్ని తెలుగు పద్యంగా రాశారు. మధ్యాహ్నం భోజనమైనాక సోఫామీద కూచుని వుండగా, నేను హాలుకి ప్రదక్షిణంగా వెడుతున్నాను. దగ్గరవున్న అనంతాచారిని చూసి భగవాన్ "అందమ్మ (ఆ అమ్మ) పోయినదా?" అని అడిగారు. నేను వెనక్కి వెళ్ళి, వారికి ఎదురుగా నుంచున్నాను.

నన్ను చూసి, వారు "ఇదుగో, తెనుగు పద్యము. ఇది తీసుకుని చదువు" అన్నారు. దానికి నేను "నా దగ్గర కళ్ళజోడు లేదు, సరిగా చదవనూ లేను" అన్నాను.

అప్పుడు ఆ పద్యాన్ని అనంతాచారిచేత చదివించి అర్థం చెప్పారు.

ఆ పద్యం యిది:

బహువిధ దశలన్ని పరిశీలనముచేసి
సత్వరం పదమేది తత్పదమును
హృత్తునగాని భువినెన్నడు గ్రీడింపు
భావమ్ములో నెల్ల భావమదియు,

ఎరిగితివా దృష్టి యెప్పుడూ విడువక
యిల యందు వర్తిలు మిచ్చపగిది
సంభ్రమ సంతోష సంతాప కోప స
మారంభ ప్రారంభ
వ్యాజముగ విహరించు లోవిమలుడగుచు
ఆశాపాశ విముక్తుడై అన్ని వృత్తు
లందు సమభావముంగల్గి అవనియందు
వేషయుక్తుడై వెలియాడు వీరరామ!

దానికి నేను "మాకీ పద్యాలూ, వాటి అర్థమూ -
ఇదంతా ఎందుకు? సర్వ పద్యాలలో అర్థమూ, వేదాంతమూ
అన్నీ మీలో ఒప్పి వున్నాయి. మిమ్మల్ని నమ్ముకుంటే
మాకు చాలు. ఇవన్నీ మాకేమి అవసరము?" అన్నాను.

దానికి స్వామివారు "నాకేమి తెలుసు? నాకు
శాస్త్రిలు తెలుసునా? నాకేమీ తెలియదే? నా దగ్గిర
ఏముంది? నాలో ఒప్పి వున్నాయట! ఏమి ఉన్నాయి?"
అన్నారు.

ఇవన్నీ ఎందుకు?

మొదటినుంచీ కూడా భగవాన్ వాకిట్లోకి వెళ్లేట
ప్పుడూ వొచ్చేటప్పుడూ నేను ఆయనని చూడగానే లేచి
నుంచుంటూ వుండేదాన్ని. ఆయన చూస్తూనే వుండేవారు.
ఆయన మా ఎదురుగా వస్తేచాలు - అందరంకూడా భయ
భక్తులతో ఒక పక్కకి ఒదిగి ఉండేవాళ్ళం.

నేను ఊళ్ళో కాపురం వుండి ఆయన దర్శనార్థ



వొచ్చే కాలంలో నేను వచ్చినప్పుడల్లా కొంచెం ద్రాక్షపళ్లు
కొని తీసుకొనివచ్చి ఆయనకిచ్చే అలవాటు. ఒక సాయంత్రం
అదే ప్రకారం తెచ్చిన ద్రాక్షపళ్ళను ఆయన ముందు
పెట్టాను.

దానిని చూసి, "ఇప్పుడెందుకు తెచ్చావు?" అని నవ్వి,
"ఎప్పుడు తెచ్చావు యివి? పొద్దున తెచ్చావా, వొచ్చే
టప్పుడు? అయితే, యివి ఇప్పుడెందుకు పెట్టావు?" అని
అన్నా - అందర్నీ కలిపి, "ఇదంతా యెందుకు? స్వామిని
చూసి నుంచునేదీ, చాలా భక్తి వున్నట్టు నటించేదీ, ఈ వేషా
లన్నీ ఇక్కడికి వచ్చిన తరువాత యిది నేర్చుకున్నది. ఇవన్నీ
ఎందుకు? వీటివల్ల ఏం ఫలం? మామూలుగా వుంటే
చాలదా? మనసు నిర్మలంగా వుండాలిగాని; ఈ నమస్కా
రాలూ, మన్ననలూ-యివన్నీ వేషం. స్వామిని కన్నుతుడిచి
ఏమార్చాలని చూసే పనులు" అని మురుగనారుతో ఆ
సంబంధంగా ఏవేవో కథలు చెప్పినారు అరగంటసేపు.

ఇంకా యిలా అన్నారు: "ఈ నమస్కారాలు అన్నీ
ఏం ప్రయోజనం? అయ్యంగార్లు యిష్టం వుంటే గురువుకి
నలుగురూ చూసేటప్పుడు మరియాదచేసి భక్తి చూపేదీ;
ఇష్టం లేకపోతే ఒక గుంటతీసి, 'స్వాములవారూ, దయచేసి
[illegible] ఆ గుంటలో కూచుంటారా? లేకపోతే మిమ్మల్ని
ఎత్తి కూచోపెట్టమా?' అని అడుగుతారు."

ఆ కథలు విని ఆ రోజు నమస్కారం పెట్టడానికి
కూడా భయపడి వాకిట్లోంచే వెళ్ళి పోయినారు మురుగ

నారు. ఆ రోజు మురుగనారుతో చాలా మాటలు అన్నారు భగవాన్. "మొదట మనుషులు ఇక్కడికి వచ్చేటప్పుడు భక్తి వినయాలతో వస్తారు. తరువాత త్వరలోనే సర్వమూ వారిదే. అంతా వారి ఇష్టమే, అధికారమే. వారు చెప్పినట్లు స్వామి వినాలి. స్వామిది యేదీ లేదు. వారు యెన్ని తప్పులు చేసినా వూరికే నోరుమూసుకు వుండవలసిందే స్వామి. వారు ఒక్క నమస్కారం చేశారా, అర్థం ఏమిటంటే—మేము నమస్కారం పెట్టాము గదా, మా తప్పులకి ఇక మీరు ఏమీ అనడానికి వీలులేదు అని." ఇట్లా చాలా కోప్పడ్డారు.

ఆ తరువాత అందరికీ భయమే ఆయనకి నమస్కారం పెట్టడమన్నా, ఆయనకి ఏమన్నా తీసుకుని వెళ్ళడమన్నా. మురుగనారు మొదలైనవారు, స్వామివారికి దూరంనించే నమస్కారం పెట్టుకుని వెళ్ళేవారు.

## చేతిలో చారు

భగవాన్‌కి భోజనం వొడ్డించేటప్పుడు చారు చేతిలో పోసేదాన్ని. ఆయన ఆ చారు తాగిన తరువాత మళ్ళీ చారు చేతులో పోసేదాన్ని. వారు తాగినంతసేపూ అట్లానే పోస్తాను. ఒకరోజు ఇంక చారు పొయ్యవద్దు పొమ్మన్నారు. మరునాటి నుంచీ అన్నం గుంటచేసి, ఎంత చారు పడితే అంత చారే పోసుకుంటున్నారు. నావల్ల ఏమి తప్పు జరిగిందా అని నేను తర్కించుకున్నాను. బాధ పడ్డాను.

చివరికి వారు వంటింట్లోకి వచ్చినప్పుడు ఓ రోజు,



నాకు భయమై శాంతమ్మచేత అడిగించాను, "ఏం తప్పు జరిగింది? చారు చేతులో పోసుకోరేం?" అని.

"నాకు ఒక్కడికే చారు పోస్తే కూచుంటే, తక్కిన వాళ్ళందరూ చారు కోసం కాచుకుని కూచుంటున్నారు. కన పట్టంలేదా? వాళ్ళకీ పోసివచ్చి నాకూ పోస్తూవుంటే సరి పోతుంది" అన్నారు.

వారికి ఎక్కడ ఆలస్యమౌతుందోనని మా భయం.

"తప్పయిపోయింది స్వామీ! మళ్ళీ ఎప్పటిమల్లే మీరు చారు చేతిలో పోయించుకుంటేనేగానీ మా మనస్సుకు ఆరాటం ఆగదు. దయచేయండి" అన్నాను.

"ఎందుకు అంత చారు? నాకు అక్కర్లేదు. అన్నంలో పోస్తే చాలు" అన్నారు. అంతకన్న వారితో తర్కించడం నాకు భయం.

"సరే, తమ దయ" అన్నాను.

"దయకేం, చారు తాగితే దయ ఉన్నట్లూ, లేక పోతే లేనట్లూనా? చారు తాగితేనే దయా?" అన్నారు.

ఆ నాటి నుంచీ చారు చేతిలో పోయించుకోనే లేదు. తన ప్రత్యేకంగా శ్రద్ధ చూపడం ఆయనకి ఏ మాత్రమూ గిట్టదు. అందరూ ఏకమేననీ, అందర్నీ తనవలెనే మేను ఉండాలనీ, సమత్వం మాలోకి తీసుకురావాలనీ ఆయన మాకు ఎన్నేళ్ళు ఎంత శిక్షణ నిచ్చారో! ఆ శిక్షణ మా మనసు లోతుగా దిగి, మేము మరవకుండేందుకు ఆ చిన్న ఏర్పా టు కూడా తాము మానుకొనేవారు.

కామెర్లు

ఓసారి వారికి కామెర్లు వచ్చాయి. పళ్లు తప్ప ఏమీ తినకూడదు. తెచ్చిన కాసిని పళ్ళూ అందరికీ పంచి పెడితేనే గాని ఆయన తినరు. ఎన్నిపళ్లు తేగలరు? కాని, ఆయన మాను కొంటారుగానీ, అందరికీ పంచనిదే తినరు. అప్పుడు ఆశ్రమం పెరగలేదు. అన్నీ తెచ్చి పెట్టేందుకు ధనికులు లేరు. అప్పటికీ మా శక్తికి మించేటట్లు పరిస్థితులు కల్పించి తప్పు పట్టేవారు. భోజనాల చివర, పళ్లు పంచడం అయిపోయిన తరువాత, ఒకాయన వచ్చి భోజనం చేశారు.

ఆయన్ని "పళ్లు నీకు ఇచ్చారా?" అని అడుగుతున్నారు భగవాన్!

ఏ మందులకీ కామెర్లు తగ్గలేదు. తిరుక్కోయిలూరు నుంచి ఒక ముసలాయన రెండు నిమ్మకాయలు పట్టుకొని వచ్చారు భగవాన్ దగ్గరికి.

"మీకు నిమ్మపళ్ళ రసంతో తేనెగాని, చక్కెరగాని వేసి ఇమ్మని నాకు కల వొచ్చింది" అన్నారు ఆయన. "సరే, ఇమ్మన్నారు" భగవాన్. నిమ్మపళ్ళ రసంతో చక్కెర కలిపి ఇచ్చారు, దాంతో భగవాన్ కామెర్లు నయమైనాయి.

'ఉంగరం చేయించాను'

ఒక మధ్యాహ్నం భగవాన్ పప్పు రుబ్బుతున్నారు. వారు శ్రమపడి ఏమన్నా చేస్తోవుంటే చూడలేము. అ పని



మేము తీసుకున్నామా - వారికి కోపం వస్తుంది. ఇంక వంటిం ట్లోకే రావడం మానేస్తారు. రాకపోయినారా-మా సంతోష మంతా చచ్చిపోతుంది. హాలులో భగవాన్ అందరి వారు. వంటింట్లోనో...ప్రత్యేకం మా సొంత భగవాన్! శ్రీవారు తెల్లారకట్ట మూడింటికే లేచి కూరలు తరుగుతున్నారని, కుంజుస్వామి, తక్కినవారు రాత్రే కూరలు తరిగితే, ఇంక కూరలవేపు రావడమే మానారు భగవాన్.

ఆ మధ్యాహ్నం భయపడుతూ వెళ్ళాను. "నీ కోసమే వస్తున్నాను. పప్పు రుబ్బుతావా? ఇంద" అని చప్పున నా కిచ్చి, లేచి వెళ్ళారు. పప్పు పూర్తిగా రుబ్బి, పిండి లోపలికి తీసుకుని వెళ్లాను. స్వామి పొయ్యి దగ్గర కూర్చుని గుమ్మడి కాయ కుత కుత వుడుకుతో వుంటే కలియ పెడుతున్నారు. ఆవిర్లు, పొయ్యి వేడి. వారి వళ్ళంతా చమటలు. 'దీనికా, నాకు అంత సులభంగా పప్పు రుబ్బేపని నప్పజెప్పారు?' అను కున్నాను. ఆయన పడుతున్న శ్రమ చూస్తే నిలవలేకపోయి నాను. ఆ కూర ముక్కలు చింది, కాలివేలు బొబ్బ ఎక్కింది. కాని, అడ్డం వెళ్ళే ధైర్యం మాకు లేదు.

మర్నాడు లోకమ్మ వచ్చి చూసి "స్వామీ, మీ వేలుమీద అదేమిటీ?" అన్నది.

దానికి స్వామి, "నీకు తెలియదా, నేను ఉంగరం చేయించుకున్నాను!" అన్నారు. గోచీ తప్ప ఏమీ లేని ఆ [illegible] ఉంగరమట!!

## కాఫీ అలవాటు లేదు

భగవాన్‌కి కాఫీ తాగడం ఇష్టం వుండేది కాదు. కాని ఆయన చుట్టూ వుండే భక్తులకి కాఫీ యిష్టం. పైగా ఎవరో ఒకరు తెచ్చి యిచ్చేవారు కాఫీకి కావలసిన సామగ్రి. ఆయన తాగకపోతే తక్కిన వారికి తాగడం కష్టంగా వుండేది. తక్కినవారి కోసం, భగవాన్ నాలుగు రోజులు కాఫీ తాగేదీ, ఏదో వంకతో పది రోజులు మానేదీ; మళ్ళీ అందరు బలవంతం చేస్తే నాలుగు రోజులు తాగేదీ - ఇట్లాగే గడిచేది. అట్లాగే ఒకసారి పట్టుపట్టి చాలా కాలం కాఫీ తాగడం మానేశారు.

ఓ రోజు అప్పుశాస్త్రిగారి భార్య వూళ్ళోంచి, కాఫీ చేసుకొని, ఫ్లాస్కులో పోసి తీసుకొచ్చింది, భగవాన్‌ని కాఫీ తాగమని అడిగింది. "నేను కాఫీ తాగడం లేదే — మానివేశాను. నేను తాగను" అన్నారు భగవాన్.

దానికి ఆమె "నేను మాత్రం ఏం చెయ్యను? నిన్న రాత్రి కలలో నాకు దేవాలయం పక్కన ఒక ముత్తయిదువ కనపడ్డది. ఆమె పార్వతి; అపీతకుచాంబ. ఆమె నాతో 'నా బిడ్డ కాఫీ తాగడం లేదు. నువ్వయినా కొంచెం కాఫీ కాచి యివ్వకూడదా?' అని అడిగింది. అందుకని తీసుకుని వచ్చాను. మీరు తాగక తప్పదు" అంది,

దానికి భగవాన్ కొంత విసుగుతో "ఆమె మునుపు కొండ మీదా యిట్లాగే కలలో చెప్పింది. అట్లా చెప్పి నా నియమాలు తీసేస్తో వుంటుంది" అని కాఫీ తాగారు.



## వేదాంత బోధ

మాతో పప్పులు రుబ్బుతో, కూరలు తరుగుతో, వంట వండుతో, మా చేత వడ్డన చేయించుకుంటూ మాకు ఆయన నోటితో తెల్పిన వేదాంతమే కాక, ప్రతి చిన్న పనిలోనూ మాకు యెటువంటి శిక్షణనిచ్చి, మా స్వభావాలనే ఎట్లా మార్చారో, యెట్లా తెలుసుకోగలం?

ఆనాడు ఆయన కోపాలలో, ఆజ్ఞలలో, పెట్టే భయాలలో అర్థం దూరంగా కూడా కనపడలేదు. ఈనాడు వాటి విలువ తీసుకుంటున్నాము. ఆయన్ని మొదటినుంచీ యీశ్వరావతారమని నమ్మాము. ఆయన యేమి చేసినా, ఆ విశ్వాసం ఏనాడూ కన్నడూ చలించలేదు. మా విశ్వాసం చలించ లేదంటే మా ప్రజ్ఞ కాదు. ఆయన చలింపనీ లేదు. ఎప్పటికప్పుడు ఏ నిమిషానో ఆయన విశ్వరూప సందర్శనం అయ్యేది. చిన్న వాళ్ళం, ఆడవాళ్ళం, చదువుకోని వాళ్ళం ఆయనమీద ప్రేమవల్ల కట్టుపడి, మా ఊళ్ళని; మనుషుల్నీ వొదిలి పడి వున్నాము. ఆయన ఏ వుపదేశం వల్లనో, కరుణ వల్లనో మమ్మల్ని ముక్తి మార్గంలో పెడతారని మొదట్లో మా విశ్వాసం, మా ఆశ. ఆయన నేర్పదలచుకున్న సమత్వమూ, ప్రేమా మాకేం తెలుసు? వారికి తెలుసు-మా స్వభావాలు తీక్ష్ణమై, మా మనసులు నిర్మలమై, ప్రతి వాళ్ళలో, ప్రతి వాటిలో ఈశ్వరుణ్ణి చూడగలిగే శిక్షణ పొందితేనేగాని మాకు ఆధ్యాత్మిక గతులు లేవని!

## [illegible]ంటి యింటి సాధన

ఏ స్థితిని యోగులు తీవ్ర సాధనవల్ల సాధించ

చూస్తారో ఆ స్థితిని, మాకు యింటి పనులలోంచి, వంటింటి పనులలోంచి ఆయన సాధనను యిచ్చి ఉత్తీర్ణుల్ని చేశారు.

ఆయన జీవితంలో ఎట్లానో, మరణించీ అట్లానే మమ్మల్ని నడుపుతున్నారనేది స్పష్టం. మమ్మల్ని తరింప చేయనిది, ఆయన వదలరనేది మా నిశ్చయం.

ఆయన పెట్టిన తిప్పలన్నీ వాటికి అర్థం తెలియకుండానే ముక్కుతూనో, విసుక్కుంటోనో గురువు విధించే సాధనకిందే తీసుకున్నాము. ఆయన ఎన్ని నేర్పారో మాకు!

ఏదన్నా పదార్థం ఆశ్రమానికి వచ్చిందా, అది వృథా కాకూడదు—చివరికి కాకరకాయ ముక్కలు కడిగిన చేదు నీళ్ళయినా సరే.

ఆయనకి వడ్డించేప్పుడు ఎంత జాగర్త చూపాలో! ప్రాణాలెగిరి పొయ్యేవి. ఆయనకి తక్కువ కాకుండా తినాలని మా కోర్కె. కాని, వేసిందల్లా తింటారు ఆయన. ఎక్కువగా వేశామా మాపని అయిందే. చివాట్లు! చివాట్లు లేవా, ఏదో ఒక సుస్తీ. ఆ సుస్తీ చేసేదో, చేయించుకునేవారో!

ఎవరన్నా తెచ్చిగాని, చెట్టునుంచి కోసిగానీ ఏదన్నా కూరకానీ, పదార్థంకానీ ఆశ్రమానికి వచ్చిందా అది ఏ మాత్రమూ వృథా కాకూడదు.

## కొండ మీద నల్లేరు

ఒకసారి ఒకామె కొండమీదనుంచి నల్లేరు తెచ్చి ఆశ్రమం బావిదగ్గర పెట్టుకొని ఆశ్రమంలోకి వెళ్ళింది. అటు వస్తో భగవాన్ ఆ నల్లేరును చూసి "ఇదెందుకు యిట్లా పడేసి



వుంది? దీన్ని పచ్చడి చేయవచ్చునే. తీసుకురండి'' అని చెప్పి వెళ్ళిపోయారు.

ఆశ్రమంలో వాళ్ళ ప్రాణాలు ఎగిరి పోయినాయి—ఈ నల్లేరంతా పచ్చడిచేసి తమని తినిపిస్తారు గావును అని. వెంటనే వారంతా ఆ నల్లేరు ఎవరు తెచ్చారో కనుక్కొని, ఆమెను బతిమాలి ఆ నల్లేరు అక్కడనుంచి తీసుకుని పోయేటట్టు చేశారు.

ప్రతి వస్తువుకూ ఏదో ఒక ఉపయోగం చూపేవారు. ఒక మెతుకుగాని, ఒక పలుకుగాని వృథా కావడం [illegible]కుసకంట ఎక్కడ పడుతుందో అని హడలు మాకు.

## కుండలతో మజ్జిగ

ఒకసారి కుండలతో మజ్జిగ వచ్చింది నెల్లూరునుంచి. ఎట్లా ఉపయోగించడం అంతమజ్జిగని? పచ్చిమిరపకాయలూ, [illegible]ప్పు, మిరియాలూ మొదలైనవి నూరించి ఆ మజ్జిగలో [illegible]రు భగవాన్. కలిపి, ఆ మజ్జిగ అయిపోయిందాకా [illegible]ంజీ ప్రతి దాంట్లోనూ చేరుస్తో వుండమన్నారు. అట్లా ఎన్నింటిలో చేర్చినా యింకా వుండిపోయింది ఆ మజ్జిగ! [illegible]గత్తి శాంతమ్మ మిగిలిన మజ్జిగనంతా కలిపి చారు చేసి [illegible]ఘులకు పోసింది. భగవాన్ వచ్చి మజ్జిగ లేకపోవడం [illegible]సి, ''ఇదంతా తూములో పారపోశారా?'' అని కోపగించు[illegible]న్నారు. ఏం చేశామో వారితో చెప్పడానికి ఎవరికీ ధైర్యం లేక పోయింది. మేము తెలపకపోతే ఆ సర్వజ్ఞులు తనకి తెలి[illegible] ప్రవర్తించేవారు.

తక్కినవారికంటె తనని ఏ విధంగానన్నా ఎక్కువగా చూశామా, ఆయన ఏమాత్రం క్షమించేవారు కారు. అందరికీ పెట్టనిదీ, ఆయనకి ప్రత్యేకంగా ఏమైనా పెట్టామా అయిందే మా పని. ఆయన జబ్బుగా వున్నా, పత్యమైనా, అందరికీ ముందు పంచిపెట్టి తరువాతనే వారికి పెట్టాలి-ఆయనకి బహుస్వల్పంగా వచ్చినా సరే.

అందర్నీ ఈశ్వర స్వరూపంగా చూసుకోవాలని ఆయన ఉద్దేశం. అప్పడాలు వేయిస్తో 'ఈ మంచి అప్పడం స్వామికి' అని మనస్సులో అనుకున్నామా, ఆ రోజున అప్పడమే విస్తట్లో వేయించుకోరు. "ఈ నాడు నాకు అవసరం లేదు" అంటారు.

వారిపైన ప్రేమవల్ల వారికి ప్రత్యేకంగా ఏదో చెయ్యాలనే మా కాంక్ష; ఏమైనా ప్రత్యేకంగా చేశామా వారి ఆగ్రహం విరుచుకుపడుతుందనే భయమూ- ఈ రెంటి మధ్యా నలిగిపోయినాము. మా మనసులో ఏది జరిగినా అది వారికి తెలిసిందని మాకు తెలిసేటట్టు పరిస్థితులు తటస్థించేవి.

ఏళ్ళకి ఏళ్లు విసుగు లేకుండా అలిగి, కోపించి, తిట్టి సమత్వం నేర్పారు. వారే అందరితో సమానమైతే మేము అధికంగా - ప్రత్యేకంగా మాకని ఏమి దాచుకోగలం?

## పవిత్ర తీర్థం

ఆయనపైన భక్తివల్ల భక్తులు ఆయన తాకినవన్నీ పూజాద్రవ్యాలకింద వాడుకునేవారు. ఆయన కాళ్ళు కడుక్కున్న నీళ్లు, ఆయన చెయ్యి కడుక్కున్న నీళ్ళు, ఆయన



స్నానంచేసిన నీళ్లు, ఆయన తిన్న విస్తరి, వొదిలిన మెతుకులు-అన్నీ గంగాజలంకన్న పవిత్రమైనాయి. ఆ నీళ్ళని యితర్లకి అందకుండా చేయడానికి ఆయన ఎన్ని జిత్తులు చేసేవారో! ఎన్ని అలకలో! ఎన్ని చివాట్లో! ఒక్కొక్కప్పుడు ఎందుకో వారిపైన మా ప్రేమని కనికరించి చూసీ చూడనట్లు వూరుకునేవారు. కాని, ఎప్పుడో అన్నింటికీ కలిపి తగిలేవి చివాట్లు ఏకంగానో!

కొండ మీదనుంచి వొచ్చి కాళ్లు కడుక్కుంటోవుంటే ఆ నీళ్ళు భక్తులు నెత్తిన చల్లుకుంటున్నారని కాళ్ళు కడుక్కోడం మానేశారు.

క్రమంగా ప్రజలు ఎక్కువై, వారి శరీరంలో ఓపిక తక్కువైనప్పుడు కొన్ని అలివికాక వొదిలేసినట్టున్నారు.

వారు భోజనం చేసిన తరువాత ఆ విస్తరిలోనే భోజనం చేసేవాళ్ళం. ఆయన భోజనం చేసి గిన్నెలో చేయి కడుక్కుంటే ఆ నీళ్లు తీర్థం కింద ఉపయోగించేవాళ్లు దగ్గర భక్తులు. ఒకసారి ఒక విశేషం జరిగింది. అప్పుడు నేను యిక్కడ లేను, కాని, వొచ్చి విన్నాను.

ఆశ్రమంలో భోజనాలయినాక, ఎవరి విస్తరి వారు తీసి పారవెయ్యడం రివాజు. ఒక్క భగవాన్ మాత్రం విస్తరి అక్కడే వొదిలి, అక్కడే గిన్నెలో చేయి కడుక్కునేవారు.

ఒక రోజు ఒక ఆశ్రమ భక్తుల అమ్మాయి వచ్చి భోజనాల దగ్గిర నుంచుంది. భోజనం చెయ్యమంటే చెయ్యలేదు.

భగవాన్ ఆ అమ్మాయి ఎందుకు వొచ్చిందని నొక్కి నొక్కి
అడిగితే, ఆ అమ్మాయి "తీర్థానికి" అంది.

"ఏం తీర్థం?" అని ఆరా తీయగా, భగవాన్ చెయ్యి
కడుక్కున్నారే-ఆ నీళ్ళు (తీర్థం) తెమ్మని వాళ్ళ వాళ్ళు
పంపినట్లు తెలిసింది.

## తన విస్తరి తానే...

ఆ రోజునుంచీ తక్కినవారితో పాటు వారు కూడా
తన విస్తర్ని తానే మడిచి తీసుకొనిపోయి బైటపారవేసేవారు.
అక్కడే చెయ్యి కడుక్కునేవారు. అదివరకు వారికి తెలీదా-
తనచేతి నీళ్ళూ, విస్తరీ ఎట్లా ఉపయోగ పడుతున్నాయో!

అన్నీ తెలిసినా, తన కంట పడితేనేగాని ఆయన తెలిసి
నట్టు ప్రవర్తించేవారు కారు.

ప్రభావతి అనే భక్తురాలు, భగవాన్ తన విస్తరి
పారేసుకోడం భరించలేక, తాను పారేస్తానని అన్నది. భగ
వాన్ వీలు లేదన్నారు. ఆ విస్తరి కోసం ఇద్దరూ చెరో
మూలా పట్టుకుని కలియబడ్డారు. చివరికి ప్రభావతే వొది
లేసింది.

"నా విస్తరి నువ్వు ఎత్తి వేస్తావు. ఇక్కడ అందరూ
ఎవరి విస్తరి వారు ఎత్తుకుంటున్నారు. వారి విస్తళ్ళు ఎవరు
ఎత్తి పారేస్తారు?" అని అడిగారు భగవాన్.

"నేను" అంది ప్రభావతి.

"ఎన్నాళ్ళు?"

"ఎప్పుడూను."



"సరే, కానీ" అన్నారు భగవాన్.

ఇదంతా చూసి రాజయ్యరు, తాను అందరి విస్తళ్లు
ఎత్తి పారేస్తానన్నారు. ఆ రోజునుంచీ ఆశ్రమంవారే అంటు
విస్తళ్ళు ఎత్తించే ఏర్పాటు అయింది. ప్రజలు ఎక్కువైన
తరువాత ఊరుకున్నారుగాని భగవాన్—తనకి నమస్క
రించడం, కానుక లివ్వడం, సేవ చెయ్యడం ఇష్టపడరు. తన
దేహానికి సేవ చేయడం కన్న, తన బోధ ప్రకారం నడుచు
కోవడమే ముఖ్యమని పదే పదే మమ్మల్ని కోప్పడి చెప్పే
వారు. కాని, మాకు- ముఖ్యంగా స్త్రీలకి, ఆయనకి సేవచేసి,
ఆయనకి వొండిపెట్టి, ఆయనకి దేహపోషణ చేస్తేనేగానీ మా
ప్రేమ ఆగేది కాదు.

## జ్ఞానభిక్ష

తాను దేహం కాదనీ, తాను ఆత్మననీ, తాను
[illegible]నుంచి వేరుకాదనీ మాకు తెలీడం కాకుండా, మా అను
భవంలోకి రావాలని, పనులద్వారా మాకా అనుభవం
కల్పించేందుకు ఎంతైనా, లేని కఠినత్వాన్ని ఆయన మా
మీద ప్రయోగించారు. ఎప్పటి కప్పుడు ఆయన—మేము
చూస్తున్న శరీరం తాను కాదనీ, తాను సాక్షాత్తూ సర్వే
శ్వరుడనీ తోపించేవారు. ఆయన స్వరూపం ఏమీ మార
కుండానే-మాకు, ఒకప్పుడు వటపత్రశాయి అయిన శ్రీమన్నా
రాయణుడనీ, ఒకప్పుడు గోపికాలోలుడైన శ్రీకృష్ణుడనీ,
ఒకప్పుడు సాక్షాదీశ్వరుడనీ ఆ రూపాలు, ఆ తేజస్సు చూస్తు

న్నట్లే భ్రమించేవి మా మనస్సులు. ఎప్పుడూ ఆ జ్ఞాపకం మానుంచి తీసి వెయ్యకుండా నిలబెట్టేవారు.

వారు మాతో నవ్వినా, తిట్టినా, వేళాకోళం చేసినా తాను, మేముచూసే తాను కాదనే సంగతి మా మనసుల్నించి తొలిమాయలో పడకుండా చేస్తో వుండేవారు.

వయసువల్లా,జన సమ్మర్దంవల్లా,ఆయన వంట యింట్లోకి రావడం మానుకున్నాక కూడా ఆయన మానుంచి దూరం కాలేదు. ఆయనకి ప్రతిపూటా వొడ్డించే భాగ్యం, చివాట్లుతినే అదృష్టం మాదేకదా! భోజనాలై అందరూ లేచిపోయిన తరువాత కూడా, వారు అట్లానే కూర్చుని, మాతో కబుర్లుచెప్పి, కొత్త వంటలు నేర్పి, కొత్త శ్లోకాలు, పాటలూ అవీ బోధ చేసి, మా మనసుల్ని తృప్తిపరచి వెళ్ళే వారు. సోఫాపైన కూర్చున్న భగవాన్, తన పూర్వపు ఘురానా భక్తులకి అంత పరిచితంగా అందక పోయినారేమో గానీ, మమ్మల్ని మాత్రం ఎన్నడూ మరవలేదు. మా నుంచి ఎన్నడూ దూరం కాలేదు. మమ్మల్ని దిద్దడం మానలేదు.

ఆ నాడు శ్రీకృష్ణుడు గోపికల్ని ఉద్ధరించేందుకు గొల్లవాడై పుట్టి, ఆవుల్ని కాసినట్టే, ఈ నాడు సర్వేశ్వరుడు తిరిగి అవతారమెత్తి మాబోటి సాధారణుల్ని ఉద్ధరించడానికి వంటలవారై మాకు బోధించి, జ్ఞానమిచ్చి, తన చేతుల్తోనే వొండి భక్తులకి వొడ్డించి అనుగ్రహించారు.

— —

# సంపూర్ణమ్మ

మా వాళ్ళంతా మొదటి నించీ భగవాన్ని బాగా ఎరుగుదురు. వారి వూరి దగ్గిరే మా వూరు. ఎప్పుడూ ఆశ్రమానికి వొచ్చిపోతూ వుండేవారు. నేను వితంతువునైన తరువాత చాలాసార్లు చెప్పారు, అరుణాచలంలో ఓ మహానుభావు లున్నారు - వెళ్ళి దర్శించుకోమని. వాళ్ళు వెడుతూ రమ్మని పిలిచేవారు. కాని, నా కేమీ కదలిక రాలేదు.

ఒకసారి మధుర మీనాక్షి ఆలయంలో పిళ్లారి గుడి ముందు ఒక ముసలి బ్రాహ్మణుడు నా దగ్గిరికి వొచ్చి, "నాకు వొండి పెట్టవా?" అని అడిగారు. ఆ అడగడమే వింతగా వుంది. అన్నం పెట్టమని అడుగుతారుగాని, వొండి పెట్టమంటారా? తనకి ప్రత్యేకం వొండి పెట్టాలా!

అయినా నేను "సరే, రండి ఇంటికి," అన్నాను. ఆయన కదలలేదు.

"ఇక్కడ ఏముంది, వంటకి?" అని చెప్పి, నేను పిళ్ళయారుకి నమస్కారం చేసుకుని, ఆయన కోసం తిరిగి చూసేప్పటికి ఆయన లేరు. చాలా ఆశ్చర్య పడ్డాను. తరవాత తెలుసుకున్నాను నేను, ఆ నాడు నన్ను అడిగింది నా గురువు భగవానేనని.



చివరకి మా వాళ్ళు పిలవగా పిలవగా 1932 లో, నా చెల్లెలూ, మరిదితో కలిసి వొచ్చాను భగవాన్ దగ్గిరికి.

తల్లి సమాధిపైన పాకలో ఓ ఇరవై మంది కాఫీకి కూచుని వున్నారు. భగవాన్ పక్కన దండపాణిస్వామి వున్నారు.

నన్ను చూసి దండపాణి స్వామి "మన నారాయడి వొదినగారు," అన్నారు భగవాన్‌తో.

నేను బైటవుండి మళ్ళీ భగవాన్‌కి కనపళ్ళేదు.

"ఆమె కనపడ లేదే?" అని కనుక్కున్నారు భగవాన్.

అప్పుడో ఇరవై రోజులున్నాను...

ఆయన దగ్గిర వున్నప్పుడు, ఏమీ తోచేది కాదు. అల్లానే నిలబడిపోయేదాన్ని. ఆలోచనలు బాగా తగ్గిపోయే వనుకుంటాను.

నేను శలవు తీసుకోడానికి వెళ్ళినప్పుడు భగవాన్ స్వయంగా లేచి, లోపలికి వెళ్ళి, అరవం 'నేనెవడను?' కాపీ తీసుకొచ్చి నాకు ఇచ్చారు.

మా వూరు వెళ్ళాక నాకు కల వొచ్చింది-ఓ ముత్తయిదువ నన్ను ఆశ్రమానికి రావా అని అడిగినట్టూ, ఆశ్రమంలో భగవాన్ "సంపూర్ణమ్మ రాలేదేం?" అని అడుగుతున్నట్టూ.

ఇంతలో మా మేనమామ తాను అరుణాచలం వెడుతున్నానని, నన్ను కూడా వెంట రమ్మన్నాడు. అతని బలవంతం మీదనే ఇష్టం లేకండానే వొచ్చాను. నేను

రావడంతోనే చిన్న స్వామి, శాంతమ్మ లేదని, నన్ను వంటలో చేరమన్నారు. భగవాన్ సమక్షంలో వంట చెయ్య వొచ్చును గదా అని సంతోషంతో వొప్పుకున్నాను.

నాకు వంట అంత చేతకాదు. పైగా మా వంట విధం వేరు, ఆశ్రమం వంట వేరు. భగవాన్ నా పక్కన వుండి ఎట్లా అన్ని తయారు చెయ్యాలో వోపికతో నేర్పారు. ఆ పూటకి ఏమేమి తయారు చెయ్యాలో ఆయనే చెప్పడం, ఆ పదార్థాలు ఎట్లా తయారు చెయ్యాలో కూడా ప్రతి చిన్న విషయము చెప్పడమును.

"ఇదేమిటి? ఈ వంట?" అని చాలా నవ్వుగా వుండేది నాకు.

అల్లం, మెంతులు, వాము, మిరియాలు, ధనియాలు, ఇంగువ - ఇవన్నీ ఎక్కువ వాడిక ఆశ్రమంలో.

ఎవరికన్నా వొళ్ళు బాగా లేకపోతే, వంటలో మార్పు తోనే ఆ జబ్బు నయంచేసేవారు భగవాన్. ఏ పదార్థం ఏ కూర ఐనా సరే—బాగా రుబ్బినా, వొండినా, దాంట్లో దోషం పోతుందనేవారు. వొళ్లు బాగా లేనివారికి పనస కాయని చూస్తే భయం. భగవాన్ ఆ పనస కాయని చెక్కు లుతో సహా రుబ్బించి, వొండించింతరువాత అది ఏ అనా రోగ్యమూ చేసేదికాదు.

భగవాన్ వంటింటిమధ్య వుండేవారు. ఏది కావలిసి - ఏది అందుకోడానికి వెళ్ళినా, ఆయనకి ప్రదక్షిణం తప్పదు. ఆయన ప్రదక్షిణం చేస్తో వొండుతున్నాననే వుండేది నా మన సులో.



కూర, పచ్చడి, సాంబారు ఏదైనా సరే - తయారు [illegible]గానే తాను రుచి చూసేవారు; నాకు రుచి చూపేవారు.

నేను వారి చేతికిచ్చిందాంట్లో వారు రుచికోసం [illegible]ంచెం నోట్లో వేసుకుని, తక్కింది వంటలోనే వేసేవారు. [illegible]ంతో వంట అంతా ఆయన ప్రసాదమయ్యేది.

అటు వెళ్ళి, ఇటు వొచ్చి, వొంటింట్లోనే ఆయన పని. ఎన్నడూ ఏమీ అక్కర్లేనివారు, వంటింట్లోకి వొచ్చి కొంచెం [illegible]రు తాగేవారు. తనకి చాలా ఇష్టమైనట్టు మజ్జిగ పులుసు [illegible]స్తున్నారూ, ఆయనకి సంతోషం-పండగ నాడు అన్నీ [illegible]ండుతూ వుంటే చూస్తున్న చిన్న పిల్లల సంతోషం. ఏది [illegible]ట్లా రుబ్బాలో, ఎపుడు వెయ్యాలో, ఎంత వుడికించాలో - [illegible]ంత శ్రద్ధో! ఎంతో జాగర్త; ఏదీ లోపం జరగ కూడదు.

ఎప్పుడూ ఏం వున్నాయి, వాటితో ఏం చేద్దాం? ఇదే [illegible]లూ, వుత్సాహాలూ, కబుర్లూ. తన చిన్న తనంలో ఎలా [illegible]సేవారో, తల్లి ఎట్లా వొండేదో అవన్నీ చెప్పేవారు.

మా వూరు ఆయన వూరు దగ్గరే. అందుకనే "[illegible]ంపూర్ణం! నీ వొంట మా వంటే. నువ్వు వొండితే మా [illegible] వంట జ్ఞాపకం వొస్తుంది" అనేవారు.

ఇంకా వుబ్బేసేవారు నన్ను. నేను మా వూరికి వెళతా [illegible], "సరిగా వొంటచేసేది కాస్తా వెళ్ళి పోతానంటోంది. [illegible] వాళ్లా? ఒకరు పచ్చివే పెడతారు, ఒకరు మాడు [illegible]" అన్నారు.

భగవాన్ చెప్పినట్టే ఏదన్నా వొండి రుచి చూపి "[illegible] వుందా స్వామీ?" అని అడిగితే—

"ఇది బాగానే వుందిలే. చక్కగా వొండావు. మీ అందరికోసమే ఈ రుచి చూడడం. నేను భోజనానికి కూచోగానే, ఎచ్చమ్మ ఏ పప్పో తీసుకొస్తుంది. మొదలియార్ పాటి ఏ ఆకు కూరో తెస్తుంది. ఇంకెవరో ఏవో ఫలహారాలు తెస్తారు. అవీ, నువ్వు చేసినవీ అన్నీ ఏకంగా కలుపుకుని తినే నాకేం రుచి?" అనేవారు. అందుకని పొద్దుటివి దాచి, రాత్రులు వొడ్డించే దాన్ని.

ఆయన చెప్పినట్లు గాక ఏ మాత్రం వ్యత్యాసం చేసినా, ఆయన పోనీ అని వూరుకోరు. ఆయన ఎంత అంటే అంతే. ఆయన ఎట్లా నంటే అట్లాగే. ఆ విధంగా వంటలో నించి, గురువు ఆజ్ఞని ప్రశ్న లేకుండా శిరసావహించడంలో మాకు సాధన నిచ్చారు. మాకేం తెలుసు? ఎందుకబ్బా ఇట్లా చంపుకు తింటారు? ఈ కాస్తలో ఏం పోయింది? అనిపించేది. కాని. మాకేం తెలుసు? ఆధ్యాత్మికాభివృద్ధి కావాలంటే మొదటి సూత్రం, మన సొంత యోచన లేకుండా గురువు ఆజ్ఞని పరిపాలించడమనీ, ఆయనకి కావలిసింది వంట రుచి కాదనీ, ఆయనకి కావలసింది వంటలో నించి మేమూ శిక్షణ పొందడమనీ! వంట మీది ఆయన ఉత్సాహమంతా మాకా వుత్సాహాన్నిచ్చేందుకు. వంట అంటే మాకు భారం కాకుండా చేసేందుకు ఆయన వంటపైన అంత శ్రద్ధ చూపుతేనే గాని, మా మనసుల్లో మేము చేసేది భగవత్సేవ అనే భావం రాదు. మా పైని కరుణవల్ల అంత నాటకం ఆడారు ఆయన.



"కూరకి మూత పెట్టాలి. అప్పుడే ఆవిరి అనుగుతుంది. పక్వమై రుచిని పడి, తినడానికి యోగ్యమౌతుం"దని చెప్పి మా వంక చూశారా, ఆ మాటలు—

"మనసుకి మూత వేస్తే వృత్తులు అణుగుతాయి. మనిషి జ్ఞానియై ఈశ్వరుడిలో లయించడానికి సిద్ధమౌతా"డని అర్థమిచ్చేది.

ఒకసారి కొందరు సెంజీకోట చూడడానికి ప్రయాణమౌతున్నారు. వాళ్ళతో నేనూ వెళ్లి చూడాలనుకున్నాను, భోజనాలైనాక వెళ్లి భగవాన్ని అడగాలనుకున్నాను. వెళ్ళి చూస్తే ఆయన ముసుగు పెట్టుకుని కళ్లుమూసుకుని నిద్ర పోతున్నట్టున్నారు.

హాలుకి ఓ రెండుసార్లు ప్రదక్షిణంచేసి చూస్తే, మాధవ స్వామితో అసలు నిద్రపోనట్టే మాట్లాడుతున్నారు. వెళ్ళి అడిగాను. దానికి భగవాన్—

"నాకు కొంచెం శుభ్రంగా కాచి పోస్తుందనుకుంటే మాటిమాటికీ ఇక్కడికి పోతాను, అక్కడికి పోతానంటుం దేమిటి?" అని, నాతో "సరే, ఎప్పుడు వొస్తావు?" అని అడిగారు.

"రెండు రోజుల్లో తప్పక వస్తాను."

వెళ్ళానా - మళ్ళీ వొచ్చేప్పటికి నాలుగు రోజులయింది. మళ్ళీ వొచ్చి కనపడ్డప్పుడు, భగవాన్ "రెండు రోజుల్లో వొస్తానన్నావు? వెళ్ళడం, రావడం నీ చేతులో వుందా, పిచ్చిదానా?" అన్నారు.

ఒకసారి నాతో అన్నారు భగవాన్ "నువ్వే వేదాం

తమూ చదవనక్కర్లేదు, 'రిభుగీత' చదవమని. ఆ గీతలు నా కేం తెలుస్తాయని ఆలశ్యం చేశాను. భగవానే తన చేతులతో పుస్తకం కుట్టి, తన దస్తూరితో రిభుగీత రాసి నా కిచ్చారు. చూశాను.

"ఇదంతా నా కెందుకు స్వామీ? నా కేం అర్థమాతుంది?" అన్నాను.

"అట్లా కాదు. అర్థం కాకపోతేనేం? చదువుతో వుండు. ఒక్కొక్క అధ్యాయానికీ ఫలితం కనపడుతూ వుంటుంది" అన్నారు.

ఒకరోజు మధ్యాహ్నం హాలులో కూచుని ఆ పుస్తకం చదువుతున్నాను. ఎవరో ఒకరు వుండీవుండి కొత్తగా వొచ్చిన వారు, ఏదో ఓ కానుక వారి ముందు పెడుతున్నారు. దానికి భగవాన్ నాతో "చూశావా సంపూర్ణం! ప్రతి అధ్యాయానికీ ఫలితం వెంటనే వొస్తోంది" అన్నారు.

ఇంకోసారి "ఎచ్చెమ్మ ఏది చేసినా, నిప్పుకి చూపి, వుడికిందనుకుని స్వామికి పంపుతుంది. వేణమ్మ ఒక్క రవ్వ నిప్పు పైన పెట్టి దించుతుంది. ఈ సంగతి వాళ్ళతో చబితే నాలిక పీక్కుంటారు. కాని, వాళ్ళు ప్రసాదమని నాకు పెట్టినవన్నీ తినాలి. నా ఖర్మం అట్లా అయింది. ఏం చెయ్యను ?" అన్నారు. కాని, ఎచ్చెమ్మపాటి నుంచి ప్రసాదం రాకపోతే, వొచ్చిందాకా భోజనాలు ఆపించేశారు ఆశ్రమంలో.

ఏదీ వృథా కాకూడదు. ఒక్క బియ్యపు గింజ, ఆవగింజ కింద పడి వుంటే తాను వొంగి ఏరి తీసి, బుట్టల్లో పడేస్తారు.



"ఎందుకు స్వామీ, ఆ ఒక్క గింజ కోసం ఆ శ్రమ?" అన్నాను ఓసారి.

"అవును. నా జాగర్త అట్లాంటిది. ఏ సంగతినీ వొదలను. అన్నీ సరిగా జరగాలి. నేనే పెళ్ళి చేసుకుంటే ఏ స్త్రీ నాతో పడలేదు. అంత కఠినుణ్ణి. పడుగొత్తుతుంది" అని, మళ్ళీ "మా తండ్రి సంపాయించి నా కిచ్చిన ఆస్తి ఇది. నేను దీన్ని జాగ్రత్తగా కాపాడి, నా పిల్లలకి పెట్టవొద్దా?" అన్నారు.

పచ్చి కరక్కాయల ఊరగాయి, నల్లేరు పచ్చడి, చిన్న వేపాకు కనపడ్డా, వంటలో వేయించేవారు. కాని, ఏదీ బయటివ్వడు. ఏమి వేశారో ఎవరూ తెలుసుకోలేరు!

ఓసారి జయంతికి ఎన్నో వంకాయలు వొచ్చాయి. వరసగా కొన్ని పూటలు వొండాము. వాటి నుంచి కోసిన తొడిమలన్నీ ఓ కుప్ప పడివున్నాయి, ఏది పారెయ్యడానికి ఎవరికీ సాహసం లేదు. వాటిని చూసి భగవాన్, ఆ తొడిమల్ని కూర చెయ్యమన్నారు. తొడిమల కూర! ఎవరు తింటారు? చేశాము, వాటిల్లో ఎండు బటానీలు కలిపి. ఎన్ని గంటలు వుడికించినా వుడకవు—తొడిమలుగాని, గింజలుగాని. ఎందుకు వొచ్చారో హాలులోంచి వంటింటోకి వొచ్చారు భగవాన్.

ఎంత పనిలో వున్నా సరే, మా వంటలో ఏదన్నా తక్కువ వొచ్చిందా, ఎట్లా వొచ్చేవారో—మా ఎదట వుండే

వారు. హాలు గుమ్మం దగ్గిర మేము కనపడ్డామా, వెంటనే లేచి వొచ్చేవారు మా వెంట. వంటమీదవున్న శ్రద్ధ దేని మీదా లేదు భగవాన్‌కి అనుకోవచ్చు. కాని, వారికి వంట చేసేవారి పైన ఉన్న అనుగ్రహం, ఎవరిపైనా వున్నట్టు కనపడేది కాదు, ఆ హాలులో కూచున్న వారిపైన.

"ఎట్లా వుంది కూర?" అన్నారు.

"కూర ఏమిటి? అవి తొడిమలు కావు. ఇనపగుగ్గిళ్ళు, ఎన్ని గంటలకీ వుడకవు" అన్నాను.

"ఏం? వుడక లేదా?" అంటూ ఓసారి గరిటతో తీసి చూసి, కలిపి, ఏ ఉపాయం చెప్పకుండానే వెళ్లి పోయినారు. వెళ్ళి చూస్తే-తొడిమలు, ఎండు బటానీలు, అన్నీ వుడికి వున్నాయి!

ఆ రాత్రి అందరూ చాలా బాగా తిన్నారు. ఆ కూర ఏమి కూర అని అడిగారు తినేవారిని. ఎవరూ చెప్పుకోలేక పోయినారు. ఒక్కసారే వొడ్డించాను, అంత కష్టపడి చేసిన కూరని, భగవానుకి. అంతా ఒక్క ముద్దగా నోట్లో వేసుకుని మింగేశారు. నా ప్రాణం చివుక్కు మంది. అంత రుచైన కూరని, అంత కష్టపడి చేసిందాన్ని అట్లానా తినడం?

తరవాత ఎన్నిసార్లు కూర వొడ్డిస్తా నన్నా, వొద్దన్నారు. మర్నాడు అన్నారు ఎవరితోనో, "రాత్రి నేను కూర తినలేదని సంపూర్ణం మనసు నొచ్చుకుంది. నేను తింటేనేం,



తినక పోతేనేం? తను శ్రద్ధగా చేసింది నేను తిన్నట్టే" అని.

భక్తులకన్న స్వామికి ఎక్కువ వెయ్యాలని నా మనసులో ఏ మూలన్నా వుందో ఏమో; ఆ వ్యత్యాసాన్ని తీసేసే సాధనం తాను తినక పోవటమే!

వంట అంతా చెప్పేదీ, చేసేదీ, హాలులో వెళ్ళి కూచునేదీ, మళ్లీ కాసేపటికి వొచ్చి వంటంతా ఎట్లా వుందో చూసేదీ. అన్నీ సరిగా తయారయిందాకా ఎవరన్నా వస్తే హాలులో దర్శనమిస్తున్నా, ఆయన ప్రాణమంతా వంట మీదనే వుంచి, అవన్నీ రుచిగా-తనకి భోజనంలోకి బాగా తయారవుతున్నాయో, చెడిపోతున్నాయోననే బెంగతోనే ఆయన తిరుగుతున్నట్లుంటుంది. అంత జాగ్రత్తగా తయారు చేయించినవన్నీ భక్తులకి రుచిగా వుండడానికో, మాకు కర్మ మార్గంలోంచి సాధన నివ్వడానికో, నిష్కామతత్వం నిరూపించడానికోగాని అద్భుతంగా వుండేది ఆయన చర్య.

నేను వూళ్ళోకి వెళ్లేప్పుడు అడుగుతారు - ఏమేమి వున్నాయి, మర్నాటి వంటకని. తెలుసుకుని, నేను తిరిగి పొద్దున్న వొచ్చేప్పటికి, అన్నీ నాన వేసి, కొన్ని రుబ్బించి, కూరలు తరిగి, తరిగించి, సిద్ధంగా వుండేవారు, వొంట కోసమూ, దాన్ని రుచిగా తినడం కోసమూ బతుకుతున్నట్టు, దాని సంగతే రాత్రంతా ఆలోచిస్తున్నట్టు.

వంట బాగా వొచ్చినా, చెడిపోయినా, దాంట్లోంచి

మాకో వేదాంతం. ఆ వాక్యాలే, ఎటు పడితే అటు అర్థం తీసుకునేవిగా వుండేవి.

ఓసారి సేమియా పుట్టు చేస్తో వున్నాము - జాగ్రత్తగా పొడిపొడిగా వొచ్చేట్టు.భగవాన్ వొచ్చి అంతా అణిచేశారు.

"ఇదేమిటి భగవాన్, ఇట్లా అణిచి వేశారు? అంతా ముద్దయి పోయిందే!"

"అవును. విడివిడిగా వుంటే ఏం బావుంటుంది? అంతా ఏకం కావాలి."

చాలా రుచిగా వుంది సేమియా పుట్టు ఆ రోజున.

దేంట్లోనైనా భగవాన్ ఉప్పు వేశారా, ఒక్కసారైనా సరే ఉప్పు ఎక్కువగాని, తక్కువగాని కావడం జరగలేదు. వంట సరిగా తయారౌతుందో ఏమోనననే భయం లేదు. ఆయన చెప్పినట్టు చెయ్యాలి. అంతే మా పని. ఏది కుదరక పోయినా భగవాన్‌తో చెపితే చాలు. ఏది తెలీక పోయినా ఆయన్ని అడిగి తేచాలు.అంతేకాదు.మా జీవితంలోనే ఎప్పుడూ ఏ కష్టాలలోనూ భయాలలోనూ తాను మాతో వున్నట్టు తోపించేవారు.

ఒకసారి నేను తెల్లారకట్ట మూడింటికే వూళ్ళోంచి ఆశ్రమానికి రావాల్సి వొచ్చింది. అంతా అడవి ఆ రోజుల్లో. నాకు తోడు ఎవరూ లేరు. ఎట్లా అనుకొంటున్నాను - నేను వెళ్ళేప్పుడు.



భగవాన్, 'నీకేం భయం? నేను తోడు లేనా?' అన్నారు.

ఆ మాట భగవానన్న తరవాత ఇంకేం భయం?

అంత చీకట్లో వొస్తే చిన్నస్వామికే ఆశ్చర్యం వేసి, "ఎట్లా వొచ్చావు ఇంత చీకట్లో, ఒంటరిగా! నీకు భయం వెయ్యలేదా?" అన్నారు.

అది వింటున్న భగవాన్ "అదేమిట్రా! ఏం భయం? నేను వెంట లేనా?" అన్నారు.

ఒకసారి నేనూ, సుబ్బలక్ష్మమ్మా గిరి ప్రదక్షిణం బయలుదేరాము తెల్లారకట్టే. బాగా చీకటిగా వుంది. మాకు భయమేసింది. ఎట్లా వెళ్ళడం. వెడదామా? లేదా? తోవలో పాములున్నాయేమో? కనపడవే అనుకున్నాము. మా ముందు నీలం రంగు వెలుతురు పడ్డది. ఏదో పిశాచం గావునని మరీ భయం వేసింది. కాని, చూస్తే—ఆ వెలుతురువల్ల ధైర్యం వొస్తోందిగాని, భయం కలగటం లేదు. మా వెంటనే వొచ్చింది ఆ వెలుతురు—పగటి వెలుతురు వొచ్చి మా భయాలు పోయిందాకా, మాకు తోవ చూపుతో.

ఇంకోసారి మే మిద్దరమే గిరి చుడుతున్నాము, పొద్దున్న పదకొండు గంటలకి; కబుర్లు చెప్పుకుంటో. రోడ్డు నిర్జనం. మా [illegible] ఎవరో సామియార్ వొస్తున్నారు. ఇద్దరం వయసులో ఆడవాళ్ళం. ఇంకా అడవిలోకి పోయాము వెనకే ఈ పురుషు [illegible]కని, ఆయనని ముందు పోనిద్దామని ఆగాము. ఆ సామి [illegible] ఆగాడు. మాకు అనుమానమేసింది. మళ్ళీ నడిచాము.

ఆయనా నడిచాడు. మళ్ళీ ఆగాము. ఆయనా ఆగారు. ఇట్లా మూడు నాల్గుసార్లయ్యేప్పటికి మాకు భయమేసింది. రోడ్డు మీద ముందూ వెనకా ఇంకే మనుషులు కనపడరు. ఎట్లాగా అని- "అరుణాచలేశ్వరా, నువ్వే ఎల్లకాలాలందూ శరణ్యం" అని బిగ్గరగానే అన్నాము.

దానికి ఆ సామియార్ "అవును. అరుణాచలేశ్వరుడే సదా శరణ్యం. ఎప్పుడూ అట్లాగే తలుచుకోండి. చూడండి, ఆ జ్యోతే లోకాన్నంతా తేజస్సుతో నింపుతోంది. జాగ్రత్త- జాగ్రత్త" అన్నారు.

మా వెంటనే వొస్తున్నారు. మా రక్షణ కోసం సర్వేశ్వరుడు ఈయన్ని పంపారా లేక, సర్వేశ్వరుడే వొచ్చారా? కాకపోతే- తోవలో ఈ కబుర్లు, ఆ కబుర్లు చెప్పుకోకుండా ఈశ్వరుణ్ణి తలుచుకోమని చెప్పడానికి వొచ్చారా?

కొంతదూరం వెళ్ళాక వెనక్కి-చూస్తే ఆయన లేరు.

అన్ని విధాల ఆయన మమ్మల్ని రక్షించుతున్నారు.

నేనెంత? ఏం గొప్ప? నా వెంట భగవాన్ వుంటున్నారు. ఏం అదృష్టమిది! ఇంకేం కావాలి?

అరవంలో సేమియాని సేవా అంటారు.

ఓసారి నేను చేసిన సేవా చాలా బావుంటుందని తింటున్నారు అందరూ.

"సంపూర్ణమ్మ చేసిన ఈ సేవా ఎంత బావుంది!" అన్నారు ఒకరు.

"అవును. సంపూర్ణమ్మ చేస్తే అట్లాగే ఉంటుంది.అంత



శ్రద్ధతో చేస్తుంది" అన్నారు భగవాన్. నేను సంతోషంతో తల్లకిందులైనాను.

ఓసారి మేము గోశాలపైన డాబా మీద వొడియాలు [illegible]డుతున్నాము. భగవాన్ మా పక్కనే కూచుని, ఎట్లా [illegible]ట్టాలో చెపుతున్నారు. ఇంతలో మాధవస్వామి వొచ్చి, స్వామి దర్శనార్థం ఎవరో ఆమె వొచ్చిందని చెప్పారు.

భగవాన్, "ఎవరో ఆమె నాకు తన దర్శన మివ్వడానికి వొచ్చిందట" అని చెప్పి బైలు దేరుతున్నారు. నేను [illegible]ళంలో పాట పాడుతున్నాను. ఉత్సాహం అట్లా పొంగేది [illegible]లో-ఆయన మాముందు వుంటే. "కృష్ణుడు బృందా [illegible]నంలో గోపికలతో లీలలు చేసేటప్పుడు గోపికలు కృష్ణుడికి [illegible] మీద ప్రేమ, మా మీద ప్రేమ అని ఎవరికి వారే అను[illegible] వొళ్లు మరిచి తన్మయావస్థలో ఉండేవారు" అని పాడి, "అట్లానే మీ ప్రేమని పంచుకోడానికి, ఇంకో ఆమె ఎవరో అదృష్టవంతురాలు వొచ్చింది" అన్నాను.

దానికి భగవాన్ అవునవును అంటూ, ఆనందంతో [illegible]గిపోతో, అడుతూ మెట్లుదిగి వెళ్ళారు.

ఆ కాలమంతా మాకు అట్లానే వుండేది. ఈ లోకంలో [illegible]న్నామో, ఏ లోకంలో వున్నామో, బతుకుతున్నామో, [illegible] తింటున్నామో ఏమీ గుర్తు వుండేదికాదు. రోజులు తెలీ[illegible]నే వెళ్ళిపోయేవి. ఎంతో భారమైన పనికి ఎంత శక్తి [illegible]! కష్టమే తెలేదు. మా ఇళ్ళల్లో కొంచెం పనిచేస్తే పడు[illegible] అలిసినట్టుండేది. భగవాన్ సమక్షంలో అలసటే [illegible]. బద్ధకమనేది లేదు. పనిచేస్తున్నా, కూచున్నా భేదం

తెలిసేది కాదు. అట్లా చూశారు మమ్మల్ని భగవాన్. ఏ కారణం లేకుండానే, ఒకటే సంతోషంగా వుండేది. చిన్న చిన్న తగాదాలూ, చిరాకులూ వొచ్చినా, ఏమీ మనసు నంటివి కాదు.

ఓసారి భగవాన్తో అన్నాము కూడాను. వంటింట్లోకి వొచ్చి ఆయన, "అప్పుడే అంతా అయిందా?" అంటే – "అవును. ఎంతసేపో చూడండి, భూతాలు చేసేసి నట్లుం టుందిగాని, మనుషులు చేసేదా?" అన్నాము.

"భూతాలేమిటి? అదుగో, పెద్ద భూతం ఆ అరుణాచ లేశ్వరుడే చేశారు" అన్నారు.

ఒకసారి నేను భగవాన్ని అడిగాను, వెన్నెల భోజ నాలు ఏర్పాటు చెయ్యాలని వుందని. కానీ అన్నారు. పౌర్ణమి నాడు అనుకుని, గొప్పగా వంటలు చేశాం. ఆ సమయానికే ఓ భక్తుడు బెంగుళూరునుంచి తయారు చేయించుకుని ఎన్నో పిండి వంటలు తెచ్చారు. భోజనాల హాలు పైన వున్న డాబామీద మూడువందలమంది భోజనాలు చేశారు వెన్నెట్లో. అందరి మధ్యా భగవాన్. ఆ రాత్రి ఆకాశంలో ఉదయించి కొంచెం పైకివొచ్చిన చంద్రుడు భగవాన్ తలపైన ప్రకాశిస్తున్నట్లు తోచింది మాకు. ఏదో భక్తికొద్దీ అట్లా అనుకోడంకాదు; ఆ దృశ్యం అట్లానే నిలిచింది మా కళ్ళముందు.

ఆ రోజుల్లో ఆశ్రమంలో పనిచేసే ఆడవాళ్ళం బైట వున్నప్పుడు ఆశ్రమంలో భోజనం చెయ్యము, ఆ వంటని అసలు తినము. ఎక్కడో ఎవరింట్లోనో ఏర్పాటు చేసుకునే వాళ్ళం. ఒకసారి నా కెక్కడా ఏర్పాటు కాలేదు. అందుకని



ఆశ్రమం ముందున్న ముష్టివాళ్ళ మంటపంలో కూచున్నాను. తిండి లేదు. ఆశ్రమంనుంచి భోజనం పెట్టరు.

భగవాన్ ఆవాళ ఎందుకు అడిగారో – 'సంపూర్ణం ఏది?' అని అడిగారట. చెప్పారు. ఆమెకి భోజనం పెట్టండి అన్నారట భగవాన్.

ఎదురు చెప్పలేక, "ఆ మండపంలో కూచుని వుంది. అన్నం తీసుకుపోయి పెడతాము" అన్నారు.

"ఆ మండపంలో ఏం ఖర్మం! రమ్మనండి" అన్నారు భగవాన్.

"మరి భగవాన్, బైటవుంది అది."

"వుంటేనేం? అంతా బ్రహ్మం! ముట్టేమిటి? రమ్మ నండి."

అట్లా భగవాన్ చెప్పినా, వాళ్ళకి మనసొప్పదు. సాక్షాత్తు ఈశ్వరుడు చెప్పినా, ఆచారాల్ని వొదులుకోరు. ఇంక గతిలేక నన్ను లోపలికి పిలిచారు. భగవాన్ వంటింటి వైపు వెడుతున్నారు.

"అక్కర్లేదు భగవాన్! మేము వడ్డిస్తాము."

సరిగా వాళ్లు వెడతారో లేదో అని భగవాన్ అక్కడే కూచున్నారు, తనకి పట్టింపు లేకపోతే వాళ్ళకీ పట్టింపు వుండ కక్కర్లేదని వాళ్లు తెలుసుకోవాలని. కాని, ఏం లాభం? ఆయన తిప్పు తిప్పగానే నా వల్ల అంత అనాచారం జరిగిందని పెద్ద అందరికీ కోపాలు వొచ్చాయి నా మీద.

అంతే మనుషులు!

వంటింటిలో వొక్కత్తే వుండి స్త్రీ వంట చెయ్యడం భగవాన్‌కి ఇష్టం వుండేదికాదు. ఎవరో వొకర్ని తోడుకి తెప్పించేవారు.

ఎప్పుడూ వంటింటి నించి కదలకుండా, మా అందరికీ తల్లిలాగు నిలబడి వుండేది తేనమ్మ. ప్రతి వారమూ ఏదో వొక పనితో, వొంకలతో మా వూళ్ళు పోయేవాళ్ళం. కాని, తేనమ్మ అన్నేళ్ళూ ఒక్క రోజు కదలలేదు.

ఆశ్రమం నించి కొందరు కాశీ పోతున్నారు. నాకూ పోవాలనిపించి, భగవాన్ని అనుజ్ఞ అడిగాను. ఆయన మాట్లాడ లేదు. మళ్ళీ అడిగితే, "ఏముంది ఆ కాశీలో ఇక్కడ లేనిది? ఇంతకంటే అక్కడ విశేషం ఏముంది? ఏం పోక పోతే?" అన్నారు. ఆగిపోయినాను.

"ఇదుగో, ఇక్కడే కాశీ విశ్వేశ్వరుడు వుంటె, వేరే వెళ్ళడమెందుకు ఎక్కడికో!" అనుకున్నాను.

మర్నాడు నన్ను చూడగానే భగవాన్, "ఇదేమిటే, నిన్న రాత్రి నిన్ను కాశీ విశ్వేశ్వరుడి దగ్గిర చూశానే!" అని నవ్వారు.

అవును. లేనా మరి!

భగవాన్ దేహం వొదిలేసిన తరవాత ఒకరి సహాయంతో నేను కాశీ వెళ్ళడం జరిగింది. గంగలో మునిగానో లేదో, నా దేహం ముక్కలై గంగలో పడిపోయినట్టూ, నే నెక్కడో ఆకాశంలో తేలుతున్నట్టూ, ఓ దివ్యమైన అనుభవం వొచ్చి, నన్ను నే నెరక్కుండా అయినాను.

కొండలోంచి ఒక లేడిపిల్ల భగవాన్ దగ్గిరికి వచ్చి



తిరుగుతోంది. ఆయన బయటికి వెళ్ళినప్పుడల్లా, అదీ వెంట వెళ్ళేది. ఆయన చుట్టూ గంతులేస్తో ఆడేది. ఆయన దాని [illegible] దాంతో గంతులువేసి ఆడేవారు. ఇట్లా ఓ ఏడాదిపైన ఆశ్రమంలో వుండి ఓ రోజు గిరి రోడ్డు వెంబడి పారి పోయింది.

అక్కడ దాన్ని తినాలని ఎవరో కొట్టారు. బాగా గాయాలు తగిలాయి, కాళ్ళు విరిగిపోయినాయి. ఆ స్థితిలో [illegible] దాన్ని గుర్తు పట్టి ఆశ్రమానికి తీసుకొచ్చి వొదిలారు. భగవాన్ తన హాలు పక్కన పందిట్లో పడుకోపెట్టి ఆ గాయాలకి కట్లుకట్టి వైద్యంకూడా చేయించారు. మాటికి మాటికి వెళ్ళి దాని పక్కన కూచునేవారు.

ఓ అర్ధరాత్రి ఆ లేడి ఆయన్ని పిలిచిందో ఏమో, వెళ్ళి కూచున్నారు. అది దగ్గిరికి—ఇంకా దగ్గిరికి జరిగి, ఆయన ఒళ్ళో తలపెట్టుకుని నిర్యాణం అయింది.

మర్నాడు పొద్దున్న వంటింట్లోకి వొచ్చినప్పుడు భగవాన్ నాతో "రాత్రి వెళ్ళిపోయినాడు" అన్నారు.

"పూర్వం మారీచుడు రావణుడి చేతులో చావడమెందుకు? రాముడు చేతిలోనే చావొచ్చునని లేడి ఐనట్టు ఏ జన్మలో జింక రూపాన మీ చేతుల్లో వెళ్ళిపోవడానికి ఆశ్రమం చేరుకున్నారు" అన్నాను.

"అవునవును. ఇట్లాంటిదే జరిగింది ఇంకోటి. తెలీదా మీకు? కాకి రూపంలో వుండి వశిష్టుడికి సృష్టి క్రమాన్ని చెప్పిన మహాముని లేదూ? అల్లాగే ఓసారి కాకి రూపంలో ఓ ఋషి వచ్చారు నా దగ్గిరికి, నేను కొండపైన వుండే

రోజుల్లో. ఆయన నా దగ్గిరికి వొచ్చి కదలలేదు. ఎవరు ఏం పెట్టినా తినలేదు. నేను వెళ్ళి పెడితే నాలుగు మెతుకులు తిన్నాడు. అంతే, చచ్చిపోయినాడు" అని చెప్పారు.

ఇంకోసారి భగవాన్ హాలులోకి గరుడపక్షి వొచ్చి బీరువా మీద కూచుంది, భగవాన్ వంక కొంతసేపు చూసి సోఫాకి ప్రదక్షిణం చేసి, ఎగిరిపోయింది.

భగవాన్ "వాడో జ్ఞాని, నాకు దర్శనమిచ్చాడు. వెళ్ళిపోయినాడు" అన్నారు.

ప్రతి రోజూ మధ్యాహ్నం నించి రెండు పిచికలు - ఒక ఆడదీ, ఒక మొగదీ వచ్చి, భగవాన్ హాలు తలుపు రెక్కలు మీద ఎదురెదురుగా కూచునేవి. ఎంత తోలినా వొచ్చి మళ్ళీ అక్కడే కూచుంటాయి సాయంత్రం దాకా. వాటిని ద్వారపాలకులనేవారు భగవాన్.

"ఎవరో, ఎందుకు వొచ్చారో నాకు దర్శన మివ్వడానికి?" అనేవారు.

భూమిపైకి కలియుగంలో అవతరించిన ఈశ్వరుడి దర్శనం కోసం ఎందరెందరు యోగులు మనుష్యులుగానే కాక మృగాలుగా పక్షులుగా వొచ్చారో! మేము సాధారణ స్త్రీలము, తేనెలో పడ్డ ఈగలమల్లే ఆ తీపికి కదలలేక అన్నేళ్ళు తన్మయులమై కట్టుపడలేదా, గోపికలు శ్రీ కృష్ణుడికి వశ్యమైనట్టు!!

---

# రాజయ్యర్

**1911**లో నేను హైస్కూల్లో చదువుకునేప్పుడు, భగవాన్ విరూపాక్ష గుహలో వుండేవారు. అప్పుడు ఆయన మౌన ముద్రాంకితులు. భగవాన్ అరుణాచలానికి వొచ్చినప్పటి నుంచి, మా పెత్తల్లిగారికి వారిపైన భక్తి. వీలైనప్పుడల్లా వారినిపిలిచి భిక్ష పెట్టేవారు. ఆ వీధికిభగవాన్ భిక్షకొచ్చినప్పుడు, ఆమె తప్పకుండా వారికి ప్రేమతో భోజనం ఇచ్చి పంపేది.

నేను నా పెత్తల్లి గారి ఇంట్లోనేవుండి చదువుకునే వాణ్ణి. తరుచూ నేనూ, నలుగురైదుగురు సహాధ్యాయులూ కలిసి భగవాన్ దర్శనానికై కొండమీదికి వెళ్ళే వాళ్ళం. మేము వెళ్ళినప్పుడల్లా, మా పెదతల్లిగారు, చక్రపొంగలి మొదలైనవి ఏవో వొకటి చేసి ఇచ్చేవారు స్వామికోసం. అప్పుడు భగవాన్ని చూస్తే కుర్రాళ్ళం మాకు ఆయనో గొప్ప స్వామి అని గౌరవం. అంతకన్న అధికం ఏమీ వుండేది కాదు.

సాయంత్రం మేము వెళ్ళేప్పటికి వారు విరూపాక్ష గుహ బైటవున్న తిన్నెమీద వొచ్చి కూచుని వుండేవారు. వారితో ఇంకొకరు ఆయన సేవచేస్తూ వుండేవారు. మమ్మల్ని గుర్తుపట్టి నట్టుగా చిన్న చిరునవ్వుతో చూసే వారు. మేము ఆయన పాదాల దగ్గిర కూచుని భక్తి కీర్తనలు పాడే వాళ్ళం.



సాయంత్రం కొండమీదనుంచి ఓషధుల పరిమళంతో గాలి, కొండకి నీలపు గొడుగుమల్లే ఆకాశం, పడమటినించి అడవిలోంచి మా మీద పడే గొడుగుకి పచ్చ పట్టుకుచ్చుల మల్లే సాయంత్రపు కిరణాలూ, మా వెనక మా పాట మధ్య గలగలమనే పక్షులూ, మా ముందు ఎక్కడో చూస్తూ కూచున్న స్వామీ-ఏదో మాకు తెలని శాంతి మమ్మల్ని ఆవరించేది.

కీర్తనలైన తరవాత మేము తెచ్చిన చక్రపొంగలి మొదలైన పొట్లాలు విప్పి, స్వామికి కొంత పెట్టి, మేము కొంత తినేవాళ్ళం ఆయనా మాతో కలిసి తినేవారు. అక్కడి [illegible]లో కొండ నీటిధారలో దాహం తాగి, నవ్వుతో, గంతు లేస్తూ, వింతైన ఉత్సాహంతో లేళ్లమల్లే కిందికి దూకుతో, ఇళ్లు చేరుకునే వాళ్ళం. మళ్ళీ ఎప్పుడు మా వాళ్ళు ఓ ఫల హారం చేసి ఇస్తారా, మళ్ళీ స్వామిని ఎప్పుడు చూస్తామా అని వుండేది.

నేను చదువు మానేసింతర్వాత అటూ ఇటూ వూళ్లకి తిరగడం ప్రారంభించాను. ఆ తిరుగుళ్ళలో నాకు బుద్ధి పుట్టిం కుంటే, కొండమీదికి పోయి స్వామి దగ్గిర వుండి పోయేవాణ్ణి. [illegible] నిద్రా అక్కడే.

అప్పటికి స్వామి విరూపాక్ష గుహ వొదిలి, స్కందా శ్రమానికి వెళ్లారు, వుండడానికి. అక్కడికి ఎచ్చెమ్మ పాటి, మొదలియార్ పాటి మొదలైనవారు వూళ్ళోనే భోజనం [illegible] కొండపైకి తెచ్చేవారు. భగవాన్ దగ్గిర కొంతమంది [illegible] స్థలం చేరాం స్థిరంగా. ఆ వొచ్చిన భోజనం ఎంత వుంటే

అంత, ఎంత మందిమి వుంటే అంతమందిమి, ఎంత వస్తే అంత పంచుకు తినేవాళ్ళం. వచ్చిన భోజనం స్వామికి అయినా, ముందు అందరూ సరిగా తింటేనేగాని, స్వామికి ప్రత్యేకంగా ఏమీ లేదు. సరైన వేళకి తిండి వుండదు. రాత్రి పొంగలి మిగిలితే, తెల్లారి తినేవాళ్ళం, ఔపోసనం లేదు, అఖ్కర్లేదన్నారు స్వామి.

ఎవరన్నా ఏమన్నా పదార్థాలు తెస్తే, అక్కడే స్వామి వొండి అందరికీ పెట్టేవారు. వారికి సహాయం చేసేవాణ్ణి నేను. పొయిలోకి ఎండుపుల్లలూ, బజారునించి ఉప్పూ - ఇట్లాంటివి అందిచ్చి, పని చెపితేచాలు-పరిగెత్తుకుని వెళ్ళి చేసేవాణ్ణి.

కొంత కాలమైన తరువాత భగవాన్ తల్లి, చిన్న స్వామి వొచ్చారు స్కందాశ్రమంలో వుండడానికి. వారు వొచ్చిం తరవాత భక్తులు బియ్యమూ, అవీ కొండపైకి తెచ్చి యిచ్చేవారు. అవి వొండేది భగవాన్ తల్లి. అందరం తినే వాళ్ళం. అయినా ఏమి వుండేవి? అన్నం, మజ్జిగా, వూరగాయ ముక్కా--అంతే స్వామికి!

నే నెక్కడా నిలిచి ఓ రెండు రోజులు వుండను. ఎవరు ఎక్కడికి తీసుకుపోతే వారితో అక్కడికి. ఎవరు పిలిస్తే వారి వెంట, పిలవకండా కూడా ఇక్కడా అక్కడా, ఎక్కడ దొరికితే అక్కడ తింటూ, తిరుగుతూ వుండేవాణ్ని. కాని, ఎక్కడ తిరిగినా అరుణాచలం రాగానే, స్కందాశ్రమానికి వెళ్ళకండా వుండలేను. అక్కడి మజ్జిగ అన్నమే అమృతంగా వుండేది. వూళ్ళోకి పోయి ఏదన్నా తెమ్మంటే చాలు, పరిగెత్తి తెచ్చి పెట్టేవాణ్ణి హనుమంతుడిలాగు. రుబ్బడం, తరగడం, తురమడం అన్నీ చేసేవాణ్ణి- భగవాన్‌తో కలిసి.



ఒక్కపూటే వంట. మధ్యాహ్నం భోజనం మిగిలితే రాత్రికి, మిగలకపోతే ఏమీ లేదు.

నాకు పెళ్ళి చేశారు మా వాళ్ళు. కాని, నాలుగు రోజులు పట్టుమని ఇంటి దగ్గిర వుండను. సంసారానికీ, నాకూ పుట్టుకతోనే చాలా దూరం. ఎప్పుడూ భక్తులతో భజనలతో ఊరూరా తిరుగుతాను. భక్తికన్న తిరుగుడు మీద ఎక్కువ ఇష్టం! ఆ విధంగా పండరీపురం మొదలయిన క్షేత్రాలన్నీ తిరిగాను. నా భార్య చచ్చిపోయింది. అక్కడితో సంసారం నించి నాకు పూర్తిగా విడుదలయింది.

స్కందాశ్రమంలో ఉండేప్పుడు భగవాన్ అక్కడి గోడలూ, అరుగులూ కట్టేవారు; బాగు చేసేవారు. ఓసారి తలకి గుడ్డ కట్టుకుని మన్ను మెత్తుతున్నారు. ఎవరో భక్తులు ఆయన్ని చూడాలని చాలా శ్రమపడి కొండ యెక్కి వొచ్చారు.

ఆయన్ని చూసి, "కూలిమనిషీ, ఇక్కడ బ్రాహ్మణ స్వామి వుండాలి, ఏరీ?" అని అడిగారు.

భగవాన్ ఇటూ అటూ చూసి "కొండమీదికి వెళ్ళారు," అన్నారు.

"ఈ వేళ ఇక్కడే వుంటారని చెప్పారే?"

"ఏమొచ్చిందో, అట్లా పడి పోయినారు."

"ఎప్పుడు తిరిగి వొస్తారు?"

"ఏమో! ఎప్పుడు వొస్తారో! రాత్రికో, రేపటికో, ఎప్పటికో."

వాళ్ళేం చేస్తారు పాపం? కిందికి పోతున్నారు. కాని, కరుణా సముద్రులు, వాళ్ళకి దర్శన మీయకుండా పోనిస్తారా?

ఎచ్చెమ్మపాటి భగవాన్‌కి భోజనం తీసుకొస్తూ వాళ్ళకి ఎదురయ్యింది.

"స్వామి దర్శనమయిందా?" అంది వాళ్ళతో.

"లేదు. స్వామి కొండమీదికి వెళ్ళారుట. ఎప్పుడు వొస్తారో తెలీదుట," అన్నారు వాళ్ళు.

"అదేమిటి, వారు ఈ వేళకి ఎక్కడికీ వెళ్ళరే! ఎవరు చెప్పారు?"

"అక్కడో కూలిమనిషి చెప్పాడు."

"కూలిమనిషా! కూలిమనిషి ఎవరు?" ఎచ్చమ్మకి భగవాన్ చేసిన 'జోక్' అర్థమవుతోంది. "రండి- నేను చూపుతాను," అని వాళ్ళని వెంట పెట్టుకుని వెనక్కి తీసుకు వెళ్ళింది.

ఈ లోపల స్వామి చేతులు కడుక్కుని విభూతితీర్చుకుని, పద్మాసనంలో అరుగుమీద కూచుని వున్నారు.

వొచ్చినవారు ఆశ్చర్యంతో దిక్కులు చూస్తున్నారు. కూలీ లేడు!

వాళ్ళు వెళ్ళాక ఎచ్చెమ్మపాటి, "ఏమిటి స్వామీ, పాపం-వాళ్ళని అట్లా చేశారు?" అంటే—

"అంతకన్న ఏం చెయ్యమంటావు? స్వామి ఎవరని అడిగితే నేను అని చెప్పుకుని నిలబడమంటావా, లేక 'నేను రమణ మహర్షిని' అని అట్ట కట్టుకోమంటావా మొహాన?" అన్నారు భగవాన్.



1927 లో నేను రెడ్డిపాలెం వెళ్లాను. మూడు నెలలు అక్కడ భజనలు చేస్తూవున్నాను. ఒక రాత్రి నాకు కల వొచ్చింది. తేజస్సుతో ప్రకాశిస్తున్న ఒక యోగి హాల్లో కూచుని వున్నారు, సోఫామీద. ఆయన నన్ను చూసి పంకా లాగమన్నారు కాసేపు. ఏమిటా ఆ కల అనుకుంటూ ఆ ఊరి నించి భగవాన్ దగ్గిరికి వొచ్చాను.

అప్పటికి భగవాన్‌కి పాలితీర్థం దగ్గిర ఆశ్రమం ఏర్పాటు కావడమూ, హాలు కట్టడమూ జరిగింది.

భగవాన్‌కి నన్ను చూడగానే, "వెళ్ళి భోజనం చెయ్యి," అన్నారు. భోజనం చేసి హాలులోకి రాగానే సోఫా మీద కూచుని నన్ను తనకి కొంచెం పంకా లాగమన్నారు. ఎవరినీ తనకి ఏ పనీ చేసి పెట్టమని ఎప్పుడూ అడగరు భగవాన్. వెంటనే తెలిసిపోయింది నాకు, నా కలలో కనపడ్డ యోగి వీరేననీన్నీ, ఆ పంకా లాగమని అడగడంతో నన్ను తన సేవకి స్వీకరించారనీ. సంతోషించాను.

ఐదు నిమిషాల్లో చాలు ఆపమన్నారు. ఆయనకి పంకా కావలిసి అడిగారా నన్ను! అదో ఆట; అదో అనుగ్రహం! ఆలోచించి నాకు నిశ్చయమయింది—వారే నా గురువు అని.

నేను ఆశ్రమం నించి పోవాలనుకున్నప్పుడల్లా, నేను వెళ్ళకుండా వుండే పరిస్థితులు ఏర్పడేవి. సర్వమూ అక్కడే వుంది. ఎక్కడికీ దేనికీ కదల నక్కర్లేదని, తిరిగి తిరిగి తెలియ చెప్పేవారు, ఎట్లాగో అనేక నిదర్శనాల ద్వారా. కాని, చపల చిత్తం నన్ను ఓ చోట నిలవనిచ్చేది కాదు. నా పూర్వ

పరిచితులు వొచ్చి నన్ను ఆశ్రమం నించి లాక్కుని పోయే
వారు. భగవాన్ నన్ను ఎంతో దగ్గిరికి తీసుకుని, నా వెంట
వుండి పనులు నాతో కలిసి చేస్తున్నా, నిలకడగా నిలిచేవాణ్ణి
కాదు నేను.

ఇక్కడే ఓ వూళ్లో శ్రీరామ నవమికి ఉత్సవాలు చేస్తు
న్నారు—అక్కడ భజనకి రమ్మని నన్ను పిలవ వొచ్చారు,
ఆ వూరి భక్తులు. వొస్తాను పదమన్నాను.

ఇంతలో అలహాబాదు నించి మహంతు చాలా
డబ్బు, రమణాశ్రమానికి పంపి, శ్రీరామ నవమి ఉత్సవం
జరిపించమన్నారు. ఇంకేం? ఆశ్రమంలోనే శ్రీరామ నవమి
గొప్పగా జరిగింది. నేను కదలడానికి వీలు లేక పోయింది; అవ
సరమూ లేదు. ఆ వూరినించి శ్రీరాముడు ఆశ్రమానికి వొచ్చి
నట్టు అనిపించింది నాకు.

ఆ నాటినించీ ఏదో శక్తి నన్నా భగవాన్ దగ్గిర
వుంచాలని చూస్తున్నట్టు ఇప్పుడు తెలుస్తోంది.

ఏదో వొక పని చేస్తేనే గాని ఆశ్రమంలో భోజనం
పెట్టరు. నాకు పని బద్ధకం. పోనీ, వీరు చెప్పిన పని చెయ్య
డానికి ఒప్పుకొని ఆశ్రమంలో వుందామని వొచ్చేవాణ్ణి కాని,
ఇప్పుడేపనీ లేదు–నీవు చెయ్యడానికి, పొమ్మనేవారు చాలా
సార్లు. కాని, త్వరలోనే మళ్లీ ఆశ్రమానికి వెళ్లకండా వుండ
లేక పోయేవాణ్ణి. కొన్నాళ్ళు పూజకి పువ్వులు కొయ్యడం,
గుళ్ళో గంధం తియ్యడం, పూజకి నీళ్లు చేది ఇవ్వడం–ఇట్లాంటి
పనులు చేశాను.



ఈశ్వరభట్టు అనే అతను వొచ్చాడు. అతనికి ఈ పను
లన్నీ నేర్పడమే కాకుండా. గుళ్లో పూజ చెయ్యడం కూడా
నేర్పాను. చాలా రోజులు ఆలయంలో నేనే అర్చన. ఈశ్వర
భట్టుకి నేను భక్తి కీర్తనలూ; నృత్యంకూడా నేర్పాను.

శ్యామసుందర మదన మోహన
బృందావన విహారీ
బృందావన విహారీ, గోవర్ధన గిరిధారీ
గోపాలకృష్ణ మురారీ
గోపీ మానసహారీ

అని పాటకి నేనూ, వాడూ కలిసి భగవాన్ హాలులో
భగవాన్ ముందు నృత్యం చేసేవాళ్ళం. ఈ నాటికీ నేను
పాడుతూ, నృత్యం చేస్తోనే వున్నాను.

1935 లో చిన్నస్వామి నన్ను ఇడ్లీ చెయ్యడానికి
ఆశ్రమంలో వుండి పొమ్మన్నారు. కష్టమిన్నాద వొప్పు
కున్నాను. ఆ నాటికీ ఈ నాటికీ ఇడ్లీ పని నాకు అట్లాగే
వుండిపోయింది. ఎక్కడెక్కడి వారు ఆశ్రమంలో ఇడ్లీ రుచి
[illegible]క్కడి ఇడ్లీకీ లేదనేవారు. ఇట్లా ఇడ్లీ చేస్తున్నా, మధ్యలో
[illegible] వూరు జ్ఞాపకం వొచ్చిందా, లేక ఎవరన్నా భజనకని పిలి
చారా, పారిపోయే వాణ్ణి; దేశ సంచారానికి.

1937 లో ఆశ్రమానికి పోస్టాఫీసు వొచ్చింది. నన్ను
[illegible]య్యాలని నన్ను పోస్టుమాస్టర్ని చేశారు. మొదటి రోజు
పోస్టాఫీసు తెరిచినప్పుడు భగవాన్ పోస్టాఫీసులోకి వచ్చి వర
సగా రెండు రోజులు మొదట ఉత్తరాలపైన తన చేత్తో

ముద్ర కొట్టారు. అదివరకు కూడా వూళ్ళో పోస్టాఫీసునించి ఆశ్రమం ఉత్తరాలు తీసుకురావడం నా పనే.

"ఓహో, Post man ఈ నాటినించి Post-master అయినాడు," అని గేలి చేశారు భగవాన్.

మజ్జిగ పులుసులోకి పప్పు మొదలైనవన్నీ రుబ్బమన్నారు వంటింట్లో వారు, నన్ను ఒకసారి. ఎంత రుబ్బినా నాకు నలుగుడు పడలేదు. విసుగెత్తింది. కొండ ఎక్కరమ్మన్నా వస్తాను కాని, ఈ పప్పు రుబ్బడం నాకు సాధ్యం కాదన్నాను. వీలు లేదు, మెత్తగా రుబ్బి కాని కదలడానికి వీలు లేదన్నారు వంటవారు. నేను రుబ్బ నన్నాను.

ఈ తగదా మధ్య భగవాన్ వొచ్చి అంతా విన్నారు.

"ఎందుకంత శ్రమ! ఏమీ లేదే. కొంచెం ఉప్పు వెయ్యండి," అన్నారు.

తీసుకొచ్చి వేశాను. వెంటనే నలిగి పోయింది. అనుభవజ్ఞులైన వంటవారే ఆశ్చర్యపోయారు. ఆ రోజునించి నాకు రుబ్బుడు భారం కాలేదు.

ఒకొక్కప్పుడు ఆశ్రమంలో నేను చేసే పని వంటికీ, మనసుకీ భారమయ్యేది. అట్లాంటప్పుడు భగవాన్ హాలు చుట్టూ ఒక్క ప్రదక్షిణం చేశానా, ఇంక శ్రమ ఏ మాత్రం వుండేది కాదు. పాత శ్రమ అంతా మాయమయ్యేది.

నేను ఒకవేపు పొయ్యి పెట్టి ఇడ్లీ చేస్తే, భగవాన్ తడికకి రెండో వేపున కూరలు తరుగుతూ వుండేవారు. ఒక కన్ను నా మీదనే వుండేది. ఏది దుబారా చెయ్యకుండా



[illegible] విధాలు ఎన్నో చెప్పేవారు నాకు. ఏదీ వృథా పోవడం భగవాన్‌కి ఇష్టం లేదు. వృథా చేశామా—కోప్పడతారు.

ఇడ్లీ పిండి గరిటతో తీసేటప్పుడు కింద చుక్కలు పడ్డాయా, నన్ను ఆపి, ఎలా గరిట తుడిచి గరిట ఎత్తాలో స్వయంగా చూపుతారు; ఎలా కొంచెం కిరసనాయిలుతో పొయ్యి వెలిగించవొచ్చో బోధిస్తారు. మా కోసం, మా [illegible] కోసం కాకపోతే; అది ఆయన అనుగ్రహం కాకపోతే —ఏం పట్టిందో ఆయన కింతా!

తెల్లారకట్ట దోసెలన్నా, ఏమన్నా చేసినప్పుడు అప్పటికప్పుడు వేడివి హాలుకి పంపేవారు. రెండు పంపితే, భగవాన్ ఒకటి రుచికి తిని, రెండోది అక్కడ వున్నవారికి పంచేవారు. తిరిగి కాఫీకి వొచ్చినప్పుడు, ప్రతివారికీ రెండు దోసెలు [illegible]స్తే, ఆయన ఒక్కటే తీసుకునేవారు, తెల్లవారకట్ట తాను [illegible]టి తినలేదా మరి!

స్కందాశ్రమంలో, భగవాన్ ఉండేప్పుడు ఆయన [illegible], గిరి ప్రదక్షిణం వెడుతూ వుండేవారు. అక్కడి నించి [illegible]నులన్నీ తీసుకుని వొచ్చి వంట వొండేవారు. భోజనా[illegible], మధ్యాహ్నం నించి చాలామందిమి బైలుదేరే[illegible]ం. గౌతమాశ్రమం చేరేసరికి రాత్రి తొమ్మిది గంట[illegible]ది.

పల్లాకుత్తులో వొండి మిగిలింది వెంట తీసుకుని [illegible]ము. తెచ్చుకున్నది అందరమూ అక్కడ తిని పడు[illegible]ము. తెల్లారకట్టే బైలుదేరి, పచ్చయమ్మ గుడి చేరు[illegible]ము. దేశంలో వున్న పచ్చయమ్మ గుళ్ళన్నిటిలోకీ,

ఈ పచ్చయమ్మే గొప్ప మహిమ కలదని చెప్పారు భగవాన్.

ఒకప్పుడు పొద్దున్న తొమ్మిది గంటలకల్లా, వూళ్లో తన ఇంట్లో వండి, ఎచ్చెమ్మపాటి మా అందరికీ భోజనం తీసుకొని వొచ్చారు. తిరిగి స్కందాశ్రమం చేరేటప్పటికి రాత్రి పది గంటలయింది. అంత నెమ్మదిగా నడిచేవారు భగవాన్. ఆయనతో గిరిని తిరగడం అదో ఉత్సవం.

భగవాన్ తెల్లారగట్ల నాలుగింటికి నిద్ర లేచేవారు. రాత్రి 9 గంటలదాకా భక్తులు అన్ని గంటలూ ఆయనతో కూచుని ఉండేవారు. రాత్రి కూడా నిద్రలేకుండా, కబుర్లు చెపుతూనే ఉండేవారు. యోగక్షేమాలు విచారించేవారు. సరిగా నిద్ర పోతున్నారో, లేదో అడిగేవారు; చూచేవారు.

రాత్రి 9 గంటలకి బైటనించి వచ్చినవారు వెళ్ళాలని రూలు పెట్టారు ఆశ్రమంవారు. తరవాత భగవాన్ అలిసి పోతున్నారని, మధ్యాహ్నం భోజనమైనాక రెండున్నర వరకు తలుపులు వేసెయ్యమన్నారు, ఎవరూ హాలులో లేకండా. ఇది భగవాన్ని అడిగి చేసిన పనికాదు. మొదటిరోజు తలుపులు వేస్తున్నప్పుడు భగవాన్ యెందుకని ప్రశ్నించారు. తెలుసుకుని, తానే హాలులోంచి బైటికివచ్చి కూచున్నారు.

"నా కోసం అన్ని వేళలా ప్రజలు వస్తారు. వాళ్ల వెంటనే వెళ్ళి పోవలసి ఉంటుంది. దర్శనానికి వేరే గంటలేమిటి? వారిని మీరు రానీకపోతే, నేనే వారిని కలుసుకుంటాను. మీ తలుపులూ అవీ మీరు వేసుకోండి" అన్నారు. తరవాత రోజుల్లో అందరూ బతిమాలుకుంటే ఆ రూలు ఒప్పుకున్నారు, అతి కష్టంపైన.



అట్లానే ఎప్పుడూ, ఆయన అనుమతి లేనిదే ఆశ్రమంవారు, ఆశ్రమం సక్రమంగా నడిచేందుకు, అనేక నిబంధనల్ని ఏర్పరిచేవారు. భగవాన్‌కి తెలిస్తే, ఆయనకి ఇష్టంలేనప్పుడు, అయిష్టం చూపేవారు. దాన్ని గమనించక తమ పద్ధతే నెగ్గాలని ఆశ్రమంవారు పట్టుపడితే, 'సరే, మీ యిష్టం'అని ఒప్పుకునేవారు, ఆశ్రమంవారు మరీ పట్టుబట్టినా,ఎవరికన్నా ఆశ్రమంవారివల్ల అన్యాయం జరిగినా, భగవాన్ "సరే, మీ ఆశ్రమం మీరు చూసుకోండి; నేను కొండపైకి పోతున్నా," అనేవారు.

ఆ భయమే లేకపోతే, ఆయన చుట్టూ కూడిన మనుష్యుల మనసులు, యెన్ని విధాల, ఎన్ని వంకర్లతో పని చేసేవో-ఆయనని గుళ్ళో రాతివిగ్రహం కింద కూచోపెట్టి.

భగవాన్‌కి కురుపులేచి ఆపరేషను అవుతున్నప్పుడు ఓ సారి వారికి ఎట్లాగో నయం చెయ్యాలనే ఆదుర్దాలో, నాకు తెలుగు నేర్పిన ఓ పోస్టుమాస్టరుగారూ నేనూ తంజావూరు దగ్గిర ప్రసిద్ధి కెక్కిన పచ్చయమ్మ దేవాలయానికి డబ్బు పంపి, అర్చనలు చేయించి ప్రసాదం తెప్పించాము. ఆ ప్రసాదం భగవాన్‌కి అందివ్వాలి. అప్పటికి భగవాన్ దగ్గిరికి పోకూడదు, భగవాన్‌తో మాట్లాడ కూడదనే నిబంధనలు తీవ్రంగా ఉన్నాయి. మేము భగవాన్ దగ్గిరికి వెళ్ళడం పెద్దలు చూచారా మమ్మల్ని ఆశ్రమం బైటికి తరుముతారు. అందుకని భగవాన్ని ప్రార్థించుకుంటూ సహాయం కోసం చూస్తున్నాము.

9

మధ్యాహ్నం రెండుగంటలకి ఎవరూ లేరు. మేమిద్దరం పిల్లలమల్లే లోపల దూరి, "భగవాన్, మేము మీ దేహారోగ్యం కోసం పచ్చయమ్మకి అర్చన చేయించాము. ఆ ప్రసాదం మీకు తీసుకొచ్చాము" అన్నాము, ఏం కోప్పడతారో అనే భయంతోనే.

కాని, వారు మా హృదయంలోని మా భక్తి శ్రద్ధల్ని మాత్రమే గమనించి వుంటారు, కాకపోతే, సర్వేశ్వరుడికి జబ్బు చేస్తే పచ్చయమ్మ ప్రసాదం నయం చేస్తుందా? అయినా, భగవాన్ ఆ విభూది కుంకుమలని చాలా ఆదరంతో తీసుకుని, మొహాన పెట్టుకుని, వొంటికి రాసుకుని, ఆ కురుపు మీద కూడా నెమ్మదిగా రుద్దుకున్నారు. పచ్చయమ్మ మహత్యం గురించి మాట్లాడారు. మేము ఎంతో తృప్తిపడి సంతోషంతో వొచ్చేశాము.

ఏ విధాన, ఏ తాహతుతో, ఎట్లా ఏ భక్తుడు ఆయనని సమీపిస్తే ఆ విధంగా వారి అంతస్తులోనే ఆయన వారికి తృప్తినీ, ప్రీతినీ కలిగించేవారు. అదేకదా దైవత్వమంటే! భక్త పరాధీనుడు ఈశ్వరుడు. ఆ భక్తుడి భక్తి ఏ అంతస్తు లోనిదైనా సరే, ఆయనకి స్వీకారార్హమే నన్నది ప్రత్యక్షంగా చూపారు, భగవాన్.

రేపల్లి దగ్గర మూరతోట గ్రామంనించి పీనిగని పెట్టెలో పెట్టి తీసుకొచ్చారు, ఆశ్రమం గుమ్మంలోకి, ఒకరు



రాత్రి ఎనిమిదింటికి. వాళ్ళకి ఒక్కడే కొడుకు. అతన్ని భగవాన్ బతికిస్తారని వాళ్ళ ఆశ. భోజనంచేసి ఆ తల్లి రాత్రి పదింటివరకు భగవాన్‌తో చెప్పుకుంది. భగవాన్ ఏమీ మాట్లాడలేదు. వాళ్ళు వూళ్లోకి వెళ్ళారు. తెల్లారిందాకా [illegible]సినట్టున్నారు. తెల్లారి తగలేశారు ఆ పీనిగని.

తరవాత భగవాన్ అన్నారు: "విశ్వాసంతో చాలా దూరం వొచ్చారు. కాని, ఒకర్ని బతికిస్తే ఇంక ఈ బతికించడానికి అంతం వుంటుందా?" అని.

తరవాత రెండు రోజులు వున్నారు వాళ్ళు. వెళ్ళేటప్పుడు దుఃఖమంతా మరిచి నవ్వుతో వెళ్లారు. వాళ్ళకొడుకు [illegible]సంతపనీ అయింది వాళ్ళకి.

నేను తిరుమంగళం అనే ఊళ్లో ఉన్నప్పుడు తేనమ్మాళ్ అనే
ఆమెను కలుసుకోవడం తటస్థించింది. ఆమె ఆ పూరి
అరుణాచలం నుంచి వచ్చింది, భగవాన్ దర్శనం చేసుకొని.
ఆమే, నేనూ ఎప్పుడూ ఆధ్యాత్మిక విషయాలు మాట్లాడుకునే
వాళ్ళం. ఆమె భగవాన్ గురించి చాలా గొప్పగా మాట్లా
డింది. ఆమె తిరిగి తిరువణ్ణామలై వెడుతోంది. నేను ఆమెతో
వెళ్ళాలని చాలా ప్రయత్నం చేశాను. కానీ మా వాళ్ళు ఏ
మాత్రం ఒప్పుకున్నారు కాదు. ఆమె వెళ్ళిన తరువాత అ
రోజంతా ఏడుస్తున్నాను, నేను వెళ్ళలేక పోతినే అని.

తేనమ్మాళ్ భగవాన్‌తో నా సంగతి చెప్పి తన దర్శ
నానికి నన్ను రప్పించుకోమని ప్రార్థించిందిట. తిరిగి నా బంధువుల
నందర్నీ ప్రార్థించాను, నన్ను ఒక్కసారి అరుణాచలం వెళ్ళ
నివ్వమని. ఎవరూ ఒప్పుకోలేదు. వారు నిరాకరించే కొ
నాలో ఉండే కాంక్ష ఎక్కువయిపోయింది, భగవాన్
దర్శనం చేసుకోవాలని.

ఒకసారి పత్రికల్లో శేషాద్రిస్వామి నిర్వాణం సంగ
పడ్డది. ఒకరు తెలీనివారు వచ్చి "నువ్వు దర్శనం చేసుకోవా
లనే మహాత్ములు నిర్వాణం చెందారు అరుణాచలంలో" అని
చెప్పారు. నిర్వాణం చెందింది భగవానే అనుకున్నాను. నా



ఆశలన్నీ కూలిపోయినాయి. కిందపడి పొర్లి రాగాలు పెట్టాను,
వారు బ్రతికి ఉండగా ఒక్కసారి వారి దర్శనం చేసుకునే
భాగ్యం నాకు లేకపోయిందే అని.

ఇంతలో ముంగిట్లో భగవాన్ దర్శనమిచ్చారు, కర్ర
కమండలముతో. వెంటనే లేచి కూర్చుని నా దగ్గిర వారితో
"భగవాన్ బ్రతికే ఉన్నారు. ఆ పత్రికలో తప్పు పడ్డది"
అన్నాను. వారు పత్రికను సరిగా చూచి తప్పు తెలుసు
కున్నారు.

ఆనాటి నుంచి భగవాన్ని చూడాలనే ఆశ బల
మైంది. సన్నపడి బలహీనమైనాను. మళ్ళీ అడిగాను నా వారిని
నన్ను వెళ్ళనిమ్మని. వీల్లేదన్నారు. ఇంక సముద్రంలో పడి
ప్రాణత్యాగం చేసుకొని నా ఆత్మతోనన్నా . వారి సన్నిధిని
ఉండాలని నిశ్చయించుకున్నాను. ఎప్పుడూ సముద్ర తీరంలో
పడి ఉండేదాన్ని. నాకు పిచ్చెక్కుతోందని భయపడ్డారు. నా
స్థితి చూచి నా తమ్ముడు తిరువణ్ణామలై రైలెక్కించాడు
కొంతమందితో.

రాత్రికి సత్రంలో పడుకుని ప్రొద్దున్నే ఆశ్రమానికి
వెళ్ళాము. అప్పుడు ఆశ్రమమంటె ఒక పూరిపాక. వారిని
చూచిన ఆనందంలో వారికి తెచ్చిన పళ్ళనుగూడా సమ
ర్పించడం మరచిపోయాను.

నాతో వచ్చినవారు తెచ్చిన పళ్ళను అక్కడ ఉంచి
ఆశ్రమం చుట్టూ చూడ్డానికి వెళ్ళారు. నా కళ్ళు నన్నక్కడే
కట్టేశాయి. భగవాన్ని చూస్తో అట్లానే కూర్చుని ఉండిపోయి
నాను. వారి కళ్ళల్లోకి చూస్తో ఉంటే వారిలోంచి నాలోకి

ఒక శక్తి ప్రవహిస్తున్నట్టయింది. నా కళ్ళ వెంట నీటి ధారలు. వాటిని తుడుచుకుంటూ భగవాన్‌ని చూస్తూ అట్లాగే కూర్చున్నాను. భగవాన్‌తోనే లేచి భోజనంచేసి మళ్ళీ హాల్లో కూర్చున్నాను.

మధ్యాహ్నం మురుగనార్ వచ్చారు. వారిని అడిగారు భగవాన్, "ఈమెను గురించేనా తేనమ్మాళ్ చెప్పింది?" అని.

నాతో వచ్చినవారు ఊళ్లో గుడి చూచి తిరుపతి వెళ్ళుతున్నారు. నన్ను రమ్మన్నారు. నేను రానని చెప్పి వారిని యాత్ర పూర్తి చేసుకొని తిరిగి వెళ్ళేప్పుడు నన్ను ఇంటికి తీసుకొని వెళ్ళమన్నాను. వాళ్ళు వెళ్ళి పోయినారు. నేను రాత్రికి మొదలియార్ పాటి ఇంటికి వెళ్ళాను.

ఉదయాన ఆశ్రమానికి వచ్చాను. ఆ రోజుల్లో ఆశ్రమంలో కాఫీలు ఇడ్లీలు లేవు. కొంచెం కొంచెం గంజి తాగే వారు. నాకూ ఇచ్చారు. భగవాన్ నా వంకచూచి, "కాఫీ తాగకుండా గంజి తాగడం నీకు కష్టం కదా?" అని అడిగారు. ఫరవా లేదన్నాను.

ఒక ముగాయన వంట చేసేవారు. నేను వంటింట్లో ఆయనకు సహాయం చెయ్యడం ప్రారంభించాను.

సంగీత జ్ఞానము భక్తివినా-

ఒకరోజు సాయంత్రం హాల్లో అరవంలో ఒక పాట



పాడాను. భగవాన్ మళ్ళీ స్పష్టంగా పాడమన్నారు. నాకు అర్థం కాక మౌనం పెట్టాను. ఆయన తిరిగి అడిగి పాడించుకుని తనూ పాడడం ప్రారంభించారు.

వారం రోజుల్లో తిరుపతి వెళ్ళినవారు తిరిగి వచ్చారు. నేను వాళ్ళని వెళ్ళమని, వెనుకనుంచి వస్తానని చెప్పి పంపాను. తర్వాత శెలవు తీసుకోడానికి భగవాన్ దగ్గరకు వెళ్ళాను. "ఏమిటి-ఇవాళే, అప్పుడే వెళుతున్నావా?" అన్నారు. నేను "అవున"ని వారి దర్శనం కోసం పడ్డ శ్రమంతా చెప్పుకున్నాను. "స్వామీ, నాకెవరూ లేరు-ఏ బంధమూ లేదు. నేను ఎప్పుడూ తమ సన్నిధిలో ఉండే వీలును కలుగ చెయ్యండి" అని ప్రార్థించాను.

వారు ఏమీ మాట్లాడకుండా ఉపదేశ సారంలోంచి పద్యాలు అక్కడక్కడ చదువుకుంటున్నారు. ఇంతలో మురుగనార్ వచ్చారు. భగవాన్ ఆయనను చూచి, "మీరు వస్తారని చూస్తున్నాను. ఆమెకి ఉపదేశం కావాలట. ఇది చదవండి" అని ఆయనకిచ్చారు పుస్తకం. ఆయన చదివారు.

నేను వెళ్లేప్పుడు వారు చదువుతున్న ఉపదేశసారం పుస్తకం నాకు ఇమ్మని అడిగాను. "ఇది నాకు ఉన్నదే ఒక పుస్తకం. ఇంకా ప్రతులు లేవు" అన్నారు. కాదు ఇవ్వమని ప్రార్థించాను.

ఆ సమయంలోనే సోమసుందరం స్వామిగారు వచ్చారు.

నే నేమిటి అడుగుతున్నానని భగవాన్ని అడిగారు. భగవాన్ చెప్పారు. దానికి సోమసుందరం స్వామిగారు తన దగ్గర ఉప దేశసారం పుస్తకం ప్రతి ఉన్నదనీ, దాన్ని తాను భగవాన్కి ఇస్తాననీ, ఈ ప్రతిని నాకు ఇమ్మనీ ప్రార్థించారు. నవ్వుతో తన ఎడమచేత్తో ఆ పుస్తకాన్ని భగవాన్ నా కిచ్చారు.

తరువాత తరచు ఆశ్రమానికి వచ్చి 15 రోజులు, రెండు మూడు నెలలు ఉండిపోయేదాన్ని. మా వాళ్లు తిరిగి రమ్మని బలవంతం చేస్తూ ఉత్తరాలు వ్రాస్తే తిరిగి వెళ్లక తప్పేది కాదు. కానీ, వీలు కాగానే మరల పరుగెత్తుకు వస్తు వుండేదాన్ని.

క్రమముగా ఆశ్రమమే నా స్వంత గృహము, మా ఊరికి చుట్టపు చూపుగా వెళ్ళడము అయింది; నేను వంట ఇంట్లో పనిచేస్తూ ఉండేదాన్ని.

ఒక రోజున శనగపిండి విసిరి, అది వంకాయతో కలిపి కూర చెయ్యాలనుకున్నాం. మర్నాడు ప్రొద్దున వచ్చేప్పటికి భగవాన్ శనగపిండిని కలిపి వుంచామనీ, దాన్ని వంకాయ ముక్కలకి పట్టించి కూర చెయ్యమనీ అన్నారు.

పక్కన తేనమ్మాళ్ వంటింట్లో ఒక మూల పప్పు మంగలంలో వేయిస్తోంది. ఎందుకని అడిగారు భగవాన్. మాతో వంటింట్లో పనిచేసే ఒకామె బైట ఉన్నదనీ ఆ ఆమెకి ఫలహారం తయారు చెయ్యడానికని చెప్పాను నేను.



"అదేమిటి? బైటవుంటే మైలా? ఏం మైల? ఎందుకు మైల? అట్లా భేదం చూపకండి. మామూలుగా అందరికి మల్లేనే అన్నమూ, వంకాయ కూరా పెట్టు" అన్నారు. అట్లాగే పెట్టాను.

## మడి మైలలు—అబద్ధాలూ

రాత్రి భగవాన్ అడిగారు నన్ను, "బైటవున్న ఆమెకి మామూలు భోజనం పెట్టావా?" అని. "అవును" అన్నాను నేను. ఆ రోజు పగలే ఒక భార్యా భర్త ఆశ్రమానికి వచ్చారు. వారు భోజనం చేశారా అని అడుగుతున్నారు, భగవాన్ నన్ను. ఆ సమయములో చిన్నస్వామి వచ్చారు. నా వంక చూచి చిన్నస్వామి, "ఎవరన్నా బైటవున్న ఆశ్రమ స్త్రీలకి ఆశ్రమ భోజనం పెడతారా అని అడిగితే, అట్లా పెట్టరనీ, వేరే ఫలహారం పెడతామనీ చెప్పు" అన్నారు.

వెంటనే భగవాన్ అదమాయించి, "ఒరే, ముట్టాళ్! ఆమెను అబద్ధం చెప్పమంటావెందుకు? సమస్తమైన వారికీ ఆశ్రమ భోజనం పెడతాము. ఇష్టమున్నవారిని తినమను; లేని వారిని వెళ్ళమను" అని, అంతటితో వూరుకోక, "నేను స్కందాశ్రమంలో ఉండేప్పుడు అమ్మా అంతే. కట్టెలు తీసు కొచ్చి పడేసేవాడు మాల అతను. ఆయనకు భోజనం పెట్టడం ఇష్టం లేదు. అది మైల. తాను ముందు తినాలిట. తనకన్న

ముందు నేను తినాలి. నేను తినను, అతనికి ముందు పెట్టమనే వాణ్ణి. చాల బాధపడేది. ఏమిటీ భేదం మనిషికి మనిషికి మధ్య; నేను బ్రాహ్మణుడు, వాడు అబ్రాహ్మణుడు వీడు మాల అని! అందర్నీ భగవత్ స్వరూపంగా చూడకూడదా?'' అన్నారు.

ఆ మాటల్ని విని ఆశ్చర్యపోయినాము. ఆ మాటలు మమ్మల్ని అన్నట్టే అనిపించి, మా మనసుల్ని ఆ సమదృష్టికి మార్చమని భగవాన్ని ప్రార్థించాము.

ఒక ఉదయం నేను భగవాన్ ముందు ఒక తేవారం చదువుతున్నాను, పుస్తకంలో చూచి. ఒక పాదం తప్పు చదివాను. భగవాన్ గమనించి ''అది అట్లాగే ఉందా? మళ్ళీ చదువు'' అన్నారు. మళ్ళీ తప్పు చదివాను. మళ్ళీ అంతే. ఎన్నిసార్లు సరిగా చూచి చదవమని భగవాన్ చెప్పినా సరిగా రాలేదు.

చివరకి భగవాన్ అన్నారు: ''ఎక్కడ తప్పో నువ్వే తెలుసుకోవాలి. నేను తప్పు సరిదిద్దను. సరిగా వచ్చిందాకా చదివి నువ్వే తెలుసుకో. నేను దిద్దితే అప్పుడే మరచిపోయి ఆ తప్పులోనే పడతావు.''

కుంజుస్వామి వచ్చి అది విని తాను నా తప్పును సరి దిద్దబోయినారు. భగవాన్ వీల్లేదంటే ఆయన మాట్లాడకుండా వెళ్ళిపోయినారు. అప్పుడు కాకినాడ వెంకటరత్నంగారు నా



పక్షాన భగవాన్ని ప్రార్థించారు, సరిదిద్దమని. భగవాన్ ''హుఁ-వీల్లేదు, కావలసే ఆ తప్పు చదువుతోంది. నేను ఆ తప్పును దిద్దాలని ఆమె ఆశ. నేను దిద్దను,'' అన్నారు.

భోజనం వేళ అవుతోంది. భగవాన్‌కి నమస్కరించి విస్తళ్ళు వెయ్యటానికి లేచాను. ''ఏం, తప్పు దిద్దుకోవేం? ఈ విధంగా తప్పించుకోవాలని చూస్తున్నావా? వీల్లేదు, కూర్చో. సరిగా చదివిగాని కదలటానికి వీల్లేదు'' అన్నారు.

ఎవరో విస్తళ్ళు వేశారు. భోజనానికి గంట కొట్టారు. భగవాన్ లేచి వెళ్లారు. నేను వెళ్ళి భోజనాలు వడ్డించాను.

మధ్యాహ్నం సోమసుందర స్వామిగారి నించి నా తప్పు దిద్దుకున్నాను. మధ్యాహ్నం సరిగా చదివాను. భగవాన్ ముందు, ''దిద్దించుకున్నావా?'' అని అడిగారు.

''అవును.''

''నువ్వే నీ తప్పుని కనుక్కున్నప్పుడే, సరియైనది నీ మనసులో స్థిరంగా నిలుస్తుంది'' అన్నారు. బ్రతుకు జీవుడా అని బయట పడ్డాను.

ఒకసారి భగవాన్ నాకు వాసుదేవ మననం చదవమని ఇచ్చారు. చదివి ఇచ్చేశాను. ''పూర్తి చేశావా?'' అని అడిగారు.

''పూర్తి చేశాను కానీ, స్వామీ! ఒక్కరవ్వ నా మనసులో నిలవలేదు'' అన్నాను.

దానికి భగవాన్ "లోపలికి తీసుకునేదంతా మరచి పోతాము. లోపలికి వచ్చేదంతా పోయి తీరాలి. ఉండేదేమో స్థిరంగా ఎప్పటికీ ఉంటుంది," అన్నారు.

ఒకసారి ఒరుగుల పులుసు చేశాను ఆశ్రమంలో. భోజనమైనాక నేను భగవాన్‌తో ఆ పులుసులో వేసిన వేమిటో చెప్పి, రుచిగా ఉందేమో అడిగాను.

"రుచి అంటూ ఏముంది? మన నోట్లో రుచిని ఆ పదార్థానికిచ్చి, అది తిని రుచిగా ఉందంటాము. నాకు ప్రత్యేకం దేనికీ ఒక రుచి అంటూ వేరే లేదు" అన్నారు.

---

# సుందరం

నేను మద్రాసులో ఉద్యోగంలో వుంటో వుండగానే, నా
భార్య చచ్చిపోయి నాకు సంసార మనేదానికి బంధం
పోయింది. ఆ రోజుల్లోనే భగవాన్ సంగతి విన్నాను. ఈశ్వర
సేవకే నా జీవితం వినియోగించాలనిపించింది. ఎప్పటినించో
నాకు తెలీకండానే ఆ కోర్కె రహస్యంగా పనిచేస్తోంది
నాలో.

ఉద్యోగం వొదులుకొని భగవాన్ దగ్గిరికి వొచ్చే
శాను. హాల్లో యిద్దరు ముగ్గురున్నారు భగవాన్ దగ్గర.
నేను కూచున్నాను. రాత్రి అయింది. తాను భోజనానికి లేస్తూ
భగవాన్ నన్నూ రమ్మనారు. రాత్రులు భోజనం చెయ్యటం
లేదన్నాను.

చిన్న స్వామికి నా బంధువులు బాగా తెలుసు.
మర్నాడే నా కేవో కాయితాలిచ్చి మద్రాసు పంపారు,
ఆయన వ్యవహారంపైన. అంటే నన్ను ఆశ్రమంలో ఒకరుగా
చెప్పకండానే చేర్చుకున్నారు. నేను తిరిగి వొచ్చింతరవాత
పుస్తకాల అమ్మకానికీ, అది అయిన తరవాత ఆశ్రమం ఆఫీ
సులో రాతపనులకీ, తరవాత వంటింట్లో సహాయానికి నియ
మించారు. అప్పుడు భగవాన్‌తో కలిసి పనిచేసే అదృష్టం కలి
గింది నాకు.



మొదటనుంచి నేను 'ఆస్మా' నించి బాధపడేవాణ్ణి.
నేనేమీ అడగలేదు భగవాన్ని, ఆ వ్యాధిని నయం చెయ్య
మని. భగవాన్ పచ్చడి రుబ్బి దగ్గిర వున్నవారికి రుచి చూడ
మని కొంచెం కొంచెం చేతుల్లో పెట్టేవారు. దానినే అందరూ
ప్రసాదం కింద తినేవారు. ఓసారి అట్లాగే నాకు పచ్చడి పెట్టి
"ఇదే మందు" అన్నారు. ఆ నాటితో నా 'ఆస్మా' నయమై
పోయింది.

ఒకసారి భగవాన్‌తో ఫిర్యాదుగా అన్నాను-ఆశ్రమం
భోజనంలో చాల కారమూ, పొట్ట మండించే ఘాటు ద్రవాలు
విస్తారంగా వుంటాయేమి అనీ, "ఆశ్రమంలో సాధకులకి సాత్వి
కాహారం ముఖ్యంకదా? ఇదేమిటి ఇక్కడ భోజనం ఇట్లా
వుండిపోతుందేం?" అనీ.

దానికి భగవాన్ "ఉత్తర హిందూస్థానంలో
ముఖ్యంగా వాళ్లు చక్కెర, పాలు, గోధుమ, నెయ్యి మొద
లైనవి తింటారు. ప్రజలు సాత్వికంగా వున్నారా? ఎప్పుడూ
అక్కడ తగాదాలూ, హత్యలూ వింటాం. తంజావూరు ఆ
వైపున ఇంకా కారం తింటారు. అక్కడ ప్రజలు శాంతంగా
వుంటారు. ఏమంటారు?

"అంతేకాదు. ఈ ఆశ్రమం సాధకులకే కాదు, నన్ను
చూడవొచ్చే ప్రజలకి కూడా ఈ భోజనమే కద! అందరికీ

రుచించేట్టుగా వుండాలి. ఏ రుచీ లేకండా చప్పగా వుంటే వారికి సయించక యిబ్బంది పడతారు. కారం ఎక్కువ అనుకునేవారు పల్చగా కలుపుకోవచ్చు" అన్నారు.

ఆశ్రమంలో పనిచేసేవాళ్ళు భగవాన్ హాలులోకి పోవడం కాని, ధ్యానంలో కూచోడానికిగాని చిన్నస్వామి యిష్టపడరు; మాకు పనిలేని సమయాల్లోకూడా, మేము కళ్లు మూసుకుని కూచోడం వొప్పుకోరు ఆయన. భగవాన్ హాలులోకి కూడా వెళ్ళనీరు. ధ్యానంలో పడితే సరిగా పని చెయ్యరనో ఏమో ఆయన ఉద్దేశ్యం. మాకేమో ఎప్పుడు భగవాన్ దగ్గిర కూచోవాలనీ, చూడవొచ్చిన వారికి ఆయన చేసే వుపదేశాలు వినాలనీ ఉండేది. ఒకవేళ మేము తప్పించుకుని భగవాన్ హాలులో కూచుంటే వెంటనే పిలిపించేవారు చిన్నస్వామి. మేము మొండికేసి వెళ్ళకపోతే, నన్ను వొదిలి వెళ్లలేరు అన్నట్లు మా వంక చూసేవారు భగవాన్. కాని రాత్రి భోజనాలైనాక; ఆశ్రమంవారం చుట్టూ హాల్లో కూచునే వారం. అప్పటికి కొత్తవారు వెళ్లిపోతారు. మేమే వుండే వాళ్ళం. ఇంటివాళ్ళందరమూ పనులు ముగించుకుని ఇంటిపెద్ద చుట్టూ కూచున్నట్టుండేది. ఆ కాస్తసేపటిలోనే మా యోగ క్షేమాలు విచారించడం, ఉపదేశమివ్వడం జరిగేవి.

కాలం గడిచిన కొద్దీ, వారి గొప్పతనం గ్రహించాను. మొదట్లో మహనీయులని వారివద్ద చేరాను. తరవాత తెలి



సింది-నాకు మోక్షం కావలసి వొస్తే అది వారి చేతులో వుందని.

వంటింట్లో ఆయన వద్ద పని చేసేప్పుడు త్వరలోనే తెలుసుకున్నాను—నేను చేసేది పని కాదనీ, అదంతా ఆధ్యాత్మిక శిక్షణ అనీ. ఆధ్యాత్మిక విద్యలో మొదటిదీ, అన్నిటికన్న ముఖ్యమైనదీ, గట్టిగా తలచుకుంటే ప్రతివారికీ సాధ్యమైనదీ గురువు ఆజ్ఞని అక్షరాల పాటించడం.

ఒకసారి చాలా బరువైన ఇనప బాణలిలో పచ్చడికి తిరగమాత వేస్తున్నారు భగవాన్. నేను పక్కన నిలబడి వున్నాను అందిస్తో. గాడి పొయ్యి భగ్గు భగ్గుమని మండి పోతోంది. తిరగమాత మాడిపోయేట్టుంది. భగవాన్ 'నన్ను బాణలిని చప్పున దించెయ్యమన్నారు, ఏ ఆలోచన లేకండా.

నా చేతిలో ఏమీ లేదు. కాగే బాణలిని గట్టిగా పట్టుకుని నా బలమంతటితోనూ ఎత్తి కింద పెట్టాను. వేడిని పట్టుకున్నాననే ఆశ్చర్యమూ రాలేదు నాకు, కొంచెం కూడా వేడి అని తెలియలేదు. తరవాత ఎప్పుడో ఆశ్చర్యం వేసింది, ఎట్లా దించానో? అని. గురువుని విశ్వసించి వారి ఆజ్ఞ ప్రకారం నిప్పులో దూకినా శిగపూవు వాడదు కదా అనుకున్నాను. మహమ్మదీయులు పీర్లు పట్టుకుని నిప్పుల్లోకి దిగడం కాని, సీత అగ్నిలో ఉరికి కాలకుండా బైటికి రావడం గాని ఆశ్చర్యం ఏముంది?

చాడ్విక్‌గారికి జరంగా వుంది. "ఆయనకెట్లా వుంది?" అని అడిగారు భగవాన్.

"ఇవాళ ఆయన దగ్గరికి వెళ్ళలేదు. నిన్న సాయంత్రం జరంగా వుంది" అన్నాను.

"వెళ్లి చూసిరా. ఇన్నివేల మైళ్ల దూరం, తన దేశం కాని దేశంలో మనని నమ్మి మనం తనవారమని కదా వున్నారు. మనం ఎంత జాగ్రత్తగా చూడాలి" అన్నారు.

వెంటనే వెళ్లి చూశాను. ఆయనకు జరం లేదు.

నేను కొన్నాళ్లు భగవాన్‌కి భోజనం వడ్డించేవాణ్ని. ఆయనకు వడ్డించటం మెలకువలు తెలుసుకుని జాగ్రత్తగా వడ్డించేవాణ్ని. అయినా కోప్పడేవారు. "చూడు-ఇది ఎంత వడ్డించావో! ఎందుకింత?" అనేవారు. నేను ఎక్కువ వడ్డించనప్పుడు కూడా "నాకని ఇంత ఎక్కువ వేశావు. తక్కిన వారికన్న నాకెందుకు?" అనేవారు;

పక్కన కూచున్న దేవరాజ్ మొదలియార్ మొదలైన వాళ్లు "లేదే, మీకేమీ ఎక్కువ వడ్డించలేదే" అన్నా కూడా భగవాన్ ఊరుకునేవారు కాదు.

"లేదు, లేదు. వాడి అహం వేస్తోంది" అనేవారు చాలా కోపంగా. అట్లా ఎందుకు నన్ను అంటున్నారో నాకు తెలీక పోయినా, ఆ కోపం ఒక ఆశీర్వచనంగానే తీసుకునే వాణ్ని.



రాత్రి మిగిలి పోయిన పదార్థాలు మర్నాడు ఉపయోగించడమూ, పొద్దున్న వారు రాకముందే భగవాన్ వాటిని పొయ్యి మీద పెట్టడమూ, వంటింట్లో పనిచేసే స్త్రీలకి అభ్యంతరంగా వుండేది. కాని వారినేమీ లక్ష్య పెట్టకండా, ఆ సంగతి తనకి తెలియనట్టే భగవాన్ ఏదీ వృథా చెయ్యకండా ఉపయోగ పరిచేవారు. క్రమంగా వారి గోల ఎక్కువైంది.

ఒకరోజు చిన్నస్వామి కొడుకు ఇంట్లో పుణ్యావాచనం జరుగుతోంది. ఆ నాడు భగవాన్ ఆ స్త్రీలతో "మీరు ఇంటింటికి పుణ్యావాచనం చేయించుకోండి. నేను వెళ్తున్నాను" అని వంటింట్లోనుంచి వెళ్లిపోయారు. మళ్లీ వంటింటికి రాలేదు. వంట చెప్పలేదు. ప్రతిదినం ఎవరో వెళ్లి, ఏం వంట చేస్తారో చెప్పేవారు. వారు దానికి "సరి,సరి" అనేవారు.

ప్రతివారికి భగవాన్ సాక్షాత్తు ఈశ్వరుడనే విశ్వాసం కాని, ఈశ్వరుడే వారి ఆచారాలకు విరుద్ధంగా చేస్తే ఈశ్వరుడికన్నా ఆచారాలే ఎక్కువవుతాయి.

ఆ ముందు రోజు వండిన పదార్థాలు ఉపయోగపడి కాలనే పిసినారితనం (frugality) ఆయనకి పట్టిందా? మా ఆచారాలకి విరుద్ధంగా చేసి మమ్మల్ని నొప్పించడం కరుణామూర్తి ఉద్దేశమా? ఆచారమనే ఇరుకునించి తప్పించడానికే వారు ఆ విధంగా చేసింది? Man was not made for the Sabath!

ఒకసారి సాంబారులో కంద ముక్కలు ఉడకలేదు.

వంటింటి వారు భయపడ్డారు. ఉడకనప్పుడు భగవాన్‌తో చెప్పితే చాలు ఉడుకుతాయి అని ఎన్ని నిదర్శనాలవల్ల తెలియ చేశారో భగవాన్. కాని మానవుడి అహం అడ్డం. ఉడక లేదనే సంగతి ఎక్కడ తెలిసిపోతుందో అనే భయంతో ఆ ముక్కలు భగవాన్‌కి వడ్డించవద్దన్నారు. వారి విస్తట్లో వడ్డిం చకపోతే వారికి తెలియదనే ఉద్దేశం. ఆ నిముషానికి వారు సర్వేశ్వరుడని మరుస్తాం.

వంటింటి వారి మాట ప్రకారం నేను భగవాన్‌కి పులుసు వొడ్డిస్తే కంద ముక్కలు పడనీలేదు.

తరువాత భగవాన్ మాధవస్వామితో అన్నారట, కొండ మీదికి వెళ్ళినప్పుడు, "నాకు సాంబారులో ముక్కలు వేయలేదు చూసావా?" అని.

మాధవస్వామి నన్నడిగారు. "ఉడకలేదు. దురద అని స్వామికి వడ్డించలేదు" అన్నాను.

తరువాత భగవాన్ అన్నారు: "తక్కిన వారికి దురద ముక్కలు వడ్డించవచ్చునా? అది న్యాయమైన పనేనా?" అని.

ఒకసారి చంద్ర గ్రహణం. సాయంత్రం 5-30 గంటలకే భోజనానికి గంట కొట్టారు, భోజనాలు గ్రహణానికి ముందే తినాలని. ఆ సంగతి ముందే భగవాన్‌తో చెప్పలేదు.

అందరూ వెళ్ళి కూచున్నారు, విస్తళ్ళ ముందు.

"ఆ గంట ఏమటా?" అని అడిగారు భగవాన్.



"గ్రహణానికి" అని చెప్పారు.

విని "అట్లాగా" అని ఊరుకున్నారు.

భగవాన్ భోజనానికి లేవలేదు. భోజనానికి పిలిస్తే వినిపించుకోలేదు. చూసి చూసి ఎవరో ఇద్దరు ముగ్గురు తప్ప మిగిలినవారు భోజనం చెయ్యకుండానే లేచి వచ్చారు.

భోజనానికి మామూలు గంటకొట్టే సమయానికి 7-30 కి భగవాన్ గడియారం చూశారు. కాని ఎవరూ మాట్లాడలేదు. వారిని ఎవరూ పిలవలేదు. గంట కొట్టలేదు.

గ్రహణం అయిపోయింది.

9-30 కి భోజనానికి గంట కొట్టారు. భగవాన్ లేవలేదు. అందరూ వెళ్ళి భోజనం చేశారు. భగవాన్‌కి ఆ రాత్రి భోజనం లేదు. హృదయమున్న వాళ్లు "భగవాన్ భోజనం చెయ్యలేదు. భగవాన్ భోజనం చెయ్యలేదు" అని గొడవ పెడుతున్నారు.

ఎప్పుడూ చిన్నస్వామి "భగవాన్‌కి లోకం సంగతులు ఏం తెలుసు?" అన్నట్టుండేవాడు-ఆశ్రమాన్ని నడిపించవలసిన భారం తనదనీ, భగవాన్‌కేమీ తెలియదనీ.

భగవాన్ భోజనం చేస్తుండగా ఒకరు అడిగారు "తమ విస్తట్లోంచి కొంచెం ప్రసాదం పెట్టండి" అని. దానికి భగవాన్ "మీకు ఇస్తే తక్కినవారు అడుగుతారు. అందరికీ ఇస్తే తినడానికి నాకేం మిగులుతుంది?" అన్నారు.

ఆశ్రమానికి వచ్చిన మనుష్యులు వెంటనే వెళ్ళక పోవడమూ, ఆశ్రమంవారు వెళ్ళమని చెప్పవలసిరావడం, మనుషుల గొప్పలనిబట్టి సదుపాయాలు మారటం, కులాల కలతలూ ఎక్కువైనాయి. ఒకసారి భగవాన్ అన్నారు, "అసలు ఈ భోజనాలు వడ్డించటమనేది మానేసి సాంబారు, పెరుగు అన్నం పొట్లాలు కట్టి ఒక్కొక్కరికే ఇస్తే ఏ గొడవా వుండదు. భగవాన్ కోసం కాక భోజనానికి, దాని రుచికి మనుష్యులు చేరుతున్నారనే ఘోష వుండదు. ఆ పొట్లాలు తింటే, భోజనానికి, రుచికి ఆశించరు. భగవాన్ కోసం వచ్చినవారే ఉండిపోతారు. ఇక పొండి- అని మనుషుల్ని పంపవలసిన అవసరమూ వుండదు."

కాని ఆశ్రమాధికారులు అంగీకరించలేదు. ఆ పొట్లాలు తిని, పైగా ఆశ్రమానికి డబ్బు ఎవరు చెల్లించుకుంటారు?

---

# రాయరు

**1912** లో నేను కడలూరులో ఉండేవాడిని. అక్కడే
చెప్పుకుంటున్నారు, ఒక బాలుడు తిరువణ్ణామలై
వచ్చి సన్యసించి తపస్సు చేస్తున్నాడని. నేను సాయంత్రము
నాలుగు గంటలకి వారిని చూడడానికి వెళ్ళాను. వారు విరూ
పాక్ష గుహ ముందు కూర్చుని వున్నారు. రాత్రిపడేదా
కూర్చుండి వెళ్ళిపోయాను.

తరువాత పన్నెండేళ్ళు గడిపాను. అంతకాలము
విరూపాక్ష గుహ, అరుణాచలం నా మనస్సులో ఎప్పు
ఉండనే ఉన్నాయి. ఈ లోపల నా తండ్రి తప్ప తక్కిన 'నా'
అనే వారంతా పోయినారు.

నేను అప్పుడు కానన్ ఘూడ్ దగ్గర ఒక ఊళ్ళో ఆఫీసులో
పనిచేస్తు ఉండేవాణ్ణి. స్వామి రామదాస్ ఇంకా బైరాగిగా
తిరుగుతూ ఉండేవారు. ప్రక్క స్టేషన్ ఊళ్ళో వారాని
సారి వారిని కలుసుకునే వాణ్ణి. ఆ రోజు ఆయన అక్కడ కనప
లేదు. ఎక్కడ అని విచారించగా సముద్రం ఒడ్డున తిరు
తున్నట్టు తెలిసింది. నేనూ వెళ్ళాను.

అప్పటికే ఆయన ఓ పల్లె గుడిసెలోనికి వెళ్ళి
సమాధిలో కూర్చున్నారు, నేను అక్కడే ఎదురుగా కూర్చు



న్నాను. రాత్రి అవుతుంది. ఆయన "నీకు రైలు వేళ అయింది.
ఇంక వెళ్ళు" అన్నారు.

ఆయన ఏ అర్థంతో అన్నారో? మర్నాడు మధ్యాహ్నం
ఆఫీసులో కూర్చుండి ఉండగా నాకు ప్రశ్న వచ్చింది.
"ఎందుకు ఈ ఉద్యోగం చేస్తున్నాను? ఎవరికోసం?" అని.

నా తండ్రి తప్ప నా కెవరూ లేరు. ఆయనకు నేననవ
సరం అనుకున్నాను. రాస్తున్న కలం బల్లపైన పెట్టాను. నడక
మీద బైలుదేరాను. నా వెంట ఏదీ తెచ్చుకోలేదు. నా
వస్తువులకీ, నాకూ ఏం సంబంధం?

అట్లా నడక సాగించాను. ఎక్కడికో నడుస్తున్నాను.
పళనికి వచ్చాను. తోవలో నే నెవరినీ, దేనికీ అడుగలేదు.
భోజనం అడక్కుండానే పిలిచి పెట్టారు. పళని దాటిం తరు
వాత ఒక గ్రామంలో నాకు భోజనం లేదు. రాత్రికి, రోడ్డు
ప్రక్క ఆ వూరి అమ్మ వారి గుడిలో పడుకున్నాను చీకట్లో.

కొంతసేపటికి ఆ ఊరి కరణం వచ్చి, "నాకు తెలిసింది-
ఎవరో భోజనం లేకుండా గుళ్ళో పడుకున్నారని. అందుకు
వచ్చాను. భోజనానికి రండి' అని పిలుచుకు పోయినాడు.

నా చరిత్ర విని "మీరు ఇంక నడవటానికి వీల్లేదు. ఎక్క
డికి వెళ్ళాలి?" అని అడిగినారు.

అప్పటికి నా కాళ్ళు బాగా వాచిపోయి ఉన్నాయి.
మదనాపల్లి దాకా పంపమన్నాను. టిక్కెట్టు కొని ఇచ్చారు.

అక్కడ నా మిత్రులున్నారు. వారు నా స్థితి చూచి నన్ను పోనివ్వక వారం రోజులుంచుకొని నా కాళ్ళ బాధ నివృత్తి చేశారు. వారు రైల్లో నన్ను తిండివనం పంపారు.

అక్కడ నా బంధువులున్నారు. వారి సహాయంతో వింధ్య పర్వతాలలో తపస్సుకి పోవాలని నా ఉద్దేశ్యం. తీరా వచ్చాకదా, భగవాన్‌ని చూచిపోదామని, కొంత డబ్బు తీసికొని అరుణాచలం వచ్చాను.

ఆ విధంగా రప్పించుకున్నారు భగవాన్ నన్ను తన దగ్గరకు.

వచ్చేసినాడు!

అప్పటికి భగవాన్ కొండదిగి తల్లి సమాధి దగ్గర ఉన్నారు. మూడు గంటలకివచ్చి, భగవాన్ ఎదురుగా కూర్చున్నాను. మురగనార్ వచ్చారు. అప్పుడు "ఉన్నది నలుబది" అచ్చుకి తయారు చేస్తున్నారు. హోటల్లో భోజనం, స్వామి దగ్గర ఉండడం. ఇట్లా మూడు రోజులు గడిపాను.

ఆశ్రమంలో చిన్నస్వామి వంట. నాలుగో రోజున ఆశ్రమంలో ఆ ఒక్కరోజూ భోజనానికి ఉండమన్నారు. నేను ఎందుకో లోపలికి వెళ్ళేటప్పటికి చిన్నస్వామి పొయ్యి అలుకుతున్నారు.



నేను అలికి పెట్టుతానన్నాను. "నీకు చేతనౌనా?" అన్నారు. నేను అలికాను. మెల్లిగా ఆయనకి వంటలో సహాయం ప్రారంభించాను. ఆయన సంతోషించి నన్ను ఆశ్రమములో తక్కిన వారితో కలిసి ఉండి పొమ్మన్నారు.

నాలుగవ రోజున భగవాన్‌కి నా జీవిత చరిత్ర చెప్తున్నాను. వారు అంతా శ్రద్ధగా విని "సరిదా-పో" అన్నారు.

ఆ రోజునుండి భగవాన్ వంటింటిలోనికి వచ్చారు. అప్పటినుంచీ మేమిద్దరమే వంట. చిన్నస్వామి వంటింటి ఛాయలకు రావడం మానేశారు.

కొన్ని రోజుల్లో ప్రతివారూ నన్ను ఆశ్రమంలో ఉండి పొమ్మనేవారే.

గణపతి శాస్త్రి గారు వచ్చారు. అప్పుడే ఉపదేశసారం అచ్చయి వచ్చింది. నన్ను చూచి "వారు ఎవరు" అని అడిగారు. దానికి భగవాన్ "రాయరు. ఇక్కడకు వచ్చిఉన్నాడు" అన్నారు.

"మంచి మనిషి. ఉండనీ" అన్నారు శాస్త్రిగారు. సాయంకాలము గణపతి శాస్త్రిగారు ఉపన్యాసా లిచ్చేవారు. ఊరివారందరూ వచ్చి వినేవారు.

అట్లా నవరాత్రాలదాక ఉన్నాను. కానీ, నేను వింధ్య పర్వతాలకి వెళ్ళే ప్రయత్నం మానలేదు. "నేను వెడు

తున్నాను'' అన్నాను. అందరూ వద్దని చాలా బ్రతిమాలారు. కానీ, వెళ్ళిపోయినాను.

తిండివనం వెళ్లాను. రెండు రోజులు నా మనసు మనసుగా లేదు. తిరిగి ఆశ్రమానికి వచ్చాను. అందరు సంతోషించారు. భగవాన్ కూడా ''రాయరు వచ్చేసినాడు'' అన్నారు.

అట్లా భగవాన్ దగ్గిర ముప్పై రెండేళ్ళు వుండి పోయినాను. ఈనాడు నాకే కోర్కెలూ లేవు. ఎప్పుడూ శాంతిలో వుండేట్టు నన్ను అనుగ్రహించారు భగవాన్.

——

# నారాయణయ్యర్

మా పూర్వులనుంచీ మా ఇంట్లో పూర్వాచారము, ఈశ్వర చింత మా సంప్రదాయము. మా తాతగారు ఎప్పుడూ ప్రతి నిమిషమూ 'కృష్ణ కృష్ణ, రాధాకృష్ణ' అనే జపం చేసే వారు. మా పూర్వీకులందరికీ సునాయాస మరణం లభించింది పుణ్యక్షేత్రాలలో. పంచనదంలో పోయినారు.

నాకు ఆరో ఏట ఉపనయనం చేశారు. ఆ నాటినించి నా తండ్రి నన్ను తన ప్రక్కన కూర్చో పెట్టుకుని నా చేత త్రికాల సంధ్యా వందనం చేయించేవారు. అన్ని గొప్ప క్షేత్రాలకీ తీసుకొని వెళ్ళి పర్వదినాలలో ఈశ్వర దర్శనాలు చేయించారు. నా తల్లి ఎప్పుడూ తులసి పూజ చేసేది. తండ్రి సంధ్యా వందనం చేయిస్తే, తల్లి తులసి ప్రదక్షిణాలు చేయించేది. ఏదైనా సరే ఏ దేవతకో నైవేద్యం పెట్టంది తాను తినదు, మాకు పెట్టదు. ప్రొద్దస్తమానం 'రాం,రాం'అంటూనే ఉండేది.

1913 దసరా సమయంలో నా తండ్రి నన్నూ, మా తల్లినీ తిరువణ్ణామలై తీసుకొని వచ్చారు. అప్పుడు భగవాన్ విరూపాక్ష గుహలో ఉన్నారు. వారు గుహలో నుంచుని ఉన్నారు. చేతిలో సగము తెరిచి ఏదో సంస్కృత పుస్తకం ఉంది. వారికన్న నన్ను అప్పుడు ఎక్కువగా ఆకర్షించింది



అరుణాచలేశ్వర దేవాలయము. ఆ తొమ్మిది రోజులూ ఆలయంలోనే ఉన్నాను. అన్ని ఆలయాలు చూశాను. ఏదీ ఈ ఆలయంతో సాటికావు నాకు.

1935 నుంచీ ఎప్పుడూ శివస్తోత్రాలు చేస్తో ఉండేవాణ్ణి. నిద్రలో కూడా ఆ స్తోత్రాలే పలవరించే వాణ్ణి. ఆ సంవత్సరమే నా కుమారుడు బానమరది దీపోత్సవానికి తిరువణ్ణామలై వెళ్లారు. వాళ్ళు తిరిగివచ్చి నాకు చెప్పారు, మహర్షి గారి చుట్టూ ఆశ్రమం ఏర్పడ్డదని. ఆశ్రమ పరిస్థితులువిని నా చేతనైన సహాయం చెయ్యాలనే బుద్ధి పుట్టింది నాకు.

శ్రీ రామకృష్ణ పరమహంస అన్నారుట-నదిలో వరదలు వచ్చినప్పుడు రాళ్ళనీ, చెత్తనీ కూడా ఊడ్చుకుంటో సముద్రంలో ఎట్లా కలిపేస్తోందో అట్లానే అవతారం భూమికి దిగినప్పుడు పరిపక్వం కానివారు కూడా వారివల్ల ముక్తికి లాక్కు-పోబడతారని.

నాకు వారున్నప్పుడు ఉండే అదృష్టం లేకపోయిందే అని దిగులు పడేవాణ్ని. మూడువందల ఏళ్ళ తరువాత ఆయన తిరిగి జన్మిస్తా నన్నారు. ఆ సమయంలో నేనూ పుట్టి వారి శిష్యుణ్ణయే భాగ్యం కలగాలని కోరుకునే వాణ్ని.

భగవాన్ చరిత్ర చదివినప్పుడు వారిని చూడాలనే ఆతృత కలిగింది. కానీ శ్రీ రామకృష్ణుని మించిన గురువు గారౌతారనే సంగతి తెలీదు నాకు.

1936 లో నా కొక కల వచ్చింది. మా ఆఫీసులో సూపరింటెండెంటు నన్ను పిలుస్తున్నారని కబురు వచ్చింది. వెళ్ళి

చూస్తే ఆయన బదులు ఆ స్థలంలో పెద్ద శివలింగం ఉంది. అది భగవాన్ నుంచి పిలుపుగా గ్రహించాను.

మాకు డాక్టరు సర్టిఫికెట్టు ఉంటేనే గాని ఒక్క రోజు కూడా శెలవు దొరకడం కష్టమైనా దొరికింది అప్పుడు.

నేను వెళ్ళేప్పటికి భగవాన్ కళ్లు మూసుకొని ఉన్నారు హాల్లో. ఏం దురదృష్టమా అనుకున్నాను. అటు తరువాత ఎవరూ చెప్పకుండానే ప్రసంగంలో నన్ను చూపి 'ఆయన మద్రాసు నుంచి వచ్చారు' అన్నారు.

సాయంత్రం నా వంక అయిదు నిమిషాలు గట్టిగా చూశారు. నా శరీరం వణికింది. చెమటలు పోశాయి. ఊపిరి లోతుగా వెళ్ళింది. అది అసాధారణమైన అనుభవం నాకు.

ఇంటికి వెళ్ళాక పదిహేను ఇరవై రోజులవరకు గాలిలో నడుస్తున్నట్టుండేది. అటు తరువాత దాదాపు ప్రతి నెలా వస్తున్నాను ఆశ్రమానికి. ఎట్లాగో శలవు దొరికేది.

నేను ఎప్పుడూ సంసారానికి అంటుకు ఉండేవాణ్ణి కాను. ఎప్పుడూ నా ప్రార్థన మోక్షంకోసం. నాకన్నీ ఉన్నాయి. కోరుకోవలసింది ఏదీ లేదు. 50 ఏళ్ళకే నేను పని నుంచి విరమించదలచుకుని కాగితాలు పంపాను. అంతా సిద్ధమైన తరువాత నా భార్యతో చెప్పాను. ఆమె ఒకటే ఏడుపు, పిల్లలు చిన్నవాళ్లు- ఎట్లా గడుస్తుందని. నేను భగవాన్ని ప్రార్థించాను, ఆమెకు వైరాగ్య మిమ్మని.

ఆమెకు ఒక కల వచ్చింది.



మెట్లు కనబడ్డాయి. ఇద్దరు ముగ్గురు స్త్రీలతో ఆమె ఎక్కడికో పోబోతోంది. ఇంతలో ఒక సన్యాసి కూడా వాళ్ళతో మెట్లెక్కుతున్నారు. చటుక్కున వెనక్కి తిరిగి, "ఎవరు ఏడుస్తున్నది?" అని అడిగారు, ఆమెను చూచి. వీపు మీద తట్టి "నేను చూస్తాను కదా? నీకెందుకు భయం ?" అన్నారు.

మర్నాటి నుంచీ ఆమె ఏడవలేదు. ఉద్యోగం మాని కూడా వూళ్ళో స్థిరపడ్డాను. బైరాగులకి నిరంతరం అన్నదానం చేస్తూ, సంధ్య స్తోత్రాలు జపాలతో పిల్లలకి చదువు చెపుతూ కాలం గడుపుతున్నాను.

## జయంతి

1940లో నాకు ఆశ్రమంనుంచి జయంతికి మామూలు ఆహ్వానం వచ్చింది. నేను వెళ్లలేకపోయినాను. ఆ రోజు నేను పూజ చేస్తున్నాను, పగలు పదిన్నరకు. భగవాన్ నాకు దగ్గిరైనట్టు మనస్సులో ఒక సన్నిధిలాగు ఏర్పడ్డది. ఏమిటా ఇది అనుకున్నాను. ఆ రోజే జయంతి అని జ్ఞాపకం వచ్చింది. మర్చిపోయినాను. కాని భగవాన్ నన్ను మరవలేదు.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది. జయంతి రోజున ప్రతి సంవత్సరమూ పగలు పదిన్నరకు భగవాన్ ముఖంలో ఒక [illegible]ప్రత కనిపించేది. అక్కడకు రాలేని భక్తులకు తన జయంతి అనుగ్రహాన్ని భగవాన్ పంపుతున్నారని నాకప్పుడు అర్థమయింది.

తరువాత ఒకసారి భగవాన్‌తో నా జయంతినాటి అను
భవం చెప్పి, నేను తెలుసుకున్న సంగతిని కూడా చెప్పు
కున్నాను. ఏమిటీ? అని చాల శ్రద్ధగా కుతూహలంతో
విన్నారు భగవాన్. నా వ్యూహ సాఫీ అయింది.

1941 లో నేను నా భార్య కాశీ గయా క్షేత్రాలు
తిరిగాము. ఆ సంవత్సరం చివర నాలో కారణంలేని అశాంతి
బైలుదేరింది. అది అరుణాచలం నుంచి పిలుపుగా గ్రహిం
చాను. నేనా వూళ్ళో చేస్తున్నదేమిటనే ప్రశ్న కలిగింది. శివ
క్షేత్రమైన అరుణాచలంలో భగవాన్ దగ్గరగా ఉండాలని
నిశ్చయించుకున్నాను. సులభంగా మేము అందరం అరుణాచలం
వచ్చేశాము. ప్రతిదినము వెళ్ళి భగవాన్ హాల్లో కూర్చునే
వాణ్ణి. కూర్చోగానే భగవాన్ అనుగ్రహం నన్ను చుట్టుకునేది.
కూర్చోగానే భగవాన్ నన్ను కళ్లుమూసుకో అన్నట్టు తోచేది.
మాతలు పడగానే ఒక అరగంట ఒళ్ళు తెలియని స్థితిలో
ఉండేవాణ్ణి.

ఒక రోజు నా మనసు ఇటూ అటూ తిరుగుతోంది.
మతి స్థిమితంలేని ఒక కుర్రాడు రోజూ నమస్కరించేవాడు.
ఆ రోజు భగవాన్ అతనితో అన్నారు: "ఏం ప్రయోజనం
నమస్కారం చేసి మీరు! నమస్కార మంటే మనస్సును
కట్టి వెయ్యడమన్న మాట" అని.

ఆ మాటలు నాలో గట్టిగా పనిచేశాయి. 'నేనెవడను?'
అనే సాధన నేనూ, నా భార్య చేస్తుండేవాళ్ళం.



1942—నా కూతురుకు పెళ్ళియీడు వచ్చింది. ఒక
రికి వ్రాస్తే, అతను తన అక్కలకు పెండ్లి కానిది తన పెళ్ళి
వీలు లేదన్నారు. ఆ ఉత్తరం భగవాన్‌కి చూపాను. కొంత
సేపు ఆ ఉత్తరాన్ని అట్లానే పట్టుకొని "అవుతుంది. అవుతుంది"
అన్నారు. అట్లానే ఆ అబ్బాయే వొప్పుకున్నారు. సునా
యాసంగా పెండ్లి జరిగిపోయింది.

1944—రిభుగీత ఒకటే చదువుతో ఉండేది నా
భార్య, తన మరణం ముందు. స్ఫోటకం వచ్చి చచ్చిపోయింది.
ఆ రోజంతా పెద్దవాన. దహన సంస్కారం వీల్లేదు. భగవాన్
ఆశ్రమం వారితో నాకు సహాయం చెయ్యమని చెప్పారు:
"వానా? వాన ఆగిపోతుంది!" అన్నారు. సరిగా శవాన్ని
ఎత్తేందుకు సిద్ధమైన నిమిషాన వాన ఆగింది. పూర్తిగా
దహనం కాగానే తిరిగి ప్రారంభమయింది.

మర్నాడు భగవాన్ అడిగారు నన్ను, "దహనానికి
వాన ఏమైనా అడ్డు వచ్చిందా?" అని.

### అమ్మ దేవునిలో కలిసింది

కొన్నాళ్ళ తరువాత నా కూతురు వచ్చి హాలులో
పాడుతోంది. మధ్యలో భక్తి ఆవేశంవల్ల పాట ఆపి, కొంచెం
[illegible]పైన తరువాత తిరిగి ప్రారంభించింది. భగవాన్ హాల్లోంచి
బయటికి వస్తో బావి గట్టున నిలబడివున్న నా కూతుర్ని చూచి
"మధ్యలో ఎందుకు ఆపావు? నీ తల్లిని తలచుకొని దుఃఖం

వచ్చిందా? అరుణాచలేశ్వరుడిలో కలిసిన నీ తల్లి ఏడిస్తే వస్తుందా?'' అన్నారు.

భగవాన్ దేహం విడిచిన తరువాత రెండేళ్ళకి మా వూరికి వెళ్ళి తిరిగి వచ్చి అరుణాచలంలో స్థిరపడ్డాను. సాధన గాఢంగా సాగుతోంది. ప్రతి అడుగునా భగవాన్ నాకు మార్గం చూపుతున్నారు. తరుచు భగవాన్ రూపం కనబడుతోంది.

ఒకసారి నా కుమారుడు మద్రాసు నుంచి వస్తో ఉంటే నా కీళ్ళ నొప్పులకి ఒక తైలమూ, ఒక అరిష్టమూ కొని తెమ్మని గట్టిగా వ్రాశాను. అతను తేలేదు. అతని నిర్లక్ష్యానికి నొచ్చుకున్నాను. ఈ నొప్పుల సంగతి ఎట్లానా అనుకున్నాను. మర్నాడు కల్యాణసుందరం అయ్యరు సోదరుడు, సరిగా ఆ తైలమూ, ఆ అరిష్టమూ రెండు బుడ్లు తీసుకొని వచ్చి ఇచ్చాడు. విభ్రాంతుణ్ణయ్యాను. ఎట్లా తెచ్చావంటే "అవి ఉపయోగం లేకుండా ఇంట్లో పడివున్నాయి, మీకేమన్నా ఉపయోగం వుంటుందని తెచ్చాను సుందరం అయ్యర్ కావాలి ఇమ్మని అడిగినా ఇయ్యలేదు. మీ కోసమే తెచ్చాను, మీరే ఉపయోగించాలి'' అన్నారు. నాకు స్పష్టమౌతోంది తిరిగి, భగవాన్ ఎంత జాగ్రత్తగా తన భక్తుల్ని కనిపెట్టి ఉంటారో!

ఇంకోసారి కాళ్ళ నరం వుబ్బింది. ఇదేమన్నా ఎక్కువవుతుందా? ఎవరూ తోడు లేరే అనుకుంటూ ఉండగా



సుందరం అయ్యర్ వచ్చాడు. ఎందుకు వచ్చావంటే, ఎందుకు వచ్చాడో అతనికే తెలియదు. మర్నాడు లేవలేక పోయినాను. పదిహేను రోజులు నాకు సుందరం అయ్యర్ సేవ చేశాడు. తిరిగి భగవాన్ నా నిస్సహాయ స్థితిని ఎంత జాగ్రత్తగానో గమనించి మిత్రుడు వచ్చే ఏర్పాటు చేశారు.

ఈ సంగతులు అణ్ణామలై స్వామి డైరీనుండి తీయబడినవి. భగవాన్ దర్శనార్థం వచ్చినవారిలో ఒక అయిదేళ్ల కుర్రాడు ఉన్నాడు. అతను భగవాన్ దగ్గరగా వెళ్లి ఆయన వంకే భక్తితో చూస్తున్నాడు. భగవాన్ తన ఎడమ చేతిని ఆ అబ్బాయి తలమీద పెట్టి, ఏం కావాలి అని అడిగారు. అందుకు అతను స్పష్టంగా, స్థిరంగా నాకేమీ అక్కర్లేదు అన్నాడు. "అయితే ఇంకేం! నువ్వు మా జాతికి చెందిన వాడవన్న మాట!'' అని నవ్వారు. అప్పుడీ వృత్తాంతం చెప్పారు: "పచ్చయమ్మన్ కోయిల్లో నేను ఉండేప్పుడు నా కౌపీనం చిరిగి పోయింది; నే నెవరినీ ఏమీ అడగను. రక్కసముల్లు తీసుకొని ఒక చివర చీల్చి చిరిగిన గుడ్డలోనుంచి ఒక దారము తీసి ఎక్కించి ఆ ముల్లుతో చిరుగులు కుట్టుకునేవాణ్ణి. రెండు నెలలుపాటు పనిచేసేది ఆ కౌపీనం. ఎవరూ లేనప్పుడు దాన్ని ఉతుక్కునే వాణ్ని. నా అవస్థనుచూచి ఒక గొల్ల పిల్లవాడు వెక్కిరిస్తో ఉండేవాడు. ఇంతలో ఒక భక్తుడు చూచాడు నా కౌపీనం స్థితి. చూచి రెండు కౌపీనాలూ, అంగవస్త్రాలు తెచ్చి ఇచ్చాడు. నువ్వు

నీ సంగతేం పట్టించుకోకపోతే, బలవంతాన ఇచ్చి పోతారు. ఏమీ అక్కర్లేని వాళ్ళకి అవసరమైనవన్నీ వాటంతట అవే వస్తాయి" అన్నారు భగవాన్.

ఒక భక్తుడు కఠినమైన తపస్సు చెయ్యటానికి ఆ రాత్రి అడవిలోనికి వెళ్లాలని సంకల్పించి భగవానుని ఆశీర్వదించమని కోరాడు. భగవాన్ ఇలా అన్నారు: "నీవు వూరు వదలిపెట్టి పోగలవుగానీ, నీ మనసుని అక్కడే వదలిపోలేవు కద! నీ ఆత్మలో ఏకాంతంగా ఉండ కలిగితే ఈ వూళ్లోనే ఉండవచ్చు. అడవిలో ఉండడంతోనే సమానమౌతుంది. నీ ఆత్మని మరచిపోతే అడవిలో ఉన్నా, పట్టణంలో ఉన్నట్టే" అని చెప్పి నవ్వుతో తనకి జరిగిన కథని చెప్పారు.

## అడవికి పోయినా దేవుడే!

"నేను విరూపాక్ష గుహలో ఉండేప్పుడు అనే[క] మంది నాకు తినడానికి చాలా విధాలైన ఫలహారాలు విలువైన భోజనాలు తెచ్చిపెట్టేవారు. అవన్నీ తినలేక ఒక రోజు ఉపవాసం ఉండాలని సంకల్పించుకున్నాను. నా చుట్టూ ఉన్న వాళ్లని ఏమార్చి కొండమీద అడవి వెంట పడిపోయినాను. అడవి మధ్య ఏడుగురు ఆడ ప[డు]చులు వచ్చారు, నెత్తిమీద మూటలు పెట్టుకొని. ఒకరో గిలో వాళ్ళు ఆయనే స్వామిజీ అని చెప్పుకుంటున్నారు,



వాళ్ళు పరుగెత్తుకొని వచ్చి నన్ను కలుసుకొని "స్వామీ, రండి కూర్చోండి, కొంచెం ఫలహారం చేద్దురుగాని" అన్నారు. ఒకరు ఇడ్లీ, ఇంకొకరు రొట్టె- ఇట్లా ప్రతివారూ ఒక్కొక్క రకం ఫలహారం తీసి "ఇది నాది, ఇది నేను తెచ్చాను, మీ కోసం" అంటూ ఒకరికన్న ఒకరు పంతాలపైన నాచేత తినిపించారు. నేను తినగలిగినంత తిని "ఇది చాలా మంచి ఉపవాసము" అనుకున్నాను.

"వాళ్లని తప్పించుకోవాలని త్వర త్వరగా వెళ్ళిపోతున్నాను. "స్వామీజీ, మధ్యాహ్నం భోజనానికి సిద్ధంగా ఉండండి. మేము మిమ్మల్ని వదలము" అని నా వెనుక అరిచారు. వాళ్ళు ఒక దిక్కుకి, నేను ఇంకో దిక్కుకి వెళ్ళాము. ఇంక వాళ్లకి కనబడకూడదని నిశ్చయించుకున్నాను. బాగా అడవిలోకి వెళ్ళిపోయినాను. అలిసి ఒక చెట్టుక్రింద కూర్చున్నాను. మధ్యాహ్నమయ్యేప్పటికల్లా ఎక్కడనుంచి ఊడిపడ్డారో! ఆ ఏడుగురు కన్నెలు వచ్చారు.

"స్వామీ, నీ రెక్కడ ఉందో చూపండి త్వరగా. ప్రొద్దెక్కింది. మీకు భోజనం వడ్డించాలి" అన్నారు.

"ఇదేమిటి? ఇవాళంతా పండగ రోజు భోజనం బాగుందే?" అనుకుని పడమటి దిక్కున ఉన్న శోణతీర్థం దగ్గరకు వాళ్లని తీసుకొని నడిచాను. వాళ్ళు నన్ను కూచోపెట్టి ఆకులు పరిచి ఒకరినిమించి ఒకరు వడ్డించారు, చాలా మంచి

మంచి పదార్థాలన్నీ. నేనా విస్తరివంక చూస్తే "పొద్దున్న తిన్నదే మూడు రోజులకి సరిపోతుందే, ఇప్పుడివన్నీ ఎట్లా తినను ?" అనుకుంటూ కూర్చున్నాను. వాళ్లు "ఏమిటి చూస్తారుఅట్లా?మీముందు పెట్టినవన్నీ అణ్ణామలై రాణి ఉన్నామలై పెట్టినట్టుగా భావించుకొని తినండి" అన్నారు. భోజనమైనాక వాళ్లు "మేమెప్పుడూ ఇంతవరకు ఈ అడివికి రాలేదు. ఆకులు కోసుకుందామని వచ్చాము" అంటో మాయమైనారు. "ఎవరో భూమికి చెందని కన్యలు వీళ్లు" అనుకున్నాను. నేను కొండదిగి చుట్టూ తిరిగిపోతున్నాను రోడ్డువెంట. వెత్తిల మంటపందగ్గర అలిసి కూర్చున్నాను. కూర్చున్నానో, లేదో రామస్వామి అయ్యరు భోజనమూ మామిడి పళ్లరసమూ తెచ్చి "నేను విరూపాక్ష గుహకు వెళ్లాను. మీరు గిరిప్రదక్షిణం వెళ్లి ఉంటారని చెప్పారు అక్కడి వాళ్లు. కనక ఇటు ఎదురు వచ్చి మిమ్మల్ని కలుసుకొని ఇవి మీకు సమర్పించవచ్చును కదా అని వచ్చాను" అని తాను తెచ్చిన వాటిని నేను తినాలని ప్రతిమాలారు. జరిగిందంతా నేను ఆయనకి చెప్పినా, ఆయన ఒప్పుకోలేదు, నేను తిన్నదాకా. తప్పించుకో చూచినందుకు తగిన శాస్తి జరిగిందని నేను మెల్లిగా లేచి పొట్టభారంతో నడవలేక నడవలేక గుహకు చేరుకున్నాను. నీకు ఏది రాసి పెట్టివుందో దాన్ని తప్పించుకోలేవు" అని చెప్పారు.

---

# గౌరీ అమ్మాళ్

మా తండ్రికి సాధువులన్నా సన్యాసులన్నా భక్తి. మా
ఇంట్లో ఎప్పుడూ ఆధ్యాత్మిక వాతావరణం తాండ
విస్తూ ఉండేది. పిల్లలకి, మాకు మా తండ్రి స్తోత్రాలు, భగ
ద్గీత బోధిస్తూ ఉండేవారు. ఎప్పుడూ ఇంట్లో సాధువులో,
సంగీత పాటకులో ఉండనే ఉండేవారు. తన ఉద్యోగరీత్యా
తిరువణ్ణామలై వచ్చినప్పుడల్లా భగవాన్ దర్శనం చేసుకు
వారు నాన్న. నేనుకూడ ఆయనతో వెళ్ళేదాన్ని. అప్పుడు భగ
వాన్ విరూపాక్ష గుహలో ఉండేవారు. నా ఏడవఏట మొదట
భగవాన్ని కొండపైని చూచిన గుర్తు. నాన్నగారు నేర్పి
తేవారాన్ని పాడాను భగవాన్ ముందు.

నాకు పెళ్ళై తిరువనంతపురం వెళ్లాను. మాతండ్రి చచ్చి
పోయినారు. నా యిరువయ్యో ఏట తిరిగి వచ్చాను భగవా
దర్శనానికి. అప్పటికి భగవాన్ తల్లి సమాధియై ఆర్నెల్ల
తుంది. రెండు పాకలు మాత్రమే ఉన్నాయి. ఇద్దరు ముగ్గురు
మనుష్యులున్నారు వారి సమక్షంలో.

నే నెప్పుడూ రామకృష్ణ పరమహంస చరిత్ర,
బోధలు చదివేదాన్ని. పరమహంస కళ్ళు చూడడం నా
చాల ఇష్టం. వారి రోజులలో నేను బ్రతికి ఉండకపోతినే, వా
చూచే భాగ్యం నాకు కలుగకపోయెనే అని దిగులుపడేదాన్ని.

భగవాన్ని చూడగానే నాకు పరమహంస కళ్ళల



స్తున్నట్టనిపించింది. నా కోర్కెను ఈ విధంగా తీర్చారు
భగవాన్. నా 34 వ ఏట నా భర్త పోయినారు. సేలంలో
తల్లిగారి ఇంటికి వచ్చేశాను. అప్పటి నుండి ప్రతి నెలా
భగవాన్ దర్శనానికి వచ్చేదాన్ని.

నా భర్త పోయిన దుఃఖాన్ని జపంతో జయించాను.
తండ్రి నుంచి దక్షిణామూర్తి పైన భక్తిని నేర్చు
న్నాను. భగవాన్ని అడిగాను, నేను చేస్తున్న జపం సంగతి
- "మీకు అర్పించుకుంటున్నాను. ఇంక మీ శిష్యు
రాలిని. నన్నేం చెయ్యమంటారు?" అని.

"ఏదన్నాసరే జపంగాని, ధ్యానంగాని, ఆత్మ విచారణగాని
యొయ్య. ఏదీ చెయ్యక వూరికే ఉండకు" అన్నారు.

1940 లో మా అమ్మాయి సరోజకి టైఫాయిడ్
జ్వరం వచ్చింది. చాలా ప్రమాదమయింది. డాక్టరు కలవర
పడుతున్నాడు. భగవాన్‌కి వ్రాసాము. భగవాన్‌కి ఉత్తరం
అందుతుందనుకున్న సమయానికి జ్వరం తగ్గిపోయింది. ఆ
జ్వరం నడవవలసిన గడువు పూర్తి కాకముందే జ్వరం
పోయింది. డాక్టరు కూడ అది మహర్షిగారి మహిమయని
ఒప్పుకోక తప్పిందికాదు.

తిరుపుఘళ్ లో రెండు పాటలున్నాయి. ఒకటి పెళ్ళి
పాట. ఆ పాట భగవాన్ ముందు చదివితే ఆడ పిల్లలకి పెళ్లి
అవుతుందని నమ్మకం భక్తులకి. భగవాన్‌ని ఎవరన్నా పెళ్ళి
కావడానికి కటాక్షించమని అడిగితే "తిరుపుఘళ్ లో ఆ పాట
చదివితే పెళ్లి అవుతుంది అని పెద్దలు అంటారుగా! అది
చదవండి" అనేవారు.

అట్లానే రామస్వామి అయ్యర్‌గారి కూతురుకి పెళ్లి అయింది. రాజగోపాల్ కూతురికీ అట్లానే పెళ్లి జరిగింది.

ఆ తిరుపుఘల్‌లోనే ఇంకోపాట వుంది. తన పాపగా ఈశ్వరుణ్ణి తన చేతుల్లోకి రమ్మని అహ్వానించడం ఆ పాట. పిల్లలు కావాలని భగవాన్ని అడిగితే ఆ పాట పాడుకోమ్మనే వారు. మా అమ్మాయికి పెళ్లయి ఆర్నెళ్లయింది. పిల్లలు లేరు. ఇంక అసలు ఉండరేమోనని నేను తొందరపడి ఆ పాటని కాగితంమీద వ్రాసి, భగవాన్‌కి చూపి పాడుకోమని సరోజకి పంపాను. కొద్దిరోజుల్లో సరోజే ఇక్కడకువచ్చి భగవాన్‌ముందు ఆ తిరుపుఘల్ పాటని పాడింది.

ఇంటికి వెళ్లగానే గర్భవతి అయింది. కాన్పుకి ఈ వూరు వచ్చింది నా దగ్గరకు. మమ్మల్ని ఎరిగిన డాక్టరు భగవాన్ ముందే అన్నారు.

"ఆరేళ్లయిన తరువాత కడుపు వచ్చింది. జాగ్రత్త పడాలి. ఎందుకన్నా మంచిది. వేలూరు మిషన్ ఆసుపత్రికి తీసుకొని వెళ్లండి" అని, ఆ మాటలు భగవాన్ నుంచి వచ్చినట్టుగానే వినపడ్డాయి నాకు.

నెలలు నిండగానే వేలూరు వెళ్లి అద్దెకోసం ఇల్లు వెదికాను. ఆశ్చర్యంగా పూర్వం కావ్యకంఠ గణపతి శాస్త్రిగారు కాపురమున్న ఇల్లే దొరికింది. ఆ యిల్లు భగవాన్‌కి తెలుసు, నాయనగారు వర్ణించి చెప్పడంవల్ల. అది కాశీ విశ్వేశ్వర ఆలయం ఎదుటగా ఉంది. ఇంటినించి విశ్వేశ్వరుడు ఎప్పుడూ దర్శనమిస్తో ఉంటారు.

రెండవ రోజున ఆ ఇంటికి ఎటు తిరగాలో తెలియక



కూచుని ఉన్నాను. ఎవరో కొత్త ఆయన వచ్చి నన్ను [illegible]లంలో ఎరుగుదునని పలకరించి, ఎందుకు అట్లా నిలుచున్నానో అడిగి, నన్ను ఇంటిదగ్గర దింపాడు. తిరిగి ఆయన్ని చూడలేదు నేను. ఆయన ఎవరైనా నాకు అది భగవాన్ "నేను నిన్ను కనిపెడులోనే ఉన్నాను, భయపడకు" అన్నట్టు అనిపించింది.

కాన్పు కష్టమయింది. పిల్లను పొట్టలోనే ముక్కలు చెయ్యాలన్నారు. దిక్కు భగవానే. ఆస్పత్రి డాక్టరు గొప్పవారు. అన్ని పరికరాలు ఉన్నాయి. కాని మానవ ప్రజ్ఞకు అతీత మన్నారు డాక్టరు. భగవాన్‌కి టెలిగ్రాం ఇచ్చాము. భగవాన్ పటమున్న తాయత్తుని నొప్పులు వస్తున్నంతకాలం సరోజ చేతుల్లోనే పట్టుకొని ఉంది. కత్తులు ఉడకేస్తున్నారు డాక్టరు...అతి ఆశ్చర్యంగా మామూలు కాన్పయింది. డాక్టర్లుకూడ మహాత్మ్య మన్నారు.

కాన్పు తరువాత సూతికా జ్వరం వచ్చింది. భగవాన్‌కి వ్రాశాను. వెంటనే తగ్గిపోయింది. నా మనుమడు కొంతకాలం భగవాన్ దగ్గర పెరిగాడు. అల్లరివాడు. సరాసరి భగవాన్ దగ్గరకు వెళ్లి చనువుగా మాట్లాడేవాడు. ఆయన అతనిపైన అంత ఆదరం కనపర్చేవారు.

అతనికి తొమ్మిదేళ్ళు వచ్చిం తరువాత కాలుమీద ఏదో వ్యాధి ప్రారంభించింది. చూస్తూ ఉండగా తొడవేపు పాకుతోంది. చాల బాధ, జ్వరం. డాక్టరు తనకి వైద్యం తెలీదన్నాడు. తొడవరకు వచ్చింది. కుర్రవాడు బ్రతుకడన్నాడు. భగవాన్‌కి టెలిగ్రామ్ ఇచ్చాను. మర్నాటికి ఏమీ లేదు.

తరువాత భగవాన్ పోయేముందు 8 సంవత్సరాలు ఇక్కడే ఉండి పోయినాను, రమణ నగర్‌లో ఇల్లు కట్టుకుని. అవి చాల గొప్పసంవత్సరాలు నాజీవితంలో. కాలం ఎంత మధురంగా గడిచిందో! మాకళ్ళముందు ఎన్ని మహాత్మ్యాలు జరిగేవో!

ఒకసారి డాక్టరు శ్రీనివాసరావు భగవాన్‌తో అన్నారు: "భగవాన్, ఆరోగ్యానికి మీరు అనాసపండు తింటే బాగుంటుంది" అని. ఆ మాటలు అంటూ ఉండగానే, ఎవరో అనాసపండు తీసుకొని హాలుగుమ్మంలోంచివస్తున్నారు.

ఒకసారి భగవాన్ పూర్వం తన దగ్గరవున్న గజానన పండితుల సంగతులు మాట్లాడి ఇప్పుడు వారెక్కడ ఉన్నారో అన్నారు. ఇంతలో టపా వచ్చింది. దాంట్లో గజానన పండితుల కవరు ఉంది, ఫొటోలతో సహా, ఆయన ఆశ్రమమూ శిష్యులూ, ఆయన చరిత్ర సంపూర్ణంగా. అది చూచి భగవాన్ "ఇప్పుడు ఈయన సంగతి మాట్లాడుతున్నాను. ఇప్పుడే వచ్చాయి ఇవన్నీ చిత్రంగా" అన్నారు.

ఒకసారి హాల్లో ఒక భక్తుడు భగవాన్‌కి ఒక గ్లాసు నారింజరసం తెచ్చారు త్రాగటానికి. భగవాన్ తాగనని కోప్పడ్డారు. "అందరికి ఇవ్వకుండా ప్రత్యేకంగా నాకేమన్నా ఇస్తే అది నాకు విషం" అన్నారు చాలా కోపంగా.

"అందరికి ఇస్తాము ఈసారి" అన్నారు భక్తులు.

"ఈమాట ఇప్పుడంటున్నారు. ఈభక్తులందరూ నేనే అని దృష్టిలేకుండా అందరికీ ఇస్తాననడంలో ప్రయోజనమేముంది?" అని ఈ విధంగా కోప్పడ్డారు.

ఆ భక్తుడు వదలలేదు. ఏదో చెప్పుతున్నాడు. భగ



వాన్‌కి ఆగ్రహం ఎక్కువైపోయింది. చివరికి డాక్టరు శివరావు అతన్ని బైటికి తీసుకొని పోయినారు.

ఒక తెలుగు ఆమె బిడ్డతో వచ్చింది. ఆమెకిదివరకు పిల్లలు పోతున్నారు. ఈ పిల్లవాడన్నా బతకాలని ఆశ. ఆ పిల్లవాడికి ఇక్కడే అన్నప్రాశన భగవాన్ సమక్షంలో చేయించాలని. ఇక్కడ ఆ పిల్లవాడికి జబ్బుచేసింది. ఎక్కువయింది. భగవాన్ వస్తుండగా త్రోవలో కలుసుకుంది. ఆమె చేతుల్లో విభూతిపాత్ర ఉంది. భగవాన్ని ఆ పిల్లవాణ్ని తాకమంది. భగవాన్ వద్దంటు ఉంటే ఆమె వినక పట్టు పట్టింది. ఆమె కోర్కె ప్రకారం భగవాన్ ఆ విభూతి తీసుకొని అతనికి రాశారు. మర్నాడే చచ్చిపోయినాడు అతను. ఆమెవచ్చి ఏడిస్తే భగవాన్ అందరివంక చూచి "నన్నేమో వంటరిగా కలుసుకొని తన పిల్లవాడిని తాకమంది. వద్దన్నా వినలేదు. సరే అని, విభూతి ఇచ్చింది రాశాను. చచ్చిపోయినాడు. ఇప్పుడు ఏడిస్తే ప్రయోజన మేముంది?" అన్నారు. గణపతి శాస్త్రిగారు అనేవారు—పిల్లల్ని భగవాన్‌చే తాకించవద్దని. తాకించారా, ఆయన వెంటనే మోక్షమిస్తారు.

తరువాత భగవాన్ చాల బోధించారు, ఆమెకి ఎంతో ఆదరంతో—"ఎక్కడికి పోయినాడు నీ కొడుకు, ఇక్కడే ఉన్నాడు" అంటో. వెళ్ళేప్పుడు చిరునవ్వుతో వెళ్ళింది ఆ తల్లి. అది అందరికీ చూపి, భగవాన్ "చూడండి నవ్వుతోంది" అని ఎంతో సంతోషం చూపారు.

ఈ సంగతి జరిగినప్పుడు నేను లేనుకాని నాకు ఉత్తరం వచ్చింది. తరువాత నేను సంగతంతా వచ్చి విన్నాను. మా

చెల్లెలు ఇక్కడే ఉండేది. ఒక సాయింత్రం ఆమె పిల్లవాడు అయిదారేళ్ల వాడు ఆడుకుంటోంటే, గడ్డిలో ఏదో కరచిందన్నాడు. వెంటనే "నన్ను భగవాన్ దగ్గరికి తీసుకుపో" అని ఏడ్చాడు. ఈ కాస్తకి భగవాన్ దగ్గరికా? ఇప్పుడు ఆశ్రమంలోకి రానీరు. అంది మా చెల్లెలు అతన్ని మరిపించేందుకు. ఏదో అని వూరుకుంది. కొంచెం సేపటికి వాపు, బాధ బైలు దేరింది. చెమటలు పోస్తున్నాయి. డాక్టర్ని పిలిచారు, మందులిచ్చారు. తగ్గలేదు. ప్రమాద స్థితి వచ్చింది. ఇంక తనకు చేత కాదు. భగవాన్ దగ్గరకి తీసుకొని వెళ్లమన్నారు డాక్టరు. పిల్లవాడి చూపు నిలిచిపోయింది. అట్లానే యెత్తుకుని ఏడుస్తూ వెళ్లింది. ఆమెను చూడ్డంతోనే భగవాన్ "ఏం లేదు. ఏడవకు"అన్నారు. చేత్తో పిల్లవాణ్ని రాశారు. నిమిషాల్లో ప్రాణం వచ్చింది. లేచి కూర్చున్నాడు. అట్లానే భగవాన్ దగ్గర కూర్చున్నారు వాళ్ళు. పరవాలేదు వెళ్ళమన్నారు.

వాళ్ళు బైటికి వస్తూ ఉంటే ఆ రాత్రి 9 గంటలప్పుడు ఒక మహమ్మదీయభక్తుడు భగవాన్ హాలు వరండాలో కూర్చుని జపం చేసుకుంటున్నాడు. అతను లేచివచ్చి పిల్లవాణ్ణి చూచి "మీరు లోపలికి వెళుతుంటే చూచాను. పిల్లవాడు చావుకి సిద్ధంగా ఉన్నాడు. భగవాన్ దగ్గరికి వెళ్లుచున్నారు కదా అని నేను మాట్లాడలేదు. ఇప్పుడు పిల్లవాడు బ్రతికాడు. అయినా లోపల ఈ విషం నిలువకుండా మంత్రం వేస్తాను"అని మంత్రం వేసి పంపాడుట. మాంత్రికుణ్ణి కూడ తయారుగా ఉంచారు. ఆ ఆర్తరక్షణ దక్షుడు భగవాన్......

—.—

# పాతూరి లక్ష్మీనారాయణ

**1932** సంవత్సరములో మద్రాసు రాష్ట్ర కో ఆపరేటివ్ సభలు తిరువణ్ణామలైలో జరిగినవి. నేను ఆ సభలకు వెళ్ళి, మహర్షి గారిని సందర్శించాను.

అప్పుడు కొండవైపున వున్న ఓ చిన్న డాబాలో ఓ సోఫామీద భగవాన్ కూచుని వున్నారు. ఆయన కౌపీనం మాత్రం ధరించి వున్నారు. శరీర సౌష్టవము సామాన్యమైనది. రంగు పసిడి కాక ఎరుపు, బంగారము ఛాయలో కాంతిగా వుంది.

పతాలలో వేమన కూర్చునే మాదిరిగా వారు సోఫాపైన కూచున్నారు. హాల్లో ప్రవేశించగానే, నా దృష్టిని వారి కన్నులు ఆకర్షించాయి. మొదట లేడి కనులమల్లే కనిపించాయి కాని, త్వరలోనే రెండు జ్యోతుల మాదిరి వెలుగుతున్నట్లు అనిపించింది. ఆ నేత్రాల్ని చూసినకొద్దీ, అవి అగాధమైన లోతునించి ప్రజ్వలించినట్లు కనిపించాయి. వారు యోగనిష్టలో ఉన్నారో, మేల్కొని ఉన్నారో, ఏ దిక్కు చూస్తున్నారో, ఎవరిని చూస్తున్నారో వారి కనుచూపుల్నిపట్టి తెలుసుకోడం దుస్సాధ్యం.



ఆ హాలులో వాతావరణం అంతా, ప్రశాంతంగా నిశ్శబ్దంగా ఉంది. ఆ హాలులో నేలమీద ఇరవై మంది కూచుని కళ్ళుమూసుకుని ధ్యానంలో వున్నారు.

మధ్యాన్నం భోజనం ఆశ్రమంలోనే చేశాను. ఒక బారు బ్రాహ్మలూ, ఇంకో బారు బ్రాహ్మణేతరులూ కూచున్నారు. మధ్య భగవాన్ కూచున్నారు. అక్కడ దృష్టి దోషమూ, మడీ ఏవీ పాటించటంలేదు. భోజనమైనాక, నా విస్తరి నన్ను ఎత్తివేసుకోమన్నారు. ఆ పని నాకు నామోషీ అనిపించింది. కాని అదో పాఠము నేర్పినట్టనుకున్నాను.

మర్నాడు పొద్దున్న మళ్ళీ ఆశ్రమానికి వొచ్చి భగవాన్‌కి ఎదురుగా కూచున్నాను. ఒకాయన ఇద్దరు బిళ్లబంట్రోతులతో ఆశ్రమంలో ప్రవేశించారు.

ప్రభుత్వోద్యోగులు అన్యాయాలు చేస్తున్నారనీ, తాను దానిని వారించే ప్రయత్నాలు చేస్తున్నాననీ ఆయన ఒక ఉపన్యాసమిచ్చి, ఇట్లాంటి యత్నాలవల్ల తనకి మనశ్శాంతి లేదనీ, తనకి మనశ్శాంతి కలిగే మార్గం చూపమనీ భగవాన్ని ప్రార్థించారు. ఆయన తన గొప్పతనాన్ని భగవాన్ ముందు చాటించుకో వొచ్చినట్టు కనపడ్డది. ఆయన ఉపన్యాసం చాలించి, మహర్షిగారినించి జవాబుకి ఎంత నిరీక్షించినా, ఏమీ రాలేదు.

ఆయన తన జోరును తగ్గించుకొని, "స్వామీ, నన్ను మౌనము దాల్చమనా మీ ఆదేశము?" అన్నారు.

అందుకు మహర్షి "అవును, అవును" అన్నారు.

మూడో రోజు సభలు పూర్తికాగానే, ఆ సభ్యులు ఒక వందమంది వొచ్చి హాలులో కూచున్నారు. ముందు కూచుని వున్న వేమవరపు రామదాసు పంతులుగారు ఇట్లా అన్నారు: "స్వామీ, మేమందరము గాంధీజీ శిష్యులము. మేము అస్పృశ్యతా నివారణను నమ్మి, దానిని నిర్వహించాలని బద్ధకంకణులమై వున్నాము. ఈ విషయముపై తమ అభిప్రాయాన్ని శలవీయ కోరుతున్నాము."

ఆ ప్రశ్నకు మహర్షి జవాబియ్యలేదు. ఆయన దృష్టి ఎక్కడ ఉన్నదో కూడ తెలియలేదు. పది పదిహేను నిమిషాలయింది. గుంపులో గుస గుసలు బైలుదేరాయి. రైలు బైమ వుతోంది. హాలులోంచి ఏ విధంగా బైటపడదామా అని ఆలోచనలు బైలుదేరాయి. ప్రశ్న వేశారు. ఇరవై నిమిషాలయింది. జవాబు లేదు.

అట్లాంటి సంకట సమయంలో పచ్చయప్ప కాలేజి ప్రొఫెసరు యజ్ఞనారాయణ అయ్యర్‌గారు భగవాన్ని సంబోధించి, "స్వామీ, మిమ్మల్ని వేయకూడని ప్రశ్న వేశాము



గావును. ఇది లౌకిక వ్యవహారానికి సంబంధించినది. అందుకు క్షమించండి" అన్నారు.

వెంటనే మహర్షి "దీంటో క్షమించడానికి ఏముంది? సముద్రం పొంగి పొర్లుతూవుంటే, దాని విషయమై మీ అభిప్రాయం ఏమిటని అడగడంవల్ల లాభమేమిటి? మన అభిప్రాయంతో నిమిత్తం లేకండానే సముద్రం పొంగుతోంది" అన్నారు.

అక్కడితో తృప్తిపడి అందరూ లేచి వెళ్లారు.

నేను నాలుగో రోజు రమణాశ్రమానికి వెళ్ళాను. మహర్షి దృష్టి ఎక్కడ వుందో, ఆ కళ్లు మాత్రం జ్యోతుల లాగు వెలుగుతున్నాయి.

నేను వారిని ఉద్దేశించి ఈ మాటలన్నాను: "స్వామీ, నా మనసు నేను చెప్పినట్లు వినక దాని ఇష్టం వచ్చినట్లు విహరిస్తుంది. అందువల్ల నాకు అశాంతి కలుగుతుంది. నా మనసును స్వాధీనంలోకి తెచ్చుకొనేందుకు మార్గము ఏది?"

నేను నా ప్రశ్నను ముగించక పూర్వమే భగవాన్ కరుణారసమైన వాక్కుతో ఇట్లా అన్నారు, తెలుగు భాషలో స్పష్టంగా:

"జీవితంలో సాధకుల యత్నమంతా అందుకోసమే, ఈ మనసుని అరికట్టడానికే. జ్ఞాన, భక్తి, కర్మ మార్గములన్నీ దాని కోసమే. జ్ఞాన మార్గము ద్వారా మనసును నేను కాను

అని తెలుసుకుని మనసుని నిరోధించవచ్చును. కర్మ మార్గములో- ఏదో ఒక కర్మయందు మనసుని లగ్నం చెయ్యడం వల్ల, మనసు నిలిచిపోతుంది. భక్తి మార్గంలో మనసుని సర్వదా ఇష్ట దైవం మీాదికి పోనిచ్చి, ఆ ప్రార్థన పూజ సేవలలో మనసుని వుంచడంవల్ల, కొంతకాలానికి ఆ మూర్తియందే లగ్నమై నిలబడి పోతుంది. అన్ని మార్గాలలో భక్తి మార్గము సులభము. నీ ఇష్టదైవము పటముగాని, విగ్రహంగాని, నీ మనసులో తీరిక వినప్పుడల్లా ధ్యానించుకో. దానివల్ల నీ మనసు నిలబడిపోతుంది.”

—

# ఒక భక్తుడు

అమెరికా నించి ఒకరు భగవాన్‌ని చూడాలని ఇంత దూరమూ వొచ్చారు. వొచ్చి భగవాన్ ముందు మూడు గంటలు కూచుని వెళ్ళిపోయినారు. వారికి మళ్ళీ తిరిగి వొచ్చే వుద్దేశం లేదు. నేను అడిగాను భగవాన్ని:

"అదేమిటి? అన్ని వేల మైళ్ళు మీ కోసం వొచ్చి, ఆయన మూడు గంటలసేపులో వెళ్ళిపోయినారు? ఏం తెలుసుకున్నారు?" అని.

భగవాన్ అన్నారు: "ఆయన ఓ అవసరం వల్ల వచ్చారు. నా దర్శనం చేసుకున్నారు. నేను ఆయన దర్శనం చేసుకున్నాను. ఆయన వొచ్చిన అవసరం తీరింది. ఇక్కడే పడుండాలని ఏముంది?"

భగవాన్‌కీ ఆయన ఆశ్రితులకీ మధ్య ఏం జరుగుతుందో, వారిద్దరికీ తెలీవలిసిందే గాని ఎవరికి తెలుస్తుంది? ఎవరి స్థితిని బట్టి వారికి, అనేక విధాల ఆయన అనుగ్రహం లభించింది.

ఆయన అనుగ్రహాన్ని అర్థించిన వారికి భగవాన్ ఉపదేశాలు మామూలు సూత్ర వాక్యాలు కావు, ధర్మబోధలు కావు. అట్లా అయితే ఆయన చెప్పిన బోధలు చిన్న పుస్తకం రాస్తే చాలు. వేరే మళ్ళీ ఆయనని ప్రశ్నించ వలసిన అవ



సరం ముండదు. ఎవరి స్థితిని, అవసరాన్ని, యోగ్యతను, స్వభావాన్ని బట్టి వారికి జవాబు చెప్పేవారు. ఒకరికి చెప్పింది అందరికీ వర్తిస్తుందనుకోడం పొరబాటు. ఆయన వారి సందేహం తీర్చడంతో, ఆయన చెప్పినట్టు వారు చేస్తే, భగవాన్ అనుగ్రహం వారిలోనే వుండేది. ఒక పరిస్థితిలో ఒకే ప్రశ్నకు వారినించి, వేరు వేరు జవాబులు, ఒకదానికి ఒకటి విరుద్ధమైనవి వొచ్చేవి, ఆ మనసుల్ని బట్టి.

అట్లాగే ఒకసారి, కన్నప్ప అనే ఒక గుడ్డి భక్తుడు వొచ్చారు భగవాన్ దగ్గిరికి.

ఆ వొచ్చిన కన్నప్ప సంగతీ, కన్నప్పగురువు సంగతీ చెప్పుతో—

"భక్తి కీర్తనలు ఈయన పాడితే విన్నారా, మనుషులకి పగలో రాత్రో తెలీకుండా పోతుంది" అన్నారు భగవాన్.

"అయితే వారు కొంచెం పాడకూడదా?" అని అడిగాను.

కన్నప్ప అరుణగిరి నాధన్ తిరుపఘుల్ పాడారు.

ఎంతో మధురంగా వున్నాయి. ఆయన భక్తివల్ల అందరికీ కళ్ళ వెంబడి ధారలుగా నీళ్ళు వొచ్చాయి. తన్మయులమై పోయినాము. ఇంతలో భోజనానికి గంట కొట్టారు. భగవాన్ మోకాళ్ళు రాసుకుని మెల్లిగా లేచారు.

"ఎంత గొప్పగా పాడారు! ఏమి గానం, ఏమి భక్తి!!" అన్నాను నేను.

"అంతేనేమిటి? అతను ఎవరినంటే వారిని అనుకరించి

చూపగలడు'' అంటూ హాలు గుమ్మం దాటి బైటికి వెళ్ళి, వెనక్కి తిరిగి నా వంక చూసి,

'అవును. చాలా బాగా పాడారు. అది సరి. కాని అదంతా మన కెందుకు? దాంటో పడ్తామా, దాంట్లో కొట్టుకు పోతాము. మళ్ళీ తెప్పరిల్లి బైటపడడం కష్టం'' అన్నారు.

ఇంకోసారి అరవిందాశ్రమం నించి ప్రసిద్ధ గాయకులు దిలీప్ కుమార్ రాయ్ వొచ్చి అద్భుతంగా పాడుతున్నారు, భగవాన్ ముందు. మళ్ళీ భోజనానికి గంట కొట్టారు. దిలీప్ గారు వాయిద్యం కిందపెట్టి, లేచి చేతులు జోడించి భగవాన్‌తో–

"నేనేమీ యోగసాధన చెయ్యలేదు. వేదాంతమూ ఎరగను. నాకు చాతనయిందంతా యీ పాట. నా హృదయం భావోద్రేకంతో, యీ గానంలో కలిసి ఈశ్వర పాదాల్ని అందుకోవాలని చూస్తుంది. నాకేమన్నా ఆశ వుందా స్వామీ! నాకు వున్నదల్లా ఈ కాస్త భక్తి. అది పాట రూపానే కలుగుతుంది నాకు'' అన్నారు.

దానికి భగవాన్–

"ఆహా. అది చాలునే. అది తీసుకు పోతుంది (గమ్య స్థితికి)'' అన్నారు.

నేనా మాటలు తర్జుమా చేసి చెప్పాను. అవి విని రాయ్‌గారికి ఎంతో ధైర్యం వొచ్చినట్లయి తిరిగి తిరిగి భగ



వాన్ పాదాలకు ప్రణమిల్లారు. హాలు దాటి బైటికి వెళ్ళిం తరవాత, భగవాన్ నా వైపు తిరిగి–

"భక్తి జ్ఞానానికి తల్లి. ఆ మాట ఆయనతో చెప్పు'' అన్నారు.

నేను ఇంగ్లీషులో చెప్పగానే దిలీప్‌గారు పొంగిపోయి తిరిగి తిరిగి భగవాన్ పాదాలకి ప్రణమిల్లారు.

కన్నప్ప విషయంలో ఆ భక్తి మనకి వొద్దని హెచ్చరించారు. రాయ్‌గారికి ఆ భక్తి చాలు ఇంకేమక్కర్లేదన్నారు. ఎవరికేది సులభ మార్గమో, భగవాన్ తెలుసుకుని బోధించేవారు. ఒక సమయంలో, పరిస్థితులలో, ఒకరికి చెప్పిన ఉపదేశం అందరికీ గాని, ఇంకొకరికిగాని వర్తించి తీరుతుందని భావించడానికి వీలులేదు.

వేదాంత వాక్యాలు తప్ప భగవాన్ ఇంకేం చెప్పలేదని, ఎవరు ఏ కష్టంలో వుండి అడిగినా, 'నీ వెవరో తెలుసుకో'' అని మాత్రమే చెప్పారనీ అనుకుంటారు.

ఆశ్రమం పోస్టాఫీసు తెరచిన కొత్తలో, ఆ డిపార్టుమెంటులోనే పెద్ద ఆఫీసరు ఒకాయనా, ఆయన భార్యా వొచ్చారు హాల్లోకి. వారికి ఒక్కడే కొడుకు. అతను చచ్చిపోయినాడు.

"అతన్ని చాలా ప్రేమించాము. అతను పోయినప్పటి నించీ, ఆనందమంటే ఎరగం, శాంతిలేదు. ఇట్లా గతిలేక తిరుగుతున్నాము. మాకు ఒక్కటే కోర్కె. మా మమకారం ఎలాంటిదంటే – వొచ్చే జన్మలోనైనా మా అబ్బాయిని

చూస్తామా అని'' అని అడిగారు. హాలులో అందరూ నవ్వారు. ఆ నవ్వు విని ఆ వొచ్చిన ఆయన లేచినుంచుని—

''నాకు ఆశ్రమాలూ మహాత్ములూ ఆ మర్యాదలూ ఇంతవరకు-అట్లాంటి వాటితో పరిచయం లేదు. నే నేమన్నా తప్పు మాట్లాడానో ఏమో తెలీదు. క్షమించండి'' అన్నారు.

వెనక్కి- ఆనుకుని కూచున్న భగవాన్ ఆ మాటలు విని లేచి కూచున్నారు.

''తండ్రి, కొడుకు, జన్మ-వీటికి అర్థం సరిగా తెలుసుకోండి ముందు. ఆ సంగతులు తెలుసుకుంటే, తరవాత వొచ్చే జన్మ సంగతి చూసుకో వొచ్చును'' అన్నారు భగవాన్.

ఆ వొచ్చిన ఆయన ''భగవాన్! నా కివన్నీ తెలీవు, నాకు అక్కర్నా లేదు. వైరాగ్యమూ, జ్ఞానమూ, అవన్నీ నాకు పట్టవు. నాకు ఇది చెప్పండి చాలు. అంతకన్న మించి నే నేం కోరటం లేదు. వొచ్చే జన్మలో నా కొడుకుని చూస్తానా?'' అన్నారు.

ఆ మాట విని భగవాన్ ఇంకా ముందుకి జరిగి, చేతులు పైకెత్తి ఆయనకి బాగా నిశ్చయమయ్యేట్టు-

''ఆహా, తప్పకండా చూస్తావు. ఈ జన్మలో నీ కొడుకుని నువ్వు చూసినంత ప్రత్యక్షంగా వొచ్చే జన్మలోనూ చూస్తావు'' అన్నారు.

ఆ మాటకి ఆయన కరిగిపోయి పొంగిపోయి-

''అంతే భగవాన్, నాకు కావలిసింది'' అంటో భగవాన్ పాదాలకి ఒకటే ప్రణామాలూ చేసి వెళ్ళి పోయినారు.

ఆయన వెళ్ళి పోయింతరవాత నేను-



''భగవాన్, అట్లా చెప్పారేమిటి? అదెట్లా జరుగుతుంది?'' అని అడిగాను.

''ఏం చెయ్యను? అట్లా చెప్పక పోతే, వాళ్ళ విశ్వాసం పునాదులతో కదిలి పోతుంది' అన్నారు.

కాని నా కింకా సందేహం పోలేదు. అందుకు, భగవాన్ నన్ను భగవద్గీత తెమ్మని, దాంటో ఓ శ్లోకం చూపి చదవ మన్నారు. దాని తాత్పర్యం ఇది-

ఎవరి అర్హతను బట్టి వారికి జ్ఞానమివ్వాలి, సిద్ధంకాని వారికి వేదాంతం బోధిస్తే, అసలు వారి విశ్వాసమే నాశన మౌతుందని.

ఒకసారి హాల్లోకి కొత్తగా చేసిన దేవతా వూరేగింపు విమానం తెచ్చి పెట్టారు భగవాన్ ముందు. కొంతసేపు అట్లా వుంచి తీసుకుని వెళ్ళారు. ఏమిటది? అని అడిగాను నేను భగవాన్ని. ''అదా! అది తెలిదా! వూరేగింపుకి విమానం. గుళ్ళో తల్లి విగ్రహాన్ని వూరేగిస్తారట గుడి చుట్టూ'' అని, కొంత సేపుండి-

''అంతేకాదు, ఓ ఛత్రం చేయిస్తున్నారు!'' అన్నారు.

''ఛత్రమా! ఛత్రమేమిటి?''

''అరుణాచలేశ్వరుడికి వూరేగింపులో పట్టరూ, అట్లాంటిది. ఇక్కడ గుళ్లో విగ్రహానికి పట్టడానికి. చిన్నస్వామికి తల్లి, అంటే పిచ్చి. అన్నీ ఎట్లా జరగాలో అట్లా జరుగుతాయి. మనం చూస్తో వుందాం'' అన్నారు.

పూర్వం భగవాన్ తల్లి చచ్చి పోయినప్పుడు భగవాన్ అన్నారు: ''దీన్ని (ఆ శరీరాన్ని) చీకట్లో తీసుకుని పోయి,

ఏ సందడీ లేకండా, ఎవరికీ తెలీకండా, ఎవరిదీగాని నేల చూసి, దాంటో గుంట తీసి, దాంటో పాతేసి తెల్లారకముందే వొచ్చి వెయ్యండి."

కొండ మీదనించి శవాన్ని కిందికి దించారు. ఎక్కడ పాతాలా అని చాలా చర్చించారు. ఇంతలో వూళ్లో తెలిసింది. అందరూ వొచ్చారు. స్థలం చూశారు. పాతి పెట్టారు. ఒకరు మర్నాడు సమాధి కట్టించారు. ఇంకోరు అన్నం అదీ వొండి పెట్టారు. ఇంకోరు బీదలకి అన్నదానం చేశారు. ఇట్లా పదిరోజులూ అడావిడి జరిగింది. అదంతా చూసి చిన్నస్వామి రోజూ కొండదిగి రావడం, సమాధిని పూజ చెయ్యడం, నైవేద్యాలు పెట్టడం ప్రారంభించారు. ఆయన వెంట అందరూ దిగడం. కొన్నాళ్ళకి భగవాన్ కూడా దిగారు. భగవాన్ రోజూ దిగడం ఎక్కడం ఎందుకని గావును ఒక రోజు అక్కడే కూచున్నారు, ఒకరు ఆయనకి నీడగా ఓ పందిరి వేశారు. అదీ మొదలు ఆశ్రమం ఏర్పడడం.

దానికే అన్నారు భగవాన్ ఓ సారి: "ఎవరికీ తెలీకండా పాతేసి- తెల్లారేలోపల గప్పా చిప్పున వొచ్చెయ్య మన్నాను. కాని ఏది ఎట్లా జరగాలో అట్లా జరుగుతుంది. చూడండి, ఎన్ని కట్టడాలు లేచాయో, రహస్యంగా శవాన్ని పాతి పెట్టిన చోట" అని.

ఆశ్రమంలో ఈ గుడి కట్టేటప్పుడు మధ్యలో డబ్బు అయిపోయింది అని అన్నారు. వెంటనే డబ్బు కావాలి. ఆ సమయంలోనే ఆశ్రమానికి (చమన్లాల్ యోగి) అనే ఆయన



బొంబేనించి కొత్తగా వొచ్చారు. ఆయన్ని చూసి చిన్న స్వామి-

"గుడికి ఒక్క యాభై వేల రూపాయలు కావాలి. కనక నువ్వూ నేనూ పోయి జమన్లాల్ బజాజీని చూసి, అడిగి, ఆ యాభై వేలూ తీసుకుని వొద్దాము. నన్ను నువ్వు ఆయనకి పరిచయం చెయ్యాలి. బైయలుదేర"మన్నారు.

చమన్లాలు యోగి గారికి ఆ proposal ఏమాత్రం ఇష్టంగా లేదు. కొత్తవాడు. మొహమాటం. గతిలేక సరే నన్నాడు.

చిన్నస్వామిగారు పెట్టీ పక్కా సర్దుకున్నారు. కాని భగవాన్‌తో చెప్పాలి కద! అదోటి అడ్డం. చిన్నస్వామి ఎప్పుడూ భగవాన్ ఎదటపడి మాట్లాడరు. ఎవరిచేతనో కబురు పంపుతో వుంటారు. నన్ను పిలిచి తన ప్రయాణం సంగతి భగవాన్‌తో చెప్పమన్నారు. "ఇటువంటి విషయం నేనెట్లా చెప్పను? మీరు కూడా నాతో రండి" అన్నాను.

ఆ ధైర్యం కూడా లేకపోయింది ఆయనకి. కొంత మందిని పోగు చేసుకుని మధ్యాన్నం, భగవాన్ వంటరిగా విశ్రమిస్తున్నప్పుడు గుంపుగా వెళ్ళాము. భగవాన్ ఎక్కడో చూస్తున్నారు. నుంచున్నాము అట్లానే. మా వంక చూడ లేదు భగవాన్.

ఒకరినొకరం "మీరు చెప్పండి,మీరు చెప్పండి" అను

కున్నాము. చివరికి మౌనస్వామి చెప్పారు. భగవాన్ చాలాసేపు మాట్లాడలేదు. మళ్ళీ నుంచున్నాము అట్లానే.

చివరికి భగవాన్—

"నా పేర ముష్టి ఎత్తవొద్దని ఇదివరకే చెప్పాను. ఇప్పుడు మళ్ళీ చెపుతున్నాను. వున్నదాంతో తృప్తి పడండి. అయింది అవుతుంది. కానిది కాదు.

"ఇప్పుడు మీరు వెళ్ళి డబ్బుకి యాచిస్తే, ఆ ఇచ్చే వారు అడగరా? స్వామివారి ఆజ్ఞ తీసుకునే, మీరు యాచిస్తున్నారా? వారు మీకు ఉత్తరువు ఇచ్చారా అని. అప్పుడేం చెప్పతలుచుకున్నారు?" అని అడిగారు.

చమన్‌లాల్ యోగికి చాలా మంచిసందు దొరికింది.

"మీరు అడగమన్నారని చెపితే తప్ప ఒక్క కాసీ రాదు" అన్నారు.

ఇంకేం చేస్తారు?

అట్లా నుంచుని మెల్లిగా జారుకున్నారు. చిన్నస్వామి ప్రయాణం ఆగిపోయింది.

అటు తర్వాత భగవాన్ అన్నారు–

"జరిగిందంతా ఈయన యాచనవల్ల జరిగిందా? ఎట్లా జరగాలో అట్లా జరుగుతుంది. ఎవరి ప్రయత్నం వల్లా ఏదీ జరగదు" అని.

ఎవరినీ అడక్కుండానే ఆ డబ్బు రానూ వొచ్చింది, గుడి పూర్తీ అయింది.

ఒకసారి భగవాన్ కొండ దిగి వొస్తూ వుండగా ఆయన



వెంట వున్న కుక్క కొండమీది ఉడతను పట్టబోయింది. భగవాన్ ఆ కుక్కను కర్రతో అదిలించబోయి కర్రజారి, balance తప్పి, పడిపోయినారు. collar bone విరిగిపోయింది. డాక్టర్లు వారిని నెల రోజులు కదలనివ్వలేదు.

ఆ రోజే ఆయనను భోజనాల హాలుదాకా నడవనిచ్చారు. ఆయన మధ్యాన్నం భోజనమై బైటికి వొచ్చే సమయంలో నేనూ, వెంకట్రామయ్యర్ వెళ్ళి నమస్కరించాము.

ఏమిటి అని అడిగారు. మేము స్కందాశ్రమం వెళ్ళివొస్తాము అనుజ్ఞ నిమ్మని అడిగాము. "సరి సరి" అని, ఆయన వెంట వుండి పరిచర్య చేసే రంగస్వామితో, wistful eagerness తో "మనం కూడా వెడదామా?" అన్నారు భగవాన్. ఆ మండుటెండలో, ఇంకా collar bone సరిగా అతుక్కోని భగవాన్ కొండ పైకి!

రంగస్వామి హడలిపోయినాడు. "స్వామీ, ఎట్లా! తమకి ఇంకా నయం కాలేదు. పైగా చాలా నీరసంగా వున్నారు."

భగవాన్ మా వంక చూసి,

"నన్ను కూడా తీసుకుపోరా?" అని అడిగారు నిస్సహాయుడైన పిల్లాడి మల్లే.

"భగవాన్, మీరు వెంట వొస్తానంటే ఆ అదృష్టాన్ని కాదనే వాడుంటాడా? కాని మీ దేహస్థితి! అసలు ఎట్లా రాగలరు?" అన్నాను.

"నన్ను వెంట తీసుకు పోరట" అన్నారు జాలిగా భగవాన్ రంగస్వామితో.

నేనూ, వెంకట్రామయ్యర్ స్కందాశ్రమానికి కొండ ఎక్కుతున్నాము. వెనక్కి తిరిగి చూస్తే రంగస్వామీ, భగవాన్....

"మీతో కాదు" అన్నాడు రంగస్వామి.

రోజూ భగవాన్ కొండమీదికి వెడతారు. కాని ఆ వెళ్ళడం కూడా డాక్టర్లు వొప్పుకోలేదు. భోజన శాల దాకా మాత్రం వెళ్ళడానికే వారు పర్మిషన్ ఇచ్చింది. కాని ఆ రోజు కొండమీదికి మామూలుగా వెళ్ళినట్టే వెడుతున్నారు గావును అనుకున్నాము.

త్వరలో మా దోవలు చీలిపోయినాయి. మేము మలుపు తిరగగానే రంగస్వామి మా వెనక పరిగెత్తుకుని వొచ్చి "కిందికి వెళ్ళి హాలులో భగవాన్ విశ్రమించగానే, నేనూవొస్తాను. మీరు వెళ్ళకండి. ఇక్కడ ఎక్కడన్నా ఆగి నా కోసం చూడండి" అని చెప్పి పరిగెత్తుకుని వెళ్ళిపోయినాడు. మేము కొంతదూరం ఎక్కి ఓ నీడ చూసుకుని కూచున్నాము. గంట దాటింది, రంగస్వామి రానేలేదు. ఇంతలో స్కందాశ్రమంలో కావలి ఉండే సాధు కోసం ఆశ్రమం నించి కొండపైకి భోజనం తీసుకుని వెళ్ళే అతను కనపడ్డాడు. అతన్ని అడిగాను ఎవరన్నా వెనక వొస్తున్నారా అని. ఎవరూ రావటం లేదు అన్నాడు గాని, అతని మాటలు నమ్మకస్తంగా లేవు. అతన్ని ఆపి గుచ్చి గుచ్చి అడిగేప్పటికి, whisper లో చెప్పాడు, రంగస్వామి వెంటరాగా భగవాన్ కొండపైకి వొస్తున్నారని.



భగవాన్ ఈ ఎండలో! వెంకట్రామయ్యర్‌ని అక్కడే ఉండమని నేను కిందికి పరిగెత్తాను. భగవాన్ ఎండలో అలిసిపోయినారు. చమటలు కారుతున్నాయి.

కొండ రాళ్ళపైన కూలబడి చేతులతో పాకుతున్నారు. గులక రాళ్ళు పగిలిన రాళ్ళ కొనలు ఆయన పాదాల్నీ, అరిచేతుల్నీ చీలుస్తున్నాయి. నెల రోజులు నడక లేక నడక అలవాటు తప్పి అవస్త పడుతున్నారు. ఇంకా నెప్పిగా వున్న మెడబొమికతో ఏం చెయ్యడం? వొద్దు. కిందికి వెళదామంటే వారు వినలేదు. నేనూ, రంగసామీ చెరో చెయ్యి పట్టుకుని, మెల్లిగా ఎక్కించాము. చివరికి మూడు గంటలకి స్కందాశ్రమం చేరుకున్నాము. భగవాన్ అలిసి ఆయాసంతో అక్కడ అరుగుమీద సొమ్మసిలి బోర్ల పడుకున్నారు. అక్కడ ఓ వొడ్డె అతను గోడలకి సున్నాలూ అవీ వేసి ఆశ్రమాన్ని శుభ్రం చేస్తున్నాడు. అతను వొచ్చి భగవాన్‌కు నమస్కరించి "ఎంత పుణ్యదినం! కరుణామూర్తి భగవాన్ కొండ పైకి వొచ్చి నాకు దర్శన మిస్తున్నారు!" అన్నాడు.

భగవాన్‌కి ఏమన్నా తాగడానికి వుంటే ఆయన తెప్పరిల్లుతారని మాకు వుంది. కాని అక్కడేం దొరుకుతుంది? ఆ వొడ్డె అతను కొండ దిగి కిందికిపోయి ఏమన్నా తీసుకుని వొస్తానన్నాడు. కాని భగవాన్ అతన్ని ఆపి, "నీ ముంతలో ఏమీ కూళ్ళు లేవా?" అన్నారు. (కూళ్ళు అంటే అంబలి). అతను వెళ్ళి తన ముంతలో చూస్తే ఏమీ మిగిలి లేదు. మధ్యాన్నమే తాగేశాడు. ఎండి, పక్కలకి అంటు

తున్న తువాళ్ళని నీళ్ళలో తడిపి కడిగి, తెప్పించుకొని ఆ నీళ్ళు భగవాన్ తాగి తెప్పరిల్లారు.

కింద ఆశ్రమంలో మూడు గంటలకి భగవాన్ హాలు తలుపులు తెరిచారు. భగవాన్ లేరు. నాలుగు దిక్కులకీ మనుషులు పరిగెత్తారు. వాళ్ళలో ఒకరు స్కందాశ్రమానికి వొచ్చి చూసేటప్పటికి భగవాన్ మాకు పూర్వకాలం తాను ఈ వూళ్ళో బిక్ష ఎత్తుకున్న సంగతులు చెపుతున్నారు. "ఆ రోజుల్లో నాకు లోకానికి చక్రవర్తి ననిపించేది. చేతులో ఓ మూకుడైనా లేకండా నడిచేవాణ్ణి రోడ్ల వెంట. ఎవరన్నా ఏమన్నా పెడితే చేతులోనే పోయించుకుని తాగడం, తినడం—తాగిన చేతిని జుటుకి రాసుకుని, హాయిగా నడిచిపోతో వుంటాను. ఈ వూళ్ళో నేను తిరగని వీధి లేదు."

"అందరూ పెట్టేవారా?"

"నేను ఎప్పుడు వొస్తానా అని కొందరు బిక్షని దాచి, నా కోసం కాచుకుని వుండేవారు. కొందరు ఏమన్నా మిగిలితే పెట్టేవారు. కొందరు 'నీకేంరా! బలిసి దుక్కలాగు వున్నావు. పో. కూలి చేసుకో' అని తరిమేవారు."

"మీకేం కష్టమనిపించేది కాదా, భగవాన్?"

"నాకేం కష్టం? ఒకటే నవ్వుతో వెళ్ళిపోయే వాణ్ణి."

వొచ్చి భగవాన్ని చూసిన అతను ఆశ్రమంలో చెప్పడానికి కిందికి వెళ్ళాడు.

మళ్ళీ ఆ వొడ్డె అతను వొచ్చి పొంగిపోతున్నాడు భగవాన్ వొచ్చారని. ఎప్పుడు కిందికి వెళ్ళి వొచ్చాడో, బొరుగులూ, శనగపప్పూ అవీ తెచ్చి మాకు పెట్టాడు.



"నీ కోసమేరా వొచ్చాను. నీ ప్రార్థనే నన్ను లాక్కొచ్చింది" అన్నారు భగవాన్.

ఇతని ప్రార్థనా ఆ ఎండలో భగవాన్ని అంత కష్టపెట్టి తీసుకొచ్చింది కొండపైకి!

"అతని ప్రార్థన ఏమిటి?" అని అడిగాను భగవాన్ని.

"మీకు తెలీదా?" అని ఆ కథనంతా చెప్పారు భగవాన్. ఆశ్రమంలో కడుతున్న గుడి ముందు భగవాన్‌కి కొత్త హాలు కడుతున్నారు. నాలుగు రోజులు కిందట ఆ హాలు ముందువాకి, నాలుగు గొప్ప స్తంభాలు లేపారు. వాటికి పూజ ఆనాడు. డాక్టర్ల అనుజ్ఞతో భగవాన్ని తీసుకుని వెళ్ళి కూచోపెట్టాడు స్తపతి ఆ స్తంభాలముందు. చాలా గుంపు వొచ్చారు. ఆ గుంపులో వున్నాడు మన కథానాయకుడు ఈ వొడ్డె అతను. స్తంభాల పూజ ఐన వెనక భగవాన్ లేచి వెడుతో వుండగా అనుకున్నాట్ట ఇతను— "ఈ హాలు కట్టేవాళ్ళు గొప్పవారు. వీరు చేసిన పని తను చూడడానికి భగవాన్ వొచ్చారు. కొండపైన స్కందాశ్రమంలో చేసే నా పనీ నా శ్రద్ధా భగవాన్ ఎట్లా చూస్తారు? భగవాన్ కొండమీది ఈ ఆశ్రమానికి వొచ్చి ఎన్నో ఏళ్ళయింది. ఎందుకు వొస్తారు?" అని. ఈ కథనంతా చెప్పి భగవాన్, వెళ్ళి చూశారు అతను చేస్తున్న పని.

మళ్ళీ వొచ్చి భగవాన్ మాతో అన్నారు. "ఆశ్రమానికి నన్ను పిలుచుకు పోవడానికి కబురు వొస్తుంది. మనం పోవొద్దు. రాత్రికూడా ఇక్కడే వుందాం. ఒంటి గంటకి

చంద్రోదయ మౌతుంది. అప్పుడు మెల్లిగా వూళ్లోకి కొండ మీదనించి దిగి కొత్తగా సున్నాలు కొట్టించిన కోవెల గోపురాన్ని వెన్నెట్లో చూసి ఆశ్రమానికి చడీ చప్పుడు కాకుండా పోయి చేరుకుందాం.”

ఇదంతా బళ్ళోంచి తప్పించుకున్న కుర్రాళ్ళ Conspiracy వలె మాట్లాడారు.

భగవాన్‌తో వుండడం కన్న ఏం కావాలి మాకు!

కాని భగవాన్ కొండమీద ఉన్న వార్త తెలిసి, ఆశ్రమం ఆశ్రమం, పెద్దలు,ఆడవాళ్ళు, పిల్లలు–అందరూ చేరుకున్నారు పైకి. సాయంత్రం ఆరింటికి పెద్ద గుంపు.

మాకు చాలా Disappointment అయింది, మా రాత్రి ప్రోగ్రాం భగ్నమై పోతోందని. వొచ్చిన భక్తుల్ని మేము వెళ్ళమంటున్నాము కాని, ఆడవాళ్ళు పిల్లలు ఎవరూ కదలలేదు. చీకటి, పులులు, తోడేళ్ళు, పాములు, రాత్రికి తిండిలేక పోవడం–ఎన్ని చెప్పినా ఎవరూ కదలరు.

“చీకటి పడుతోంది. పాములు వుంటాయి. వెళ్ళండి” అన్నాను.

“మా దీపం ఇక్కడ వుండగా మాకు చీకటేమిటి?” అంది, మొదలియారుగారి భార్య రుక్మిణమ్మగారు.

ఏం మాట్లాడం?

ఇంక లాభం లేదని భగవాన్ లేచారు. వూరివేపు కొండ దిగాము, గుంపంతా. వూరి వాళ్ళంతా చుట్టూ చేరారు. రాత్రి తొమ్మిదయింది ఆశ్రమం చేరుకునేప్పటికి.



ఒక రాత్రి భోజనల దగ్గిర భగవాన్ విస్తట్లోనే వాంతి చేసుకున్నారు. వెంటనే లేచి వెళ్ళి పోయినారు. అప్పుడే నేను [illegible] దిగి, భగవాన్ దర్శనానికి హాలులోకి వెళ్లాను. నన్ను చూడగానే భగవాన్ మామూలు కుశలు ప్రశ్నలు లేకం [illegible]నే–

“చూశావా, ఏం జరిగిందో? వొంటింట్లో విస్తరి దగ్గిరే వాంతి అయిపోయింది. నేను ఆపుకోలేక పోయినాను. ఎంత అసహ్యం! అక్కడ భోజనం చేసే వారందరికీ ఎంత [illegible]ంది కలిగిందో, ఇట్లాంటి పని అయింది” అన్నారు [illegible]ంగా. నేనన్నాను—

“ఇట్లాంటప్పుడు ఏదన్నా పుల్లటిది, నీళ్ళలో నిమ్మకాయో, నారింజ రసమో కలిపి తాగితే మంచిదంటారు.”

“నా కెవరిస్తారు! ఇప్పుడు నిమ్మకాయా, నారింజ కాయా, ఎవరు తీసుకొస్తారు?” అన్నారు నిస్సహాయంగా.

“ఏం, లేవా?” అన్నాను, పక్కన నుంచుని వున్న పరిచారకుడు కిట్టస్వామితో.

“మధ్యాన్నం ఒకరు తీసుకొచ్చారు, ఓ పన్నెండు నారింజపళ్లు. వాటిని స్టోరు గదిలో దాచి వుంటారు. తీసుకొస్తాను” అన్నాడు.

“ఒక్కటి తీసుకునిరా. దాంట్లో సగం భగవాన్‌కి, [illegible] సగం కిట్టస్వామికీ, తక్కింది రామచంద్రయ్యకీ” అన్నారు భగవాన్.

కిష్టస్వామి వెళ్ళి మూడు నారింజ పళ్ళు తెచ్చారు.
భగవాన్ చూడలేదు.

ఒకటి కోసి, భాగాలు పంచారు. నాకు నా ముక్క
ఇవ్వగానే నేను, "ఇదేమిటి భగవాన్, నాకు పండులో మూడు
వంతులు రావాలి" అన్నాను.

"ఏమి?"

"అతను మూడు పళ్ళు తీసుకుని వొచ్చాడు."

ఆ రెండు పళ్ళూ తీసుకుని మళ్ళీ పంచారు.

ఆ రసం తాగి భగవాన్ సుఖమైన నిట్టూర్పుతో
వెనక్కి వొరిగి కళ్ళు మూసుకు పడుకున్నారు.

వాంతి చేసుకుని వెళ్లిన భగవాన్ ఏమైనారనిగాని,
వారికి ఏం అవసరమోననిగాని ఎవరికీ పట్టలేదు. భగవాన్‌కు
మాత్రం తన వాంతివల్ల ఎవరికేం ఇబ్బంది కలిగిందోనని
ఆదుర్దా.

---

# రూ డా

బొంబాయిలో నేను 1940 లో విన్నాను తల్యార్ ఖాన్ సతి నుంచి భగవాన్ సంగతి. భగవాన్ ఫొటోన్నూ, ఒకటి రెండు పుస్తకాలు కూడ ఇచ్చి ఆయన మహనీయులని చెప్పింది. ఆ పుస్తకాలలోని వేదాంతం నాకర్థంకాలేదు కాని, ఆ ఫొటో నన్ను అమితంగా ఆకర్షించింది. ఆమె మాటను విని ఆ ఫొటో చూచినప్పటినుంచి భగవాన్ని ఎప్పుడు చూడగలనా అనే ఆతృత పట్టుకుంది నన్ను.

బొంబాయి నగరంలో సాంఘికంగానూ, Cultural గాను మంచి స్థితిలో ఉండేదాన్ని. కాని ఆ జీవితంతో ఎప్పుడూ ఏనాడూ సామరస్యం కుదరలేదు నాకు. ఎప్పుడూ శాంతి లేకుండ ఉండేదాన్ని.

1942 లో వచ్చాను ఈ ఊరు. ముందు భగవాన్ని కొండ మీద కలుసుకున్నాను. భగవాన్ కొండపైకి వెళ్లారు. తిరిగి వస్తారని దారిలో నుంచున్నాను, ఎప్పుడు కనబడతారా అని పైకి చూస్తో. నా కళ్లకి మనిషి వస్తూన్నా రనిపించలేదు. సూర్యోదయమైనట్టుంది. వారు నా దగ్గిరగా వచ్చి నా ప్రక్కన ఆగి, ఆదరంగా నా వంక చూసి చిరునవ్వు నవ్వి, తలవూయించారు, నా రాకను అంగీకరిస్తున్నట్టు. నాలో ఏదో చాల ముఖ్య



మైనది, నా పూర్వానుభవంలో లేనిది జరుగుతోంది.ఏమిటో నాకర్థం కాలేదు. ఒక నెల ఉన్నాను.

తిరిగి బొంబాయి వెళ్లాక నాకు మరీ అశాంతి ఎక్కువయింది. Miserableగా అనిపించింది. ఎప్పుడు అరుణాచలం వెళ్లగలనా అనే ఆకాంక్ష పట్టుకుంది.

నేనప్పుడు ఉద్యోగంలో ఉండేదాన్ని. ప్రతి సంవత్సరం ఒక నెల శలవు దొరికించుకొని వచ్చి ఇక్కడ ఉండేదాన్ని. 1945 లో చివరికి తెగించి నాకు ఉన్నదంతా అమ్మి, బొంబాయికి ఒక నమస్కారం చెప్పి అరుణాచలం నివాసంగా వచ్చేశాను.

అదీ నా కథ.

మొదటిసారి నేను ఇక్కడికి 1942 లో వచ్చినప్పుడే భగవాన్ పాదాలు తాకాలనిపించింది. మురుగనారు మొదలైన భక్తులు ప్రతిరోజు భగవాన్ పాదాల్ని స్పృశించేవారు. ఆ కాంక్షను తల్యార్ ఖాన్ సతికి వెలిబుచ్చాను. ఒకరోజు భోజనాల హాల్లో ఎంతోమంది ముందు తల్యార్ ఖాన్ సతి అంది: "భగవాన్, కోడాకి తమ పాదాలు తాకాలని ఉందిట" అని.

భగవాన్ మాట్లాడలేదు.

భోజనాలై బైటికి పోతున్నాము. భగవాన్ లేచి వెళుతున్నారు. అందుకని ప్రక్కకు తప్పుకొని నిలుచున్నాము. భగవాన్ మా దగ్గర ఆగి, అరవంలో చెప్పి, నాతో చెప్పుతున్నారు–

"ఈ పాదాలు తాకాలని ఆమెకి కోర్కె ఎందుకు?

నా పాదాలు ఎప్పుడు ఆమె శిరస్సుపైన ఉండనే ఉన్నాయి” అని.

నేను పొంగిపోయినాను. అందరూ నన్ను చాల అదృష్టవంతురాలని అన్నారు. అన్నేసి ఏళ్ళున్నవారిలో ఎవరినీ అనలేదు, ఆ మాట భగవాన్!

“నీపైన వారి సంపూర్ణానుగ్రహం ఉందన్నమాట” అన్నారు.

ఆనాటినుంచే నేను తెలుసుకోడం ప్రారంభించాను, భగవాన్ ఆ శరీరం కాదనీ, ఆయన పాదాలంటే మనకి కనబడే ఆ పాదాలు కాదనీ. ఆ విధంగా ఆయన శరీరం నుంచి ఆయనను వేరుగా చూడడంవల్ల నే ఆ రణం వేసి ఆయన అంత బాధపడుతున్నట్టు కనపడ్డప్పుడు, ఆయన శరీరం మరణానికి సమీపంగా ఉన్నప్పుడు కూడ నాకేమి విచారం కలుగలేదు.

ఒకసారి నేను బొంబాయి నుంచి వచ్చినప్పుడు భగవాన్‌కి విలువగల Stationary కానుకగా తెచ్చి సమర్పించాను.

“ఇవ్వన్నీ భగవాన్ ఏం చేసుకుంటారు? ఆయనకేం ప్రయోజనం?” అన్నారు అక్కడివారు.

“ఇంతకన్న నేను భగవాన్‌కి ఏమివ్వగలను?” అన్నాను.

“అవును. ఎవరు ఏమి ఇవ్వనక్కర్లేదు. భగవాన్‌కి సమస్తమూ వుంది” అన్నారు భగవాన్.

కూర్చుని ఆలోచించాను, “భగవాన్‌కి ఉపయోగమైనది ఏమివ్వగలనా?” అని.



ఉడుతలకు పప్పులు అవీ వెయ్యడానికి దాచి ఉంచే ఒక రేకు భరిణ వుంది భగవాన్ దగ్గర. అట్లాంటిది వెండిది తెచ్చిపెడదాము ఈసారి బొంబేనుంచి వచ్చేటప్పుడు అనుకున్నాను నా మనస్సులో.

కాస్సేపటికి సరిగా నేననుకున్న మోస్తరుదే వెండి డబ్బీ ఒకటి తెచ్చి ఒకరు సమర్పించారు. భగవాన్ దాన్ని తాకనైన లేదు.

“ఏమిటి? వెండిపెట్టా? వద్దు. తీసెయ్యి ఇక్కడ నుంచి. దాన్ని ఆ తెచ్చిన ఆయనకు ఇచ్చెయ్యి. నాకు వెండిపెట్టే!” అంటూ కోపంగా విదలించేశారు భగవాన్. ఆ మాట అంటూ నావంక చూచారు—రేపు నువ్వు తెచ్చినా నీ సంగతీ ఇంతే అన్నట్టు.

ఈ వూళ్ళోనే నా పెళ్ళి అయింది. భగవాన్ స్వయంగా శ్రద్ధ తీసుకొని మా వివాహం జరగడానికి కొంత అండ అయినారు.

నా భర్తకీ, ఆశ్రమానికీ వచ్చిన ఒక mis-understanding వల్ల ఆశ్రమం వారు నన్ను ఆశ్రమానికి రాకూడదన్నారు. ఆశ్రమానికి రాకూడదంటే పోయిందేమి లేదు కాని, భగవాన్ దగ్గర కూర్చోడానికి వీల్లేకపోవడం, భగవాన్ని చూడకపోవడమంటే ఇంక ఎందుకు బతికి ఉండడం అనిపించింది.

నేను ఆశ్రమం చుట్టు తిరిగి వెళ్ళి కొండవేపు మెట్ల మీద కూర్చునేదాన్ని, కొండమీదికి వెడుతూ ఉండేప్పుడు భగవాన్ని చూడడం కోసం. భగవాన్ వెళ్ళుతూ ప్రతి రోజు

ఆగి నన్ను దయార్ద్రదృష్టితో చూచి పలకరించి వెళ్ళుతూ ఉండేవారు. అప్పుడూ ఆ ఆంక్ష నాకు ఒక blessing in disguise అయింది.

హాల్లో నెలల కొద్దీ కూర్చున్నా భగవాన్ చూపు, పలుకు దొరుకదు. ఇక్కడ అనాయాచితముగా ఆయన నవ్వునూ, ఆదరాన్ని ప్రతిదినము పొందగలిగాను.

హాల్లో స్త్రీలందరు ఒక ప్రక్కను కూర్చుంటారు. వారిలో ముఖ్యులమనుకునేవారు ముందు పంక్తిలో భగవాన్‌కి ఎదురుగా కూర్చునేవారు. కొన్నాళ్ళకు ఆ స్థానాలు ప్రత్యేకంగా వారివే అనుకునేవారు. ఒకసారి ఒకామె గొప్ప గొప్ప చీరలు నగలతో వచ్చింది, చదువుకున్నామె. ఆశ్రమంలో తాను ముఖ్యురాలుననుకునే ఒకామె నా వంక చూచి నన్ను లేచి ఆ క్రొత్తగా నచ్చిన ఆమెకి నా స్థలమిమ్మంది. నేను లేచి వెనక్కి వెళ్ళాను. వెనక్కి ఆనుకుని కూర్చున్న భగవాన్ ఇది చూచి చప్పున ముందుకు కూర్చుని, నన్ను చోటుచెయ్యమన్న భక్తురాల్ని ఒక నిమిషం కోపంగా "ఛీ" అన్నట్టు చూశారు. ఆ క్రొత్తగా వచ్చిన ఆమె కూడ చూసింది ఆ చూపుని. ఆమె నన్ను వెనక నుంచి పిలిచి తన ప్రక్కన కూర్చో పెట్టుకుంది. నన్ను లెమ్మన్న ఆమె పశ్చాత్తాప పడ్డది.

ఒకసారి మౌనంలో వుంటున్న కమలారాణి పెద్ద కాగితం నిండా ఏవో వ్రాసి పంపింది భగవాన్‌కి. భగవాన్ దాన్ని పరిశీలించి,

"ఇదేనా మౌనమంటే" అని తిప్పి పంపించారు.



మౌనమంటే మనసు మౌనమని భగవాన్ అర్థం. నోటికి మౌనం పెట్టి కాగితం మీద వ్రాస్తూ ఉంటే, మౌనానికి అర్థం ఏమిటి? అట్లానే ఒకాయన వచ్చి ఊరికే సాష్టాంగ పడుతూ, పడనూ లేవను చేస్తున్నారు. భగవాన్ "ఇదేమన్నా తాలింఖానా? ఆ వ్యాయామ మేమిటి? మీకు అంత భక్తి ఉంటే నిశ్శబ్దంగా చూపండి" అన్నారు.

ఒకసారి ఇద్దరు మనుష్యులు వచ్చారు. అందులో ఒకాయన రెండో ఆయనను చూపి,

"భగవాన్! ఇతను ఒకరిని గురువుగా తీసుకున్నారు. ఆ గురువేమి గొప్ప స్థితికి వెళ్ళిన ఆయన కాదు. అసలు గురువంటే ఎట్లా ఉండాలో, ఆత్మ సాక్షాత్కారము పొందినవారి లక్షణ మేమిటో చూపి ఇతన్ని ఆ అవివేక మార్గం నుంచి తప్పించడానికి తమ దగ్గరకు తీసుక వచ్చాను" అన్నారు.

దానికి భగవాన్ కోపంతో,

"అతను ఏరుకున్న గురువు సరియైన ఆయన కాదని నీకేం తెలుసు? ఆయనస్థితిని కనిపెట్టగల సామర్థ్యం నీకెంతఉంది?

"అసలు గురువు యోగ్యత కాదు ముఖ్యం, శిష్యుడి భక్తి. గొప్ప భక్తితో సేవిస్తే రాయి కూడ ఈశ్వరుడౌతుంది" అన్నారు. ఇతరుల్ని, ఇతర గురువుల్ని, ఆశ్రమాల్ని తర్కించడం, విమర్శించడం మాత్రం భగవాన్ ఏమాత్రం ఇష్టపడరు.

ఒక ధనవంతురాలు ఒక పాకీ అబ్బాయిని శుభ్రంచేసి అతనికి నౌకరు Uniform వేసి తనతో చనువునిచ్చి తిప్పు

కుంటోంది. ఆ కుర్రాణ్ణి గొప్పగా తన A. D. C. అని చూపు కునేది, అతనిలో అంత అద్భుతంగా మార్పు తీసుకు రాగలిగిన తన శక్తిపైన గర్వపడుతూ.

ఇంట్లో వస్తువులు మాయమౌతున్నాయి. ఈ కుర్రాడి పైన మాత్రం అనుమానం రాలేదు. చివరికి విలువ గల వస్తువొకటీ, ఆ కుర్రాడూ ఏక కాలమందే మాయమైనారు.

ఆ అబ్బాయి ఎంత కృతఘ్నుడో అందరిలో చాటి, చివరికి భగవాన్‌తో చెప్పుకుంది.

"మూల నుంచవలసిన చీపురుకట్టని కుర్చీలో కూర్చో పెడితే అంతకన్న ఏమవుతుంది?" అన్నారు భగవాన్.

కొత్తగా యూరపు నుంచి ఒకామె వచ్చింది. ఆమెకు కాళ్ళు ముడుచుకొని కూర్చోటం చాలా కష్టం. కాలు చాచింది కొంతసేపటికి. అవి భగవాన్ వేపుకు ఉన్నాయి. భగవాన్ వెంట నుండి సేవచేసే అనుచరుడు మండిపడి "సరిగా కాళ్ళు ముడుచుకొని కూర్చో" మని ఆజ్ఞాపించాడు. ఆమె ముడుచుకుంది భయంతో. వెనక్కి ఆనుకొని కాళ్లు చాచుకొని కూర్చున్న భగవాన్ వెంటనే ఆమె మల్లేనే తామూ కాళ్ళు ముడుచుకొని కూర్చున్నారు. అంతే, ఎన్ని గంటలైనా అట్లానే కూర్చున్నారు.

భగవాన్ కాళ్లు అసలు నొప్పులు. చాలసేపు ఒక position లో కూర్చోలేరు. అందరూ ప్రార్థించారు, ఆయన్ని కాళ్ళు జాపుకోమని.

"హాలులో అందరికి ఒకటే మాట. ఎన్నడూ కాళ్ళు



ముడుచుకుని కూర్చోని ఆమెకు ఆజ్ఞ పెట్టితే నాకు పెట్టినట్లు కాదా?" అని, ఆ రోజంతా అట్లానే కూర్చున్నారు.

ఒకరు రేడియో కొని ఆశ్రమానికి ఇచ్చారు. దాన్ని భగవాన్ హాల్లో పెట్టారు. క్రిష్ణస్వామి అనే పరిచారకుడు దాన్ని ఎప్పుడూ పాడిస్తూ ఉండేవాడు. హాల్లో ధ్యానము చేస్తున్న భక్తులకి disturbanceగా ఉండేది; ముఖ్యంగా ఆ సంగీతం అలవాటు కాని విదేశీయులకి. వారిలో ఒకామె క్రిష్ణ స్వామితో "ఏమిటి? ఎప్పుడూ అట్లా పాడిస్తావు ఆ రేడియోని? నీకు తెలియటం లేదా, భక్తుల ధ్యానానికి అది ఎంత భంగకరమో!" అని కోప్పడింది. అందుకతను జమాయించి రేడియోను ఇంకా బిగ్గరగా తిప్పాడు.

ఆమె రేడియోను ఆపటానికి వెళ్ళింది. అతను వీల్లేదని గలియబడ్డాడు. ఇదంతా భగవాన్ ముందే.

"ఎందుకట్లా మనసుల్ని పాడు చేసుకోవడం? రేడియో సంగీతం కన్న ఈ పోట్లాట వలనే ఎక్కువ disturbance మనసుకి. ఆ రేడియో అంత గోలగా ఉంటే ఇక్కడే కూర్చోవాలని ఏముంది? నిశ్శబ్దమైన స్థలాలు చాలా ఉన్నాయి. అక్కడకు పోకూడదా?" అన్నారు భగవాన్.

ఆ క్రిష్ణస్వామి కోతుల్ని ఒక్కటే కొట్టేవాడు. కోతులు హాలులోకి వచ్చి అల్లరి చేసినా, పళ్లు ఎత్తుకపోయినా, ఏమి చేసినా, కొట్టేటప్పుడు కొట్టవద్దనేవారు భగవాన్. ఒకసారి అతను కోతుల్ని కొడుతూ ఉంటే,

"నువ్వు కోతుల్ని కాదు, నన్ను కొడుతున్నావు.

వాటిని నువ్వు కొట్టే దెబ్బలన్నీ నాకు తలుగులుతున్నాయి. ఆ బాధంతా నేను పడుతున్నాను" అన్నారు భగవాన్.

కొంతమంది కోతులబాధ పడలేక భగవాన్‌తో చెప్పుకున్నారు. అందుకు భగవాన్,

"ఇదంతా అడవి. అనాదిగా కోతుల నివాస స్థలం. మానవుడు ఇటు రాకముందు ఎన్నో వందల ఏళ్ళ నుంచి అవి కాపురముంటున్నాయి. ఇక్కడ వాటి మధ్యకు వచ్చి, వాటి అడవినంతా నాశనంచేసి ఇళ్లు కట్టుకున్నాం మనం. మనది దురాక్రమణ. వాటికి కష్టం కలిగి అల్లరి చేస్తే మనం కోపం తెచ్చుకోవడంలో న్యాయమేముంది? కొంత బాధని భరిస్తే నేం?" అని అడిగారు,

భగవాన్ కొద్ది రోజుల్లో పోతారనగా ఒక ఉదయం పార్సీ అతను Framjie తన మతం ప్రార్థన "ఉదయించే సూర్యుడికి నేను సాష్టాంగ పడుతున్నాను" అనేది భగవాన్ ఎడల చదివాడు. దానికి భగవాన్ "సూర్యుడు అస్తమిస్తు న్నాడు, అదెట్లు సందర్భ పడుతుంది?" అన్నారు, అంటే తాను పోతున్నానని.

ఎవరు ఏవేళప్పుడు ఏం తీసుకొచ్చినా భగవాన్ తినేవారు. ఆయన వంటికి జబ్బుచేసేది చాలాసార్లు ఆ ఫలహారాలవల్ల. ఎవరన్నా తన దగ్గర ఉంటే అందరికి పంచితీరాలి, ఆ ఫల హారాల్ని.

కాని, ఒక్కొక్కరు తీసుకొని వస్తేనూ, అదేపనిగా తీసుకొస్తూ ఉంటేనూ తాకేవారు కారు, ఆ తీసుకొచ్చిన వాటిని.



ఒక భక్తురాలు హార్లిక్సు చేసి తీసుకవచ్చి పెట్టింది భగవాన్ ముందు త్రాగమని, అందరిలోనూ.

"ఏమిటిది! నాకెందుకు?"

"హార్లిక్సు. మీరు చిక్కిపోతున్నారు. తాగి తీరాలి" అందామె.

"నేనేం పాపాయినా? తీసుకుపో!" అని కఠినంగా కంపేశారు.

Freedman అనే భక్తుడు ఒక గ్లాసునిండా నారింజ రసం తీసుకొనివచ్చి యిచ్చాడు భగవాన్‌కి త్రాగటానికి. ఆ గ్లాసు తీసుకొని చూచి భగవాన్,

"ఇంతేనా? ఇది చాలదే?" అన్నారు.

ఇంకా కావాలంటున్నారనుకుని ఆశ్చర్యపడి చూచాడు అతను.

"అందరికీ యివ్వటానికి" అన్నారు భగవాన్, కూర్చున్న వందలాది భక్తులకేసి చూస్తూ.

"కాదు భగవాన్, మీరు పాలిపోయినట్లు కనబడుతు న్నారు. మీరు త్రాగండి, మీ కోసం తెచ్చాను"అన్నాడు.

"నాకన్న పాలిపోయి కనబడుతున్నావు, నీకెక్కువ అవ సరం. నువ్వు తాగు" అని ఒక చంచాడు తీసుకొని తక్కింది యిచ్చేసారు.

భక్తులు అనేకమంది తీసుకొని వచ్చి యిచ్చేవారు, పంపేవారు పోస్టులో మందులు భగవాన్‌కి–కాళ్ళ నొప్పులకు రాసుకోటానికి, వంటికి బలానికీ. ఇట్లా ఎన్నోబుడ్లు చేరాయి భగవాన్ దగ్గర అన్ని రకాల వైద్యాలవి.

ఒకసారి భగవాన్ ఒక పెద్ద ఖాళీబుడ్డి తెమ్మన్నారు. తెచ్చాక తన దగ్గర చేరుకున్న బుడ్లలోని మందులన్నీ దాంట్లో పోయమన్నారు. తాగేవి, రాసుకునేవి అన్నీ పోశాక వాటి నన్నిటిని కలిపినదాన్ని రోజూ ఒక గరిటెడు తనకు తాగటాని కిమ్మన్నారు. వాటిల్లో కొన్ని విషాలు.

"ఇదేమిటి భగవాన్?" అన్నారు.

"అవును. నా మీద ప్రేమతో, భక్తితో యిన్ని మందులు, పంపుతారు యిస్తారు. ఇవన్నీ ఎట్లా తాగి, రాసుకుని వారిని తృప్తిపరచను? కలిపి తాగేస్తే సరిపోతుంది" అన్నారు.

డాక్టరు పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఆలోపతీ, ఆయుర్వేదం, హోమియోపతీ మందులు, పూతలు, తైలాలు, విషాలు, అన్నీ చూచాడు. హడలిపోయినాడు. అందరూ కలసి ఒక్కటే మొర, తాగవద్దని భగవాన్‌తో. బుడ్డి తీసుకపోయి దాచెయ్యడం చాల కష్టమైపోయింది.

ఒకసారి భక్తురాలు ఎచ్చమ్మ తాను చేసిన ప్రసాదం వడ్డించింది భగవాన్ విస్తట్లో.

"ఏమిటి, యింత ఎట్లా తినను?" అన్నారు భగవాన్.

దానికి ఆమె—

"అంతా మాయ కదా! అన్నమూ మాయె, మీరు తినడమూ మాయె. దీంట్లో సత్యమెక్కడ ఉంది, మీకు జబ్బు చేసేందుకు?" అంది.

భగవాన్, "చూచారా, మనం అన్నమాటలు మనకే ఎట్లా వప్పగిస్తారో!" అని నవ్వారు.

——

# రామస్వామి అయ్యర్

విల్లుపురం నా హెడ్ క్వార్టర్సు. భగవాన్ కీర్తి విని, ఆయ
నని చూడాలని తిరువణ్ణామలై వొచ్చాను. అది 1907 లో.
ముందు ఆలయం చూడగానే, ఆ దృశ్యం నన్ను గాఢంగా
థ్రిల్ చేసింది. ఆ పెద్ద గోపురాలూ, వాటికి బ్యాక్ గ్రౌండుగా
గంభీరమైన అరుణాచలం. అప్పుడు అరుణాచల పర్వత
మహత్వం నాకు తెలీదు. కాని నేను వాటిని విడువలేనంత
ఆకర్షణ పడ్డాను.

భగవాన్ కొండమీద విరూపాక్ష గుహలో వున్నా
రని తెలిసి, మధ్యాన్నం కొండమీదికి వెళ్ళాను. స్వామి
లోపల వున్నారు. కార్తీకదీపం రోజులు గనక జనసమ్మర్థం
ఎక్కువగా వుంటుందని, స్వామిని ఎవరూ 'డిస్టర్బు' చెయ్య
కండా, కిట్టయ్య అనే ఆయన గుహ వాకిట కావలి వున్నాడు.
నేను లోపలికి పోతో వుంటే అడ్డగించాడు. నాకూ, ఆయనకీ
ఘర్షణ జరిగింది. స్వామి త్వరలోనే వస్తారు, ఆగమన్నాడు
ఆయన. చేసేది లేక కూచున్నాను. కొంచం సేపట్లో భగ
వాన్ బైటికి వచ్చి, నన్ను చూడకుండానే బైటికి వెళ్ళి
పోయినారు. వారిని కలుసుకోవాలని నేను వెనకనే
వెళ్ళాను. వారు తిరిగి వొచ్చేప్పుడు, ఓ గొప్ప చింత చెట్టు
కింద ఎదురుపడ్డాను. వారు నా వంకచూసి, నిలిచారు. నేనేం
మాటాడాలో ముందుగా యోచించుకోలేదు. "ఆధి వ్యాధుల



నించి చాలా బాధపడుతున్నాను. కరుణించండి'' అన్నాను.

అందుకాయన "నాకేం తెలుసు? నేనేమీ వైద్యుణ్ణి
కాదు; మాంత్రికుణ్నీ కాదు,'' అన్నారు.

"తమరు మహనీయులని విని వొచ్చాను. నా అదృష్టం
ఎట్లా వుందో!'' అని నొచ్చుకున్నాను.

ఒక్కక్షణం నా వంక నిదానించి చూసి,

"ఏది మాత్రం నన్నేం చెయ్యగలదు! అనే ధైర్యంతో
ఇంటికి వెళ్ళండి'' అంటూనే ఆయన అరిచెయ్యిని ఓ విధంగా
గాలిలో కదిలించారు. దాంట్లోంచి నాకు ప్రకాశం కనిపించింది.
ఆ "Don't Care'' అనేదే ఉపదేశంగా తీసుకున్నాను.

నాకు అజీర్తి వ్యాధి. వుత్త గంజి తప్ప, ఏమీ జీర్ణం
కావడం లేదు. రాత్రులు నిద్రలేదు. వొంట్లో బాధ. జీవితమే
నరకమై పోయింది. నా మనసుకేమి శాంతిలేదు. ఇంటికి
వెళ్ళాక నా వ్యాధి కొంత నయంగా తోచింది.

స్వామి నన్ను ఎక్కువ ఆకర్షించ లేదుగాని, ఇంటికి
వెళ్ళినా, అరుణాచల ఆలయమూ, వెనక పర్వతమూ నన్ను
గట్టిగా పిలుస్తున్నాయి. అందుకని నేను తిరువణ్ణామలైలో
కాపురం పెట్టాను.

ఈ వూరు కాపరం వొచ్చిం తరవాత తీరుబడిఐన
ప్రతిరోజూ స్వామి దర్శనానికి వెడుతున్నాను. కొన్నిరాత్రులు

కూడా నిద్ర అక్కడే. ఆయనవద్ద పళనిస్వామి అనే శిష్యుడు వుండేవారు. ఎచ్చమ్మ స్వామివారికి భోజనం తెచ్చేది, వూళ్ళోంచి కొండపైకి. నేను చాలాసార్లు వారికి నైవేద్యంగా ఏదో ఒకటి తీసుకుని వెళ్ళేవాణ్ణి.

ఒకసారి స్వామి ఒంటరిగా కూచుని వున్నారు, గుహ వాకిట్లో. వారిని చూడడంతోటే నా మనసులో పెద్ద కలవరం బైలుదేరింది. నేను చాలా ఇమోషన్‌తో, "స్వామీ, జీసస్ మొదలైన మహాత్ములు పాపాత్ముల్ని వుద్ధరించడానికి ఈ లోకానికి దిగి వొచ్చారు. నాకు ఏమైనా ఆశ వుందా?" అని అడిగాను ఇంగ్లీషులో.

నా హృదయాన్ని చీల్చుకుని వొచ్చిన ఆ ఆర్త నాదాన్ని వినేటప్పటికి, స్వామికూడా చాలా కదిలిపోయినట్లు కనిపించారు. తను కూచున్న స్థలంనించి నా వేపు జరిగారు. "There is Hope. Yes, there is hope" (ఆశ లేకేం! అవును. వుంది) అన్నారు.

వారిని విడవలేక ఇంటికి వొచ్చాను. ఇంటికి రాగానే, నా మనసులో ఓ కీర్తన వొచ్చింది. రాశేశాను. అదే మొదలు నేను కీర్తనలు రాయడానికి. నాకు సంగీతం బాగానే తెలుసు. శాస్త్రయుక్తంగా కూడా పాడతాను. వీణ వాయిస్తాను. కాని కవిత్వానికీ, నాకూ ఏ సంబంధమూ లేదు. నేను రాసిన



మొదటి పాటని భగవాన్‌కి వినిపించినప్పుడు వారు నాకు యతి ప్రాసల సంగతి చెప్పి చూపారు. పాటలు ఏ విధంగా వుండాలో దప్పుతో,

చక్కని రాజ

చిక్కని పాలు

అని తెలుగులో చెప్పి తెలియచేశారు ప్రాస అంటే ఏమిటో. ఆనాటినించి నే నెన్నో పాటలు రాశాను, అన్ని ఏళ్లూ, భగవాన్ శరీరం సమాధి అయేవరకు. తరవాత పాటలు రాలేదు. అంతకుముందైనా పాటలు నేను యోచించి వ్రాసినవి కాదు. ప్రయత్నించి నేనొక్క పాటా రాయలేను. కవిత్వం నా సొమ్ముకాదు. అంతా ఆయన అనుగ్రహం.

ఆషాఢమాసంలో ఆ నాడు పండగ. నేను వెళ్లేప్పటికి. భగవాన్ గుహ లోపల వున్నారు. నేను విచారంగా గుహ బైట కూచుని వున్నాను. భగవాన్ బైటికి వొచ్చారు. నన్ను చూసి,

"ఏమిటి అట్లా విచారంగా కూచున్నావు?" అని కరుణతో అడిగారు.

"ఏం చెప్పాను స్వామీ? నా వొళ్లు బాగాలేదు, ఇంటినిండా మందుబుడ్ల సీసాలు. ఏదీ జీర్ణం కాదు. నిద్ర రాదు."

ఒక్క క్షణం నా వంక చూశారు. నా తల చల్లగా అయింది.

ఇంతలో ఎచ్చెమ్మ పిండివంటలు తెచ్చింది, స్వామికి. ఆ రోజు పండగ కద! అప్పుడు మధ్యాహ్నం నాలుగు గంటలవుతుంది. అక్కడికి దగ్గర్లోనే ఒక (water fall) కొండనీటి జలపాతంవుంది.(అప్పుడు వుండేది.) అందరూ అక్కడికి వెళ్లారు- ఫలహారాలు, వడలు, సుండలు, అన్నీ తీసుకుని.

చాలా ఆహ్లాదమైన సాయంత్రం. గాలిలోనే శాంతమైన మాధుర్యం...ఆ శిఖరం కిందనించి ఎక్కడో పుట్టి ఎండలో మెరుస్తో నీళ్ళు నవ్వుతో కిందికి దొర్లుతున్నాయి. కాని నా హృదయంలో అంధకారం. నా అజీర్ణం పెద్దబాధ; నిరాశ; స్వామి దయముందు, ప్రకృతిలో ప్రతిదీ అంత శాంతంగా సంతోషంగావుండే స్థలంలో, సమయంలో, నేను ఒక్కణ్నే అక్కడ తీరని బాధలో! శరీర బాధవల్ల మనసంతా చీకటై, నా శరీరమే నాకో కురుపై, నా జీవితమే నా వాళ్ళ ఒక బండరాయైపోయింది.

నేను అక్కడే అట్లానే విచారంలో కూచుని వుండిపోయినాను. నేను తనతో రాకపోవడం భగవాన్ చూసి, వాసుదేవశాస్త్రి అనే ఆయన్ను నా కోసం నన్ను పిలుచుకుని రమ్మని పంపారు.



"నేను పత్యంలో వున్నాను. నాకా భోజనం పడదు. నేను రాను" అని చెప్పి వారిని పంపించేశాను.

ఎవరో పక్కకి తిప్పినట్టు అప్రయత్నంగా నా మొహం భగవాన్ వున్న దిక్కుకి తిరిగింది. దిగులుతో వంచుకుని వున్న నా తల ఎత్తాను. భగవాన్ నన్ను రమ్మని చెయ్యూపారు. వెళ్ళి కూచున్నాను. నాముందు పిండివంటలు వడ్డించారు. నేను వూరికే తినకుండా కూచున్నాను.

"భోంచెయ్యండయ్యా!" అన్నారు భగవాన్.

అంతే. నా మనసులో భయం పోయింది. ఏదో ధైర్యమొచ్చింది వారి మాటవల్ల. మామూలుగా అందరు ఎట్లా తిన్నారో అట్లానే తిన్నాను గొప్పగా. ఆ వడలు, సుండలు మొదలైనవి ఏ కొంచెం తిన్నా రాత్రంతా మేలుకుని నరకబాధ పడతాను. గంజే నా ఆహారం ఆ రోజుల్లో. ఆ రాత్రి గుహలోనే పడుకున్నాను. తెల్లవారిందాకా నా వొళ్ళు తెలీదు. అట్లా నిద్రపోయినాను.

తెల్లవారి ఎంతో "ఫ్రెష్"గా అయి లేచాను. గుహ ముందు గడ్డిలో వికసించిన పువ్వుమల్లే అనిపించింది నాకు. నా జాడ్యం నన్ను ఒదిలిందని తెలిసిపోయింది. నా హృదయం గొప్ప కృతజ్ఞతతో భక్తితో నిండింది. అంతేకాదు. ఇంక దేనికీ నాకు భగవాన్ ఉన్నారు కదా అనే ధైర్యం వచ్చింది. ఆనాటి

నించి నా భక్తి అచంచలమైంది. నా కుటుంబానికంతా వారి పైననే భక్తి కుదిరింది.

ఒక రాత్రి గుహలోకి ఒక సాధు గంజాతో తయారు చేసిన భంగు తీసుకొచ్చి పెట్టాడు.

నేను దాన్నిచూసి "ఇదేమిటి? ఇది తెచ్చావు. ఇది ఎవరికి?" అని విసిరి నీళ్ళలో పారేశాను.

భగవాన్ అది చూసి, "ఎందుకు పారేశారు? అది ఎవరికి ఇష్టమో, వారిని సేవించనీండి," అన్నారు.

నేను అనవసరమైన చనువుతీసుకున్నానని అనుకున్నాను.

ఆ రాత్రి మా యింట్లో ఓ గోడ నిష్కారణంగా కూలింది. నాకు భయం వేసింది. ఆ రాత్రి గుహలో నేను చేసింది అపరాధ మనుకున్నాను.

ఆ రోజుల్లోనే నా పై అధికారి నన్ను "టీజ్" చేశారు–"ఏమిటి! నీకు నూటయాభై రూపాయల జీతమా! ఎందుకు అంత?" అని. ఆ మాటల్లో బెదిరింపు వినపడి భగవాన్‌తో చెప్పాను.

"ఓహో, మీకు రెండువందలు వస్తే ఏమంటాడో!" అన్నారు.

ఆ మరుసటి గెజెటులో నాకు రెండువందలకి ప్రమోషన్ అయింది.



విరూపాక్ష గుహనించి భగవాన్ మామరం గుహకు వెళ్లారు వుండడానికి. అప్పుడు బాలానందం అనే ఆయన వెనకరు భగవాన్‌తో,

"నీకు ఉపదేశం చేస్తాను రారా" అని పిలిచారు. భగవాన్ మాట్లాడలేదు. ఆయనకి కోపం వొచ్చి భగవాన్ ముఖాన తమలపాకులు నమిలిన ఎంగిలి ఉమ్మేశారు. భగవాన్ కాని, అక్కడ వున్నవారుగాని ఏమీ పలకలేదు. ఆయన రైలుకి వెళ్ళారు. రైల్లో ఆయన్ని ఆ కంపార్టుమెంటు వారికి ఆయనకి కోపం వొచ్చి తీవ్రంగా కొట్టారు.

నేను ఒకసారి తిరుకోయిలూరులో క్యాంపులో వుండగా భగవాన్ రూపం కనపడ్డది నాకు. వెంటనే రైలెక్కి సరాసరి భగవాన్ దగ్గిరికి వొచ్చాను. నేను వొచ్చేటప్పటికి, ఒక సన్యాసి భగవాన్‌తో పెద్ద వాదన వేసుకుని ఆయనకి బాధ పెడుతున్నాడు. నేను వెళ్ళగానే, ఆ సంగతి గమనించి ఇట్లా అన్నాను–

"అయ్యా, మీరు వేసే ప్రశ్నలన్నీ Intellectual. [illegible]గంటు తెలివిగలవారు మిమ్మల్ని వోడిస్తారు. ఎందుకయ్యా, ఆ ప్రదర్శనంతో ఏం లాభమయ్యా?" ఆయన వెంటనే ఏదో వెళ్ళిపోయినారు. ఆయన వెళ్ళింతరువాత భగవాన్ నాతో, "నన్ను చాలా సేపటినుంచి బాధిస్తున్నాడు.

మీారు వొచ్చి అతన్ని పంపించేశారు. మంచి పనిచేశారు,'' అన్నారు.

అట్లా భక్తులకి తనకి సహాయం చెయ్యగలిగామని తృప్తికి ఛాన్సు ఇచ్చేవారు భగవాన్.

భగవాన్ కొండపైన వుండే కాలంలోనే శేషాద్రి స్వామి అని ఓ మహానుభావులు వుండేవారు తిరువణ్ణామలైలో. వారిని గురించి నేను విల్లుపురంలో వుండేప్పుడే విని, వారిని దర్శించాలని రైలుదేరి వొచ్చాను ఒకసారి.

నేను రైలుదిగగానే ఒక ఒడ్డూ పొడుగూ వున్న ముష్టి వాడు వచ్చి, "నాకో కాలనా ఇయ్యి," అన్నాడు. నేను కోపించి, "ఏమిరా, అంత బలిసి వున్నావు, పనిచేసుకోలేవా! నీవంటి సోమరి వాళ్ళకి నేను ఇవ్వను పో!" అన్నాను.

శేషాద్రిస్వామిగారి కోసం ఊరంతా వెతికాను. గంట తరవాత ఎవరో చూపారు, రోడ్డున పోతున్న వారి నొకరిని 'అరుగో, శేషాద్రి స్వామి వారే' అని. నేను కానీ ఇవ్వను పొమ్మన్న ముష్టివాడే ఆయన.

నేనేమై పోయినాను! ఆ కరుణామూర్తి నన్ను కలుసు కోవాలని రైలు దగ్గిరికి వస్తే, నేను తిట్టి పంపాను! నేను అరుణాచలంలో స్థిరపడ్డ తరవాత, వారు నా పైన చాలా వాత్సల్యం చూపారు. మా ఇంట్లో భోజనం చేసి వుండి పోయేవారు. నేను నమస్కరిస్తే, తన పాదాలు నా తలపైన



పెట్టేవారు. మే మిద్దరమూ కలిసి భగవాన్ దగ్గరికి వెళ్ళే వాళ్ళం. శేషాద్రి స్వామి పిచ్చిగా వ్యవహరించేవారు.

"ఆయన పిచ్చి నటిస్తారు'' అనేవారు భగవాన్!

నేను చాలాసార్లు నా పిల్లలతో భార్యతో భగ వాన్‌ను చూడడానికి వెళ్ళేవాణ్ణి. నా పిల్లలతో ఆడుకునే వారు భగవాన్. ఒకసారి బియ్యం దంచిన మెత్తని తౌడు రుచిగా వుందని నా కూతురు ఆయనకి పొట్లం కట్టి తీసుకుని వెడితే అదంతా తిన్నారు.

వారి దగ్గిరికి రోజూ ఉడతలు, ఎలికలు, కోతులు, ఆవులు వొచ్చి-ఆయన దర్శనం చేసుకుని, ఆయనతో ఆడుకుని ఆయనని రాసుకుని, ఆయన చేత ముద్దు చేయించుకుని వెళ్ళేవి.

నాకు పియాలీ బదిలీ అయింది. భగవాన్‌ని వొదల లేక ఏడుస్తూ వెళ్ళాను. ప్రతి నెలా వొచ్చి వారిని దర్శించే వాణ్ణి. నాకా రోజుల్లో సన్యాసం తీసుకోవాలని చాలా వుండేది. ఎన్నిసార్లు భగవాన్ని అడిగినా, ఖండితంగా వీలు లేదు అనేవారు.

ఒకసారి మా పెద్ద అమ్మాయితో భగవాన్ దర్శనా నికి వొచ్చాను. మమ్మల్ని చూడగానే భగవాన్,

"అమ్మాయికి ఇంకా ఎందుకు పెళ్ళి చెయ్యలేదు?" అని అడిగారు.

"చెయ్యాలనే వుంది. కాని అల్లుడికి ఇచ్చుకోడాని పెళ్ళి ఖర్చుకి డబ్బులేదు. అల్లుణ్ణి వెతకనూ లేను. భగవాన్ కృప చెయ్యాలి" అన్నాను.

ఇంతలో ఎచ్చెమ్మ వొచ్చి ఆ మాటలు వింది.

"మన నీలకంఠుడికి ఇవ్వవొచ్చునే" అంది.

"అవును. ఇవ్వవొచ్చు. బుద్ధిమంతుడు" అన్నారు భగవాన్.

నీలకంఠం అరుణాచలం స్కూలులో టీచరు. ఆ రోజుల్లో భగవాన్ స్కందాశ్రమంలో వుండేవారు.

ఎప్పుడూ నేను రైలు వేళకి కొండ దిగేవాణ్ణి. ఆ నాడు ఎందుకో మధ్యాహ్నం నాలుగు గంటలకే బైలు దేరాను.

"ఏం తొందర?" అన్నారు అక్కడివాళ్లు.

"అక్కడ ఓ అబ్బాయి వున్నాడట. వెళ్ళి చూడని" అన్నారు భగవాన్.

కొండ దిగి ఎచ్చెమ్మ ఇంటికి వెళ్ళాను. అక్కడికి నీల కంఠం అనే అబ్బాయి తండ్రి వొచ్చారు. మా అమ్మాయిని చూసి నే నేమీ అనక ముందే ఆయన,



"మీ అమ్మాయిని మా అబ్బాయికి పెళ్ళి చేసుకుంటాను" అన్నారు. నేను సంతోషంగా వొప్పుకున్నాను.

పియాలీ వెళ్ళి, డబ్బు ఎట్లాగా అని ఆలోచిస్తున్నాను. ఎదురింటి ఆయన నన్ను పిలిచి,

"ఏమయ్యా, మీ అమ్మాయి పెళ్ళిట. నీ దగ్గిర డబ్బు ఎక్కడ వుంది? నన్ను అడగకూడదా? నేను ఇవ్వనా?" అని వెయ్యి రూపాయలు ఇచ్చారు. పెళ్ళి జరిగిపోయింది.

నాకు బరంపురం బదిలీ అయింది. అక్కడ నా కాలు మీద పంద కురుపులు లేచాయి. చాలా బాధపడుతో రాత్రింబవళ్లు అరుస్తున్నాను. ఏ వైద్యానికీ తగ్గలేదు. ఇంక అరుణాచలేశ్వరుడే గతి అని ఆ స్మరణలోనే వున్నాను, ఓ తెల్లారకట్ట ఎవరో తలుపు కొట్టారు.

"ఎవరు?" అన్నాను.

"అరుణాచలం" అన్నారు.

ఆశ్చర్యపడి తలుపు తీశాను. ఇద్దరు బ్రాహ్మణులు నిలుచుని వున్నారు. వాళ్ళ కాళ్ళమీద పడ్డాను.

"మేము అరుణాచలంనుంచి వొస్తున్నాము. ఉత్తర యాత్ర వెడుతున్నాము. భగవాన్ మమ్మల్ని దోవలో ఇక్కడ ఆగి మిమ్మల్ని చూసి వెళ్ళమన్నారు" అన్నారు.

వాళ్ళు భగవాన్ దూతలు అనిపించింది. వాళ్ళు నా

అవస్థచూసి సాంబ్రాణి, చింతపండూ నూరి కట్టారు. మర్నాడు ఒక్క కురుపు లేదు.

అప్పుడే శరణాగతి పాట రాశాను.

భగవాన్ తల్లి నిర్యాణ సమయంలో నే నక్కడనే వున్నాను. ఆమె ప్రాణం పోతున్నంతసేపూ ఆమె గుండె పైనా, తలపైనా చెయ్యి వేసుకుని కూచున్నారు, భగవాన్. ప్రాణం పోగానే, తనకి ఆ శరీరంతో ఏమీ సంబంధం లేనట్టు లేచి వెళ్ళిపోయినారు. ఆ దేహాన్ని తగల పెట్టాలా, సమాధి చెయ్యాలా అని ప్రశ్న వొచ్చింది. భగవానేమీ మాట్లాడ లేదు. వారిని అడిగితే, ''తీసుకుపోయి ఓ పొంతలో పారెయ్యండి,'' అన్నారు.

కాని తక్కినవారు పారెయ్యగలరా? ఆమె సమాధి పైనే ఇంత ఆలయం లేచింది.

మెల్లిగా ఏళ్ళు గడిచిన కొద్దీ, భగవాన్ కీర్తి ఎక్కువ కావడమూ, అధికంగా ప్రజలని ఆకర్షించడమూ, భగవాన్ని సమీపించడానికి వీల్లేకుండా ఆశ్రమ నిబంధనలు ఎక్కువ కావడమూ, పాత భక్తులం దూరం నించే వారిని చూచి అనుగ్రహం పొందడమూ సంభవించింది.

---

# రంగస్వామి

నా తలి తండ్రులు వ్యవసాయదారులు, మా వూరు అరుణా చలానికి 30 మైళ్ళు. వాళ్ళకి పుత్ర సంతానం లేక, వినాయకుడికి పూజలుచేసి నన్నూ, నా తమ్ముణ్నీ కన్నారు.

తిరువణ్ణామలైలో దీపోత్సవం చాలా విశేషమని విని, ఆ దీప సందర్శనం చెయ్యాలని పెద్ద నిలవలేని కుతూహలం కలిగి బైలుదేరాను. నాకప్పుడు ఇరవై ఒకటో ఏడు. ఆ ముందు రాత్రి నాకో కల వొచ్చింది. కౌపీనం ధరించిన ఓ సన్యాసి, చుట్టూ బ్రహ్మచారులతో, కొండ పక్క ఆశ్రమంలో నాకు దర్శనమిచ్చారు. ఆయన పెద్దపులి చర్మంపైన కూచుని వున్నారు.

ముప్పై మైళ్ళు. అతి వడిగా వెడుతున్నాను. అంత నడక నాకు అలవాటు లేదు. మధ్య ఓ పల్లెలో ఆగాను, తెలిసిన వారింటో. వారు నా వెర్రి వాలకం చూసి నన్ను వెళ్ళనద్దని, ఓ గదిలో పెట్టి తాళం వేశారు. కాలం మించి పోతోంది. నేను గోలపెట్టగా పెట్టగా చివరికి వొదిలారు. దీపం వెలిగించడానికి ఇంక రెండు గంటలసేపే టైముంది. పది హేను మైళ్ళు వెళ్లాలి. ఆ ఆవేశంలో నాకు వొళ్లు తెలీలేదు. ఒకటే పరుగుతీశాను. గాలి మీద ఎగిరిపోయినాను. సాయంత్రం అయిదన్నరకల్లా అరుణాచలం చేరాను, దీపం దర్శించుకున్నాను.



ఈశాన్య మఠానికి వెళ్ళాను. అక్కడ నన్నాదరించి ఉండ కున్నారు.

మర్నాడు పొద్దున్న గిరి ప్రదక్షిణం బైలుదేరాను. త్రోవలో రమణాశ్రమం. అందరూ భగవాన్ని చూడడానికి వెడుతున్నారు. నేనూ వెళ్ళాను, ఆయన్ని చూడగానే నా లోపల నుంచి వచ్చే ఆవేశం పట్టలేక ఏడ్చేశాను. నా మనసు లోపల ఎప్పుడు నాకీ బంధవిముక్తి కలుగుతుంది? అనే ప్రశ్న గట్టిగా ధ్వనించింది నన్ను. భగవాన్ చేతిని వూపి నన్ను కూచో మన్నారు. ఓ గంట వొళ్లుమరిచి కూచున్నాను. నాకు ఆశ్ర మంలో వుండిపోవాలనిపించి, చిన్నస్వామిని అడిగాను. ఆయన "చిన్నవాడివి, నీకేం పని చాతనవుతుంది? వెళ్ళు" అన్నారు. కాని నేను వదల్లేదు. "భగవాన్ నాకు బలాన్నిస్తారు. ఏ పని అన్నా చెప్పండి" అని నేను కదలలేదు. చివరికి ఆయన నన్ను పూలతోటలో కలుపు తియ్యమన్నారు. నేను ఇద్దరి మనుషులు పని చేసి చూపాను. భగవాన్ కూడా మెచ్చుకున్నారు. పని చెయ్యడం, ధ్యానంలో కూచోడం-అంతే. ఒకరోజు భగవాన్ని అడిగాను.

"స్వామీ, మోక్షానికి ఏం మార్గం?"

"వొచ్చిన మార్గమే."

ఆ మాట అనగానే నా మనసు ఆగిపోయింది. ఉప దేశ సారంలో పదో పద్యం చూపి చదువుకోమన్నారు.

తరవాత నాకు గుళ్ళో పూలు కట్టేపని పెట్టారు. అప్పుడే ఆశ్రమం చావిడి కడుతున్నారు. అందరమూ రాళ్ళు మోసాము. మాతో కలిసి భగవాన్ కూడా మోసేవారు. ఒక రాయి పడి నా వేలు చితికింది. అది బాగయ్యేనరకు నా బదులు భగవాన్ పూలు కట్టి పెట్టారు. తరవాత భగవాన్ పక్కన వుండే attendant గా నియమించారు నన్ను. మాధవస్వామి నేనూ ఇద్దరమూ ఆయన పరిచారకులం. మా ఇద్దరికీ చదువుకోమని అచ్చులోంచి వొచ్చిన చింకిరి కాపీలు రమణ విజయం పుస్తకాలు ఇచ్చారు. నా కాపీలో అన్ని పేజీలూ లేవు. ఆ పేజీలు కాపీ చేసుకోమన్నారు నన్ను. కాని నాకు వ్యవధి దొరకలేదు. ఒక రోజు అడిగారు, "కాపీ చేసుకున్నావా?" అని.

వ్యవధిలేక పోయింది అన్నాను.

"ఇప్పుడేం చేస్తావు?" అన్నారు.

"మీ కౌపీనం ఉతకడానికి పల్లాకత్తుకి వెడుతున్నాను" అన్నాను.

"సరే. నువ్వు నా పని చెయ్యి. నేను నీ పని చేస్తాను" అని ఆ పేజీలన్నీ కాపీ చేసి పెట్టారు.

ఆ రోజుల్లో ఎవరు ఏం అర్పించినా అది వెంటనే అక్కడే పంచిపెట్టి వెయ్యాలి. చీమలకి, ఉడతలకి, పిల్లలకి,



పిల్లులకి, కుక్కలకి, ఆవులకి, మనషులకి తినిపించేవారం. నిలవ వుంచడమనేది లేదు.

ఒకసారి భగవాన్ తిరగమాత వేస్తో నన్ను గరిటలో కాని వెయ్యమన్నారు. ఎక్కువ పడి జోలెడు నేలమీద పడ్డది. ఆ నూనెనంతా వారు నా వొంటికి రాసి 'పో, స్నానం చెయ్యి' అన్నారు.

ఒకసారి వేలూరు నించి జిల్లా కలెక్టరు గారు. భగవాన్ని దర్శించడానికి వొచ్చారు. దగ్గిరే ఉడత పిల్లలు వాటి గూట్లో వున్నాయి. వాటి తల్లిని పిల్లి తినేసింది. వాటి రక్షణ భగవాన్ పైన పడ్డది.

అన్నారు భగవాన్,

"ఆ పిల్లలకి తెలీదు, ఆ గూట్లో వుంటేనే తమకి సుఖము. ఎంతకీ బైటకి పోదామనే వాటి ప్రయత్నం. బైటనే అన్ని బాధలూ. కాని బైటికి పోకండా నిలవలేవు. అట్లానే మనసు బైటికి పోకుండా హృదయంలో నిలిచిపోతే ఏ చిక్కు లేదు. కాని వెళ్ళకుండా వుండలేదు" అని.

"దాన్ని గూట్లోనే ఆపడానికి మార్గమేమిటి" అన్నాను.

"ఇక్కడ నేను చేస్తున్నదే. ఉడతపిల్లలు బైటికి వొచ్చినప్పుడల్లా తీసి గూట్లో పడవెయ్యడమే. పడవెయ్యగా వెయ్యగా; అక్కడే ఆగిపోతాయి. అప్పుడు ఆనందంగా కూచోవచ్చు" అన్నారు.

నా తలి తండ్రులు నా కోసం వెతికారు, దీపానికి వెళ్ళినవాడు తిరిగి రాలేదేమిా అని. చివరకి సంవత్సరం తరువాత నన్ను కలసుకున్నారు. వొచ్చి భగవాన్ ముందు ఏడ్చారు.

"వొస్తే తీసుకు పొండి. నా ముందు ఏడవడ మెందుకు?" అన్నారు భగవాన్.

నేను రానన్నాను.

"మేము తపస్సు చేసి కన్నాము, అతన్ని. ఏ దేవుడు మా కిచ్చాడో, ఆ దేవుడే తన సేవకై అతనిని తీసుకున్నారు" అని వెళ్ళిపోయినారు.

కొన్నేళ్ళ తరవాత కాశీ పోయి రావాలని సంకల్పం కలిగింది. భగవాన్‌తో చెపితే—

"కాశీ – కాశీ అనే ఆ రెండక్షరాలూ మరచిపోతే, ఇదే కాశీ" అన్నారు.

"మరచిపోలేకుండా వున్నాను స్వామీ" అన్నాను.

"సరే, ఆ సంకల్పం తీర్చుకురా" అన్నారు.

చిన్నస్వామి వొప్పుకోలేదు.

కాని వెళ్ళాను. వాళ్ళూ వీళ్ళూ చందాలు వేసుకుని ఇచ్చారు డబ్బు. మూడు నెలలకు తిరిగి వొచ్చాను. చేర్చుకోడానికి వీల్లేదు పొమ్మన్నారు చిన్నస్వామి.



"వాడట్లానే అంటాడులే" అని నన్ను పనిలో చేర్చుకున్నారు భగవాన్.

ఒక రోజు సాయంత్రం భగవాన్ కొండ దిగి వొస్తున్నారు. నేను వెనక వొస్తున్నాను.

ఒక పాకీ అతను భగవాన్‌కి నమస్కారం పెట్టవొచ్చాడు. భగవాన్ అతనితో, "నీ పనిని నువ్వు శ్రద్ధగా చేస్తే అదే నమస్కారం" అన్నారు. అని భగవాన్ హాల్లోకి వెళ్ళారు. అక్కడ కూర్చున్నవారంతా లేచి నిలుచున్నారు. అందరు సాష్టాంగ నమస్కారాలు చేశారు. అందరూ కూర్చున్న తరవాత తోవలో జరిగింది వారికి చెప్పమన్నారు భగవాన్. చెప్పాను.

"ఈ కూర్చోడాలూ, నిలుచోడాలూ, నమస్కారాలూ కాదు అసలు నమస్కారం. ఎవరి పనులు వారు శ్రద్ధగా చెయ్యడమే నమస్కారం" అని భగవాన్ ఉపదేశించారు అందరికీ.

ఆశ్రమంలో వంట చేసే శాంతమ్మ పాటి భగవాన్‌కి తన చేత్తో వొడ్డిస్తేనే తృప్తి అనుకునేది. అందరికన్న భగవాన్‌కి ముందు వడ్డించేది. చూసి చూసి భగవాన్ "స్వామి ఉంటే ఈ దేహంలోనే కాదు; ఈ భక్తులలో ప్రతి వొక్కరిలో ఉన్నదీ స్వామే. అందరికీ వొడ్డించిన తరవాత చివరికి వొడ్డిస్తేనే ఈ స్వామికి ఇష్టం" అన్నారు.

రెండో పరిచారకుడు మాధవస్వామికి చెవులో ఆప
రేషన్. అంతపనీ నా పైన పడ్డది. స్నానం చేయించడం,
నైవేయిద్యాలు పంచడం, స్వామితో కొండపైకి వెళ్ళి
రావడం, రాత్రి మేలుకోవడం-అన్ని పనులూ. ఆ భారంతో
నా వొళ్ళు బావుండలేదు. ఆ సంగతి స్వామితో చెప్పాను. ఓ
రోజు రాత్రి స్వామి పాదాలకి తైలం మర్దన చేస్తున్నాను. ఆ
పాదంతో నా పొట్టమీద రుద్దారు. దాంతో నా జబ్బు
పోయింది. నా కెక్కడలేని బలం వొచ్చింది. అంత పనీ సుల
భంగా చేశాను, ఆ నెలలన్నీ.

ఒక సాయంత్రం నేనూ, భగవాన్ కొండ మీదికి
వెడుతున్నాం. తన వరండాలో కుర్చీ వేసుకుని వూగుతున్న
ఛాడ్విక్‌గారు నన్ను చూసి "రంగసామీ" అంటూ చప్పట్ల
శబ్దంతో పిలిచారు. ఏమిటని అడిగారు భగవాన్. చెప్పాను.
దానికి వారు—"ఇట్లా పెంచుకుంటారు అవసరాల్ని పశ్చిమ
దేశస్తులు. హాయిగా ఓ చాప పరుచుకుని కూచుంటే ఎంత
సుఖం!" అన్నారు.

——

# సుందరేశయ్యర్

భగవాన్ 1908 లో విరూపాక్ష గుహలో వుండేవారు. నా
12 ఏళ్లు. నా కజిన్ కృష్ణమూర్తి రోజూ భగవాన్ దగ్గర
వెళ్ళి తిరుప్పుగళ్ పాడి వొస్తూవుండేవారు.

"నువ్వెక్కడికి పోతావు రోజూ?" అని అడిగాను.

"అక్కడ కొండపైన అరుణాచలేశ్వరుడే ప్రత్య
రూపంలో కూచుని వున్నారు. నువ్వూ రా" అన్నారు.
అరుగుమీద కూచుని వున్నారు భగవాన్. వారి చుట్టూ
పదిమంది వున్నారు. ప్రతివారు ఏదో ఒక స్తోత్రం
పాడారు. నన్ను చూసి భగవాన్, "నువ్వూ ఒక స్తోత్రం
చెప్పవూ?" అని అడిగారు.

అప్రయత్నంగా సుందరమూర్తిస్వామి తేవారం ఒక
మనస్సులోకి వొచ్చి చదివాను.

"ఇంక అన్యమైన పట్టు ఏమీ లేకండా, నీ పాదా
పట్టుగా, నా మనసులో భావన చేస్తాను. ఇది నాకు దొ
నందువల్ల దుర్లభమైన నీ అనుగ్రహాన్ని సులభంగా పొందగలి
గాను. మహనీయులవల్ల స్తోత్రం పొందిన పరమేశ్వరు
నేను నిన్ను మరిచి పోయినప్పుడు కూడా నా జిహ్వ న
నమశ్శివాయ అని చెపుతూ వుండుగాక" అని దాని అర్థం.

"ఆ-ఆ. అదే చెయ్యవలె" అన్నారు భగవాన్.



దేశంగా భగవాన్ ఇచ్చినట్టు తోచింది నాకు. రోజూ
న్నాను వారి సన్నిధికి.

అప్పుడు నాకు 15 ఏళ్ళు వుంటాయి. రోజూ భగ
వాన్ని దర్శించే వాణ్ని అంత వరకు. అప్పుడు ఓ సారి అని
పించింది. "ఏం ప్రయోజనం ఈయన దగ్గిరికి రోజూ పోవడం
వల్ల! మానేస్తాను" అని మానేశాను.

కాలం గడిచింది. ఇక భగవాన్ని చూడకండా ఆగలేక
పోయినాను.

సరిగా నూట ఒకటో రోజు సాయంత్రం వెళ్ళాను.
అప్పుడు భగవాన్ స్కందాశ్రమంలో ఉండేవారు. నేనింకా
మెట్లుకింద ఉండగానే ధ్యానంలో కూచొని ఉన్న భగ
వాన్ నన్ను చూచి లేచి వొచ్చారు ఆశ్రమం గేటు దగ్గరకు.
నేను వారికి నమస్కారం పెట్టబోతో ఉంటే నా మనసు
ఆగక పెద్ద ఏడుపు వచ్చేసింది. ఆయన పాదాల్ని గట్టిగా
పట్టుకుని ఏడ్చాను. నన్ను లేవనెత్తి భగవాన్ అడిగారు—

"నువ్వు వొచ్చి సరిగ్గా నూరు రోజులయింది. ఏమయి
పోయావ్?" అని.

"ఏమిటి లాభం, ఆయన దగ్గరకు వెళ్ళి?" అనే ఆలో
చనవల్ల ఆగి పోయినా నన్నాను.

"పోనీ, లాభం లేకపోతే పోయింది లే. వచ్చిన నష్టం
ఏముంటుందిగా" అన్నారు, కన్నీళ్ళతో తడిసిన నా ముఖం కేసి
చూస్తూ.

ఎప్పుడు కొండపైకి వెళ్ళినా భగవాన్‌కి ఏదో ఒకటి

నై వేద్యంగా చేతులో పట్టుకుని వెళ్ళేవాడిని. ఆ రోజు ఏమీ లేదు. దిగులుగా భగవాన్‌తో—

"ఈ దినం తీసుకొచ్చేందుకు ఈ దరిద్రుడికి ఏమీ లేక పోయింది" అన్నాను.

దానికి భగవాన్ "తీసుకురాక పోవడమేమిటి! అసలు ఏం తీసుకురావాలో దాన్నే తీసుకొచ్చావు. తక్కిన వెందుకు!" అన్నారు.

ఏమిటా అని దిక్కులు చూస్తున్న నాతో "తెలీలేదా! నిన్ను తీసుకొచ్చావు. ఇంకేం అవసరం?" అన్నారు.

1920 ప్రాంతాలలో కావ్యకంఠ గణపతి శాస్త్రిగారు తిరువణ్ణామలైకి నివాసంగా వచ్చారు. ఆయన్నే అందరూ 'నాయనగారు' అని పిలిచేవారు.

అప్పటికే భగవాన్‌కి ప్రియమైన శిష్యులుఆయన. తిరువణ్ణామలై Town Congress President. నేను చిన్నప్పటి నుంచి Tilak movementలో పని చేసినవాణ్ణి. మహాత్మా గాంధీగారి ప్రణాళికలో నా కట్టే ఆశ కనిపించ లేదు. నేను నాయన గారి దగ్గిరికి వెళ్లి—

"ఈ Political activities వల్ల నా కేమీ ప్రయోజనం కనిపించటం లేదు. దేనికైనా ఈశ్వరుడి అను గ్రహం కావాలి. ఆ ఈశ్వరానుగ్రహాన్ని మీ బోటివారి తపశ్శక్తిచేత దేశముక్తికై సంపాదించాలి" అన్నాను.

"అవును. నా మతమూ అదే. దైవానుగ్రహాన్ని సంపాయిద్దాము. నువ్వు నా దగ్గిర వుండిపో" అన్నారు ఆయన.



నన్ను వేదాలు చదవమని, నాకు ఋగ్వేద సూత్రాలు నేర్పారు. పాఠము, అర్థమూ చెప్పారు.

నాయనగారు అప్పుడే మహేంద్ర సంఘాన్ని స్థాపించారు. ఈశ్వర జప తప హోమాలద్వారా దేశానికి స్వతంత్రం సంపాయించాలని దాని ముఖ్యోద్దేశం. ఇండియా అంతటా మెంబర్లు వున్నారు, ఓ పదివేలమంది. నేను సెక్రటరీని.

నాయనగారు అప్పుడు పది సంవత్సరాలు విరూపాక్ష గుహలో వున్నారు. పాలితీర్థం దగ్గర ఆశ్రమం ఏర్పడ్డదాకా భగవాన్ స్కందాశ్రమంలో వుండేవారు.

నాయనగారు తరుచూ భగవాన్ దర్శనానికి వచ్చేవారు. ఎక్కువ భగవాన్ నించి సందేహం తీర్చుకోడం, శాస్త్రవాదంతోనే సరిపోతుంది. అంతటి పండితులు అనేవారు, "భగవాన్ చెప్పే సూక్ష్మశాస్త్ర రహస్యాలు ఎంతటి బుద్ధిమంతులకు కూడా భగవాన్ అనుగ్రహం వుంటేనే గాని గ్రాహ్యం కావని—ఏమీ చదువురాని భగవాన్.

భగవాన్ ముందు ఎవరన్నా కళ్ళు మూసుకుని ధ్యానంలో కూచుంటే నాయన గారికి పడేదిగాదు.

"ఏమిటిది? సూర్యుడు అక్కడ వెలిగి పోతూవుంటే, ఆ వెలుగుని తీసుకోక, నేను ఎంతటి ధ్యాన పరుణ్నో అన్నట్లు ఆయన సమక్షంలోనే నీ దీపం వెలిగిస్తావేం?" అనేవారు.

భగవాన్ అనుగ్రహమయితేనేం, ముఖ్యం నాయన గారి మంత్రబోధ ఐతేనేం, ఆ రోజుల్లోనే అనేక దేవతా దర్శనాలైనాయి నాకు.

భగవాన్ స్కందాశ్రమంలో వుండగా భగవాన్ దగ్గిర ఒక నెమలి వుండేది. ఓ రోజు నల్ల త్రాచు వొచ్చింది. ఆ నెమలి తనని ఆహుతి చేసుకోడానికి వొచ్చిందనిపించింది. భగవాన్ పాము వంకచూచి,

“నువ్వెందుకురా ఇక్కడికి వొస్తావు? నిన్ను చంపేస్తాడు ఆ నెమలి, వెళ్లిపో” అన్నారు. పాము వెళ్లిపోయింది.

ఒకసారి విలక్షణానందస్వామి అనే వైష్ణవ గురువు వొచ్చారు అరుణాచలానికి. ఆయనకి పెద్ద శిష్యకోటి, తమిళ దేశమంతటిలో. ఆయన చాలా Powerful yogic Personality. గొప్ప ఆకర్షణ ఆయనలో. ఆయనకి గురువు లేరు. భగవాన్ వలెనే స్వయం గురుః. వారు నన్ను తనని భగవాన్ దగ్గిరికి తీసుకొని వెళ్ళమని అడిగారు. ముప్పైమంది శిష్యులతో వొచ్చారు. ఆయన భగవాన్‌కి నమస్కారమన్నా చెయ్యలేదు. చూస్తో నిలబడ్డారు. పది నిమిషాలు కదలకుండా అట్లా చూస్తోనుంచుని తటాలున సాష్టాంగ పడ్డారు. కళ్ళలో ధారలుగా నీళ్ళు.

“ఇంతవరకు ఈ శిరస్సుని ఎవరి ముందూ వొంచలేదు. ఇదే మొదటి సారిగా, ఇదే కడపటి సారిగా అనుగ్రహించు” అన్నారు.

అక్కడనించి కిందికి దిగివొచ్చి నాయనగారిని కలుసుకున్నారు. నాయనగారు ఆ స్వామి వారితో, “మీ శక్తిని మీరు మీ శిష్యుల మధ్య ప్రచారంలో, ఉపన్యాసాలివ్వడంలో, చర్చలలో వృథా చేసుకుంటున్నారు. దానిని సద్వినియోగం చెయ్యండి” అన్నారు.



అంతే. ఆనాటినుంచి విలక్షణానంద స్వామివారు తమ నిలయం నుంచి బైటికి రానేలేదు.

నాయనగారు ఉమాసహస్రం అనే గ్రంథాన్ని రచిస్తున్నారు. ఇంకా ఆ శ్లోకాలు పూర్తికావాలి. ఫలాని తేదీకి ఆ గ్రంథాన్ని అపీత కుచనాయకి పాదాలవద్ద సమర్పణ చేస్తామని అందరకీ దూర దూరాలు ఆహ్వానాలు పంపారు. కొన్ని వందలమంది వొచ్చారు. మర్నాడు ముహూర్తం. ఇంకా 300 శ్లోకాలూ పూర్తికాకుండా అట్లానే వున్నాయి. ఆ రాత్రి భగవాన్ అడిగారు—

“ఆ మూడువందల శ్లోకాలు రేపటిలోపల పూర్తి చేస్తారా? లేక ముహూర్తాన్ని Postpone చేస్తారా?” అని.

“రేపు తప్పదు...ఇప్పుడే పూర్తిచేస్తాను” అని భగవాన్ సన్నిధిలో ప్రారంభించారు. భగవాన్ స్వస్తితిలో మౌనంగా కూచున్నారు. నలుగురు మనుష్యులు రాయడానికి తయారుగా వున్నారు. నాయనగారు ఆశుధారగా చెపుతున్నారు, చాల వేగంగా.

రాత్రి 11-30 గంటలకి పూర్తిచేశారు. అంతవరకు కన్ను ఎత్తక అట్లానే కూచున్నారు భగవాన్. పూర్తికాగానే కన్ను తెరచి, “నాయనా, నేను చెప్పిందంతా రాశారా?” అని అడిగారు.

నాయనగారికీ తన వొంటిమీద, మనసుపైనా ప్రజ్ఞ లేదు అంతవరకు.

“అవును. నాయన చెప్పిందంతా వ్రాశాను” అన్నారు నాయనగారు. ఆ రాత్రి తాను చెప్పేటప్పుడు ఆ శ్లోకాలలో

వుండే అంతరార్థాలు నాయనగారికి తెలీనే లేదు. తరువాత కొత్తగా చూచుకొని అద్భుత పడాల్సి వొచ్చింది.

"ఓహో! అద్భుతంగా భగవాన్ హృదయంలో ప్రసవంతి ఉద్భవించి నా వాక్కు-ద్వారా ప్రవహించిం తెలుసుకున్నా" నన్నారు నాయన.

ఉమా సహస్రాన్ని తరువాత రోజుల్లో ఆరుసా Revise చేశారు. కాని ఆ 300 శ్లోకాల్ని తాకలేదు. వలసిన అవసరం కనపడలేదు. అవి అంత Perfect.

1926 లో నాయనగారు బెల్గాం ప్రాంతాలకి తపస్సు వెళ్ళిపోయినారు. వెడుతో నన్ను భగవాన్‌కి అప్పగించా చూచుకోమని. తరువాత ఉత్తరం రాశారు భగవాన్‌కి-

"నేను వొచ్చేశాక సుందరం పరమ దీనుడై పో వుంటాడు. అతనిపై మీా పరమ కృపను వుంచండి" అని.

"చూడు, ఈ ఉత్తరం. నువ్వెక్కడికీ వెళ్ళకు. నా వొచ్చి నా సుందరం ఎక్కడ అంటే నేను తిరిగి నిన్ను అప్ప చెప్పకపోతే పూరుకోరు" అన్నారు భగవాన్ నాతో.

నేను నా నివాసం ఆశ్రమములోనే పెట్టుకున్నా నెలాఖరున నా జీతం ఇంట్లో ఇచ్చే సేవాణ్ణి. అదే నా కుటు నికీ, నాకూ సంబంధం.

1929 లో భగవాన్‌ని అడిగాను- ఇంకా పరిశో చెయ్యమంటారా అని. భగవాన్ నాకు మహావాక్య స్యాలు కూడా బోధించారు. ఆ నాటి నుంచి 1938 నేను అప్రయత్నంగా బ్రహ్మదృష్టిలో వున్నాను. ప్రాపంచి



దృష్టి లేకుండానే వ్యవహారాలన్నీ నా ఉద్యోగంతో సహా నిర్వర్తించాను. అది భగవాన్ అనుగ్రహం.

నా 36 వ పుట్టినరోజు నాడు "నాకింకా ఈశ్వర దర్శనం కాలేదు భగవాన్" అనే అర్థంతో ఓ పద్యం వ్రాసి ఇచ్చాను, భగవాన్ చేతికి.

కూచోమన్నారు నన్ను.

దివ్యదృష్టి ననుగ్రహించారు. లోకం మాయమై దాని స్థానంలో White silver screen లాగ అయింది.

నా లోపల ఓ Voice-

"నీకు ఏం చూడాలని వుందో అవన్నీ చూడు" అంది.

రామచంద్రుడి దర్శనం కావాలనుకున్నాను. రామ పట్టాభిషేక దర్శనమయింది. ఓ గంట సేపైన తరువాత బాహ్యదృష్టి వొచ్చింది.

"దక్షిణామూర్తి అష్టోత్తరం చదివావా?" అని అడిగారు భగవాన్

"లేదు."

పుస్తకం తీసి Last few names చదవ మన్నారు. ఆ నామం యోగ పట్టాభి రామాయ నమః అని వుంది.

"రాముడన్నా దక్షిణామూర్తి అన్నా ఒకటే" అన్నారు భగవాన్.

ఓ రోజు భగవాన్ నాకు వేదాంతంలో అర్థం కావడం కష్టమైన ఒక విషయాన్ని విడమీసి చెపుతున్నారు. సమయం 10-45 అయింది. కాలాన్నే మరచి పోయినాను. భగవాన్ చప్పున అన్నారు-

"ఇదేమిటి? నువ్వు బడికి వెళ్ళలేదే! మరచిపోయి
నావా?"

"కాదు భగవాన్, ఇవాళ ఆదివారం."

"ఇట్లాగేనా నువ్వు పని చేసేది? మంచివాడివి! ఇవాళ
సోమవారం. తొరగా పో, మీ హెడ్మాష్టరు గేటు దగ్గిర నిల
బడి నీ కోసం చూస్తూన్నారు" అన్నారు.

నేను పరుగెత్తాను. సరిగా అట్లాగే నిలబడి ఆలయం
దారి వేపు చూస్తున్నారు హెడ్మాష్టర్, నేను వొస్తున్నా నేమో
నని. నేను దగ్గిరికి రాగానే ఆయన–

"ఏమండీ, ఇవాళ సోమవారమని మరచిపోయిన
న్నారు. ఏ వారమో మహర్షి మీకు జ్ఞాపకము చెయ్యాలి
వొచ్చిందా?" అన్నారు.

"అవును. జరిగింది అదేను' అన్నాను. హెడ్మాష్టరు
గారు నవ్వారు.

తమిళంలో భగవాన్ రాసిన పుస్తకాలన్నీ కలిపి ఒక
టిగా అచ్చు వేయించాలని చూస్తున్నారు. ఆ పుస్తకాని
ఉపోద్ఘాతం రాయించాలని అందరూ అన్నారు. కాని ఎవరి
ఆ అర్హత లేదని అనుకున్నారు. పండితుల్ని అడిగారు ఆశ్రమం
వారు. వారు రాస్తామన్నారు గానీ, ఎవరు అంటే, ఎవరు
నువ్వంటే నీవని వాదించుకున్నారు. రాత్రి పదిన్నరకి
అట్లా వెడుతు వుంటే భగవాన్ నన్ను పిలిచి,

"పోనీ, ఆ ఉపోద్ఘాతం నువ్వెందుకు రాయకూడదు!"
అన్నారు.



"భగవాన్ ఆశీర్వాదముంటే రాయడానికే"మన్నాను.

"సరిగానే వొస్తుందిలే రాయి" అన్నారు.

వెంటనే ప్రారంభించాను. ముప్పావు గంటలో ముగిం
చాను. అంతసేపూ నా కలాన్ని ఎవరో నడిపిస్తూన్నట్టే అని
పించింది. తెల్లారకట్ట రెండింటికి ఆ ఉపోద్ఘాతాన్ని భగవాన్
పాదాల ముందు పెట్టాను. మెచ్చుకున్నారు నేను రాసిన విధా
నాన్ని.

"సరే. తీసుకుపో" అని, నేను వెడుతో వుంటే వెనక్కి–
పిలిచారు.

నా ఉపోద్ఘాతానికి చివరి వాక్యం "ఈ పుస్తకం చదివే
సాధకులకి పరమానంద స్వరూపమైన మోక్షాన్నిస్తుందని
ఆశిస్తున్నాను" అని రాశాను.

"ఆశించడమేమిటి? నిశ్చయంగా ఇస్తుంది అని దిద్దు"
అన్నారు. అంటే ఆయన అనుగ్రహం శాశ్వతానందాన్ని కలి
గించి తీరుతుందని భావం. దాంట్లో ఏ సందేహమూ లేదని
సూచించారు కరుణామయులైన భగవాన్.

పెరూ దేశం నుంచి భార్యా భర్తా వొచ్చారు ఆశ్ర
మానికి. వాళ్ళు భగవాన్ని దర్శించి తమ కథ నంతా చెప్పు
కున్నారు. భగవాన్ విషయం చదివి నప్పటి నుంచి జీసస్
తిరిగి భూమికి అవతరించినట్టుగా భావించి, ఆయనని దర్శించు
కోవాలని ఆశించారు. కాని డబ్బు లేదు. ప్రతి వారమూ
తమ జీతంలో కొంత దాచి కొన్నేళ్ళకి స్టీమర్లో చాల బీద
ప్రయాణీకుల కింద బయలు దేరారు. కొన్ని నెలలు ప్రయాణం

అవస్థలు పడ్డారు. వారి చరిత్ర నంతా భగవాన్ జాగ్రత్తగా విని——

"ఇన్ని కష్టాలుపడి ఇంత దూరం ఎందుకు వొచ్చారు? అక్కడ నించి నన్ను తలుచుకుంటే సరిపోదా? ఇక్కడికి వొచ్చి నన్ను చూచినంత ఫలితమూ, తృప్తీ అక్కడే కలిగేది కద మీకు?" అన్నారు.

భగవాన్ మాటలు వారికి అర్థం కాలేదు.

సాయంత్రం భగవాన్ వాళ్ళతో మాటల్లో ఆ దేశం సంగతులూ, అక్కడ వారు దినమంతా ఏంచేస్తూ వుంటారో ఆ వివరాలన్నీ అడుగుతున్నారు. వాళ్లూ, ఆ వూరూ, సముద్రం, బీచీ-ఇవన్నీ వర్ణిస్తున్నారు. భగవాన్, "మీ వూరి బీచి చలవరాతి పలకలతో పరిచారు కాదూ? మధ్య మధ్య కొబ్బరి చెట్లు నాటారు. అవునా?" అన్నారు. వాళ్లకి చాల ఆశ్చర్యమయింది.

"మహర్షికి ఎట్లా తెలుసు?" అన్నారు.

"నాకు తెలిస్తే నేం? ఆత్మకి దూరమూ, కాలమూ అనేవి లేవని మీకు తెలిస్తే చాలు" అన్నారు.

అప్పుడు వాళ్లకి అర్థమయింది-వాళ్ల వూళ్ళో నించే భగవాన్ని తలుచుకున్నా, ఆయన కృప ఎలా వాళ్లతో వుండ గలదో.

భగవాన్ భక్తుడు మహాదేవయ్యర్ ఓ నెల రోజుల నుంచి మద్రాసులో ఎక్కిళ్లతో బాధ పడుతున్నారు. ఆ జబ్బు నయం చెయ్యమని ఆయన కూతురు భగవాన్ని ప్రార్థిస్తూ ఉత్తరం రాసింది.



బెల్లమూ, శొంటి పొడుం నూరి తింటే ఎక్కిళ్లు నయమౌతాయని వ్రాయమని, మాధవస్వామి (పరిచారకుడు) వేపు తిరిగి——

"తయారు చేసిన మందు మన దగ్గిర వుండాలి కదూ?" అని అడిగారు. మాధవస్వామి ఆ బుడ్డి తీసుకొచ్చాడు. దాన్ని కొంచెం భగవాన్ తీసుకొని భక్తులకి కొంచెం పంచి పెట్టారు.

నేను నవ్వుతూ అన్నాను కదా——

"ఇంకా ఉత్తరం కూడా ఎందుకు? మహాదేవయ్యర్ కి ఈ పాటికి ఎక్కిళ్లు నయమై వుంటాయి" అని. ఆ సాయంత్రమే ఉత్తరం రాశాను. కాని ఆ ఉత్తరం అందకుండానే, మర్నాటికే ఉత్తరం వొచ్చింది-మధ్యాహ్నం ఒంటి గంట నించి అయ్యర్ గారికి ఎక్కిళ్లు కట్టాయి అని. సరిగా అదే టైం భగవాన్ మందు తిన్నది.

ఆశ్రమంలో ఒకరు కొబ్బరికాయలు కోస్తున్నారు. భగవాన్ గోశాల నించి వొస్తూ చూశారు. ఆ కాయ లకే కర్రకి కొంకి 'వెదురా, ఇనుమా' అని అడిగారు. ఇనుప కొడవలి కట్టానని అతను చెప్పాడు.

"ఇనుప కొడవలితో పట్టి పీకితే చెట్టుకి గాయం కాదా? వెదురు ముక్క కడితే చాలునే" అని భగవాన్ వెళ్లి పోయినారు. రోజూ అతను మాత్రం కొడవలితో నే కాయల్ని పీకుతున్నాడు చెట్టు నుంచి. వారం రోజుల్లో అట్లా

కోసేటప్పుడు ఓ కాయ అతని ముక్కు మీద పడ్డది. ముక్కు చితికింది. భగవాన్ ఆ సంగతి విని,

"ఆ చెట్టుని తాను కొడవలితో ఎంత బాధిస్తున్నదీ ఇప్పుడు తెలిసి వొస్తుంది" అన్నారు.

ఆ రోజు శివరాత్రి, సాయంత్రం పూజలన్నీ అయినాయి. భోజనం తరువాత భగవాన్ హాల్లో సోఫాపైన కూచున్నారు. చుట్టూ భక్తులు కూచున్నారు. ఒక సాధు నమస్కరించి భగవాన్ని ప్రార్థించారు—

'ఈ రోజు శివరాత్రి. మాకు భగవాన్ దక్షిణామూర్తి స్తోత్రం అర్థం అనుగ్రహిస్తే మా జన్మలు తరిస్తాయి' అని.

'సరే. అలాగే కూచోండి' అన్నారు భగవాన్.

అందరమూ చాల ఆతృతగా వినడానికి కూచున్నాము. భగవాన్ మా వంక చూస్తున్నారు మౌనంగా. అట్లా కూచున్నాము అందరం నిశ్శబ్దంలో. మాలో భగవాన్ కలిగిస్తున్న నిశ్శబ్దంలో గడియారం గంటలు కూడా వెళ్లిపోతున్నాయి. తొమ్మిది, పది, పదకొండు, పన్నెండు, ఒకటి, రెండు... ఎవరూ కదలలేదు, మాట్లాడ లేదు, కాలం లేదు, స్థలం లేదు. శాంతిలో, మౌనంలో ఎనిమిది గంటలు నిలిపారు అందర్ని. ఆ విధంగా మౌనంలో పరమబ్రహ్మతత్వం, దక్షిణామూర్తి స్తోత్రంలోని పరమార్థాన్ని బోధించారు. నాలుగు కొట్టిం తరవాత అన్నారు భగవాన్—

'దక్షిణామూర్తి స్తోత్రం అర్థం ఇప్పుడు తెలిసింది కద!' అని. ఆనందాన్ని ఆపుకోలేక ప్రణమిల్లారు భక్తులు.



భగవాన్ పచ్చయమ్మ కోయిలలో వుంటూ వుండే రోజుల్లో, ఓ రోజు మద్రాసునుంచి వారి భక్తులు రంగస్వామి అయ్యంగారు వొచ్చారు, మధ్యాన్నం వొంటిగంటకి మండు టెండలో. ఆలయము ఎదురుగా వుండే కొలనికి స్నానానికి వెళ్ళారు. అదంతా అడవి. ఎవరూ లేరు. హాయిగా స్నానం చేస్తున్నారు అయ్యంగారు.

భక్తులతో మాట్లాడుతున్న భగవాన్ చప్పున లేచారు. ఆ చెరువు దగ్గిరికి వెళ్ళారు. అక్కడికి ఓ చిరుతపులి వొస్తోంది, దాహం తీర్చుకోవడానికి. అయ్యంగారు అవతల వొడ్డున స్నానం చేస్తున్నారు. చిరుతని చూడలేదు.

"ఇపుడు పోయి కొంచెం ఆగి తరువాత రా. నిన్ను చూసి అయ్యంగారు భయపడతారు" అన్నారు భగవాన్. చిరుతపులి వెళ్ళిపోయింది.

Knowless అని ఒక ఇటలీ దేశపు ఆయన వొచ్చారు భగవాన్ దర్శనానికి. ఆయన పూర్వ పశ్చిమ వేదాంతాన్ని గట్టిగా చదివారు. చాల Discussions చేశారు భగవాన్‌తో. ఒక రోజు వాదనలో భగవాన్ ఆయనతో జీవన్ముక్తి స్థితిని గురించి మాట్లాడుతున్నారు. Knowless గారు భరించలేక—

"సరే భగవాన్, ఇప్పుడు మీరు నాతో మాట్లాడుతున్నారా లేదా? ఇది వాస్తవమే కద?" అని అడిగారు. ఏం చెప్తారో భగవాన్ అని అందరూ ఎదురు చూస్తున్నారు.

"లేదు. నీతో నేను యిప్పుడు మాట్లాడటం లేదు," అని

చాల గట్టిగా అన్నారు భగవాన్. ఆ మాటలు విని Knowless పొంగిపోతో—

“అవును. శ్రీ భగవాన్ నాతో మాట్లాడడం లేదు. భగవాన్ మాట్లాడరు. శ్రీ భగవాన్ ఉంటారు అంతే” అన్నారు.

Eye specialist ఒకాయన మద్రాసునుంచి ఆశ్రమానికి వొచ్చారు. భగవాన్ కళ్ళజోడు Power సరిపుచ్చాల్సి వుందని జ్ఞాపకం వొచ్చి చిన్నస్వామి భగవాన్ అద్దాల్ని తెప్పించి చూపారు ఆయనకి. ఆయన వాటిని పరిశీలించి తన స్వంత కళ్ళ జోడు భగవాన్ కళ్ళకి సరిగా సరిపోతుందన్నారు. నేను ఆ డాక్టరు కళ్ళ జోడును తీసుకొని భగవాన్ దగ్గిరికి వెళ్లాను. సరిగా భగవాన్ చూపుకి సరిపోయింది కాని, దాంటో దూరం చూపుకూడా అద్దాలున్నాయి. భగవాన్‌కి చదువుకి మాత్రమే అద్దాలు అవసరం. ఆ సంగతి భగవాన్ అదివరకే చెప్పారు. నేను తిరిగి వొచ్చి చిన్నస్వామితో చెప్పాను, ఆ అద్దాలు భగవాన్‌కి సరిపోయినాయని, ఆ అద్దాలు భగవాన్‌కి ఇయ్యమని డాక్టర్ని వొప్పించాము.

డాక్టరుగారి అద్దాలు తీసికొని భగవాన్ దగ్గిరికి వొచ్చాను. భగవాన్ ఆ అద్దాలు ఉపయోగించడానికి వొప్పుకోలేదు. చిన్నస్వామి ఆజ్ఞని పరిపాలించాలనే ఆత్రుతలో నేను ఆ డాక్టరు కళ్ళ జోడు తీసుకోమని బుద్ధి లేకండా భగవాన్ని Press చేశాను. భగవాన్ నా వంక చూసి,

“హుం. నేను వొద్దన్న వాటిని నేను తీసుకోవాలని అట్లా బలవంతం చేస్తావేమిటి?” అన్నారు.



తిరిగి వెళ్ళిపోయినాను. అది జయంతి ముందు రోజు. జయంతి పనులలో తిరుగుతున్నాను. కాని భగవాన్నించి వొచ్చిన నిమిషం నించి ఓ పెద్ద మంట ప్రారంభించింది నాలో. చాలా బాధగా వుంది. ఏం చేస్తున్నా ఆ మంట నన్ను కాల్చేస్తోంది. జయంతి అయిన మర్నాడు ఇంక ఆ బాధని భరించలేక హాల్లోకి పరుగెత్తుకుని వెళ్ళాను. హాలంతా భక్తులతో కిక్కిరిసి వుంది. భగవాన్ తన ఆనందంలో మునిగి కూచుని వున్నారు ఎక్కడో చూస్తూ. నేను తటాలున సాష్టాంగపడి—

“భగవాన్! నాపై క్షమాపణని అనుగ్రహించండి. నేరం చేశాను. ఆ కళ్ళ జోడు తీసుకోమని నేను మిమ్మల్ని బలవంతం చేసింది అపరాధం. నా మీద హుంకరించారు. తమ హుంకారం నా వెంటబడి కాలుస్తోంది. నేను తట్టుకోలేను. మూడు రోజులు రాత్రింబవళ్ళు భరించాలని చూశాను. ఇంక నా చేతకాదు. మీరు నన్ను శిక్షించలేదు. నా కర్మే నన్ను కాలుస్తుంది. నన్ను కరుణాదృష్టితో చూచి ఈ అగ్నిని ఆర్పండి” అని గొంతెత్తాను.

భగవాన్ నా వంక చూచి “ఏమిటి ఇదంతా! నాకు మీమీదేం కోపం రాలేదే! గొడవ పడకు. కూచో, అంతా సర్దుకుంటుంది” అన్నారు. చాలా పశ్చాత్తాపంతో చిన్న పిల్లవానివలె ఏడ్చాను. పది నిమిషాల్లో నా బాధంతా పోయింది.

మాణిక్య వాచకర్ మధురలో పాండ్యరాజు దగ్గర మంత్రిగా వుండేవారు. రాజు డబ్బిచ్చి మంత్రిని వెళ్ళి వెతికి

ప్రశస్తమైన గుర్రాల్ని కొనుక్కు రమ్మన్నాడు. గుర్రాల కోసం వూళ్లు తిరుగుతూ వుండగా, ఒక గ్రామంలో ఈశ్వరుడు మాణిక్య వాచకర్‌కి దర్శనమిచ్చి, అక్కడే తనకి ఓ ఆలయం కట్టమన్నారు. తన దగ్గర వున్న రాజుగారి ధనంలో ఓ ఆలయం కట్టించి, భక్తుల్ని పోగుచేసి భగవత్ సంకీర్తనలో కాలం గడుపుతున్నారు మాణిక్య వాచకర్. రాజ భటులు వొచ్చి గుర్రాల సంగతి జ్ఞాపకం చేశారు.

'దేవుడా, ఏం చెప్పను రాజుకి? మాయా ప్రపంచం నా నెత్తిమీద పడ్డది' అన్నారు మాణిక్య వాచకర్. ఈశ్వరుడు కనపడి—

'వెళ్ళు. రాజుతో చెప్పు. నెల లోపల గుర్రాలు వొస్తాయి,' అని అన్నారు.

మాణిక్యవాచకర్ వెళ్ళి ఆ ప్రకారం రాజుతో చెప్పి అక్కడే వున్నారు. నెల అయింది. అడవిలో తోడేళ్ళ నన్నిటినీ పంచకళ్యాణి గుర్రాలుగా మార్చి రాజుగారి దివాణానికి తోలుకుని వొస్తున్నారు పరమేశ్వరుడు, గుర్రాల కాపరి వేషంతో. ఆ గుర్రాల్ని చూసి రాజు ఆనందభరితుడైనాడు. ఆ గుర్రపు కాపరి 'గుర్రాలు ఇవుగో, నేను వెడుతున్నాను' అన్నారు. రాజు ఆ కాపరిని చూసి విడువలేక నమస్కరించాడు.

రాత్రికి గుర్రాలన్నీ తోడేళ్లై అడవిలోకి పారిపోయినాయి.

రాజు ఉగ్రుడై, తనని మోసం చేశాడని ఎండలో పెట్టి కొట్టమన్నాడు మంత్రిని.



ఒక వారం కొట్టారు. మాణిక్యవాచకర్ ఒకటే ఏడ్చారు, ఈశ్వరుడితో చెప్పుకుని.

మధుర పట్నం పక్కన వున్న వైఘునదిలో అకస్మాత్తుగా వరదలు తెప్పించారు ఈశ్వరుడు. పట్టణం మునిగి పోవడానికి సిద్ధమయింది. ఊరివాళ్ళని నదికి కట్ట వెయ్యమన్నాడు రాజు. ఇంటికి ఒకరు చొప్పున వొచ్చి మన్ను తవ్వి పొయ్యాలి. ఒక ముసలి వితంతువు పుట్టు కుడుములు చేసి అమ్ముకునేది. ఆమెకి తన ఇంటి తరపున పంపడానికి ఎవరూ లేరు. ఎట్లాగా అనుకుంటో ఈశ్వరుణ్ణి తలుచుకుంది. పరమేశ్వరుడు వడ్డెవాడై వొచ్చి వాకిట నిలిచారు, కూలివాడు కావాలా అని అరుస్తో.

"నీకేమి కూలి ఇవ్వాలి?" అని అడిగింది ముసలమ్మ. "నువ్వు చేసే కుడుముల్లో విరిగి ముక్కలైనవి నాకు కూలి కింద ఇయ్యి, చాలు" అన్నాడు కూలి. ఆ ముసలమ్మ సరే నంది సంతోషంతో. ఆమె చాల నేర్పరి. ఏ కుడుమూ ముక్కలు కాదు ఆమె చేస్తే. చాల మంచి బేరం అనుకుంది. అతను కట్ట వెయ్యడానికి నది దగ్గరికి వెళ్ళిపోయినాడు.

ఆ నాడు ఇక్కడ ఆమె కుడుములన్నీ ఎన్ని చేస్తే అన్నీ విరిగిపోయినాయి. ఆ వడ్డెవాడు పనికి వెళ్లాడే కాని తన వంతుకు వచ్చిన కట్టను వెయ్యనే లేదు. ఇంటికి వచ్చి పుట్టు కుడుముముక్కలన్నీ తిని ఒక నీడలో పడుకొని నిద్రపోతున్నాడు. రాజు తనిఖీకి వచ్చి, పని చెయ్యని కూలిని చూచి కర్రతో కొట్టాడు. ఆ వడ్డెవాడిని కొట్టిన దెబ్బ రాజు వీపుమీద,

మంత్రుల వీపుమీద, అక్కడ వున్నవారి వీపులమీద, దేవ
లోకంలో ఈశ్వరుడి వీపుమీద తగిలింది. ఆ కూలీఅతను
కనపడ లేదు. రాజు మంత్రి పాదాల మీద పడ్డాడు, క్షమించ
మని.

ఒక రోజు నా భార్య దోసెలు చేస్తోంది. "విరిగిన
వన్నీ కూలి ఈశ్వరుడికి" అని నవ్వుతూ వెళ్లిపోయినాను.
ఆకలితో దోసెలు తినాలని ఇంటికి వచ్చాను. "అన్ని దోసెలు
ముక్కలైవొచ్చాయి"అని ఆ ముక్కల్ని చూపింది నా భార్య.
ఏం చెయ్యను? ఏమి అనకండా భగవాన్ దగ్గరికి తీసుకొని
పోయి వారి ముందర పెట్టాను.

"ఏమిటిది?" అన్నారు.

"నా భార్య దోసెలు చేస్తోవుంటే నవ్వులాటలకి నేను,
మాణిక్యవాచకర్ కథలో మల్లే,విరిగినవన్నీ ఈశ్వరుడికి అని
వొచ్చాను. ఒక్కటీ సరిగా రాలేదు. ఈ ముక్కలన్నీ మీవి
గనక మీకు తీసుకొచ్చాను" అన్నాను. నవ్వుతో ఆయన
నాలుగు ముక్కలు తిని, తక్కినవి భక్తులకు పంచి పెట్టించారు.

ఓ ఉదయం భగవాన్ స్నానం చేసి అడ్డంగా కట్టిన
వెదురు గడకి ఆరేసిన తన తువ్వాలుని తీసుకోబోయినారు.
అటు కొనాన ఆ గడ కర్రపైన ఓ పిచ్చిక గూటిని కట్టుకుని
మూడు గుడ్లు పెట్టింది. తువ్వాలు తీసుకుంటూ వుంటే భగ
వాన్ చెయ్యి తగిలి గూడు వూగి ఓ గుడ్డు కింద పడ్డది. వారు
తన పరిచారకుడు మాధవుడితో,

'చూడు చూడు, ఈ ఉదయం నన్నెటువంటి పాపం



చుట్టుకొందో!" అంటో కింద పడ్డ ఆ గుడ్డుని తీసి పరీక్షిం
చారు. అది చితక లేదుగాని పగుళ్లు వారింది. పెద్ద పగుళ్ళు.

"పాపం, ఆ తల్లి తన గుడ్డు చితికిందని ఎంత ఏడు
స్తుందో! తన గుడ్డుని నాశనం చేశానని నా మీద కోప
గిస్తుంది కూడాను. ఈ పగిలిన గుడ్డు అతుక్కొని పిల్ల అవు
తుందా? చూద్దాం" అంటో ఓ గుడ్డ పేలికని ఆ గుడ్డు చుట్టూ
చుట్టి ఆ పిట్ట గూట్లో పెట్టేశారు.

ప్రతి మూడు గంటలకీ ఓసారి ఆ గుడ్డుని తీసుకుని తన
అమృత హస్తంలో పెట్టుకుని, కొన్ని నిమిషాలు మౌనంగా
దానివంకనే చూస్తున్నారు. చూసి మళ్ళీ ఆ పేలికని చుట్టి
గూట్లో పెడుతున్నారు. తన చూపుతో ఏంచేస్తున్నారో!
ప్రాణాన్ని ప్రతిష్టించే చూపుల్ని ఆ గుడ్డులోకి ప్రసరింప
చేస్తున్నారో, ఆ చల్లబడ్డ గుడ్డులో వేడిని పునః ప్రవేశ పెడు
తున్నారో!

ప్రతిసారి అంటూ వుంటారు భగవాన్, "ఈ
పగుళ్ళు అతుక్కుంటాయా? ఇది మళ్ళీ పిల్ల అవుతుందా?"
అని. ఇట్లా దయగా, తల్లికన్న శ్రద్ధతో సాకారు ఆ గుడ్డుని
ఓ వారం రోజులు. ఎనిమిదో రోజున ఆ పీలికని తీసేసి, చిన్న
కుర్రాడు సంతోషంతో ఎగురుతున్నట్టుగానే "చూడండి,
చూడండి. పగుళ్లు అతుక్కున్నాయి. ఇంక తల్లి వ్యసన పడదు.
ఈ ప్రాణాన్ని తీసిన పాపంనించి ఈశ్వరుడు నన్ను రక్షించారు.
ఎప్పుడు పిల్ల బైటికి వొస్తుందో చూడాలి" అంటో ప్రతి
రోజు ఆ గూటిని కనిపెట్టే వున్నారు. ఓ రోజు ఆ గుడ్డు పగిలి

పిచ్చిక పిల్ల బైటికి వొచ్చింది. ఆ పరీక్షిత్తుని భగవాన్ తన చేతుల్లోకి తీసుకొని, చేతులతో తడిమి ముద్దుచేసి, సంతోషంతో అందరి చేతుల్లో పెట్టి, తిరిగి తీసుకొని తల్లికి అప్ప చెప్పారు.

ఒకసారి ఒక భక్తుడు భగవాన్ని గణపతిశాస్త్రిగార్ని కలిసి తీసిన ఫోటో కావాలని భగవాన్ని ప్రార్థించారు. భగవాన్ సరేనన్నారు.

బావిదగ్గర కంబలి పరచి దానిపైన సోఫా తెచ్చి పెట్టారు. భగవాన్ కొండనించి సరాసరి వచ్చి సోఫా మీాద కూర్చున్నారు. శాస్త్రులవారు వొచ్చి వారి పాదాలవద్ద కంబలి పైన కూచున్నారు. భగవాన్ ఆయన్ని తన పక్కన సోఫా మీాద కూచోమన్నారు. దానికి శాస్త్రిగారు వొప్పుకోలేదు. భగవాన్ వొంగి తన చేతులతో శాస్త్రిగారిని పైకిలాగి తన ప్రక్కన కూచోపెట్టుకున్నారు. ఫోటో తీశారు. ఆ సంగతి ఆశ్రమాధికారులకు తెలిసింది,

"నువ్వు ఎంతవాడివని భగవాన్‌తో సమానంగా కూచు న్నావు?" అంటో గణపతిశాస్త్రి గారితో పోట్లాడారు.

శాస్త్రిగారు "నేనేం చెయ్యను? భగవాన్ బలవంతం చేశారు" అన్నారు.

"భగవాన్ మాయావి.ఎవరి మనస్సులో ఏది దాక్కొని వుంటుందో దాన్ని బైటికి తీసుకొస్తారు.నీకు లోపల ఆ కోర్కె, ఆ అహంభావం ఉండనే ఉంది. నీదంతా అహం. నువ్వు



అహంలో నిండావు" అంటో గణపతిశాస్త్రి గారిని చాల నిందించారు. దూషించారు.

ఆయన ఆశ్రమం వదలి తన తోవన వెళ్ళిపోయారు. ఆ ఫోటో కాపీలు అందరూ తీసుకున్నారు. ఆ ఫోటో చూసి అధికారులు మండిపడి ఆ negetive ని పగల కొట్టించి ఎవ రెవరు కాపీలు తీసుకున్నారో వారి నందర్నీ ఆ కాపీలు తమకి అప్ప చెప్పమని ఆజ్ఞాపించారు. చాలమంది నిరాకరించారు. వారి నందర్నీ ఆశ్రమానికి రావడానికి వీల్లేదని నిషేధించారు. భగవాన్ని చూడకుండా బతకలేక కొందరు కాపీలు ఇచ్చేశారు. ఇవ్వనివారు కొండమీాదకు వెళ్ళేప్పుడు భగవాన్ని కలుసు కుంటున్నారు. ఆశ్రమం వారు చేసింది భగవాన్‌తో చెప్పు కున్నారు.

"ఫోటో తీయించుకున్నట్టు ఎందుకు వారికి తెలియ నిచ్చారు? తీరా తెలిసింతరువాత వారి కోపానికి మీారు శ్రమ పడుతున్నారు" అన్నారు భగవాన్. చివరికి ఆశ్రమంలో భగవాన్ని చూడకుండా నిలవలేక తమ ఫోటో కాపీలని ఆశ్రమం వారికి సమర్పించుకున్నారు. అసలు ఫోటో తీయిం చిన ఆయన మాత్రం ఇవ్వలేదు. ఆయన త్వరలోనే ఆత్మ హత్య చేసుకున్నారు.

ఒకసారి మళయాళం నించి ఒక వేద పండితుడు వచ్చి భగవాన్ ముందు శుక్ల యజుర్వేదం చదివాడు. ఈ దేశంలో ఉన్నదంతా కృష్ణ యజుర్వేదం. అది విన్న తరువాత భగ

వాన్ "ద్రావిడ వేదం మీరు ఎప్పుడన్నా విన్నారా?" అని అడిగారు. ఆ పండితులు తెల్లబోయినారు.

"మా సుందరేశ్ చదువుతాడు వినండి," అని నన్ను చూపారు. నేనదివరకు ఒకసారి భగవాన్ తమిళంలో రాసిన 'ఉన్నది నలుబది'ని వేదస్వరాలకి కూర్చి భగవాన్ ముందు చదివి వారిని ఆనందపరచాను.

అది చదివాను ఇప్పుడు.

అదెక్కడ దొరుకుతుంది? ఎవరు రచించారు? అది ఎంత ప్రాచీనము-ఇట్లాంటి ప్రశ్నలు కురిపించారు ఆ పండితులు. దానికి నేను-

"ఇది రమణోపనిషత్" అన్నాను. అందరూ నవ్వారు.

గాంధీగారి హత్య రోజుల్లో ఒక బ్రాహ్మడు భగవాన్ హాల్లోకి వచ్చి ఉగ్రంగా చూస్తో "గాడ్సే గాంధీని చంపి వినుకెక్కాడు. నేను నిన్ను చంపి కీర్తి కెక్కుతాను" అని బెదిరించాడు భగవాన్ని.

"చంపు నాయనా, నాకీ దేహ భారం తప్పిపోతుంది" అన్నారు భగవాన్.

హాల్లోవాళ్ళు అతన్ని అటకాయించి తోసెయ్యాలని చూశారు. కాని, భగవాన్ అతన్ని తన దగ్గరే ఉంచుకొని తనతో భోజనానికి తీసుకొని వెళ్లారు. రెండు రోజులు ఆశ్రమంలో ఉండిపోయినాడు అతను. మూడో రోజున అతను భగవాన్ దగ్గరకు పోయి—

"నన్ను క్షమించండి. నాకు మతి స్థిమితం వుండు



తప్పి పోతో ఉంటుంది. నా మతి సరిగ్గా వుండేట్టు ఏదన్నా ఉపదేశించండి" అన్నాడు.

గాయత్రి చెయ్యి అన్నారు భగవాన్. కొన్ని నెలలో తిరిగి వచ్చాడు అతను, పిచ్చి అంతా పోయి-గొప్ప భక్తితో.

పార్వతి ఈశ్వరుడి శరీరంలో అర్ధ భాగాన్ని వాంఛించి అరుణాచలం పైన తపస్సు చేస్తున్నది. మహిషాసురుడు గొప్ప శివభక్తుడు. శివలింగం అతని కంఠంలో వుంటుంది. దాన్ని సదా ఆరాధిస్తాడు. కనుక అతను కంఠారాధుడు. అతను పార్వతిని మోహించాడు. పార్వతి అతన్ని సంహరించింది. ఆ సందర్భంలో ఆ అసురుడి కంఠంలోని లింగం పార్వతి చేతిలోకి వచ్చింది. కాని అది చేతినించి వూడిరాదు. అప్పుడు పార్వతి ఈశ్వరుణ్ణి ప్రార్థించింది. పార్వతిని ఆమె చేతిలోని ఖడ్గంతో అక్కడ వున్న రాతిపైన కొట్టమన్నారు ఈశ్వరుడు.

కొట్టగానే తీర్థమయింది. దానిపేరే ఖడ్గతీర్థం. దాంటో స్నానం చేసేప్పటికి లింగం వూడి ఒడ్డున పడ్డది. లింగాన్ని అక్కడే ప్రతిష్టించమన్నారు ఈశ్వరుడు. అదే ఈ వూరి ఈ దుర్గ గుడి. ఆ గుడి శిథిలమైతే దాని ధర్మకర్తలు బాగుచేయిస్తున్నారు.

ఆ కాలంలోనే ఒక రాత్రి భగవాన్ గిరి ప్రదక్షిణం చేస్తో ఆ దుర్గాలయం దగ్గరకువచ్చి లోపలికి వెళ్ళారు. అక్కడ ఉన్న శ్రీ చక్రాన్ని చూచారు. రాత్రి రెండుగంటలు. అక్కడి కావలి అతను ధర్మకర్తతో చెప్పాడు; ధర్మకర్త వచ్చాడు. భగవాన్ అతనికి ఆ చక్రాన్ని చూపి దాంట్లో లోపం ఉంద

న్నారు. వారు ఆ శిల్పిని అప్పటి కప్పుడు పిలిపించారు. భగవాన్ అక్కడే కూర్చుని శ్రీ చక్రాన్ని సవరింప జేశారు. సూర్యోదయం లోపల పని పూర్తయింది. భగవాన్ తన చేత్తో ఆ శ్రీ చక్రాన్ని ప్రతిష్ఠించారు.

ఆ రోజు అమావాస్య. భోజనశాలలో అందరూ ఇడ్లీ కాఫీకి కూర్చుని ఉన్నారు. నేను నుంచుని చూస్తున్నాను. భగవాన్ నన్ను చూచి,

"ఏం సుందరేస్, నువ్వు కూచోవేం?" అన్నారు.

"భగవాన్! ఇవాళ పితృతర్పణం రోజు."

"ఎందుకు పితృతర్పణం? నీ తలి దండ్రులు ఇదివరకే ఊర్ధ్వలోకాలకి వెళ్లారు. ఇప్పుడు నువ్వు తర్పణం వదిలి వాళ్ళని పైకి పంపవలసిన అవసరం లేదు, తిను" అన్నారు. అలవాట్లకి బానిసలం కద? నేను కదల లేదు. భగవాన్ లేచి వచ్చి నా చెయ్యి పట్టుకుని లాగి కూచోపెట్టి ఇడ్లీ తినిపించారు.

ఆ నాటి నించి నేను అమావాస్యకి పితృతర్పణం చెయ్యడం మానేశాను.

ఒకసారి చిన్నస్వామికి నామీద అమితమైన కోపంగా ఉంది. ఆ దినలులో నేను రాత్రి భోజనం చెయ్యలేదు. తెల్లారి ఆకలిగా ఉంది. ఆశ్రమంలో నిలువ మనస్కరించ లేదు. భగవాన్ తెల్లారకట్ల ఇడ్లీ చేస్తున్నారు. వెళ్ళి నమస్కరించాను.

"ఏమిటి సమాచారం?"

"టవునుకు వెడతాను."



"ఎందుకు?"

"పిల్లలు ట్యూషన్‌కు కాచుకుని ఉంటారు."

"తెలుసు. నాకు తెలుసు నీ దొంగతనం. ఆదివారం నాడు నీకు ట్యూషన్ ఏమిటి? ఎవరికి చెప్పతావు? సంగాయం సాంబారు చేశాను మధ్యాహ్నానికని. ఇప్పుడే నీకు వేసిపెడతాను. రా. తిను. పద. కూచో" అని తొందరగా విస్తళ్ళు వేశారు. తానూ నా ప్రక్కన కూచుని నా దిగులు మరచి పోయేట్టు ఎన్నో కబుర్లు చెప్పి నవ్వించారు. అట్లాంటిది భగవాన్ కరుణ.

నా రెండో కొడుకు సోమరి. చదునడు. అతను S. S. L. C. పరీక్షకు వెళ్ళడానికి ముందు రోజు ఒక Fountain Pen కొని తీసుకొచ్చి భగవాన్ ముందు పెట్టాడు. "ఎందుకిది?" అని అడిగారు భగవాన్.

"మీరు చేత్తో తాకి నాకియ్యండి."

"ఏమి విశేషం?"

"నేను పరీక్షకు వెడుతున్నాను. Pass కావడం కోసం."

"చదివితే Pass అవుతావు. నువ్వు చదనవు. ఎట్లా Pass అవుతావు?"

"చదువెందుకు? మీరు Bless చేస్తేచాలు." నవ్వి ఆ కలంతో ఓసారి వ్రాసి తిరిగి ఇచ్చారు భగవాన్.

అతను pass అయినాడు.

ఆశ్రమంలో ఆ రోజుల్లో నేనే Foreign Corres- Podenceచూసి జవాబులు ఇచ్చేవాణ్ణి.ముందుDraftతయారు

చేసి భగవాన్ ముందు పెట్టి వారి Suggestions తీసుకొని వాటిని ఆ ప్రకారం మార్చి పంపేవాణ్ణి. కొంత మంది క్లిష్టమైనవి వివేకవంతమైన ప్రశ్నలు పంపేవారు. ముఖ్యం పరదేశాల నుంచి. ఆ ప్రశ్నలకు భగవాన్ సూచనల ప్రకారం నేను వ్రాసిన జవాబులు చాల విలువైన ఆధ్యాత్మిక గ్రంథ మౌతుందనుకునే వాణ్ణి. నా జవాబుల Office Copies భద్రంగా Office లో ఉంచాను. ఒకసారి భగవాన్‌కి కారప్పూస ఇచ్చారు ఆశ్రమం వారు. ఆ కారప్పూస దేంట్లో ఇచ్చారో ఆ కాయితం చూశారు భగవాన్. అది నేను భద్రంగా దాచిన ఆ ఉత్తరాల రికార్డు లోంచి చించినది. ఆధ్యాత్మిక విషయాలపై ఆశ్రమం వారికి అంత భక్తి శ్రద్ధలు.

నన్ను పిలవమన్నారు భగవాన్. ఆ కాగితం చూపి ఉగ్రులైనారు. ఎంత కోపమో! భగవాన్ కోపానికి హడలి పోయినాను. పైగా అటువంటి రికార్డు నాశనమయిందని నా దుఃఖం. ఆఫీసులో కనుక్కుంటే ఆ తప్పంతా నాదేనని తేల్చారు. వాళ్ళకి చీమ కుట్టినట్టు లేదు.

ఒకసారి డబ్బుకావలసి వచ్చింది చిన్నస్వామి ఆశ్రమంలో తలపెట్టిన పనులకి. కొందరు పెద్దలు ఆశ్రమం నుంచి బయలుదేరి రిటైర్డుజడ్జి సుందరం శెట్టియార్ని కలుసుకొని అందరూ కలిసి మైసూరు మహారాజుగారిని డబ్బు అడగాలని చిన్నస్వామి నిశ్చయించారు. నన్నుపోయి ఆ సంగతి భగవాన్‌తో చెప్పమన్నారు చిన్నస్వామి.



"నాకు భయం. ఆ పని నా వల్ల కా"దన్నాను. వీల్లే అన్నారు.

ఇంకొకటి చేస్తానన్నాను. ఆ విషయమంతా సుందరం శెట్టియారుకు ఒక ఉత్తరం వ్రాసి భగవాన్ ముందు పెట్టాను. ఆ ఉత్తరాన్ని చూసి భగవాన్ ఎంత అసహ్య పడ్డారో! ఆ కాగితాన్ని పెంటని తాకినట్టు దూరంగా పారేసి,

"ఎప్పుడూ డబ్బు, డబ్బు. బతుకంతా అంతే. తెల్లారి లేస్తే డబ్బు. నువ్వూ నీ స్వామీ కట్టకట్టుకుని ఏట్లో పడండి" అన్నారు.

ఆశ్రమానికి మునిసిపల్ వాళ్ళు పన్ను వేస్తామన్నారు. విలువ లేదని అర్జీ పెట్టారు. మునిసిపల్ కౌన్సిలులో ఆశ్రమానికి విరోధులైన ఒక పార్టీ ఉండేది. ఈ విషయం ప్రతి మీటింగుల్లో చర్చించటమూ,వాయిదా వెయ్యడమూ జరుగుతోంది. అవతల పార్టీ వారికి ఆశ్రమాన్ని తిట్టడమే పని. ఒక మీటింగుకు నన్ను ఆశ్రమ ప్రతినిధిగా పంపారు చిన్నస్వామి. నేను వెళ్ళేప్పటికి కౌన్సిలు మీటింగు జరుగుతోంది. ఈ ఆశ్రమం విషయం కౌన్సిలు ఎదుటికి రాగానే నేను-"భగవాన్, నువ్వు అందరి హృదయాల్లోనూ వున్నావు. నిన్నూ, ఆశ్రమాన్ని తిట్టే వారి హృదయాల్లోనూ ఉన్నావు" అని నాలో అనుకుని, నమస్కరించుకున్నాను. అంతే. కౌన్సిలు వాళ్ళు వేసిన పన్నుని తీసేశారు. ఏ ఒక్కరినించీ ఏ అభ్యంతరమూ రాలేదు.

నేను భగవాన్‌ని నిర్గుణ బ్రహ్మంగా స్తుతిస్తో ఒక తెలుగు పద్యం వ్రాశాను. అటు తరువాత రూపంలో ఉన్న

ఈశ్వరుడుగా వర్ణిస్తో ఒక పద్యం వ్రాసి "ఎవరినించి అనుగ్రహం చరాచరాలపైన నిరంతరం ప్రసరిస్తుందో" అని వ్రాసి భగవాన్‌కి వినిపించాను. భగవాన్ విని "అట్లా కాదు" అని, దాన్ని సరిచేశారు.

ఒక్క మాటే మార్చారు. అందులో ఒక అక్షరమే. ఆ మార్పుతో "ప్రసరిస్తుందో" అనేది కాదు, "ప్రసరింప చేస్తున్నారో" అన్న అర్థం వచ్చింది.

అంటే, సూర్యునివలె కాంతి పడటం కాక, ఆయన ఇష్ట ప్రకారం తగినవారని తనకు తెలిసిన వారిపైన ప్రసరింప చేస్తున్నారనే అర్థం వచ్చింది. ఉత్త indeterminate illumination కాక directed illumination అని అర్థం.

ఒకసారి ఒక భక్తుని ద్వారా నాకో offer వచ్చింది. షోలాపూర్‌లో Jewish refugees కి ఇంగ్లీషు ఉపాధ్యాయుడిగా. పెద్ద జీతం. వొవ్వుతున్నాను. Appoinment order వొచ్చింది. దాన్ని భగవాన్‌కి చూపాను.

"ఏం ఉద్యోగం? ఎట్లా వచ్చింది?" అని అడిగారు. చెప్పాను.

"సరే, వెళ్లు" అన్నారు.

గడప దాటానో లేదో లోపల్నించి పెద్ద వణుకు, భయం వచ్చాయి—"ఏం చేస్తున్నావు? నీ గురువు సన్నిధానం వొదిలి వెళ్ళిపోతున్నావా?" అని.



వెనక్కి వెళ్లి భగవాన్ పాదాలపైన పడి "భగవాన్! మిమ్మల్ని వదలిపోలేను" అని ఏడ్చాను. భగవాన్ నవ్వి అక్కడ ఉన్న వారితో "చూడండి. ఇరవై ఏళ్లనించి ఇతను ఇక్కడ ఉండి తెలుసుకుంటున్నాడు. ఇతడట, ఈనాడు భగవాన్ లేని స్థలానికి వెడుతున్నానని దుఃఖపడుతున్నాడు. భగవాన్ లేని స్థలానికి వెళ్లగలడా, ఈయన!" అని నన్ను హేళన చేసి నవ్వించి, వెళ్ళమని encourage చేసి శలవిచ్చిపంపారు.

స్కూలునించి శలవైతే పెట్టాను కాని నాకు షోలాపూర్ వెళ్ళడానికి డబ్బు ఏదీ?

అహమదాబాదు నుండి ఒక కోటీశ్వరుడు, బజాజ్, ఆశ్రమానికివచ్చి భగవాన్‌కి ఓనూరు ప్రశ్నలు రాసి ఇచ్చారు. భగవాన్ ఓపికగా వాటికి జవాబులు చెప్పారు తమిళంలో. దగ్గర ఉన్న వారు దానిని ఇంగ్లీషులో తర్జుమా చేసి చెపితే ఆయన వ్రాసుకొన్నారు.

మర్నాడు నేను బళ్ళో వుండగా ఒక పెద్ద కారు వచ్చింది నా కోసం, భగవాన్ నన్ను తీసుకు రమ్మన్నారని. వెళ్ళుతున్నానని స్కూలులో చెప్పి భగవాన్ సమక్షానికి వచ్చాను. భగవాన్ నన్ను బజాజ్ గారి బసకి వెళ్ళి, ఆయన వ్రాసుకొన్న విషయాలన్నీ తర్జుమాలో పొరపాట్లు దిద్ది వివరణచేసి పొమ్మన్నారు. ఆ పని ఆరు గంటలు పట్టింది. ఆయన నా శ్రమకి ప్రతిఫలంగా ముప్పై రూపాయ లివ్వబోయినారు.

"ఇది భగవాన్ కార్యం. నేనేమీ తీసుకో"నన్నాను. కాని, వారు పూరుకోక భగవాన్ దగ్గరకు వచ్చి చెప్పారు. భగవాన్ "తీసుకో! షోలాపూర్ రైలు ఖర్చుకు పనికి వస్తుంది" అని అన్నారు. తీసుకొన్నాను. ప్రయాణమై బెంగళూరు వెళ్ళాను. బయలుదేరడమే 104 డిగ్రీల జ్వరంతో బయలుదేరాను. ఆ వూళ్ళో నా చెల్లెలూ, కుమారుడు వున్నారు. రోజూ జ్వరం ఎక్కువవుతూంది. వెళ్ళవద్దని ఏడ్చారు వాళ్ళిద్దరు. ఎంతకాలానికి జ్వరంపోలేదు. ఉద్యోగానికి రాజీనామా నిస్తో వైరు పంపాను. మర్నాటికి జ్వరం తగ్గింది. నేను జీతం నష్టంపైన ఒక సంవత్సరం శలవు పెట్టాను. కాని, ఆ లోటు లేకండా బెంగళూరులో బోసుగారు ఒక సునాయాసమైన ఉద్యోగం ఇచ్చారు. కాని, భగవాన్ నించి దూరంగా ఉండలేక భగవాన్ దగ్గరకు త్వరలో వచ్చేశాను.

---

# ఓరుగంటి వెంకటకృష్ణయ్య

మా కుటుంబమేదో విధంగా మతంతోనూ, ఆధ్యాత్మిక చింతతోనూ గట్టి సంబంధమున్న కుటుంబం. మా మేనత్త భర్త చివుకుల వెంకటశాస్త్రిగారు రమణ గీతలో భగవానుని ప్రశ్నించిన వారిలో ఒకరు. చిన్నతనంలోనే వారింట్లో రమణ గీతా, రమణ చరిత్రా చదవడమూ, భగవాన్ ఫోటో చూడడమూ అయింది.

నా బి. యల్. చదువు కాలంలో మద్రాసులో కాంగ్రెస్ జరుగుతూ వుంటే యస్. దొరస్వామి అయ్యర్ గారి యింటి హాలులో నాయనగార్ని అంటే కావ్యకంఠ గణపతి శాస్త్రిగారిని చూశాను. గాంధీ ఆశ్రమం నుంచి వచ్చిన చతుర్వేదుల కృష్ణగారితో వారు మాట్లాడుతున్నారు. కృష్ణగారు ఆబ్దికాలు నిష్ప్రయోజనమనీ, తాను పెట్టడం లేదనీ వాదిస్తున్నారు. దానికి నాయనగారు శాస్త్ర ప్రమాణం చూపుతూ గట్టిగా చివాట్లు పెడుతున్నారు. ఆ నాయనగారి ఆకారమూ, శాస్త్ర వచనాన్ని ఆయన రూఢిచేసి చెప్పే విధమూ చూచి బాగా ఇంప్రెస్ అయినాను. ఆయన a man out of the ordi-anory అనిపించింది.

కృష్ణ "ఏమైనా అసలు వీలు వుండవొద్దా? గాంధీ ఆశ్ర



మంలో తద్దినం పెట్టాలంటే బ్రాహ్మలెవరు దొరుకుతారు?" అని అడిగారు.

"నువ్వే గట్టిగా శ్రాద్ధం పెట్టతలుచుకుంటే బ్రాహ్మడు దొరికి తీరతాడు. అంతా శ్రద్ధలో వుంది" అన్నారు నాయన.

"రేపే మా తల్లి శ్రాద్ధం. నేను పెడతానన్నా నాకు సిద్ధంగా భోక్తలెవరున్నారు?"

"లేకేం? నేను ఒకణ్ణి."

"రెండో వారు?"

నాయన చుట్టూ చూచారు. ఓ ఇరవై మంది ఉన్నారు అక్కడ. ఓ మూల కూచున్న నన్ను చూపి "ఆ అబ్బాయి రెండో బ్రాహ్మణుడు" అన్నారు.

నేను బ్రాహ్మణ్ణి అని కూడా తెలీదు కదా ఆయనకి. నాకు చిత్రం వేసింది.

"మూడో అతను?"

"అగ్ని."

అంటే అగ్ని, శాస్త్రులవారూ, నేనూ—ముగ్గురం అగ్నులం అన్నమాట. నన్ను వారితోనూ, అగ్నితోనూ కలపడం నాకు గర్వం కాదా!

మర్నాడు తద్దినంలో నాయనగారే మంత్రాలు చదివారు. అవి వింటోవుంటేనే గొప్పగా అనిపించింది నాకు. ఏదో చెప్పలేని ఒక గొప్ప సంచలనం కలిగి, సాయంత్రం వరకు నాలో అట్లాగే వుంది.

కొద్ది రోజుల్లోనే పెద్దలలో ఒకరు నాయనగార్ని నెల్లూరు పిలిపించారు ఉపన్యాసాలకై. నేను కలుసుకున్నప్పుడు

ఆయన మాట్లాడుతూనే నా కళ్ళల్లోకి చూస్తూ వుండి పోయి నారు. నేనూ ఆయన కళ్ళల్లోకి చూసి,ఆ వేడి ఇంక చూడలేక కళ్ళు తిప్పుకున్నాను.ఆ సంచలనంతో నాకు రాత్రంతా నిద్ర లేదు. ఎర్రటి కళ్ళతో మర్నాడు ఆయన ఎదటపడి చెప్పాను, రాత్రి నేను బాధ పడ్డానని.

"నువ్వెంత వాడివో పరిశీలించాను" అన్నారు.

"ఏం పరిశీలనో, నేను చాలా బాధపడ్డాను."

"నా వుద్దేశం అదికాదుగా! అయినా నేను తెలుసు కుంటే నీకు పిచ్చెక్కించలేనా?" అన్నారు.

వారు అంతటి వారని నాకే సందేహమూ లేదు.

ఆయన ఆకారమే చూపేది ఆయన ఎవరో మహా పురుషుడని, ఆయన ఎవరో తెలీని వారికి కూడా. కొట్టవచ్చే పెద్ద నుదురు, తేజోవంతమైన పెద్ద కళ్ళు, ఆయన గడ్డం తీరు అంతా Ancient Hebrew prophet లాగు వుండేవారు. కంఠం మాత్రం కొంచెం పీల కంఠం.

ఈయనే ఇంతవారైతే ఈయన గురు వెంతవారో అనుకున్నాను.

మొదటిసారి అరుణాచలం 1929 లో వొచ్చినప్పుడు వేంకట రామిరెడ్డి గారూ, నేనూ వూళ్ళో భోజనం చేసి ఆశ్ర మానికి చేరాము. అప్పుడు హాలూ, తల్లి సమాధిపైన పాకా, భోజనశాల–అంతే వుండేవి. భగవాన్ భోజనం చేస్తున్నారు. మమ్మల్ని చూడగానే కన్నులు చిన్నవి అదో చిత్రమైన చూపు చూశారు.

"భోజనం చేశారా?" అని అడిగారు.



వూళ్ళో భోజనం చేసానని చెప్పాను.

"ఇక్కడే భోజనం చేసి వుండవొచ్చే" అన్నారు.

రెండు రోజులున్నాను. చాలా కాలం వరకు ఆయన మహాత్ముడనే దృష్టితోనే వుండేవాణ్ని. ఆ రోజుల్లో చాలా వరకు ఆయనే నంట. ఆయన వెంటనే వుండేవాళ్ళం. వారు అన్నమే రాత్రిళ్ళు ఆశ్రమంలో. వెళ్ళేప్పుడు అడిగాను స్వామిని–

"భగవాన్! నాకేమన్నా మంచి మార్గం చూపండి."

"ఇప్పుడేం చేస్తున్నారు?"

"మనసు పొంగినప్పుడు త్యాగయ్య కీర్తనలు పాడు కుంటాను, గాయత్రి జపం చేస్తాను."

"సరే, అట్లాగే గాయత్రి జపం చేసుకోనండి. ప్రాణా యామం చెయ్యండి!"

నేను వెడుతూ వుండగా నా వెనకే,

"అద్వైతదృష్టి మానకండి" అన్నారు.

ఆ మాటలు నాకర్థం కాలేదు అప్పుడు.

మళ్ళీ రమణాశ్రమానికి వెళ్ళేలోపల ఆ ఒకటిన్నర సంవత్సరంలో ఐదారుసార్లు అరవిందాశ్రమం వెళ్ళాను. కాశీకి వెళ్ళి ఓ నెల వున్నాను. మళ్ళీ అయిదు నెలలు పుదుచ్చేరిలో గడిపాను కాని పుదుచ్చేరి సముద్రతీరాన్నైనా, గంగా తీరాన్నైనా భగవాన్ తీక్షణమైన చూపు కళ్ళకు పొడ కట్టుతోనే వుండేది.

ఇతరచోట్ల 'నీ శరీరము దుర్బలము,యోగానికి తగవు'

అన్నారు. భగవాన్ నా యోగ్యతను అడగలేదు. నా చంచ
లాన్ని దండించ లేదు. కాని నా మట్టుకు నేను చూసుకుంటే
భగవాన్ ముందు నిలబడడానికి మాత్రం నాలో ఏ యోగ్య
తలున్నాయి? లేకపోతేనేం ? నా భగవాన్ రాముడంతటి
వాడు. ఒకమారు ప్రసన్నుడైతే చాలు, నీ వాడనని యాచిస్తే
చాలు, తన వానిని చేసుకుంటాడు.

1930 లో రెండోసారి వొచ్చాను రమణాశ్రమానికి.
ఆ సారి ఓ నెల వుండి పోయినాను. తెల్లవారు జామున లేచి
పాలి తీర్థం బావి దగ్గర స్నానం చేసి, కుంపటిపైన నైవేద్యం
వొండి, అమ్మ (భగవాన్ తల్లి) సమాధిపై లింగానికి పూజ
చేసేవాణ్ణి. చిన్నస్వామి (భగవాన్ తమ్ముడు) మంత్రాలు
చదివేవారు. భగవాన్ రోజంతా మా ప్రక్కనే నేల మీగే
కూచునేవారు మాలో వొకరిగా. తాను తయారు చేసిన
గరిటెలు, కమండలాలు మొదలైనవి మాకు చూపేవారు.
కబుర్లు చెప్పేవారు. అప్పుడు వేదాంతం ప్రశ్నలడిగేవారు
ఎవరూ లేరు. సాయంత్రం బావి దగ్గిర కొయ్య మంచం మీద
కూచుని భగవాన్ మౌనంగా అరుణాచల శిఖరాన్ని చూస్తూ
వుండేవారు. చుట్టూ కూచునే వాళ్ళం మేము. చీకట్లు దట్ట
మైన కొద్దీ భగవాన్ తేజస్సు హెచ్చేది. అలివేలమ్మ తిరుప్పు
ఘళ్ పాడేది. ఆ నిశ్శబ్దం చాలా గంభీరం.

రాత్రి భోజనాంతరం గోష్టి ప్రారంభమయ్యేది. భగ
వాన్ వేదాంతం కథలు కబుర్లు చెప్పేవారు, పరిహాసాలు చేసే
వారు, నవ్వించేవారు. అప్పుడు "మన" భగవానే. రాత్రి
ఎంత పొద్దు పోతుందో ఎవరికీ తెలిసేది కాదు, చివరికి మా



వుడు స్వామి వెనక నిలబడి, వారికి తెలియకుండా మూగ
సౌజ్ఞలతో మమ్మల్ని వెళ్లి నిద్ర పొండని ప్రార్థించిందాకా.

1930 లో మళ్ళీ వచ్చాను రమణాశ్రమానికి. ఆ రోజు
ల్లోనే నరసింహ అయ్యర్ గారు భగవాన్ జీవిత చరిత్ర రాయ
డానికి భగవాన్ నుంచి, భక్తుల నుంచీ విషయాలు పోగు
చేస్తున్నారు. ఆయన దగ్గిర రాతప్రతి rough గా తయారై
వుంది. దాన్ని చదివాను. చదవగానే ఇట్లాంటిది తెలుగులో
రాస్తే బాగుంటుందనిపించింది. భగవాన్ అనుజ్ఞ అడిగాను.
రాయమన్నారు. ఆయన ఇంగ్లీషుని ఆధారం చేసుకొని తెలు
గులో రాసి సిద్ధం చేసేశాను ఆ నెల రోజుల్లో.

తరవాత వీలైనపుడల్లా, కోర్టుకి శలవలు ఇచ్చినపుడల్లా
రమణాశ్రమానికి వచ్చే వాణ్ని. ఆశ్రమానికి దగ్గిరగా పరిచి
తుణ్ని అయినాను. భగవాన్‌తో సహా అందరూ కిష్టయ్య
వచ్చాడు అని సంతోషంతో ఆహ్వానించే వారు. ఆ కాలంలో
భగవాన్ మాతో చాలా స్వేచ్ఛగా, మాలో ఒకరుగా వుండే
వారు. ఆయన ఏదన్నా రుబ్బడమో, నూరడమో ముగు
స్తోందనగా చుట్టూ చేరేవాళ్ళం. ఆయన చేత్తో అందరికీ
రుచికి తలా కాస్తా పంచుతారు. అదే ప్రసాదం కింద తీసు
కుంటాను.

నే నెప్పుడూ ఆయనతో వేదాంతం మాట్లాడ లేదు.
ఏ సందేహాలు అడగ లేదు. ఈ సృష్టి, పుట్టు పూర్వోత్తరాలు
తెలుసుకోవాలని ప్రయత్నించ లేదు. ఆయనతో నాకు
personal and emotional touch. కాని ఇతర్లు ఆయన్ని
ప్రశ్నించినప్పుడు వాళ్ళకి ఆయన చెప్పే జవాబులు

జాగ్రత్తగా వినేవాణ్ణి. ఆయన ముందు నే నెప్పుడూ పాడలేదు. ఎన్నేళ్ళున్నా, ఎంత ప్రయత్నించినా నా గొంతు పెగిలేది కాదు. ప్రతివాళ్ళూ పాడేవారు—గొప్ప పాటకులూ, స్వరమంటే ఏమీ తెలీనివాళ్లూ. కాని, నాకు పాటని నిరాకరించినట్లయింది. అదొక్కటే. తక్కిందంతా స్వేచ్ఛ నాకు ఆయన దగ్గిర. నేను ఆశ్రమంలో పనులు చేసేవాణ్ణి. సరదాకి నీళ్లు చేదడం, పువ్వులు కొయ్యడం, కాని భగవాన్ ఎదట కాదు. ఆయనతో కలిసి పనులు చెయ్యనిచ్చేవారు కాదు, భగవాన్. నేను లేని సమయంలో మా అమ్మ ఆశ్రమానికి వెడితే, ఆమె ఎవరో తెలుసుకోక ముందే భగవాన్

"కిష్టయ్య అమ్మ వచ్చింది. మాధవా, ఫలహారం పెట్టు" అన్నారట.

ఆ మాట తీసుకొచ్చి మా అమ్మ చెపితే ఎంతగా కరిగి పోయిందో మనసు నాకు.

భగవాన్‌తోనే కబుర్లు. ఆయనతోనే భోజనం. ఆయన హాల్లో ఆయనతోనే నిద్ర. ఇట్లా గడిచేది కాలం.

మొదటినుంచి నాకు ఆయన గొప్ప వ్యక్తి అని భావం. కాని దేవుడు అవతారం అని ఇట్లాంటివి ఏమీ వుండేవి కావు. మనం బాగుపడడం వీరి చేతుల్లో వుంది, ఈయనపైన ఆధారపడవచ్చు అనే విశ్వాసం, ఆయనతో స్నేహం, ఆయన మీద ప్రేమ. నన్ను ప్రత్యేకమైన శ్రద్ధతో చూచి కట్టేసుకున్నారు ఆయన. తండ్రిపైన వుండే ప్రేమ నాది. ఏ కష్టమైనా ఆయనతో చెప్పుకోవచ్చు. ఆయన తీరుస్తారు. కష్టం వస్తే "రమణా"



అంటే సరి. కలలో భగవానో, ఆయన చెయ్యో కనపడి ఆ బాధని తుడిచేసినట్టు అనిపించేది. అంతే. బైటిదిగాని, మనసుదిగాని, వొంటిదిగాని తీరిపొయ్యేది బాధ.

ఆయన రుబ్బుతో వుండగా ఓ సారి, కూరలు తరుగుతో వుండగా ఒకసారి నేను రుబ్బుతాననీ, తరుగుతాననీ ఊహించున్నాను. మూడుసార్లు కత్తి తీసుకున్నాను తరగాలని. వద్దన్నారు భగవాన్ మూడుసార్లూ. చివరికి–

"ఇంటి దగ్గిర తరుగుతావా?" అని అడిగారు.

"నాకు తరగవలసిన పని లేదు."

"అయితే ఇక్కడమాత్రం ఎందుకు? ఇక్కడ ఇంటి దగ్గిర మల్లేనే వుండు" అన్నారు.

వారికి నామీద ఎంత శ్రద్ధో! ఆశ్రమంలో నాకు మా ఇంటి దగ్గిర మల్లేనే సుఖంగా వుండాలని వారి ఉద్దేశం. పడుకొంటే తలకింద ఏముందో, సుఖంగా నిద్రపడుతోందో లేదో అని జాగర్త పడతారు.

ఓ రాత్రి నిద్రలో లేచాను. కారణం తెలీలేదు. భగవాన్ మేలుకునే ఉన్నారేమో–

"ఏం లేదు. పడుకో, పడుకో" అన్నారు. ఆ కంఠం తీరిగా జడుసుకొని లేచిన చిన్నపిల్లవాణ్ణి ప్రేమగల తండ్రి ఆదరించినట్టే వుంది.

ఓ సారి మాధవస్వామి తమిళంలో భగవాన్‌పైన పాటలు పాడుతున్నాడు. పాడుతూ మధ్య–

"కిష్టయ్య పాడడేం?" అన్నాడు.

"ఏం? ఇన్నాళ్ళా నువ్వు పాడుతున్నావు చాలదూ! ఏమొచ్చింది నీకు? ఏది పాడు" అన్నారు భగవాన్.

అటు తరవాత అతని పాటలో అన్నీ తప్పులే. భగవాన్ దిద్దుతున్నారు.

"ఇన్నేళ్లూ పాడి నువ్వు నేర్చుకున్నదిదీ. కిష్టయ్య పాడకపోతేనేం, నువ్వు పాడు. అతను ధ్యానం తెలుసుకుంటాడు" అన్నారు.

ఎక్కడికక్కడ శిష్యుల అహాన్ని అణిచేవారు.

ఓ పౌర్ణమి రాత్రి కొంతమంది భక్తులు గిరి ప్రదక్షిణం బయలుదేరుతున్నారు. దేవరాజ మొదలియార్ నన్ను రమ్మని అడిగారు. నాకు ఆస్త్మా, రానన్నాను. కొంతసేపటికి వాళ్ళు బయలుదేరుతూ భగవాన్ని శలవ అడగడానికి వచ్చారు. వాళ్ళల్లో డాక్టరు క్రిష్ణమూర్తిగారు కూడా వున్నారు. అతనికి నాకన్నా ఎక్కువ ఆస్త్మా. ఆయన వెళ్ళగా లేనిది నేనెందుకు వెళ్ళకూడదనిపించింది. నేను భగవాన్ అనుజ్ఞ అడిగాను. దేవరాజ నన్ను అడిగారు భగవాన్ ముందే, ఇందాక రానన్నావే అని. చెప్పాను కారణం, డాక్టర్ని చూచి మార్చుకున్నానని. భగవాన్ అడిగారు, ఎప్పటికి వస్తారు అని. రెండు మూడు గంటలసేపు పడుతుంది అన్నారు వాళ్ళు.

"ఆ. నెమ్మదిగా వెళ్ళండి. రాత్రి రెండుగంటలకి అంటే (అయిదారు గంటలకి) రండి. ఏదైనా నెమ్మదిగా చేస్తే శ్రమ వుండదు. తీరుబడిగా slow గా చేశామా కొండనైనా ఎక్కవచ్చు. శ్రమ తెలీదు" అన్నారు.



మేము తిరిగి వచ్చేటప్పటికి మేము అనుకోకుండానే సరిగా రాత్రి రెండు గంటలయింది. రాగానే భగవాన్-

"కిష్టయ్యకి శ్రమగా లేదుకదా!" అంటే- ఆ కంఠధ్వనిలో, తను అంతసేపూ నన్ను కనిపెట్టి శ్రమ కలగకుండా చూస్తున్నానని వినపడింది.

రాత్రులు ఎందుకో భగవాన్ ఆ రోజుల్లో టార్చి తీసుకుని ఒంటరిగా ఆశ్రమం చుట్టూ తిరిగేవారు, ఆశ్రమానికి అవతలగా లైటువేసి పరీక్షిస్తో. అదంతా మరి భక్తుల రక్షణకేమో. గుడి కడుతున్నప్పుడు రాత్రులు టార్చివేసి ఆ కడుతున్న గోడల్ని పరిశీలించేవారు.

భోజనమైన తరవాత తీరుబడిగా కూచుని ఎన్నో కథలు, కబుర్లు చెప్పేవారు. మేము పక్కలు పరుచుకుని పడుకున్న తరవాత కూడా చెబుతూనే వుండేవారు.

ఒకసారి వచ్చినప్పుడు నేను అడిగాను: "గాయత్రి చెయ్యమన్నారే నన్ను, ఆ మంత్రం చాలా పొడుగ్గా వుంది. పైగా అర్థం తెలుసుకోవాలిట" అని.

"నిన్నెవరు అవన్నీ చూడమన్నారు? ఆ మంత్రం జపించేవాడు ఎవరో వాణ్ణి చూడమన్నాను" అన్నారు భగవాన్.

ఒకామె నారాయణ పటం తనముందు పెట్టుకొని జపం చేసేది. ఆమె భగవాన్ని అడిగింది, తాను చేసేది సరిగా వుందా అని.

"రూపం లేకపోతే ధ్యానం ఎట్లా కుదురుతుంది?" అన్నారు భగవాన్.

సాధారణంగా అందరి అభిప్రాయం ఏమిటంటే, "నే నెవరు?" అనే ఆత్మవిచారం ఒక్కటే భగవాన్ బోధించిందని.

ఎవరి అధికారాన్ని, ఎవరి పరిస్థితిని బట్టి వారికి భగవాన్ సాధనని అనుగ్రహించే వారు.

ఒకసారి 1939 లో గావును భగవాన్‌తో అన్నాను-

"స్వామీ, నా మనస్సు ప్రణవం వైపు లాగుతోంది" అని.

"చేసుకో, చేసుకో. ప్రణవం అంటే ఏమిటి? సర్వమూ అదే. నువ్వే తెలుసుకుంటావులే..."

ఇంకోసారి అడిగాను-

"వృత్తి మూలంగా చూడమన్నారు. వృత్తి స్ఫురణ లేకుండా ఎట్లా పోతుంది?" అని.

"చేసి చూడుమీ" అన్నారు.

ఒకప్పుడు ఆశ్రమంలో మనస్సుకు శాంతి లేక మా స్నేహితుల దగ్గరికి కోలార్ వెళ్ళాను, రాత్రి తొమ్మిదన్నరకు స్వామి శలవ తీసుకుని. బలరామ రెడ్డికి తప్ప నేను వెళ్ళిన సంగతి ఎవరికి తెలీదు. నేను వెళ్ళిన ఉదయమే ఒక నెల్లూరి ఆమె ఆశ్రమానికి వొచ్చింది. నేనున్నానుకదా అని ముందుగా బస ఏర్పాటు చేసుకోలేదు. నే నెక్కడ ఉన్నానని స్వామిని అన్నదామె.

"అడుగో" అన్నారు స్వామి.

"ఎక్కడ?" అన్నది.



మళ్ళీ భగవాన్ "అడేం!" అని వేలుతో చూపించారు. ఆమెకి భయంతో కాళ్ళు వొణికాయి ఇదేమిటా అని.

"కోలారు వెళ్ళాడు కదా!" అన్నాడు బలరాం.

అప్పుడు భగవాన్ "అవునవును. కోలారు వెళ్ళాడు కదా!" అన్నారు.

ఆ సంగతి ఆమె నాకు కోలారుకు ఉత్తరం రాసింది. అశాంతిగా వుండడం వల్ల కోలారు వచ్చానని ఆమెకి రాశాను. ఆ ఉత్తరం ఆమె భగవాన్‌కి చూపించింది.

"ఎక్కడ వుంటేనేం? బిడ్డవలె వుంటే అశాంతి వుండదు. రమ్మని రాయి" అన్నారట భగవాన్. ఆ రాత్రే నా కలలో కనపడి భగవాన్ ఆ మాటలే చెప్పారు. ఆ మర్నాడు ఆమె ఉత్తరమూ వచ్చింది. ఆశ్రమానికి వచ్చేశాను, అశాంతి పోయింది.

ఒక రాత్రి హాలులో ఒకరిద్దరే వున్నారు. మాధవుడు భగవాన్ కాళ్ళకు మందు రుద్దుతున్నాడు. ఒక కాకినాడ ఆయన ముందుకువచ్చి "భగవాన్‌కు నేనూ సేవచేసుకుంటాను" అన్నాడు. భగవాన్ ఊరుకున్నారు. ఆయన వదల లేదు. కాళ్ళకి తానూ మందు రాస్తానని ముందుకు వచ్చాడు. "కాకినాడలో భగవాన్ చిత్ర పటానికి పూజ నిత్యం చేసుకుంటాను" అని మరల ప్రారంభించాడు. తటాలున భగవాన్ లేచి ఉరుము వంటి పెద్ద గొంతుకతో-

"అక్కడే అన్ని సేవలూ చేసుకోక పోయావా?ఇక్కడికెందుకు వచ్చావు?" అన్నారు. ఆయన హడలిపోయి మళ్ళీ కాళ్ళొడ లేదు.

భగవాన్ దృష్టి మనో అంతరాళంలోకి పోతుంది. ఒక్కొక్కప్పుడు కఠినంగా అణిచేవారు, భక్తిలోనైనా సరే ఏ మాత్రం హద్దు మీరినా.

ఒకసారి ఒకాయన భగవాన్‌తో కొండమీదికిబయలు దేరారు. భగవాన్‌తో వున్న పరిచారకులు "పిల్లేరు, వెంట రావద్దు క్రిందికి వెళ్ళి" పొమ్మన్నారు. ఆయన మొండి పట్టు పట్టి, ఎండలో అక్కడే ఆ కొండరాయి పైన కూచున్నారు. భగవాన్ కొండపైకి వెళ్ళి తిరిగి వచ్చిందాకా అట్లాగే కూచుని, భగవాన్‌తో క్రిందికి వొచ్చారు. భగవాన్ ఏమీ మాట్లాడలేదు.

సాయంత్రం ఓ ఉడత ఇటూ అటూ తిరుగుతోంది అరుస్తూ.

పొద్దున్న కొండపైకి వెళ్ళిన ఆయన "పాపం, ఆ ఉడతకి దాహం గావును. నీళ్ళ కోసం వెతుక్కుంటోంది" అన్నారు.

దానికి భగవాన్-

"అవును, మీకు ఉడతపైన దయ. దానికి దాహం వేస్తే మీకు గుండె కొట్టుకుంటుంది. భగవాన్‌కి అంతమాత్రం కూడా భక్తులపైన దయలేదు. వాళ్ళు ఎండలో కొండ రాళ్ళ పైన కూచోవొచ్చు. ఆయన గుండె కొట్టుకోదు మీ కోసం" అన్నారు.

### గోమహాలక్ష్మిపై ప్రేమ

ఆవులక్ష్మికి దూడగా ఉన్నప్పటి నుంచి భగవాన్ పైన



బద్ధానురాగం. అన్ని ఆవులు వున్నా, లక్ష్మికే భగవాన్ పైన ఆ ప్రేమ. భగవాన్ని చూడకుండా నిలువ లేదు. ఎందరిలో కూచున్నా, తాళ్లు తెంపుకుని ఐనా సరే, భగవాన్ని చూడడానికి హాల్లోకి వొచ్చేది.

ఒకరోజు ఆవులక్ష్మి హాలులోకి వచ్చింది. సరాసరి భగవాన్ ఎదురుగా వెళ్లి, ఆయన భుజంమీద తలపెట్టుకుని, ఒకటే ధారలుగా ఏడ్చింది. ఆయన లక్ష్మిని అరగంట సేపు ఓదార్చారు. ఆమె దుఃఖం పోయిందాకా,

"ఏం అమ్మా! ఎందుకా దుఃఖం? నీ కెందుకు కలిగిందమ్మా? నేనున్నాను కదా! ఎందుకట్లా కష్ట పడతావు? నేనుండగా నీకు కొరవేమి?" ఈ విధంగా మాట్లాడుతోనే వున్నారు ఆమె ఓదార్పు పొంది వెళ్లిందాకా!

ఒకసారి ఓ భక్తుడు విలువైన హల్వా తెచ్చి భగవాన్ ముందున్న పీటపైన పెట్టాడు. ఆశ్రమం కుక్క దాంట్లో మూతి పెట్టింది. ఆ దాపునవున్న ఆశ్రమాధికారి "ఛీ-ఛీ"... అంటో కుక్కను వెళ్ళగొట్ట బోయినాడు. భగవాన్ కోపంతో చర్రున లేచారు అతనిపైకి.

"పో. అవతల పో. నువ్వెవడివిరా? ఇక్కడ నీ అధికారం ఏమిటి? ముందు నడు బైటికి. ఎవడివిరా నువ్వు అతన్ని [illegible]సద్దని తోలడానికి? నీదిరా హల్వా?" అని ఆయన్ని అవతలకి తోలి, హల్వాని ముక్కలు చేసి తాను తిని, తన చేత్తో అక్కడ ఉన్న వారందరికి పంచి పెట్టించారు. అందరూ తిన్నారు - లోపల ఏమనుకోనీ.

1931 ప్రాంతాల, కాంగ్రెసు రాజకీయ ఖైదీల నందర్నీ విడుదల చేశారు. అప్పుడు ఒక ఆయన, ఆశ్రమ భక్తులలో ఓ ముఖ్యుని తమ్ముడు జైలునుంచి విడుదలై వొచ్చారు. ఆయన బ్రాహ్మణుడు. భోజనానికి బ్రాహ్మణేతరులతో కూచున్నారు. చిన్నస్వామి వీల్లేదన్నారు.

తాను మొన్నటి వరకు అన్ని కులాల వాళ్లతో తిన్నానని, తన బ్రాహ్మణత్వం పోయిందని అతని వాదన. మొత్తానికి తను బ్రాహ్మణులలోకి వెళ్లనని గట్టి పట్టు పట్టారు అతను. ఆ సమయంలో భగవాన్ వొచ్చారు భోజనశాలలోకి. భగవాన్ పుట్టుక బ్రాహ్మణ కుటుంబంలోనైనా, భోజనశాలలో బ్రాహ్మణేతర్ల వైపునే కూచుని భోజనం చేసేవారు. బ్రాహ్మణులు కూడా ఆయనని చూడడానికి వీలుగా వుండేది.

### కులాలు పాటించే వారికి పాఠం

... భగవాన్ అడిగారు ఏమిటా తగాదా అని. సంగతంతా చెప్పారు భగవాన్‌తో. ముందు చిన్న స్వామితో ఇట్లా అన్నారు భగవాన్–

"నీది తప్పు. అతడు బ్రాహ్మణుడు కాడుట. బ్రాహ్మణుడు కానో అంటున్న వాణ్ని ఎందుకు బ్రాహ్మణులతో కూచో పెట్టాలని ఆ మొండిపట్టు? మాట్లాడకు, అతని ఇష్టం" అని, ఆ కాంగ్రెసు ఆయనతో "నీదీ తప్పే! ఇక్కడ కూచున్న వాళ్ళకి కులం ఉంది. మేము బ్రాహ్మణేతరులమని అనుకుంటున్నారు వీళ్ళు, వాళ్ళు బ్రాహ్మణుల మనుకుంటు



న్నట్టే. నువ్వు బ్రాహ్మణేతరుణ్ని అనుకోటం లేదుగా! వాళ్ళతో ఎట్లా భోజనం చేస్తావు? వీల్లేదు" అని "బ్రాహ్మణుడూ, బ్రాహ్మణేతరుణ్నీ అనుకోనివాణ్ని నే నొక్కణ్నే కనక నాతోరా. నాతో కూచో" అన్నారు.

అతనికి గుండెలు వున్నాయా, ఒక్కడూ వెళ్ళి భగవాన్ ప్రక్కన కూచుని భోజనం చేయడానికి? వెళ్ళి బ్రాహ్మణులతో కూచున్నాడు.

ఒకసారి బ్రాహ్మణేతరులు ఒకరు అప్పడాలు ఇంటి దగ్గర వేయించి తీసుకొనివచ్చి బ్రాహ్మణేతరులకు వడ్డించారు.

బ్రాహ్మలకి వడ్డించడానికి వీలులేదుగా! భగవాన్ వొచ్చి కూచుని బ్రాహ్మలకి అప్పడాలు లేవేమని అడిగి, సంగతి తెలుసుకున్నారు. అప్పటికప్పుడు బజారు పంపి అప్పడాలు తెప్పించి వేయించి బ్రాహ్మలకి వేసిందాకా, ఆయన భోజనం తాకలేదు. అంటే–అందరూ అట్టా భోజనాల ముందు కూచున్నారు భగవాన్ ప్రారంభించిందాకా.

భగవాన్‌కి కులాల విభేదం లేదు. ఆయనకు కులం లేదు. బైట వుండే కులాల పట్టింపుని ఆయన మన్నన చేయక పోలేదు. కులాలు భేదించడం వల్ల ఆశ్రమంలో పక్షపాతం జరిగినా, ఆయన దిద్దేవారు. ఆయనకి లోకం లేక పోయినా, వ్యవహారానికి వొచ్చేప్పటికి, ప్రతిదీ వున్నట్టుగానే అంగీకరించి ప్రవర్తించేవారు.

ఒకసారి ఎచ్చెమ్మగారికి వాంతు లవుతున్నాయి. అది చూచి నేను–

"భగవాన్‌తో చెప్పకూడదా?" అన్నాను.

ఎచ్చెమ్మ మొహం చేటంత చేసుకుని "అన్నీ చెప్పాలి గావును. ఆయన చూడలేరా? ప్రత్యేకం వెళ్ళి వారితో చెప్పాలా?" అని విసుక్కుంది.

నేను ఊరుకోక భగవాన్‌తో చెప్పాను.

"ఏం చెయ్యమంటావు? ఇప్పుడు తాను నాకు పెట్టాలా? తనకి ఉన్నన్నాళ్ళూ నాకూ, భక్తులకి పెట్టింది. ఆ నాడు నాకు లేదు; తాను పెట్టింది, ఇప్పుడు తిని పడి వుండమంటాను. వుండదు. ఎప్పుడూ నాకు వొండి పెట్టాలని పంతం. దాంతో ఇలాంటివి తెచ్చుకుంటుంది! ఎవరేం చేస్తారు? ఎవరి కర్మ వారిని అనుభవించనీ" అని గట్టిగా కేక లేశారు భగవాన్.

ఎచ్చెమ్మ వాంతులు నిలిచిపోయినాయి. భగవాన్ సూచిస్తారు. ఎంత దగ్గర శిష్యుల్నీ బలవంతం చెయ్యరు.

## భక్తులకు దర్శనమిచ్చే పద్ధతి

ఎంతటివారు దర్శనానికి వొచ్చినా భగవాన్ కదలరు, ఒకప్పుడు కన్నెత్తి చూడరు. పలకరించరు, తన చిత్తం వచ్చి వారి వంక చూస్తారు, పలకరిస్తారు, ఆహ్వానిస్తారు. కొందరిని భోజనం చెయ్యమంటారు. ఒకసారి ప్రణవానంద స్వామి వొచ్చారు. ఆశ్రమం గేటుదాకా వచ్చి ఇంక నడవలేక అక్కడ కోవెలముందు అరుగుపైన కూచున్నారు. ఆ సంగతి భగవాన్‌కి తెలిసింది. వెంటనే లేచి వచ్చి, కింద కూచుని-

"తాతా! ఇప్పుడే వచ్చారా? కాళ్లు నొప్పా?" అని ప్రణ



వానందస్వామి కాళ్లు పడుతున్నారు. ఆయన తప్పించుకోవాలని చూసినా లాభం లేకపోయింది. ధనంలో, కీర్తిలో, అధికారంలో, అందంలో లోక ప్రసిద్ధి పొందినవారు భగవాన్ దర్శనార్థం వొచ్చి, ఒక్క పలుకునీ, చూపునీ పొందలేక పోయినారు. గొప్ప సాధకులు, యోగులు వచ్చి - వారి లోపల ఏం జరిగిందో గాని బైట ఏ విధమైన ప్రత్యేకతనీ భగవాన్ నుంచి పొందలేదు. కాని ప్రణవానంద స్వామి ఏ జన్మలో ఏ విధమైన సేవ చేశారో, ఈ నాడు భగవాన్ చేతులతో పాదాలు పట్టించుకునే భాగ్యాన్ని పొందారు.

## భగవాన్ భూతదయ

కబంధు శవాన్ని తగలపెట్టడానికని శ్రీరాముడు ఏనుగులు చెట్లకి రాసుకుంటే, కిందికి రాలిన చెట్ల కొమ్మలతో - చితిని పేర్చమన్నారు లక్ష్మణస్వామిని. అది జ్ఞాపకమొచ్చేది నాకు భగవాన్ భూతదయ చూస్తే.

భగవాన్ హాలుకి ఎదురుగా ఉత్తరంగా ఒక బాదం చెట్టు వుండేది. చిన్నస్వామి ఒక అతన్ని ఆ చెట్టు ఎండు కొమ్మని కొట్టమన్నారు. అతను అలక్ష్యంగా వచ్చి ఆకులనీ, కొమ్మలనీ రాల కొడుతున్నాడు. భగవాన్ చూశారు. చాలా కోపం వచ్చింది.

"ఏమిరా, దానినట్లా హింసిస్తున్నావు? దానిది మాత్రం ప్రాణం కాదా?" అన్నారు.

అతను "చిన్నస్వామి ఎండుకొమ్మలు కొట్టమన్నారు" అన్నాడు.

"సరే! నెమ్మదిగా విరుచు. నీ జుట్టుకి ప్రాణం లేదు కదా! దాన్ని పట్టుకు లాగితే నీకెట్లా వుంటుంది? ఛీ, ఛీ, అవతలకి పో. దేన్నో ఓదాన్ని బాధ పెడుతో వుండకపోతే మనసు నిలవదు" అని అతన్ని కసిరి పంపించేశారు.

లక్ష తులసి వ్రతం పూనిన ఎచ్చెమ్మకయిన చీవాట్లు పుస్తకాల్లో రాసేవుంది కదా!

"పువ్వుల్ని మనుషులు సహజ శోభతో వుండనీరు. ఆ పూలని కోసి, సూదులతో గుచ్చి చిత్రవధ చేస్తారు. అవి వాడి చచ్చిపోతాయి. దేవుడికి పూలు కావాలా? చెట్లమీదే ఉంటే దేవుడివి కావా? తాము తమని అర్పించుకోవడం బదులు ఇట్లాంటి ఘాతకమైన పనులు చేస్తారు" అన్నారు.

ఒక రోజున ఒకతను ఆశ్రమంలో రాత్రి పందుం పుల్లలు చెట్టున కోసుకుంటున్నాడు. భగవాన్ ఆ సంగతి తెలిసి–

"ఆ చెట్టును రాత్రికూడా నిద్ర పోనీరా? పగలు కోస్తే వొద్దందా? ఇంతమాత్రం తెలివి, దయా ఎందుకు వుండవు? చెట్టు ఏం చెయ్యలేదు కదా, కరవలేదు కదా–అని కాదూ నిర్లక్ష్యం?" అన్నారు.

ఇంకోసారి ఒకరు చెట్టునున్న పువ్వులన్నీ కోసేస్తున్నారు.

"చెట్టుపైన పువ్వులు ఎంతో అందం. కోస్తారు, పడేస్తారు, వాడిపోతాయి. ఆ చెట్టుకు ఏమీ మిగల్చరు. వీళ్ళకి అంత ఆశ ఎందుకో నా కర్థం కాదు" అన్నారు.

మన కళ్ళలో ఈ విచక్షణ– మనిషి, మృగం, పురుగు,



చెట్టు అని. కాని ఆయనకి తెలుసు–చిన్న గడ్డి మొక్కల బాధ కూడా.

భోజన పద్ధతి

భగవాన్ ఎప్పుడూ భోజనంలో ఏమీ పారెయ్యరు. అంటే వడ్డించేప్పుడే జాగ్రత్తగా వడ్డించాలి. అట్లాంటప్పుడు భగవాన్ పారెయ్యక పోవడం చూస్తే తాము పారెయ్యాల్సి రావడం కష్టమనిపిస్తుంది. కాని పారెయ్య వొద్దని ఎవరినీ అనలేదు ఆయన. ఒకరు అన్నారు భగవాన్‌తో—

"మనం పారెయ్యకపోతే భూతాలకి, మృగాలకి, పురుగులకి తృప్తి ఎట్లా?" అని.

"ఏం నాయనా? భూతాలపైన నీకింత దయ ఐతే, నువ్వు భోజనం చెయ్యక ముందే, ఆ భూతాలేవో వాటికి తృప్తి చెయ్యరాదా? నీ ఎంగిలి కూడు తింటేనే గాని వాటికి తృప్తి కాదా?" అన్నారు భగవాన్.

ఆశ్రమం గేటు ప్రక్కనే వున్న దక్షిణామూర్తి మంటపంలో ఒకాయన భంగు తాగి కేకలు వేస్తుండేవాడు. ఎంతకీ ఆయన్ని ఎవరూ గమనించలేదు. ఆయన గబగబా భగవాన్ ముందుకు వొచ్చి, అధికారంగా demand చేస్తూ—

"నీ గేటు దగ్గిర దర్వాన్‌కి నువ్వు భోజనం పెట్టుకోకపోతే ఎవరు పెడతారనుకున్నావు?" అని గర్జించాడు. దానికి భగవాన్ మహా వినయ స్వరంతో—

"అట్లాగా! ఎవరూ నిన్ను చూడనే లేదా? పొరపాటే. ఒరేమాధవా! మన దర్వానికి మనం భోజనం పెట్టకపోతే, ఎవరు పెడతారు? పొరపాటయింది, ఈసారికి వూరుకోండి. మాధవా! ఈయన్ని తీసుకుని వెళ్ళిభోజనం పెట్టించు" అన్నారు.

పాపులమనుకునేవారు అనేకమంది వొచ్చేవారు భగవాన్ ముందుకి. ఆయన్ని చూడగానే అనేక విధాలైన వికారాలు కలిగేవి కొంతమందికి.

ఎండాకాలం సాయంత్రాలు బావి దగ్గిర అరుబైట సోఫామంచంపై కూచునేవారు భగవాన్. చుట్టూ భక్తులు కూచునేవారు. రాత్రి భోజనమైనాక, అక్కడే కూచున్నాము. ఒకాయన గట్టిగా ఏడుపు ప్రారంభించాడు.

"నేను మహాపాపిని, తమ పాదాల దగ్గిరికి చాలా కాలంనించి వస్తున్నాను. కాని నాలో ఏ మార్పూ లేదు. నేను బాగుపడేది ఎట్లా? ఎన్నటికి? ఇక్కడ వున్నంత కాలం యోగ్యుణ్ణే. కాని ఇక్కడనించి వెళ్ళానా, నేను మనిషిని కాదు, మహా పాపిని" అని ఏడ్చాడు.

భగవాన్ "నువ్వేమైతే నాకేం కావాలి? నా ముందు ఎందుకు ఏడుస్తావు? నీకు నాకు ఏం సంబంధం?" అని గదమాయించారు. అనేప్పటికి అతను గుండె పగిలినట్టు పెద్దపెట్టున ఏడ్చాడు, ఇంక తనకి ఏవీ ఆశలే లేనట్టు, ఉన్న ఆశ కాస్తా ఊడిపోయినట్టు.

"నువ్వు నా గురువువి. నువ్వే గతి, నువ్వే అన్నీ అంటే, నేనేమైపోను? నాకింక దిక్కేమిటి?"



కొంతసేపు అలా ఏడవనిచ్చారు భగవాన్.

"నేను నీ గురువునా? ఎవరు చెప్పేరు నేను నీ గురువునని? నేనన్నానా?"

"మరి నువ్వు కాకపోతే, నా గురువు ఇంకెవరు? ఈ లోకంలో నాకింక దిక్కెవరు? నువ్వు కరుణించి, నన్ను పావనుణ్ణి చేస్తావనే కదా నేను బతుకుతోంది?" అని బిగ్గరగా రాగాలు ప్రారంభించాడు.

"నేను నీ గురువునైతే నాకు గురుదక్షిణ ఏమిచ్చావు?"

"నువ్వేమీ తీసుకోవు గదా?"

"నీకెట్లా తెలుసు నేను తీసుకోనని? నేను చెప్పానా నాకు గురుదక్షిణ అక్కర్లేదని?"

"మీరు తీసుకుంటేనా? నేనేమివ్వను? నేనేం దాచుకుంటున్నాను మీనించి?"

"సరే, ఇప్పుడడుగుతున్నాను ఇయ్యి. ఇస్తావా?"

"అయ్యో! ఎందుకివ్వను? ఏంకావాలి తీసుకోండీ."

"ముందు నీ పుణ్యం నాకు ధారపొయ్యి."

"నాకేమన్నా పుణ్యమనేది ఉంటేగా! ఉంటే తమ ముందు ఈ గోల ఎందుకు?"

"ఆ సంగతి నీకెందుకు? వున్న పుణ్యమేదో నాకిచ్చెయ్యి, ఇచ్చేస్తావా?"

"ఎట్లా ఇయ్యను? ఇయ్యడం ఎలాగో చెప్పండి ఇస్తాను."

"ఇట్లా చెప్పు, 'నా పుణ్యంతో నాకేమి నిమిత్తం లేదు. దానివల్ల వచ్చే ఫలితం నాకక్కర లేదు. అంతా మీకిచ్చేస్తున్నాను' అని మనస్ఫూర్తిగా అను."

"అట్లాగే స్వామీ! నా పుణ్యమంతా మీకు సంతోషంగా అర్పిస్తున్నాను, గురుదక్షిణ కింద."

"చాలదు."

"కోరింది ఇచ్చానుగా స్వామీ!"

"నువ్వు చేసిన పుణ్యమే చాలా కొద్ది. అవునా? అది నాకేం చాలుతుంది? అంతేనా నువ్వు ఇచ్చే గురుదక్షిణ?"

"ఆ సంగతి నేను చెప్పనే చెప్పానుగా! ఇంక అంతకన్న నా దగ్గిర ఏం లేదు. ఏంచెయ్యను?"

"లేకేం? నీ పాపం నాకిచ్చెయ్యి."

అతని గుండె పగిలింది.

"మీకు తెలీదుస్వామీ, నేనెటువంటి పాపాలుచేశానో! తెలిస్తే మీరామాట అనరు. నా పాపాలు తీసుకున్నారా, వాటి ఘోరంతో తమ శరీరం ఉడికిపోతుంది. తమకు తెలీదు భగవాన్, నేనెటువంటి పాపినో! వొద్దు, వొద్దు. నా పాపాలు కోరకండి" అంటో చాలా ఏడ్చాడు.

"ఏమైతేనేం? ఆ సంగతి నేను చూసుకుంటాను. ఇచ్చెయ్యి."

ఓ పట్టాన అతను ఒప్పుకోలేదు. కాని భగవాన్ తన పట్టు వదలలేదు.

"నేను చేసిన పాపాలు నావికావు. అవీ, వాటి ఫలితమూ అంతా రమణునిదే." అని అతనన్నదాకా భగవాన్ వదలలేదు.

"సరే; ఇంక ఈ నిమిషంనుంచి నీకు పుణ్యమూ లేదు,



పాపమూ లేదు. పుణ్య పాపాలులేని పరిశుద్ధ ఆత్మవి నీవు. ఇంక పుణ్యమూ చెయ్యకు, పాపమూ చెయ్యకు, నువ్వు ఇలాగనే వుండిపో."

ఆ మాటలతో గొప్ప శాంతి వచ్చింది అతనికి. ఏమైనాఁడో, మళ్ళీ ఆశ్రమానికి రాలేదు. అవసరం లేకుండాపోయింది గావును.

ఇంకోసారి ఇంకో ఆయన తాను పాపిని అని ఏడ్చాడు భగవాన్ ముందు.

"నిద్రలో ఏముండింది? పుణ్యం ఉందా, పాపం ఉందా? నిద్రలో నువ్వు పుణ్యుడివా? పాపివా? ఎవరు నువ్వు?"

"నాకు తెలీదు."

"ఇప్పుడు మాత్రం ఏం తెలుసు నీకు, నువ్వెవడివో చెప్పేందుకు? నువ్వు చేసింది పుణ్యమో, పాపమో! పుణ్యం అనుకుంటే అది పుణ్యం, పాపం అనుకుంటే అది పాపమూనా? పుణ్యమూ పోతుంది. పాపమూ పోతుంది. మిగిలి వుండేది నువ్వే."

ఇంకోసారి ఇంకో ఆయన "ఇన్నేళ్లబట్టి వస్తున్నాను మీ దగ్గరికి. నాలో ఏ మార్పూ కనపడదు. నేను ఇంకా పాపిగానే వున్నాను" అని దుఃఖపడ్డారు.

"ఈ దారిలో మైలు రాళ్ళులేవు. నువ్వెంత దూరం పోతోందీ నీకెట్లా తెలుస్తుంది?

"మీరంతా మొదటి తరగతి ప్రయాణీకులు. మొదటి తరగతి ప్రయాణీకుడు ఏం చేస్తాడు? గార్డుతో చెపుతాడు

తాను ఎక్కడ దిగాలో. చెప్పి తలుపులు బిగించుకుని నిద్ర
పోతాడు. వాడు చెయ్యవలసింది అంతే. స్టేషన్ రాగానే గార్డ్
వచ్చి లేపుతాడు" అన్నారు.

అ విశ్వాసంతో నిలవగలిగితే ఇంకేం కావాలి!

ఒక ఎండాకాలం సాయంత్రం అట్లానే బావిదగ్గిర
సోఫాలో పడుకున్నారు భగవాన్. ఎవరో తెచ్చిన
పళ్ళు పళ్ళెంలో సోఫాకింద వున్నాయి. బావి దగ్గిర కోతులు
వాటిమీద కన్ను వేసి కూచున్నాయి. మాధవస్వామి కర్ర
పట్టుకుని జాగ్రత్తగా కావాలి కాస్తున్నాడు ఆ పళ్ళకి. అందరూ
కళ్ళు మూసుకుని ధ్యానంలో కూచున్నారు. అకస్మాత్తుగా
భగవాన్ వెనక్కి ఆనుకున్నవారు కాస్త లేచి సోఫా మధ్య
కూచుని చప్పట్లు తడుతో, ఒకటే నవ్వుతున్నారు.

"పోయింది, తీసుకు పోయింది" అంటున్నారు కుర్రాడి
మల్లే గోలచేస్తో-నవ్వుతో, చప్పట్లు కొడుతో. అందరం ఆశ్చ
ర్యంతో కళ్ళు తెరిచి చూశాము. ఆయన సంతోషం ఆ కోతి
మాధవస్వామిని ఏమార్చి, ఆ పండుని తీసుకుపోయిందని.
అందరమూ కలిసి నవ్వాము.

ఆ పళ్ళు కోతులు తిన్నా ఒకటే, మనుషులు తిన్నా
ఒకటే ఆయనకి.

ఆయన ఎప్పుడూ కోతుల వేపే. ఎవరూ చూడకుండా
పళ్ళాలో పళ్ళూ అవీ ఆ కోతులకి అందిచ్చేవారు. వాటిని
వద్దని అడ్డుపడేవారు. మెల్లిగా వచ్చి ఎత్తుకు పొమ్మని వాటికి
సైగచేసేవారు. కొట్టవస్తే కోతులు ఆయన సోఫాకి, అటూ



మధ్య నక్కేవి. వాటికి బాగా తెలుసు, స్వామి తమ పక్షమనీ,
ఎవరినీ ఆ మూలకి వచ్చి కొట్టనీయరనీ.

తరవాత చెప్పారు-సాధకుడు లక్ష్యం ఆ కోతి లక్ష్యం
మల్లే వుండాలని. ఏమెరగనట్టే, అన్నిటిపైనా చూపు వుంచి
వుంది ఆ కోతి. కాని లక్ష్యం ఆ పండుపైన, ఎప్పుడు దొరుకు
తుందా అని.

సయ్యద్ లక్నోలో ప్రొఫెసరు. మహమ్మదీయులు.
భగవాన్ భక్తులైనారు. ఆయన మూలంగా ఆయన భార్య
కూడా భగవాన్ భక్తురాలయింది. అయినా ఆమెకి మహమ్మ
దీయ మత, సాంఘిక సాంప్రదాయాలపైన చాలా పట్టు.
పురుషుల ఎదుట పడదు. ఆశ్రమంలోనే ఓ గదిలో కూచుని
భగవాన్ని అక్కడికి తీసుకు రమ్మని భర్తను బతిమాలింది.
ఆయన పిలవగా భగవాన్ వెళ్లారు. మొదట ముసుగులోంచే
మాట్లాడింది. తరవాత ఇంకోసారి ముసుగు వదలి. ఆమె తక్కిన
స్త్రీల వలె హాలులో కూచునేప్పటికి చాలా కాలం పట్టింది.

వారు ఆశ్రమం బైట అద్దె ఇంట్లో ఉండేవారు. భగ
వాన్ని తన ఇంటికి పిలిచి భోజనం పెట్టాలని ఆమెకి అణచ
లేని కోర్కె కలిగింది. భర్తని పోరింది. ఇదివరకు రెండు
సార్లు భగవాన్ను తీసుకు వెళ్ళడమే కాక, ఇప్పుడు ఆయన్ని
భోజనానికి పిలవాలంటే సయ్యద్ గారికి ధైర్యం చాలలేదు.
కాని ఆమె పోరు మానలేదు. చివరికి ఆమెతో పడలేక,
ఎట్లాగో భగవాన్‌కి చెప్పాడు తన భార్య కోర్కెని. చిరు
నవ్వు నవ్వి వూరుకున్నారు భగవాన్.

ఆమె ఒప్పుకోలేదు. తన భర్త భగవాన్ని సరిగా పిలవలేదంది. సరిగా పిలిస్తే తన ప్రార్థనని భగవాన్ నిరాకరించరని ఆమె విశ్వాసం కాబోలు. చివరికి భగవాన్ కొండ మీదికి వెడుతుండగా సయ్యద్ ఆమెఎదటనే భగవాన్‌కి నివేదించారు ఆమె కోర్కెని. నవ్వి కొండమీదికి వెళ్లారు భగవాన్.

ఆ రాత్రి భర్తతో ఆమెకి తగాదా—ఆయన భగవాన్ని సరిగా పిలవ లేదని, పిలిస్తే ఎందుకు రారని. చివరికి, ఆయన విసిగి భార్యతో "నన్నంటావేం? నీకు భగవాన్ పైన సరైన భక్తి లేదుగావును. అందుకనే ఆయన రావడానికి అంగీకరించలేదు" అని నెపం ఆమె మీదికి నెట్టారు.

దాంతో ఆమె దీక్ష పట్టి రాత్రంతా నిద్రపోకుండా భగవాన్ ధ్యానంలో కూచుంది, రమ్మంటూ. తన ప్రార్థన బలంవల్ల భగవాన్ని తన ఇంటికి పిలుచుకోవాలని ఆమె పట్టు. తెల్లవారకట్ట ఆమె కలలో భగవాన్ కనపడి—

"నువ్వెందుకు అట్లా ఆరాటం పడతావు? ఆశ్రమాన్ని వదలి నేనెట్లా నీ ఇంటికి భోజనానికి రాగలను? నేను భోజనం చెయ్యనిదే నా భక్తులు భోజనం చెయ్యరు. అదిగాక ప్రతి రోజూ నన్ను చూడాలనీ, నాతో భోజనం చెయ్యాలనీ దూరం ఊళ్ళనించి వచ్చేవాళ్ళను చూస్తున్నావు కదా! వాళ్ళను వదిలి ఎలా రాను? కనక నా బదులు ఈ ముగ్గురి భక్తులకి నువ్వు భోజనం పెడితే, నాకు పెట్టినట్టే నేను సంతృప్తి పడతాను" అని ముగ్గురు రమణ భక్తుల ఆకారాల్ని ఆమెకి చూపించారు.

ఆ కలని భర్తకి చెప్పి, తన కలలో కనపడ్డవాళ్ళ ముగ్గుర్నీ ఆశ్రమంలో భర్తకి చూపింది. వారు డాక్టరు



మేలోకటీ, ప్రబుద్ధానందా, ఇంకోరూ. సయ్యద్ వాళ్ళ ముగ్గుర్నీ భగవాన్ పేర తన ఇంటికి భోజనానికి పిలిచారు. వాళ్లు ఆశ్చర్యంతో కారణం అడిగితే, కథ అంతా చెప్పేరు సయ్యద్‌గారు.

వారు బ్రాహ్మలు. తన బదులు వారి ముగ్గురికి భోజనం పెట్టమని భగవాన్ కలలో అన్నందుకు గర్వమూ, మహమ్మదీయుల ఇంట్లో భోజనంచేస్తే వచ్చే ఇబ్బందులకు భయమూ పట్టుకుంది వాళ్ళకి. ముందు చిన్నస్వామి వెళ్ళకొడతాడు ఆశ్రమంనించి.

పూలతోట గదిలో వున్నారు డాక్టరు మేలోకటీ, ప్రబుద్ధానంద, ఆ మూడో భక్తుడూ.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" అని భక్తుడు అడిగాడు డాక్టరు మేలోకటిని రాత్రి గదికి వెళ్ళినప్పుడు. డాక్టరు "సయ్యద్ భోజనం సంగతి. ఏం చెయ్యనా అని ఆలోచిస్తున్నాను" అన్నారు.

"మీరు వెళుతున్నారా?"

"అదే ఆలోచిస్తున్నాను. ఎట్లా? పైగా వీళ్ళా వాళ్లా కాదు. తురకవాళ్ళు. మనం వెళ్ళామా, మనకి వెలి తప్పదు. చిన్నస్వామి మనని ఆశ్రమంనుంచి వెళ్ళకొడతాడు. మీరు వెడతారా మరి?" అని అడిగారు డాక్టరుగారు.

"వెడతాను."

"మరి చిన్నస్వామి?"

"ఆ పిలుపు భగవాన్ ఆజ్ఞ కాకపోతే ఆమెకి మనమేం తెలుసు? మనం ముగ్గురేనని ఎట్లా చూపించింది?"

"సరే. ఆ ప్రబుద్ధానందస్వామి వెడుతున్నారా?"

"అతనికేం! సన్యాసి; అతనెక్కడకన్నా వెడతాడు."

"పైగా స్వంత వంట. చిన్నస్వామి భయమూ లేదు అతనికి."

"అయితే, ఏంచేద్దాం"

"అంతా భగవాన్ చూసుకుంటారు."

అన్నాడే గాని, తురకవాళ్ళు. వాళ్ళ ఇంట్లో తిండి నోట్లోకి ఎట్లా వెడుతుంది? వాళ్ళకి శుభ్రమన్నా వుండదు. వాళ్ళకి కూరగాయలు వంట ఏం తెలుసు? భగవాన్ ఆజ్ఞ ప్రకారం వెళ్ళామని చెప్పినా చిన్నస్వామి నమ్మడు. ఆశ్రమ సంఘమూ నమ్మదు.

భగవాన్ ఎంత చక్కగా ఎరుగు! ఒకరు బెంగాలీ సన్యాసి, ఒకరు కన్నడ సంసారి, ఒకరు తెనుగు బ్రహ్మచారి.

మర్నాడు భోజనానికి గంట కొట్టగానే ముగ్గురూ వెళ్ళి భగవాన్‌కి నమస్కరించారు. భగవాన్ ఏమిటని అడగలేదు. చిన్నస్వామి ముందునించే వెళ్లారు ఆశ్రమం బైటికి. భోజనం చెయ్యకుండా ఎక్కడికి పోతున్నారని చిన్నస్వామి అడగలేదు. ఆ వేళ ఆశ్చర్యంగా తెల్లవారకట్టలేచి, సయ్యద్ గారి భార్య దాసీ ఆమెని అటువేపు రానీకుండా తానే స్వయంగా వంట చేసింది. భగవాన్‌పైన భక్తి అల్లాంటిది! ఆమె హిందూస్వామికి భక్తురాలవుతుందని మహమ్మదీయ గురువులు నివారించబోతే ఆమె వాళ్ళతో—తాను నమాజు చేసేప్పుడు పూర్వం పైగంబరు తన ప్రక్కన నుంచునేవారనీ, ఇప్పుడు భగవాన్ నుంచుంటున్నారని చెప్పింది.



చాల మంచి భోజనం వొండింది ఆమె. భోజనమైనాక ముగ్గురికి స్వయంగా తన చేతులతో కిళ్ళీ లిచ్చింది. ఆశ్రమానికి వెడుతూంటే, దోవలో డాక్టర్ మేలోకోటి అన్నారు: "నాకు మహమ్మదీయుల మర్యాదలు తెలియవు. హైదరాబాదు వాడిని నాకు తెలుసు." ఆయన కళ్ళ వెంట నీరు వొస్తోంది. ఆశ్చర్యపడి చూచారు తక్కిన యిద్దరూ.

"మహమ్మదీయ స్త్రీ భర్తకి, ఫకీర్కి తప్ప ఎవరికీ తన చేత్తో తాంబూలం ఇవ్వదు. మనని సన్యాసుల కింద, ఈ రూపాలలో ఉన్న భగవాన్ కిందే చూసుకొని తాంబూలా లిచ్చింది ఆమె" అన్నారు.

ఆ భోజనం సంగతి అందరికీ తెలిసే వుండవచ్చు. కాని ఎవరూ వాళ్ళముందు ఆ భోజనం సంగతి ఎత్తలేదు. తురక ఇంట్లో తిన్నారా అని వాళ్ళని ఎవరూ అడగనూ లేదు. వీరై ఎవరితో నన్నా చెప్పుకున్నా ఎవరూ నమ్మరు.

ఎంత భక్త పరాధీనుడో భగవాన్! ఆ రోజుల్లో భగవాన్‌కి కాలు మీదా, వీపు మీదా ఎక్జిమా లేచి బాధ పెడుతోంది. డాక్టరు మేలోకోటి — నికి రెండు నెలల నించి వైద్యం చేస్తున్నారు. మద్రాసు నించి ఎన్ని మందులో తెప్పించి వాడారు. నయం లేదు. ఆయన అవసరంగా తన దేశం వెళ్లాల్సి వొచ్చింది. ఇంత డాక్టర్ని, ఇన్ని మందులు వాడి భగవాన్‌కి నయం చెయ్యలేక పోయినానని సిగ్గూ, భగవాన్‌కి అట్లా ఉంటే, విడిచి ఎట్లా వెళ్ళనా అని దుఃఖమూ. ఆయనా, నేనూ ఒకేగదిలో ఉండేవాళ్ళం. తన మనోవ్యధ నాతో చెప్పుకున్నారు, ఆయన.

నేను నవ్వాను.

"మీరా నయం చేస్తున్నది? భగవాన్ ఆయనకి ఆ వ్యాధి నయం కావాలి అనుకోలేదు. కనక ఏ మందులకీ లొంగదది. మీ రేమీ దిగులు పడకండి. మీరు ఆయనని ఆ స్థితిలో వొదిలి వెళ్ళ లేక పోతే, మీ మనోస్థిమితం కోసం ఆయనని ప్రార్థించండి; నయం చేయించుకోమని" అన్నాను.

ఆయన అట్లానే చేశారు ఆ రాత్రి. మర్నాడు హాలు లోకి వెళ్ళగానే భగవాన్ "ఈ ఎక్జిమా నయమై పోతున్నట్టుందే" అన్నారు.

డాక్టరు కళ్ళల్లో ఆనందబాష్పాలు. బయటికి రాగానే పొంగి పోతున్న హృదయంతో నన్ను కావలించుకున్నారు.

నెల్లూరులో ఒక రమణ భక్తుడు ఉన్నాడు. అతనికి అందమైన కూతురు. ఒకతను ఆ పిల్లని తనకిచ్చి పెళ్ళి చేయమని అడిగాడు. కాని అతని సంగతి విచారించగా, అతని చరిత్ర బాగాలేక పోవడంవల్ల తండ్రి ఇవ్వనన్నాడు. ఆ కోపంతో ఆ దుర్మార్గుడు ఆ పిల్లకి చాతపడి చేయించాడు. ఆ పిల్లకి అర్థం కాని జబ్బుచేసింది. ఆ పిల్ల చచ్చిపోతూ, "సరే. నాకు చాతపడి చేసి చంపాడు. కాని, సాయంత్రం లోపల వాడి గతి చూసుకోండి" అంది. సాయంత్రానికి ఆ దుష్టుడు నెత్తురు కక్కుకుని చచ్చి పోయాడు. కాని చచ్చిపోయిన అమ్మాయి రెండో అన్నకి తిరిగి ఆ అమ్మాయికి చేసిన మోస్తరు జబ్బే చేసింది. ఆ భక్తుడు ఇంక దిక్కులేక, అప్పటికి సరైన స్మృతి కలిగి భగవాన్ని ప్రార్థించుకున్నాడు మనస్సులో,



"ఇదేమిటి భగవాన్, నా పైన మీరు ఇంత ఆగ్రహం పూనారు! నన్ను రక్షించడం మీదే భారం" అని ప్రార్థించాడు. అతని కలలో భగవాన్ కనపడి—

"కృష్ణయ్యను పిలు. నయమౌతుంది" అన్నారు.

అతను వెంటనే కృష్ణయ్య దగ్గరికి వెళ్ళి, ఏ సంగతీ చెప్పక తన ఇంటికి రమ్మని పిలిచాడు. ఎందుకు అని కృష్ణయ్య అడిగినా ఏమీ చెప్పలేదు. కారణం చెప్పకపోతే రానన్నాడు కృష్ణయ్య. ఇంక గతిలేక చెప్పాడు—తన కొడుక్కి దయ్యం పట్టిందనీ, కృష్ణయ్య వొస్తే ఆ దయ్యం వొదిలి పోతుందనే విశ్వాసంతో కృష్ణయ్యని పిలుస్తున్నాననీ. దానికి కృష్ణయ్య, "ఆ దయ్యం నన్ను పట్టుకుంటే నేనేం కావాలి? నా కెవరున్నారు చెయ్యడానికి? నేను రా"నన్నాడు. ఈ మాటలు వింటున్న ఒక భక్తురాలు "నిన్ను దయ్యం పట్టుకుంటే, భగవాన్ వూరుకుంటారా? ఏం భయం లేదు వెళ్ళు" అంది.

ఆ మాట వింటే కృష్ణయ్యకూ నిజమే ననిపించింది. వెళ్ళాడు. ఆ అబ్బాయికి నయమయింది.

కోర్టుకి సెలవు ఇచ్చినప్పుడల్లా, డబ్బు వుంటే సరి, రమణాశ్రమం వెళ్ళేవాణ్ని, కాలేజి కుర్రాడు తండ్రిని చూడ్డానికి ఇంటికి పరిగెత్తినట్టు. ఓ సారి కోర్టుకు శలవలిస్తున్నారు' నా దగ్గిర డబ్బు లేదు, ఎట్లానా అనుకుంటున్నాను. చిత్రంగా ఓ కమీషన్‌కి ఇంకోరి పేరు వేసిన జడ్జి కారణం లేకుండానే అతని పేరు కొట్టేసి నా పేరు వేశారు, డబ్బు చిక్కింది, పరిగెత్తాను ఆశ్రమానికి.

భగవాన్‌కి బట్టలు లేకపోవడమూ, తల వొణుకుతూ ఉండడమూ చూసి, చిన్న పిల్లలకి కనికరం కలిగేది. ఓ చిన్న అబ్బాయి, "నాన్నా! నాకిన్ని చొక్కాలు కుట్టించావు. పాపం తాత వొణుకుతున్నారు. తాతకెవరున్నారు కుట్టించడానికి!" అన్నాడు.

భగవాన్ వంట చెయ్యడం చూచి, "పాపం, ఆ ముసలాయనచేత వంట చేయించుకుంటున్నారా?" అని అడిగింది ఒక కాలేజీ అమ్మాయి.

ఎన్ని రకాలుగా ఎవరి వయసుకి, ఎవరి స్థితికి తగినట్టు వారిని ఆకర్షించి తనకి కట్టేసుకున్నారో భగవాన్!

భగవాన్ కొండమీద ఒకరిద్దరు శిష్యులతో ఉండే టప్పుడు ఒకసారి ఆయన భక్తుడు పళనిస్వామి అరుణాచలేశ్వర ఉత్సవానికి రమ్మని భగవాన్ని ఒకటే పీడించాడు. తనని గుర్తు పడతారని, గుంపుపోగౌతారని, తనకి ఇష్టం లేదని ఎంత చెప్పినా వినలేదు. "పోనీ, ఏదన్నా మారు వేషంతో రండి" అని నవ్వు టాలకి అన్నాడు పళనిస్వామి.

ఆ suggestion లోని Humour స్వామికి కూడా Appeal అయినట్టుంది.

భగవాన్ వైష్ణవ వేషం వేసుకొన్నారు; పంగనామాలు, వెడల్పు అంచు తలపాగా. అంతా ఆ వేషంలోపోయి ఉత్సవం చూస్తున్నారు. దక్షిణ గోపురం దగ్గర గొప్పవారిని గౌరవించ టానికి దేవళంవారు నియమించిన అధికారి భగవాన్‌ని గుర్తు పట్టి, వారి చెయ్యిపట్టుకొని–



"ఇరుగో, కొండమీది బ్రాహ్మణస్వామి" అనేప్పటి కల్లా "స్వామీ, స్వామీ" అంటూ అందరూ పోగవుతున్నారు.

తన చేతిని ఊడలాగేసుకుని తలగుడ్డ తీసేసి చంకలో పెట్టుకొని కొండపైకి ఒకటే పరుగు భగవాన్.

భగవాన్‌కి అనేక ఏళ్లు పరిచర్య చేసిన శిష్యుడు ఆశ్ర మానికి ఎదురు తిరిగి వ్యాజ్యాలు తీసుకొచ్చాడు, ఆశ్రమం మీదికి. తనది ఓ రమణాశ్రమమని ఆశ్రమం ఉత్తరాలు బంగీలు అవీ తాను తీసుక పోయేవాడు. ఈ విధంగా బాగా ఇబ్బందులు పెడుతున్నాడు ఆశ్రమం వారిని. కాని వారానికోసారి వచ్చి భగవాన్ని చూసి నమస్కరించి వెళ్ళేవాడు. అతనితో ప్రేమగా ఉండేవారు భగవాన్. ఆశ్రమానికి విరోధంగా ఇన్ని చేస్తున్నా భగవాన్ దర్శనం ప్రేమా అతను పొందుతో ఉండడం వొళ్లు మండుతోంది ఆశ్రమం వారికి.

ఓ సారి పెరుమాళ్ స్వామి వొచ్చినప్పుడు ఆశ్రమం వారు భగవాన్‌తో చెప్పుకున్నారు, అతనివల్ల తమకి కలుగు తున్న బాధల్ని. భగవాన్ని ఎవరన్నా ఏమన్నా అన్నారా వాళ్ళని బతకనిచ్చేవాడు కాడు పెరుమాళ్ళస్వామి. అతని విరోధమల్లా ఆశ్రమంతోనే. భగవాన్ అతనితో అన్నారు–

"ఎందుకురా, అట్లా వాళ్ళను బాధిస్తావు? అట్లాంటి పనులు మంచివి కావు, సాధువుల్ని బాధ పెట్టకూడదు" అని.

"ఏం చేశాను నేను? మహా వీరిది వొక్కరిదేనా రమణాశ్రమం? ఎవరి హృదయంలో మీరు వుంటే, వారిదీ రమణాశ్రమం" అని వాదించాడు పెరుమాళ్ళు.

భగవాన్ చెప్పేది వినిపించుకోలేదు. విసిగి కొంత సేపటికి భగవాన్-

"ఆ మాటలు సరేలే-ఇదుగో, నేను చెప్పుతున్నాను విను. ఇట్లా చేస్తే నువ్వు నరకానికి పోతావు" అన్నారు.

పెరుమాళ్ళకి కంపర మెత్తింది. ఏం తోచలేదు. కన్నీళ్ళతో అన్నాడు, ఏడ్పు గొంతులో-

"ఆ నరకంలోనైనా నీ పాదాలే కద గతి నాకు?"

భగవాన్ మహా ప్రేమయుతమైన స్వరంతో-

"అవును. నరకంలో కూడా నిన్ను విడువను. నిన్ను ఉద్ధరించే తీరుతాను. నిన్ను వదలను. కాని, అసలు ఆ నరకానికి పోవడం ఎందుకని కదా నేను అనడం!" అన్నారు.

తరువాత కొద్ది కాలంలో అతనివల్ల ఆశ్రమానికి బాధలు తీరిపోయినాయి.

ఒకసారి భగవాన్‌తో అన్నాను-

"భగవాన్! ఇదివరకు మల్లే మీ రూపం నా కళ్ళ ఎదుట నిలవడంలేదు. ఏం చెయ్యను?" అని.

"నామం జ్ఞాపకముందిగా! రూపం కన్నా నామం పై మెట్టు. నామమూ తరువాత పోతుంది. అందాకా అది చాలు" అన్నారు.

భగవాన్ దగ్గర చాలా కాలం నుంచి పరిచర్య చేస్తూ ఆశ్రమంలోనే ఉంటున్న ఒకనికి వూళ్ళో ఒక ఆమెతో స్నేహమయింది. ప్రతిరాత్రి ఆమె కోసం వెళ్లేవాడు. ఆమె బంధువులు అది కనిపెట్టి అతన్ని చంపెయ్యాలనుకున్నారు. ఓ రాత్రి



అతన్ని పట్టుకొని కట్టేశారు. అతని మెడకోసి పారెయ్యాలనే ప్రయత్నంలో ఉన్నారు.

అతను "భగవాన్! నీవే గతి" అనుకున్నాడు. ఎట్లాగైతేనేం? కట్లు వదలించుకో గలిగాడు. అర్ధరాత్రి పరుగున 'భగవాన్' అంటూ వొస్తున్నాడు. విరోధులు వెంటపడ్డారు, ఆశ్రమంలోకొచ్చి పడ్డాడు. ఆశ్రమంలో దూరడం చూసి అతన్ని తరిమినవాళ్లు వెనక్కి పోయినారు. వొణుకుతో వచ్చి ఆ అర్ధరాత్రి భగవాన్ పాదాలమీద పడ్డాడు రక్షించమని. భగవాన్ హాలు తలుపు మూయించేసి,

"భయం లేదు, ఏమిటి సంగతి?" అని అడిగి అంతా విన్నారు.

"ఏం భయంలేదు పడుకో" అని బుజ్జగించి పడుకోబెట్టారు.

మర్నాటి నుంచి ఆ స్వామి మామూలుగానే పని చేస్తున్నాడు ఆశ్రమంలో. భగవాన్ ఆ సంగతి ఎత్తలేదు.

వూళ్ళో జరిగినదంతా అందరికీ తెలిసింది. ఆశ్రమం వారు భగవాన్‌తో ఇదంతా చెప్పి, అతన్ని ఆశ్రమం నుంచి తరిమి వెయ్యాలన్నారు. భగవాన్ వీల్లేదు పొమ్మన్నారు వాళ్ళని. గతిలేక వెళ్ళి ఆలోచించుకొని మళ్ళీ వొచ్చారు, అతన్ని పంపించక పోతే ఆశ్రమం పేరు పడిపోతుందంటూ భగవాన్ దగ్గిరకి. అప్పుడు భగవాన్ అన్నారు అతనితో, వాళ్ళముందే—

"నువ్వేమో ఏదో చేశావు. చేసింది నీ తెలివి తక్కువ వల్ల బైటపడింది. నిన్ను పొమ్మంటున్నారు. వీళ్లు అంతకన్నా ఎక్కువ పనులే చేస్తారు. అయితే వీరు చేసినవి బైటికి రావు. వీరు చేసేవి బైట పడకుండా జాగ్రత్త పడుతారు. ఆ జాగ్రత్త నీకు లేదాయెను. ఇంక వీళ్లు వూరుకోరు. నిన్నిక్కడ బతకనీరు. కనుక అంతా సద్దుకున్నదాకా కొన్నాళ్లు బయట వుండు."

వ్యభిచార స్త్రీని జీసస్ ముందు పెట్టిన Pharasees సిగ్గుపడి ఆమెను వొదిలి వెళ్లిపోయినారు గానీ, యీ నవీన ఫారసీలు వొదలలేదు. పట్టుబట్టి అతన్ని బైటికి పంపారు.

తన భక్తులతో మాట్లాడి అతనికి వేరే ఉనికి యేర్పాటు చేసి, అక్కడ కొన్ని నెలలున్న తరువాత అతన్ని ఆశ్రమం లోకి తెచ్చుకొన్నారు భగవాన్.

ఆశ్రమంలో జరిగే అక్రమాలూ, అవినీతులు ఎవరో వొచ్చి భగవాన్‌తో చెప్పారు అన్నారు. భగవాన్:

"నేను దండించడానికి రాలేదు. నేనే దండించడం ప్రారంభిస్తే ఆశ్రమంలో నల్లని కాకి వాలదు. ఎవరు దేనికి ఇక్కడ చేరుకున్నారో అది వారికి దొరుకుతుంది. మీరు దేనికి వచ్చారో ఆ పని శ్రద్ధగా చూచుకోండి. తక్కినవాటి సంగతి మీకెందుకు?" అని. ఇంకోమారన్నారు: "ఆశ్రమానికి మొదటి పర్యాయము వొచ్చినప్పుడు బాగానే వుంటారు. రెండో పర్యాయము వచ్చేప్పటికి వారికి ఆశ్రమంలో సరిగా జరగటం లేదని తోస్తుంది. మూడో పర్యాయం సలహా లియ్య ప్రారంభిస్తారు. నాలుగో పర్యాయం వాళ్ళకంటే బా



బాగా చేస్తామని అనుకుంటారు. తరువాత ఇక్కడి వారిని వెళ్ళగొట్టి ఆశ్రమాన్నుద్ధరించడానికి పూనుకుంటారు" అన్నారు.

ఒకాయన భగవాన్‌తో,

"మీ శక్తి నాకిస్తే నేను దేశాలు తిరిగి అందరినీ మరామత్తు చేస్తాను" అన్నారు.

"అయ్యో! తనకి తిన మెతుకు లేదట, వీడన్న సత్రం పెడుతాడట" అన్నారు భగవాన్.

లోకాన్ని సంస్కరించే ముందు మానవుడు తనని తాను సంస్కరించుకోవాలని భగవాన్ ఎప్పుడూ చెప్పేవారు. మనిషి మనసు మారితే దాంతోపాటు లోకమూ మారుతుందనేవారు.

## నామాలు పెట్టుకున్న భగవాన్

ఆశ్రమంలో ఒకసారి భగవాన్ భక్తులు రంగస్వామి అయ్యంగారు భగవాన్ని నామాలు పెట్టుకుంటే చూడాలని వుందని చాల చాల అడిగారు. భగవాన్ సరేనన్నారు. నాయన (కావ్యకంఠ గణపతి శాస్త్రి)గారిచేత ముందు పెట్టించాలి అన్నారు భగవాన్. నాయనగారి ప్రక్కన నామమూ, తిరుచూర్ణమూ పెట్టారు భోజనం దగ్గర. ఏదో మాట్లాడుతూ ఆయన తెలీకుండానే నామం పెట్టేసుకున్నారు. తరవాత భగవాన్ పెట్టుకున్నారు. కొంచెం సేపటికి నాయనగారు భగవాన్ వంక చూసి—

"అదేమిటి? ఆ వేషం ఎప్పుడు వేశారు?" అని నవ్వారు.

భగవాన్—

"నాయనగార్ని చూసి నేనూ వేసుకున్నాను" అన్నారు.

"నేనా?" అని అద్దంలో చూసుకుని గణపతి శాస్త్రి తెల్లబోయినారు. అందరూ ఒకటే నవ్వు.

## పనస తొనల పాయసం

ఒకసారి జయంతికి వంట అవుతోండగా బోలెడు పనస పళ్ళు వచ్చి పడ్డాయి. వాటిని ఏం చేద్దామని భగవాన్ని అడగకుండానే, ఎప్పుడో ఏదో చెయ్యాలని కొట్టుగదిలో పెట్టించారు చిన్నస్వామి, ఆయన ఉద్దేశ్యమేదో వుండివుంటుంది. అది కనిపెట్టారు భగవాన్. భోజనాలకి గంట కొట్టేప్పుడు అడిగారు, ఆ పనసపళ్లని ఏం చేశారని. దాచి ఉంచామన్నారు. భగవాన్ వాటినన్నిటినీ లెక్కపెట్టి బైటికి తీయించారు. అప్పటికప్పుడు వాటిని చీల్చి, రుబ్బమన్నారు. ఆ లోపల ఊళ్లోకి పాలకి పంపారు. అప్పటి కప్పుడు వాటినన్నిటినీ పాయసం చేయించి తయారైనాక భోజనానికి గంట కొట్టించారు.

తల్లి సమాధిపైన ఇప్పుడున్న గుడిని కట్టడానికి ఆశ్రమంవారు మొదట తలపెట్టగానే భగవాన్ అనుజ్ఞ అడిగారు. భగవాన్—

"నేను సన్యాసిని. నా పేరు మీద నాకు డబ్బు కావలసినట్టు, నేను గుళ్లు కట్టతలచినట్టు మీరు డబ్బుకోసం



బిచ్చమెత్త వద్దు. పరమేశ్వరుడిస్తే కట్టండి" అన్నారు. కాని, విన్న దెవరు?

ఒక భక్తుడు భగవాన్ పుస్తకాన్ని ఒకదాన్ని ఉద్ధా చేస్తానని ఆశ్రమం వారిని పర్మిషన్ అడిగారు. వారు ఆయన నుంచి ఆ పర్మిషన్‌కి వెయ్యి రూపాయలు అడిగారు. భగవాన్ ఆశ్రమాధికారిని పిలిచి—

"వెయ్యేనా అడిగావు? అంతే చాలా నీకు? రెండు వేలు అడక్కపోయినావా?" అన్నారు.

తన మూలంగా డబ్బు చేసుకోడం చాల అయిష్టం భగవాన్‌కి. కాని, వినే దెవరు?

నెల్లూరునుంచి ఒక ప్లీడరుగారు భగవాన్ని చూడ వచ్చారు. భగవాన్ని అడగవలసిన ప్రశ్నల లిస్టు చాల పెద్దది వ్రాసుకొని వచ్చారు, వాటికి — భగవానైనా సరే జవాబు చెప్పలేడంటూ. కాని, తీరా వచ్చాక ఒక్క ప్రశ్న అడగలేదు.

మర్నాడు తెల్లారకట్ల ఆయన రైలుకి బయలుదేరుతూ భగవాన్ శలవు తీసుకోడానికి వెళ్ళాడు. ఇడ్లీ కాఫీ తయారు చేస్తో భగవాన్ వంటింట్లో ఉన్నారు. అతన్ని చూచి భగవాన్ ఇడ్లీ కాఫీ తీసుకొని వెళ్ల మన్నారు. కాని, అతను తొందరలో ఉన్నాడు. తోవలో తాగుదామనుకుని నిరాకరించి వెళ్లిపోయాడు. తోవ మధ్యలో బస్సు అతనికి కనబడి, తొందరలో కట్వాడి చేరు స్తానంటే దానినెక్కి వెంటనే బయలుదేరాడు. కొంత దూరం వెళ్ళి అడవిమధ్య బస్సు చెడిపోయింది. కాఫీ లేదు. ఇడ్లీ లేదు.

మధ్యాహ్ననికి ఎలానో బస్సు కాట్పాడి చేర్చింది. అక్కడి స్టేషన్‌లో హోటళ్ళు మూసేశారు; Annual cleaning ఆ వేళ. గూడూరు రైలు వెళ్లిపోయింది. మద్రాసు వెళ్లాడు. ఆ రైలు ఆలస్యం. Central చేరుకునేప్పటికి నెల్లూరు రైలు కదులు తోంది. దాంట్లో దూకి అర్ధరాత్రికి ఇల్లు చేరుకున్నాడు. తిండి లేదు. వెళ్ళడంతోటే రాత్రి మిగిలిన తిండి ఏముంటే అది పెట్టమన్నాడు. ఏమీ మిగలలేదు. వంట చెయ్యమన్నాడు. మర్నాడు తద్దినం, రాత్రి ఏం తినకూడదన్నారు. మర్నాడు తద్దినానికి బ్రాహ్మణులు ఆలస్యంగా వచ్చారు. అతను భోజనానికి కూర్చునేటప్పటికి రెండు గంట లయింది మర్నాడు.

ఆశ్రమం తరఫున ఒక పత్రిక పెట్టడానికి స్కీము తయారు చేశారు కొందరు భక్తులు. అంతా తయారు చేసి భగవాన్‌తో చెప్పారు. భగవాన్ పత్రిక ఎందుకు అని అడి గారు.

"ఆశ్రమ విశేషాలు, ఇక్కడి భక్తుల సంగతులు, భగ వాన్ మాట్లాడే మాటలు–అన్నీ అందరికీ తెలియ చెయ్యాలని ముఖ్యం మీ వాక్యాలు" అన్నారు.

"మీ పత్రిక నిండేందుకు నేను సరిపడా మాట్లాడుతో ఉండాలన్న మాట. ఆ పత్రిక నాకు శిక్షా?" అన్నారు భగవాన్.

అంతే–పత్రిక ప్రసంగం మళ్ళీ రాలేదు.

నెల్లూరులో రామారావుగారనే వకీలు ఉన్నారు. రమణ భక్తులూ, ఆయన మిత్రులూ ఎన్నిసార్లో భగవాన్ దర్శ నానికి రమ్మని ఆయన్ని పిలుస్తూ ఉండేవారు. ఆయన–



"భగవాన్ నన్ను రమ్మని పిలుస్తే వస్తాను" అనేవారు.

ఆయన జపంలో ఉండగా ఒకసారి ఆయనకి భగవాన్ కనబడి–

"ఏం రాలేదు?" అని అడిగారట.

రామారావుగారు ఆశ్రమానికి వచ్చారు.

అంతకుముందు రామారావుగారికి ఒక విశేషమైన శ్రీ చక్రం కలలో కనబడ్డది. ఆ చక్రాన్ని ఎవరు తనకు చెక్కి పెట్టగలరని భగవాన్ని అడిగారు. అప్పుడు ఆ చెక్కేవారి పేరు చెప్పి, ఆ చక్రం తయారైన తరువాత భగవాన్ దాన్ని స్వయంగా పరిశీలించి రామారావుగారితో పూజలో పెట్టుకో మని ఇచ్చారు, ఆ శ్రీ చక్రాన్ని.

ఒక మధ్యాహ్నం కొంత మందితో కలిసి ఒక వితంతువు, వయస్సు మళ్ళిన ఆమె వచ్చింది, భగవాన్ దర్శనానికి. ఆమెను దీక్షగా చూచి భగవాన్–

"నువ్వటే" అన్నారు నవ్వుతో.

ఆమె సిగ్గుపడి ఎక్కడన్నా దాక్కోవాలని చూచింది. అందరితో భగవాన్ అన్నారు–

"అది ఎవరో తెలుసునా? చిన్నప్పుడు మేమూ, వీళ్లూ ఒక ఇంటిలోనే భాగాలతో కాపురం ఉండేవాళ్లం. దీన్ని నాకు పెండ్లి చేస్తాననేవారు. నేను మా అమ్మకి వంటకి సహాయం చేస్తూ ఉండేవాణ్ణి. 'ఛ, ఆ గోచి పెట్టుకొని వంట చేసే ఆ ఆడంగి వాడికి మా పిల్లనిస్తానా?' అనేది వీళ్ల అమ్మ. మంచి పని అయింది. నాకు పెళ్లి గతి లేదుగాని–ఉండి, దీన్ని

చేసుకుంటే దీని జాతక ప్రభావం వల్ల నేను ఈ పాటికి చచ్చిపోయి ఉండేవాణ్ణి" అని దిగులు నటించారు. ఆ వచ్చిన ఆమెకూడ నవ్వకుండా ఉండలేక పోయింది.

ఒకరోజు భోజనం దగ్గర భగవాన్ నిమ్మకాయ ఊరగాయ అడిగారు. ఎన్నడూ ఏమీ అడగని ఆయన, ఎప్పుడో ఏదో ఎందుకు అడిగేవారో అడిగేవారు. తప్పకుండా ఆయన అడిగింది వుండదు ఆయనకు వెయ్యటానికి. దగ్గరే తిరుగుతున్న చిన్నస్వామికి న్యూనత అయిపోయింది. భగవాన్ అడగడమూ, తన యాజమాన్యం కింద దాన్ని ఆయనకు వెయ్యలేక పోవడమూ... "ఎందుకు లేకపోయింది ఊరగాయి?" అని ఇటు అటు అందర్నీ కేకలు వేసి, "నిమ్మకాయల కోసం వీరికి వ్రాయండి, వారికి వ్రాయండి, వెంట నే తెప్పించండి" అన్నారు. భోజనాలైనాక కాసేపటికి కల్లా రైలునుంచి పెద్దపార్సెల్ వచ్చింది. దాని నిండా పెద్దనిమ్మపళ్ళు. "ఇంకేం? వెంటనే పెట్టించండి ఊరగాయ. తరగండి నిమ్మకాయలు" అన్నారు. నలుగురు చేరి తరుగుతున్నారు. ఆ నిమ్మకాయలు రావడం తన ఘనతలాగే తిరుగుతున్నారు చిన్నస్వామి, సాయంత్రానికల్లా ఊరగాయి భగవాన్‌కు వేయించి తీరుతాను చూసుకోమన్నట్టు. "చూడండి భగవాన్ మహాత్యం. వచ్చాయి నిమ్మకాయలు" అన్నారు.

ఇంతలో ఒక కుర్రాడు చిన్నస్వామి చూడకుండా వెళ్ళి, తరుగుతున్న ఆ నిమ్మకాయ ముక్క ఒకటి తీసుకు పోయినాడు. వెళ్ళినవాడు మళ్ళీ వచ్చి ఇంకో ముక్క తీసుకున్నాడు. మళ్ళీ ఇంకోటి. "ఇదేమిటి, పళ్ళు పులవ్వా?" అన్నాడు తరిగే ఆయన.



"తిని చూడు" అన్నాడు కుర్రాడు.

అవి తీపి నిమ్మపళ్ళు.

"ఆహా, ఇంకేం? నిమ్మకాయలు వచ్చాయి. ఊరగాయ పెట్టిద్దా మనుకున్నాడు చిన్నస్వామి. తీరా చూస్తే అవి తియ్యవై కూర్చున్నాయి. ఏం చేస్తాము?" అన్నారు భగవాన్.

తమ ప్రజ్ఞ వల్ల పనులు జరుగుతాయి అనుకునేవారికి చాలమందికి శృంగ భంగాలు చేశారు భగవాన్.

ఒకసారి ఒక కుటుంబంతో రాత్రి గిరి ప్రదక్షిణం చేస్తున్నాము. ఈశాన్య మఠం వైపు మలుపు తిరుగుతుండగా మాకు ఓ లారీ ఎదురు వచ్చింది. ఆ లారీ వాళ్ళు "జాగ్రత్తగా వెళ్ళండి స్వామీ, చిరుత పులుల అరుపులు వినబడుతోన్నాయి" అన్నారు. ఏం చెయ్యం? వెనక్కి వెళ్ళమా మళ్ళీ అన్ని మైళ్ళు? అడవిలో ఆగితే, అవి అక్కడికి రావా. మా పసి పట్టి! తప్పదు, ముందుకు పోవాలి. "రమణా, జయ రమణా" అని పాడుకుంటూ వెళ్ళాము. ఊరు తగిలిం తరువాత చెప్పాడు మాతో ఉన్న కాలేజి అబ్బాయి, రోడ్డుకు ఇటు ఒక చిరుత, అటు ఒక చిరుత ఉన్నాయనీ, తాను చూచి కిక్కురు మనకుండా నడిచాననీ.

రమణ నామం అంత ఆపదోద్ధారక మంత్రమన్న సంగతి ప్రతి భక్తుడి అనుభవమున్నూ.

ఒకసారి తొమ్మిదింటికి చిన్నస్వామి ఆశ్రమం అవతలకి కొండవేపు వెళ్ళారు. ఒక చిరుత ఆశ్రమం మెట్లెక్కుతూ

ఆయనకు ఎదురైంది. చిన్నస్వామికి నోటమాట రాలేదు. పరు
గెత్తుకొనివచ్చి ఆశ్రమంలో పడ్డారు, అరుస్తో. అందరూ వచ్చి
ఏమిటని అడిగినా ఏమీ చెప్పలేక పోయినారు, ఊరికే అ
మెట్లవేపు చూపడం తప్ప.ఏమిటో చూద్దామని లాంతర్లతో,
కర్రలతో పరుగెత్తారు అందరూ. అప్పుడు చిన్నస్వామికి
ధైర్యంవచ్చి అటు ఇటూ తిరుగుతూ "ఇది భగవానుని
స్థలం. నువ్వు రాకూడదు. ఏమనుకుంటున్నావు? ఇది ఆశ్రమం"
అని అరుస్తున్నారు.

కాని అక్కడ ఆ చిరుత ఉంటేగా! అదెప్పుడో పారి
పోయింది.

భగవాన్‌కి వినపడ్డది ఆ గోల. అదేమిటో చెప్పారు.
"చిరుతపులి వచ్చిందా? అవును. వీడు సర్వాధికారి. వీణ్ణిచూచి
అందరిమల్లె తాను భయపడాలని దానికేం తెలుసు ? అందరి
మీద చలాయించినట్లే చిరుతపులి మీద అరవబోయినాడు
గావును. కాని నోటమాట రాలేదు. తప్పంతా చిరుతపులిదే.
ఈయన సర్వాధికారి అని ఆ మాత్రం తెలుసుకోక పోవడం"
అన్నారు భగవాన్.

ఆశ్రమంపైన ఒక పెద్ద complaint ఉంటో ఉం...,
గొప్పవారిని ఎక్కువగా చూస్తారని. ఒకాయన ఈ హెచ్చు
తగ్గుల సంగతి భగవాన్‌తో చెప్పుకుంటో ఉండగా భగవా...
మధ్యాహ్నం కాఫీ వచ్చింది.మధ్యాహ్నాలు భగవాన్‌హాలులో
అందరి మధ్యా కూర్చుని ఉండగానే కాఫీ తీసుకొచ్చి ఇచ్చే
వారు. ఫిర్యాదుల ఆయన "చూడండి పోసి. మీ కిచ్చే ...



శ్రేష్టమైంది. మా మొహాన్న నీళ్ళు"అన్నారు.భగవాను తాక
కుండానే, తనకు వచ్చిన కాఫీగ్లాసును మాట్లాడకుండా ఆయ
నకు ఇచ్చి, ఆయనకు వచ్చిన కాఫీని తాను తీసుకొని తాగు
తున్నారు. ఆయనకి భగవాన్ ఇచ్చింది కాఫీ కానే కాదు,
ఏవో ఓషధులు వేసి కాచిన కషాయం, అది భగవాన్ తాగ
వలసిందే కాని తదితరులకు దుస్సాధ్యం. తీరా తీసుకున్నాడు
గ్లాసును భక్తుడు. వద్దనడానికి వీల్లేదు. అందరి మధ్య ఉన్నాడు.
పారపొయ్యటానికి వీల్లేదు. భగవాన్ ప్రసాదం,ఆయన చేత్తో
ఇచ్చింది. ఆనాటి ఆయన యాతన ఆ భగవాన్‌కే ఎరుక.

ఒకసారి జయంతికి నేను వ్రాసిన పద్యాలలో "జయ
ముగు నీ జన్మలకు" అని ఉంది. ఆ పద్యాలు విని భగవాన్
అందరితో "చూడండి.నాకీ జన్మ చాలదట.జన్మతతులు కావా
లంటున్నారు ఈయన" అన్నారు, కంప్లైయింటు గొంతుతో.

అట్లా వ్రాశావేమని నాతో పోట్లాడారు కొందరు.
ఆయన జ్ఞానని కొందరు, బ్రహ్మ అని కొందరు వాదించు
కున్నారు; నాకు మాత్రం ఆయన కుమారావతారం.

"తమకోసం కాదు, మా కోసం" అన్నాను.

"సరి" అని క్షణంలో గంభీరులైనారు. హాలంతా
గాంభీర్యం నిండిపోయింది.

అంతకుముందు ఒకరు అడిగే ఉన్నారు భగవాన్ని
"పూర్వజన్మలలో మీకూ-మాకూ సంబంధం ఉందా, లేక మా
అదృష్టం కొద్దీ ఈ జన్మలో తమరి పాదార విందాలు దొరి
కాయా?" అని.

"ఇదివరకు జన్మలో సంబంధం లేకపోతే ఇప్పుడెట్లా కలుసుకుంటాం?" అన్నారు భగవాన్.

ఆ సంగతిని అనేకసార్లు తనకి దగ్గరైన భక్తులతో అన్నారు భగవాన్. ఇదివరకు తనవారైనవారే తిరిగి ఇక్కడ తనకి సమీప వర్తులైన భక్తులుగా వచ్చారనీ, లోకములో ఏ మూల పుట్టినా తనను గుర్తించి తిరిగి చేరుకుంటారనీ చాల సార్లు సూచించారు.

## జయంత్యుత్సవము-కూరగాయలు

ఓ జయంతికి పెద్ద వాన. ఎక్కడనించీ కూరలు రాలేదు. మర్నాడు జయంతి. సాయంత్రమౌతోంది. చిన్నస్వామి భగవాన్ చెవిని పడేట్టు "కూరలు రాలేదు. ఎట్లా వండడం! కూరలు రాలేదు" అంటో ఇటూ అటూ తిరుగుతున్నారు. రెండు గంటల తరువాత వెలిసింది వర్షం. వర్షం వెలిసిందో లేదో ఇటు వచ్చే బస్సూ అటు వచ్చే బస్సూ ప్రతిదీ ఆశ్రమం గుమ్మం దగ్గర ఆగడం, బళ్ళ కొలది అన్నిరకాల కూరలు దింపడం. అన్నీ దాచారు. రాత్రి అయింది. మర్నాటికి ఏం వొండాలి? భగవాన్ని అడగాలి. అడగంది చెప్పరు. భగవాన్ చెప్పిం తరువాత తరగడం ఒక పని. ఎవరూ తరగడానికి రాలేదు. మళ్ళీ చిన్నస్వామి "కూరలు తరగలేదు ఎవరూ, ఎట్లా?" అని కాలు కాలిన పిల్లిమల్లే తిరుగుతున్నారు రాత్రి పదకొండు గంటలకి. అది చూసి భగవాన్ కొంతమంది భక్తుల్ని పేరు చెప్పి లేపి పంపారుకూరలు తరగమని. "ఎప్పుడూ ఏడుపే. కూరలుగాకపోతే రాలేదని ఏడుపు. వస్తే తరగలేదని. ఏదో ఒకటి



ఏడుపే. వండడానికి వున్నా ఏడుపే, లేకపోయినా ఏడుపే" అన్నారు.

## ఉద్యోగానికి హఠం

భోజనానికి గంట కొట్టాక హాల్లో అందరూ భోజనానికి లేచినా ఒకాయన లేవలేదు. ఆయన సంగతి ఎవరికీ తెలీదు. కొత్తగా వచ్చారు. ఆయన సంగతి ఎవరో చెప్పారు భగవాన్తో. "ఆయనకి ఉద్యోగం కావాలిట. నేను ఉద్యోగం ఎక్కణ్ణించి ఇవ్వను? నాకే వీళ్లు తిండి పెడితే తింటున్నాను. పొమ్మంటే నాకు గతిలేదు. నేను ఒకరికి ఉద్యోగ మిచ్చే దేమిటి?" అని వెళ్లారు భోజనానికి భగవాన్.

భోజనాలై హాల్లోకి వొచ్చాక "ఏమండీ! ఇక్కడ కూర్చొని ఆకలితో భోజనాన్ని ధ్యానం చెయ్యడం కంటే భోజనం చేసి నన్ను ధ్యాన్నం చెయ్యడం నాకు ఇష్టం" అన్నారు భగవాన్. అందరూ నవ్వారు. ఆ మాటతో ఆయన భోజనానికి లేచారు. భగవాన్ ముందు భుక్తి, తరువాత ముక్తి విచారించేవారు.

## కొబ్బరికాయ ఆహారంతో పైత్యం

నంబియాత్ అని సాధకుడు కొబ్బరికాయలు మాత్రం తిని వుండేవారు. ఆయనకి చివరికి పిచ్చి పుట్టి హాలులో బట్టలు లేకుండా "అహం బ్రహ్మాస్మి" అంటూ తిరుగుతున్నారు. "అవును. వేదాంతినని కొంకాయలు తింటే పైత్యం తలకెక్కి పిచ్చి పుట్టింది. తాను సహజంగా తానుగా వుంటే ఏ బాధా

లేదు. కాని అతికి పోతే, ఇట్లాంటి గతే పడుతుంది" అన్నారు భగవాన్.

టెంకాయ మంచిదేననీ, దాంట్లో మనిషికి కావలసిన ఆహార పదార్థమంతా వుందనీ, రోజుకి ఒకటి కంటే ఎక్కువ తినకూడదనీ చెప్పారు. ఆహార నియమమంటే మితంగా తినటం,అంతేగాని అసహజమైన ఆహారం కాదు అనీ అన్నారు.

## ఒకేసారి ఆరు భిక్షులు

ఓ సారి నెల్లూరు నుంచి ఆరుగురు వితంతువులు వచ్చి ప్రత్యేకంగా వొక్కొక్కరే భిక్ష చేస్తామని ఒక్కపూటే అందరూ వేరు వేరుగా వొండి భగవాన్‌కి వొడ్డించారు.

"ఇంత పెట్టారే తినమని నాకు! ఎట్లా తినడం? అంతకన్న ఆ తిండి ఎంత ఉందో, అంత భక్తి మీకు నా పైన వుంటే ఎంత సంతోషం?" అన్నారు. భగవాన్.

## కాఫీ ప్రసాదం

ఓసారి నా తమ్ముల్లలో పెద్దవాడు ఆశ్రమాని వచ్చాడు. అతనికి కాఫీ, టీ మొదలైనవి అలవాటు లేవు. ఆశ్రమం వారు అతనికి కాఫీ ఇచ్చి తాగమన్నారు. అతను తనకు అలవాటు లేదంటే, "భగవాన్ ప్రసాదం. తాగి తీరా"లన్నారు. అతను వెళ్ళి భగవాన్‌ని అడిగాడు–

"స్వామీ, కాఫీ మీ ప్రసాదమట. నాకు అలవాటు లేకపోయినా, అయిష్టమయినా తాగి తీరాలా? తమరు అది తమ ప్రసాద మంటే, తాగుతాను" అని. భగవాన్ ఆశ్ర



మాధికారులతో ఇట్లా అన్నారు. "నేనెన్నడన్నా మిమ్మల్ని అడిగానా, నాకు కాఫీ యిమ్మని? నేను తాగకపోయినా మీరు ఎట్లాగూ తాగేదానికి, కొంత స్వామికి పోసేది, అది స్వామి ప్రసాదమని వొంక పెట్టుకు తాగేది. పైగా ఎవరన్నా తాగను వద్దంటే అదో నింద, స్వామి ప్రసాదం నిరాకరిస్తున్నారని. ఈ ఆశ్రమం వారికి ఏదేది యిష్టమో దానికంతా స్వామి ప్రసాదమని పేరు."

## ఎక్కువగా వేసిన ఉప్పు మాయం

ఓ ఉదయం భగవాన్ ఇడ్లీ పచ్చడి రుబ్బారు. ఆ పచ్చడి రుచి చూడడానికి అందరమూ ఆయన దగ్గర చేరాము, ఆయన చేతి నుంచి Directగా మాకు ప్రసాదం దొరుకుతుంది కదా అని. అన్నీ సరిగ్గా పడ్డాయి బావుంది అన్నారు. సుబ్బరామయ్యకు మాత్రం ఉప్పు తక్కువయిందన్నారు. ఆ మాట విని భగవాన్ రెండుదోసెళ్ళ ఉప్పు తీసుకొని ఆ పచ్చడిలో పోసి, రుబ్బి ఎత్తి పెట్టారు. మాకు ఆశ్చర్యం వేసింది, ఎందుకు ఆ ఉప్పువేసి ఆ పచ్చడిని పాడు చేశారా అని.శుభ్రమైన పచ్చడి అట్లా పాడైపోయింది. ఇడ్లిలో ఏం వేసుకు తినడం అని సుబ్బరామయ్యని మనసులోనే అన్ని అనుకుంటో భోజనశాలలోకి వెళ్లాం. ఆ పచ్చడి వడ్డించారు, ఒక్కరవ్వ ఉప్పు ఎక్కువ కాలేదు. అంత ఉప్పు ఏమయిపోయిందో ఇప్పుడు, లేక సుబ్బరామయ్య కోసం మమ్మల్నంతా మాయ చేశారో భగవాన్, లేక మా కోసం సుబ్బరామయ్యని మాయ చేశారో!

## 'తాతా' పదంలో అంతరార్థం

ఓ చంటిబిడ్డ "తా, తా" అంటోంది తల్లి ఒళ్ళో. "ఆ బిడ్డకున్న జ్ఞానం పెద్దలకి లేదు. ఆ బిడ్డకి తెలుసు తానెవరో. అందుకనే 'తా-తా' అంటుంది. తా-తా అనని బిడ్డ వుండదు. తా-తా అంటే తాన్, తాను అని అర్థము. తాను తానే. I am that. That is that" అన్నారు భగవాన్.

"ఒక్క మాటలో భగవాన్ మోసపోడు."

ఒక భక్తుడు భగవాన్ ఎదుటపడి గీతాలు పాడుతూ భావావేశం ఎక్కువై "భగవాన్, నన్ను నీవు చూడడం లేదు" అన్నాడు.

"చూడకేమండి? చూస్తూనే ఉన్నాను" అన్నారు భగవాన్.

"ఆహా, నువ్వు చూడ్డం లేదు."

"చూస్తున్నానండీ!"

"కాదు, చూడ్డం లేదు."

భగవాన్ మాట్లాడలేదు.

"భగవాన్! నీకు నా సర్వమూ అర్పించాను. నీకు తెలీదూ?"

"తెలుసునండీ."

"కాదు. నీకు తెలీదు."

"బాగా తెలుసునండీ."

"కాదు. తెలుసుననబోకు. నీకు తెలీదు."



భగవానైతే మాత్రం చేసేదేమిటి? ఊరుకున్నారు. కొంతసేపటికి ఆయన వెళ్ళిపోయిన తరువాత భగవాన్ అన్నారు. "అందరూ సర్వమూ అర్పించామంటారు. ఒక్క మాటతో, ఒక్క నమస్కారంతో వారి పని తీరిపోతుంది. ఇక భగవాన్‌దే బాధ్యత. మాట అనగానే మోసపోయే వాడు వాడేమి భగవాన్?" అన్నారు.

## స్వామి సన్నిధిన ఫలహారం

ఒక అమావాశ్య ఉదయం ఊళ్ళోనుంచి కొందరు శ్రోత్రీయులు స్వామిని చూడవచ్చారు. ముందు స్వామిని సేవించుకొని ఊళ్ళోకి పోయి స్నానాలుచేసి తర్పణాలు విడవాలి అని వారి ఉద్దేశము. ఆశ్రమం శ్మశాన భూమిలో ఏర్పడిందనేకారణంవల్ల ఆ కాలంలో శ్రోత్రియులు ఆశ్రమంలో భోజనం చేసేవారుకారు. ఆశ్రమం వదలగానే స్నానాలు కూడా చేసేవారు. భగవాన్ తనను వూళ్ళోనుంచి చూడ వచ్చిన భక్తుల్ని కూడా ఫలహారానికి రమ్మని పిలిచారు. ఎట్లా? అమావాస్య! స్నానం లేదు. తర్పణం లేదు. కాని ఎవరన్నా పెడతానన్నప్పుడు తినకపోతే ఆ రోజు తిండి పుట్టదని ఓ భయం. పైగా తమని పిలుస్తున్న వారు స్వామి. ఏం తోచక చివరికి అందరితోపాటు ఉప్మా తిని, కాఫీ తాగారు. భగవాన్ తిరిగివచ్చి హాల్లో కూచుని, ఉల్లిపాయలు ఎంత

ఆరోగ్యకరమో, ఉల్లిపాయల వల్ల ఎన్ని వ్యాధులు నయం చెయ్యవచ్చునో ఉపన్యాసం ఇస్తున్నారు. వూళ్ళోంచి వచ్చిన పెద్దలందరు చుట్టూచేరి వింటున్నారు. "ఉల్లిపాయలు వాసన అంటారుగాని, సరిగా వొండితే వాసన వెయ్యవు" అని పెద్దలవంక తిరిగి "ఇందాక మీరు తిన్న వుప్మా ఏమన్నా ఉల్లిపాయల వాసన వేసిందా?" అని అడిగారు. వారి నోట మాట లేదు. తెల్లపోయినారు. "ఉల్లిపాయలు సన్నగా తరిగి ఆముదంతో వేయించి ఉప్మాలో కలిపితే, వాసన రాదు. మలబద్ధమూ వుండ"దన్నారు భగవాన్.

## "భగవంతుని తిడుతూ ఆయన్ని తలచుకుంటాడు"

భగవాన్ భక్తుడు సాంబశివరావు గారికి మొదట్లో భగవాన్ పైన అంత భక్తి ఉండేది కాదు. దణ్ణంకూడా పెట్టే వారు కారేమో. ఆయన ఒకసారి భగవాన్‌తో తాను వూరికి పోతున్నానని కబురు చెప్పుతున్నట్టు చెప్పారు గాని, భగవాన్ అనుజ్ఞ అడిగినట్లు అడుగలేదు. భగవాన్ ఆయన్ని గంభీరంగా చూసి 'సరి' అన్నారు. చిత్రంగా ఎంత ప్రయత్నించినా ప్రయాణం అయిదారు రోజులదాకా సాగలేదు. ఒక దినం వాన కురుస్తోంది. ఇంకో దినం బండి రాలేదు. ఇంకో దినం వొళ్లు సుస్థి. ఇంకోరోజు రైలు తప్పింది.

ఇదంతా భగవాన్ పనే అని ఆయనకు తట్టింది.

"నేను వూరికి వెళ్ళకుండా వుండిపోవాలని తల వుంటే నన్ను ఉండిపొమ్మని చెప్పరాదా? వెళ్ళమని చెప్పి



ఇట్లా ఏడిపిస్తారా?" అని సాంబశివరావు, లోపల కించపడుతూ హాలులో ఒక మూల కూచున్నారు. భగవాన్ ఇంకోరితో అంటున్నారు– "తిడితే మంచివాళ్ళనే తిట్టడం మంచిది. చెడ్డవాళ్ళని తిడితే చాల కష్టపడవలసి వస్తుంది" అని.

ఇది తనని ఉద్దేశించే భగవాన్ అంటున్నారని సాంబశివరావుగారు ఉలిక్కిపడి, "స్వామీ, భగవాన్‌కుకూడా తిట్టూ మెప్పూ అని వుంటుందా?" అని ఒక లాయరు ప్రశ్న వేశారు. దానికి భగవాన్–

"ఉండవు. కనక భగవంతుణ్నే తిట్టడం ఇంకా మంచిది. సత్పురుషులను తిట్టినప్పుడు వారేమీ చెయ్యక పోయినా వారు మనసులో కష్టపడవచ్చు. దానివల్ల తిట్టిన వారికి చెరుపు కలగనూవచ్చు. మంచివాళ్ళు, తిట్లవల్ల కష్టపడక పోయినా, వారికేమన్నా పాపం ఉంటే అది తిట్టిన వాళ్ళకి వొస్తుందని శాస్త్రము. భగవంతుణ్ణి తిడితే, ఆయన మనస్సులో కష్టపడరు. ఆయనకి పాపం లేదు. గనుక అది తమకి వస్తుందని భయపడ నక్కరలేదు. ఇంతకీ తిడుతూ అయినా తనని తలచుకుంటే చాలుననికదా భగవంతుడు అఘోరిస్తున్నారు? కాకపోతే శిశుపాలుడికి మోక్ష మివ్వడమేమి?" అన్నారు. సాంబశివరావు మనసులో లెంపలు వాయించుకొన్నారు.

## గీతా శ్లోకం పై ప్రశ్న

ఒకరోజు భగవాన్ భోజనానికి లేవబోతున్నారు. అప్పుడు ఒకరు–

"చాతుర్వర్ణ్యం మయాసృష్టం
గుణకర్మ విభాగశః

అని అంటారే! అంటే గుణమును బట్టి కదా వర్ణాన్ని తీర్మానించవలసింది?" అని ప్రశ్న వేశారు.

భగవాన్‌కి తెలిదా- దేనికి ఆ ప్రశ్న lead చెయ్య బోతోందో, అతని ఉద్దేశ్య మేమిటో! బాగా చీవాట్లు పెట్టారు అతన్ని.

"ఈ ప్రశ్నలు తగులూ తెచ్చి పెట్టడానికే కద! ఈ దురుద్దేశాల వల్లనే అనర్థాలు పుట్టేది. నీ సంగతి నువ్వు చూసుకో. నిన్ను నువ్వు తెలుసుకోటానికి కులమూ, వర్ణమూ అడ్డం వొచ్చాయా? తానెవరో తెలీదు. నీ కేమి కావాలో తెలీదు, లోకానికేం కావాలో తెలుస్తుందా? మీరా లోకాన్ని ఉద్ధరించేవారు?" అని మందలించారు.

## మొదటి ప్రశ్నలోనే అంతమైన ప్రశ్నల పట్టీ

సాధారణంగా పరిహాసంతోనే బదులు చేప్పేవారు భగవాన్. ఒకాయన భగవాన్ని అడగడానికి ప్రశ్నల పట్టీ ఒకదాన్ని తయారుచేసి తీసుకొచ్చారు. భగవాన్ని అడగడానికి రోజంతా సాహసం చాలక పోయింది. తీరా భగవాన్ రాత్రి భోజనానికి లేవబోయే సమయంలో ఆ పట్టీ పట్టీ భగవాన్ చేతిలో పెట్టాడాయన. "అరే—పరీక్ష పేపర్లు అసల్ను చెయ్యడం యాభై యేళ్ళ కిందటే అయిపోయిందనుకున్నా నే,



అయినా చూద్దాం" అని తిరిగి సోఫామీద కూచుని చదివారు.

మొదటి ప్రశ్న— 'తల్లికి తండ్రికి తద్దినం ఎందుకు పెట్టవలెను?'

'అరే, యిదేమిటి? మనకు తల్లీ తండ్రి కనకనే వాళ్ళకి తద్దినం పెడతాము, లోకంవాళ్ళ అబ్బకీ, అమ్మకీ మనం తద్దినం పెడతామా?' అన్నారు.

అందరూ గొల్లున నవ్వారు. తరవాత ప్రశ్న భోజనం తరవాతఅంటూ లేచారు భగవాన్. ఆ కుర్రాడు సిగ్గు పడ్డాడో ఏమిటో భోజనమైనాక మళ్ళీ కనపడనే లేదు.

## దేవుణ్ణి చూశారా ?

ఒక Hat, suit, Boot నల్లదొర Boots విడవ కుండానే, హాల్లోకి దర్జాగా వొచ్చి,

"భగవాన్! మీరు దేవుణ్ణి చూశారా?" అని అడిగాడు. భగవాన్ ఏమీ తెలీనివానివలె, 'దేవుడా? ఎవరాయన?' అని అడిగారు. అతను తెల్లబోయి నుంచున్నాడు.

కొంచెము సేపుండి అతను "భగవాన్! మీ ఫొటో నేను తీసుకోవచ్చునా?" అని అడిగాడు.

"ఆహా, సాధ్యమైతే" అన్నారు భగవాన్.

భగవాన్ నిరాకారుడు, ఆయన ఫొటో తీయడం సాధ్యమా! అని భగవాన్ ఉద్దేశ్యం. ఆ వచ్చిన అతను ఒక snap తీసుకొని వెళ్ళాడు. తరవాత భగవాన్ అన్నారు-

“వివేకానంద, రామకృష్ణుని ‘దేవుణ్ణి చూశావా’ అని అడిగింది చదివి వుంటాడు. అదే అస్త్రం మనపైన ప్రయోగించాడు. ఈ వూరికి టికెట్టుతో దేవుణ్ణి కొనుక్కోవాలని ప్రయత్నిస్తారు. ఏం చేస్తాం?”

ఈ incident భగవాన్ కొండ పైన ఉన్నప్పుడు జరిగిందట.

## కోరికల పరంపరే కర్మఫలితము

“నా తల్లి వృద్ధు. నాకు కొద్ది జీతము. ఆమెను పోషించ లేకుండా ఉన్నాను. నాకు జీతం యెక్కువయ్యేటట్లు భగవాన్ సంకల్పించవలె”నని ఒక బీద ఎలిమెంటరీ టీచరు వ్రాసుకొన్నాడు. ఆ కార్డు చూచి నవ్వి భగవాన్ “సరి” అన్నారు.

కొన్నాళ్లైన తర్వాత ఆ టీచరు వ్రాశాడు: “భగవాన్ కరుణవల్ల నా జీతం ఎక్కువయింది. ఇప్పుడు నా పై గ్రేడు ఖాళీ వొచ్చింది. ఆ గ్రేడు నా కిప్పిస్తే అమ్మకు ఎక్కువగా సుఖం చేకూర్చగలను. కనక అది నాకు లభ్యమయ్యేట్టు భగవాన్ అనుగ్రహించాలి” అని.

ఈ సారీ భగవాన్ నవ్వి “సరి సరి”అన్నారు, తర్వాత కొన్నాళ్ళకు ఇంకో ఉత్తరం– “అమ్మ మంచాన పడింది. పరిచర్య చేసేవాళ్లు లేరు. నాకు పెళ్ళయితే నా భార్య ఉంటుంది, అత్తగారికి పరిచర్య చేసేందుకు. నేను పేదవాడిని. నా కెవరు



పిల్లనిస్తారు? డబ్బెక్కడ నుండి వస్తుంది? భగవాన్ కరుణించాలి” అని. భగవాన్ పెద్దగా నవ్వి “బావుంది. కానీ” అన్నారు.

ఇంక కొన్ని నెలలకు ఇంకో ఉత్తరం వచ్చింది: “తమ దయవల్ల పెళ్ళయింది నాకు. నా భార్య వెంటనే కాపరానికి వచ్చింది. నా భార్య కడుపున ఒక కాయ కాస్తే చూసి పోతానంటుంది అమ్మ, తమరు అనుగ్రహించవలె”నని.

“బావుంది. కానీ” అని నవ్వారు భగవాన్. ఇంకా కొన్ని నెలలకు, “బిడ్డ కలిగాడు, తల్లికి పాలు లేవు. ప్రమోషన్ అయితేనేగాని తల్లికి పాలుకొనలేను. స్వామి అనుగ్రహించా”లని ఉత్తరం వచ్చింది.

“ఎంతో బావుందీ! కానీ” అన్నారు స్వామి. కొన్నాళ్లకి “నాకు ప్రమోషన్ అయింది. బిడ్డ బావున్నాడు. అంతా తమ కరుణ” అని ఉత్తరం వచ్చింది.

“సరే. అంతా అయింది. అయితే నేను చేసిందేమిటి? వాడి సత్కర్మ” అన్నారు భగవాన్.

కొన్నాళ్ళకి మరలా ఉత్తరం–

“అమ్మ పోయింది. తమకి దణ్ణం పెట్టి పోయింది”అని.

“మంచిదే” అన్నారు భగవాన్.

ఒక నెలకి ఇంకో జాబు–

“బిడ్డ పోయినాడు స్వామీ, నా బిడ్డ పోయినాడు” అని.

"అరే పాపం!" అన్నారు స్వామి.

ఇంకో నెలకి, "భార్య గర్భవతి, బిడ్డని కన్నది. బిడ్డా, తల్లీ కూడా పోయినారు స్వామీ!" అని రాశాడు.

"రామ రామ. అంతా అయిపోయిందే," అన్నారు భగవాన్.

ఇంకో నెలకి మళ్ళీ ఒక కార్డు–

"సరిగా బడికి రానటం లేదని, నన్ను పనిలోంచి తీసేశారు. బికారినైనాను" అని.

భగవాన్ ఒక నిట్టూర్పు విడిచి,

"మధ్యలో వొచ్చిందేదో పోయింది. మిగిలింది ఎప్పుడూ వున్నది తాను. చివరికి మిగిలేదే అది" అన్నారు.

——

# చలం (విన్నవీ, కన్నవీ)

## ముంతలోని కూడు ఆరగింపు

భగవాన్ ఇంకా రెండేళ్లకు దేహం చాలిస్తారనగా జరిగింది ఈ సంగతి. వివిధ దేశాల్నించి వచ్చిన భక్తులు కూర్చొని ఉన్నారు, చుట్టూ హాలులో ఆ ఉదయం.

భోజనానికి గంట కొట్టారు. ఆకలిగా ఉన్నారు భక్తులు. చప్పు చప్పున లేచి వెళ్ళారు భోజనాలకు. భగవాన్‌కు మోకాళ్ళ నొప్పులు. అందుచేత చాల వ్యవధి తీసుకునేవారు సోఫాపైనుంచి లేవడానికి. మెల్లగా లేచి కర్రనానుకొని హాలు బైటికి వెళ్లే గుమ్మం దాటుతున్నారు కష్టంమీద. ఆ గుమ్మం మూల ఒక గొల్లఅతను భుజాన గొంగళి వేసుకొని, ఒక ముంత దానిపై వేలాడకట్టుకొని తలుపు దగ్గర నక్కి నిలబడ్డాడు. భగవాన్ వెళ్ళుతూ ఆగి అతన్ని నిదానించి చూచి

"ఎవరు, చిన్నపయ్యనా?" అని అడిగారు. అతను "అవును స్వామీ!" అన్నాడు, భయభక్తులతో.

"బాగున్నావా? చూడటానికి వచ్చావా? సరే, ఆ ముంతలో కూడు ఉందా ఏమన్నా?"

"ఉంది స్వామీ!" అన్నాడు అతను సిగ్గుతో.

"అయితే ఇంకేం? చూస్తావేం? పొయ్యి" అని వంగి దోసిలి పట్టారు భగవాన్.



అతను సంకోచించకుండా భగవాన్ దోసిట్లో సంతోషంగా పోశాడు. భగవాన్, దాన్ని అమృతంలాగు తాగుతున్నారు మెల్లిగా.

భగవాన్ భోజన హాలులోకి రాలేదు. ఆలస్యమైంది. భక్తులు కాచుకొని కూర్చున్నారు. ఒక సేవకుడు లేచి చూడడానికి వచ్చి భగవాన్ చేస్తున్న భోజనం చూచాడు.

"ఏమిటీ అన్యాయం స్వామీ? అందరూ కాచుకొని ఉన్నారు," అన్నాడు.

"నేను ఎవరికోసం వచ్చాను? వారికోసమా? ఎవరి వాణ్ణి నేను? నేను కొండల్లో ఉన్నప్పుడు వారందరూ నన్ను పోషించారా? ఆ నాడు నేను వీరి కెవరికీ కావలసి రాలేదు. ఈ గొల్లవాళ్లు కూళ్లు పోసింది నాకు, నా ఆకలికి" అంటూ చిరునవ్వుతో గొల్లఅతని దగ్గర శలవు తీసుకొని భోజన హాల్లోకి వెళ్లారు భగవాన్.

## వేదం వినటానికి వచ్చిన చిరుత

పూర్వం ఒకసారి భక్తులు కొందరు అర్ధరాత్రి వెన్నెలలో వేదం చదువుకుంటూ గిరి ప్రదక్షిణం చేస్తున్నారు. అడవిలో కొండమీదనుంచి ఒక చిరుతపులి దూకుతూ వచ్చి రోడ్డుమీద వాళ్ళ తోవకు అడ్డంగా నుంచుంది. వాళ్ళు హడిలిపోయినారు. నోట వేదం ఆగిపోయింది. వెనక్కి పరుగెత్తడానికి కాళ్ళు ఆడలేదు.

ఆ చిరుతపులి అట్లాగే కొంచెంసేపు నుంచుని వాళ్ళ

కేసి కాస్సేపుచూచి తన తోవన వెళ్ళిపోయింది. మెల్లగా నడుచుకొంటూ బ్రతుకు జీవుడా అని వాళ్ళు ప్రదక్షిణం పని ముగించుకొని ఆశ్రమానికి వచ్చి భగవాన్‌తో చెప్పారు.

"ఎందుకు భయపడి వేదం చదవటం ఆపారు? వాడు ఒక జ్ఞాని. మీ వేదం విని, ఇంకా దగ్గిరగా వినాలని ఆసక్తితో వచ్చాడు" అన్నారు భగవాన్.

## నల్లరాతి సోఫా ఎవరిది?

గుడి ఎదురుగా భగవాన్ కోసం వైభవంగా ఒక హాలు కట్టారు. దాంట్లో నల్ల మార్బుల్ రాతితో భగవాన్ కూచునేందుకు సోఫా చెక్కించారు. పాత చోటునుంచి కదలి కొత్త హాలులోకి వచ్చి కూర్చోమని ప్రార్థించారు భగవాన్‌ని. రాను అన్నారు భగవాన్.

ఆ రోజుల్లోనే భగవాన్ విగ్రహాన్ని రాతితో చెక్కిస్తున్నారు. మరీ బ్రతిమాలగా భగవాన్—

"ఆ రాతిసోఫాపైన రాతిభగవానుని కూచోపెట్టండి" అన్నారు.

చివరికి అదే నిజమైంది. కొత్త హాల్లోకి వెళ్ళి భగవాన్ ఒక సంవత్సరం కూచోలేదు. అటు తరువాత ఆయన బదులు విగ్రహాన్నే పెట్టుకున్నారు.

## ఆదరం పొందిన పావురం

ఒకసారి దెబ్బతిన్న పావురాయిని ఒకరు తెచ్చి యిచ్చారు భగవాన్‌కి. దానిని దువ్వి సముదాయించి అక్క-



వున్న భక్తుల్ని అడిగారు, ఎవరన్నా దాని జాగ్రత్త తీసుకునే వాళ్ళున్నారా? అని.ఎవ్వరూ ఒప్పుకోలేదు. అంతకుముందు బరోడా మహారాణి తెల్ల నెమలిని సమర్పించినప్పుడు ప్రతివారు ఆ నెమలికి సేవ చేసేవారే. భగవాన్ అన్నారు—

"నీవు నెమలివి కావు. పనికిమాలిన పావురానివి. నిన్ను ఏ బరోడా మహారాణో అపురూపంగా తెచ్చి సమర్పించలేదు. నువ్వెవరికేం లెక్ఖ? ఎవరికా-వాలి? నిన్నెవరు చూస్తారు?" అని.

## భగవాన్ కరుణాప్రసారము

ఒక ఉదయం ఒక ముసలి తెలుగు అతను ద్రౌపది గుడి దగ్గర గుమ్మంలో నుంచొని ఉన్నాడు. నన్ను చూచి మాట్లాడుతున్నాడు. అతను భగవాన్‌కి దూరంగా గంటల కొలది నుంచుని ఉండడం చూచాను ఆశ్రమంలో.

"రాత్రంతా ఇక్క-డే పడుకొని ఉంటాను" అన్నాడు, మాటల సందర్భంలో,

"ఏమిటి, ఇక్క-డా, వంటరిగానా. భయం లేదా?" అన్నాను.

"భయమా? ఏం భయం? రాత్రంతా నా పైన భగవాన్ కాంతి వేసి ఉంచుతారు. నా చుట్టూ నీలం వెలుగు ఉంటుంది. ఆయన కాంతి నాతో ఉంటే నాకేం భయం?" అన్నాడతను.

భగవాన్ ప్రియ భక్తుల మనుకుంటో, విలువైన

బట్టలు కట్టుకుని, అందర్నీ తోసుకుంటూ, భగవాన్ దగ్గిరగా ఎదురుగా పీఠాలు వేసుకొని స్థలాలకి తగాదా పడేవాళ్లు అట్లానే వున్నారు. తమ దగ్గిరిగా రానీకుండా దూరంగా నుంచో పెట్టే ముసలి బిచ్చగాడిపై భగవాన్ కరుణ.

## గడియారం కానుక

ఒకసారి ఒక భక్తుడు విలువైన గడియారాన్ని కొని తెచ్చి భగవాన్ ఎదుటనున్న బల్లమీద పెట్టి.

"భగవాన్ దీంటో గంటలు చూసుకోవాలని ప్రార్థన" అని వెళ్ళి కూచున్నాడు. నాలుగు రోజుల తర్వాత చూస్తే ఆ గడియారం అక్కడ లేదు. ఆ భక్తుడు గోల పెట్టాడు, భగవాన్ ముందు. భగవాన్ మాట్లాడలేదు. ఆ భక్తుడు అక్కడి వాళ్ళందర్నీ అడిగాడు, గడియారం ఏమయిందని. భగవాన్ దగ్గిర బంధువుల్లో ఓ యువకుడు తీసుకున్నాడని తెలిసింది.

"వాడా! వాడు నాలుగు రోజులు ఆ గడియారాన్ని ఇక్కడ ఉండనిచ్చాడు. అందుకు సంతోషించాలి" అన్నారు భగవాన్.

## తిరిగి తిరిగి బయలుదేరిన చోటుకే

ఆశ్రమంలో చాలా ఏండ్లు పనిచేసిన తరువాత శాంతమ్మకి ఓపిక తగ్గి పనిచెయ్యడం మానుకొన్నది. ఆమె ఆశ్రమం దగ్గిరే ఒక పాక వేసుకొని ఉండాలనుకొన్నది. తనకు డబ్బు లేదు. భక్తుల దగ్గర యాచిద్దామంటే ఆశ్రమంవారు ఒప్పు



కోలేదు. అందుకని వూరికి వెళ్ళిపోదామనుకున్నది. కలలో భగవాన్ కనపడి,

"ఇక్కడ కాక నీకు ఇంకెక్కడ స్థలముంది లోకంలో?" అన్నారు.

ఇక్కడ ఉండడానికి వీలు కనపడలేదు. ఆమెకి దగ్గిర బంధువు ఒక డాక్టరు; ఆమెని తన దగ్గరకు వచ్చి వుండమని చాలా కాలం నుండి అడుగుతున్నాడు. అతని దగ్గిరికి వెళ్లింది. ఈమె ప్రొద్దున్న 8 గంటలకి అతని యింటికి వెళ్ళింది. ఏ జబ్బు లేకుండానే ప్రొద్దున్న 10 గంటలకు డాక్టరు చచ్చిపోయినాడు. అక్కడ నుంచి శాంతమ్మ తన వూరు రామనాథపురం వెళ్ళింది. అక్కడ ఎవరూ ఆమెని ఆదరించలేదు. తిరిగీ ఆశ్రమానికి వచ్చి చేరింది. తిరిగి రాగానే ఆమె అడుగకుండానే భక్తులు పూనుకొని ఆమెకు కొంత భూమి యిచ్చి దాంట్లో ఒక పూరిల్లు కట్టించారు.

## ఈశ్వరుణ్ణి చూస్తున్నాను

ఒకసారి ఓ భక్తుడు అడిగాడు భగవానుని—

"మీరు శంకరుణ్ణి, కైలాసాన్ని, నందినీ చూశారా?" అని. దానికి భగవాన్,

"ప్రతి నిమిషము ఈశ్వరుణ్ణి చూస్తున్నాను కాని, శంకరుణ్ణి గాని, కైలాసాన్ని గాని,నందిని గాని ఎన్నడూ చూడలేదు" అన్నారు.

## ఏ చిక్కూ లేదు

ఒకసారి చలం అడిగాడు-

"ధ్యానంలో ఊపిరి ఆగిపోయి ఉక్కిరి బిక్కిరై మెలుకువ వస్తుంది. ఏం చెయ్యను, భగవాన్?"

దానికి భగవాన్,

"ఆ ఊపిరి పూర్తిగా ఆగిపోతే ఏ చిక్కూ ఉండదు" అని వేళాకోళం చేశారు.

అందరు నవ్వారు.

## పరీక్షించడానికి ప్రశ్న

గుంటూరు నుంచి ఒకరు వచ్చి భగవాన్‌ని,

"ఈ యుగం ఆఖరై పోతుంది కదా? మీరు ఏమి నిశ్చయించారు? జీవ సమాధి అవుతారా? మామూలు సమాధిలో పోతారా?" అని అడిగారు.

దానికి భగవాన్ ఉగ్రులై —

"ఎవ్వడవురా? నన్ను పరీక్ష చేయడానికి వచ్చావా? నువ్వా నా శక్తి సామర్థ్యాలు పరీక్ష చేసేది? ఎంతవాడవురా నువ్వు? ఛీ ఛీ-పో" అని, అతను వెళ్ళేదాకా తరిమారు.

## భక్తులకై తనకు చికిత్స

ఒకసారి భగవాన్ పడ్డారు. దెబ్బ తగిలింది. పరిచారకుడు శివానందం వెళ్ళి చిన్నస్వామితో చెప్పాడు. ఆయన డాక్టరును పిలవమన్నారు. అది విని భగవాన్,



"నాకు డాక్టరును తెప్పిస్తారా? ఇంగ్లాండు నుండి పిలిపించండి. ఊరుకోండి. నాకు డాక్టరు వద్దు," అని అదిలించారు.

అందరూ హడలిపోయి ఊరుకున్నారు. భగవాన్ తనకి డాక్టరు వద్దంటే ఒక భక్తురాలు ఏడ్చింది, భగవాన్‌కి తగిలిన దెబ్బలు చూచి. అది చూచి భగవాన్,

"పిలవండయ్యా, డాక్టరును. నా కింక స్వతంత్రం లేదు. పిలవండీ" అన్నారు.

## నన్ను నీ వెట్లా చూస్తావో నిన్ను అట్లు చూచుకో

ఒకసారి సూర్యనారాయణగారి భార్య—

"భగవాన్! దేవుణ్ణి చూశారా, మీరు?" అని అడిగింది.

హాలులోకి వెడుతున్న భగవాన్ తలుపు దగ్గర వెనుకకు తిరిగి గంభీరంగా—

"ఎవరనుకున్నావు నన్ను?" అని అడిగి ఒక నిమిషం ఆగి,

"నన్ను నువ్వెట్లా చూస్తావో నిన్ను నువ్వట్లా చూచుకో" అన్నారు.

సూర్యనారాయణగారు భగవాన్‌తో,

"నేను పడే వ్యథ చూడడం లేదు. ప్రతి నిమిషం నీ స్మరణతో గడుపుతున్నాను. నీకు తెలియడం లేదా?" అని ఏడుస్తూ అడిగారు.

"చూస్తూనే ఉన్నాను" అన్నారు భగవాన్.

అందు కాయన, "ఏం చూస్తున్నారు? ఏమిటి చూడడం, శాంతి లేకుండా నేను ఇట్లా కొట్టుకుంటూంటే?" అని దబాయించారు.

"శాంతి నా దిండు క్రింద దాచి ఉంచాను, శాంతి!" అన్నారు భగవాన్.

## గచ్చుచేయిస్తే ఆలయం లేపుతారు

భగవాన్ కొండపైకి వెళ్లినప్పుడు ఆయన వెంట బోసునూ, రామయోగీ వెళ్లారు, భగవాన్ పొదల చాటుకి వెళ్లిం తరువాత వీరిద్దరూ మాట్లాడుకొంటున్నారు. రామయోగి సౌజ్ఞ చేసి చూపించారు, ఆ చెట్టు నీడను గచ్చు చేయించమని. తిరిగివచ్చి భగవాన్ ఆ చెట్టుక్రింద కొంచెం సేపు కూర్చుంటో ఉంటారు. వారట్లా మాట్లాడుతూ ఉండగా భగవాన్ వచ్చి ఏమిటని అడిగారు. బోసు చెప్పాడు.

"వద్దు, వద్దు. ఇక్కడ గచ్చు చేయించారా, ఇక్కడ ఒక ఆలయం లేపుతారు," అన్నారు భగవాన్.

## బట్టలులేని ఇద్దరు గొప్పవారు

మొదటిసారి గ్రీన్‌లీస్ అనే ఆయన భగవాన్ దర్శనానికి వచ్చినప్పుడు ఒకరితో అంటున్నారు—

"నా చెల్లెలు ఇంగ్లాండునుండి వస్తానంటుంది. ఆమెకు భగవాన్ గురించి, గాంధీగారిని గురించి చాలా వ్రాశాను. ఈ దేశంలోకల్లా ముందు చూడవలసినవాళ్ళు వారిద్దరేనని.



కాని తీరావస్తే ఎట్లా చూపను? ఇద్దరికి వంటిమీద బట్టలు సరిగా ఉండవు. ఇద్దరూ అందం లేనివారు. ఈ దేశానికంతా వీరిద్దరే గొప్ప వారంటే ఏమంటుందో ఏమో?" అని.

## సోమర్‌సెట్ మాఘంతో మౌన ప్రసంగం

సోమర్‌సెట్ మాఘం (ప్రపంచ ప్రఖ్యాత రచయిత) భగవాన్ని చూడాలని వచ్చారు. ఎండ వేడికో ఏమో జబ్బు పడ్డారు. ఛాడ్విక్ గారు ఆయన్ని ఆదరించి తన గదిలో పడుకో పెట్టారు, మాఘంగారికి జబ్బుగా ఉన్నది అని. భగవాన్ ఛాడ్విక్‌గారి గదికి వచ్చి కూర్చున్నారు. ఒక్క మాట లేదు. భగవాన్, మాఘం ఒకరినొకరు చూస్తూ గంటసేపు ఉండిపోయారు. భగవాన్ లేచారు. మాఘంను అడిగారు ఛాడ్విక్, ఏమన్నా మాట్లాడాలా అని.

"ఏముంది మాట్లాడటానికి?" అన్నారు ఆయన.

"అవును, మాటలతో పనేమిటి?" అని వెళ్లిపోయినారు భగవాన్. మాఘం కూడా ప్రయాణమై వెళ్లిపోయినారు.

## మనసులో అనుకుంటే భగవాన్ చూస్తారు

భగవాన్‌కి జబ్బుగా ఉంది. చివరి రోజులవి. దర్శనానికి వచ్చిన వందలాది జనాన్ని మధ్యాహ్నం నుంచి క్యూలో నడిపించి దూరంనుండి భగవాన్ దర్శనం చేయిస్తున్నారు. ఆయన ఎవరి వంకా చూసేవారు కారు. తన వంక ప్రతిరోజు చూస్తారని చెప్పింది నర్తకి.

"ఎట్లా?" అన్నాడు చలం ఆశ్చర్యంతో.

"ఏం లేదు; వెళ్ళేముందు మనసులో 'భగవాన్! నా వంక చూడండి అనుకుంటాను. చూస్తారు" అన్నదామె.

చలం మర్నాటినుండి అట్లానే అనుకునేవాడు. ప్రతి రోజు భగవాన్ చలం వంక దయతో చూసేవారు.

## ఇక్కడ భోజనం చేద్దాం

ఒకరోజు ఒకరు భగవాన్ దగ్గిర–

"ఆ గురువు దగ్గర ఈ యోగం, ఈ గురువు దగ్గర ఈ సాధన చేశా" నంటూ పెద్ద జాబితా ఏకరువు పెట్టుతున్నారు.

భోజనానికి గంట కొట్టారు.

"ఇప్పుడు ఇక్కడ భోజనం చేద్దాం" అంటూ భగవాన్ లేచి వెళ్లిపోయినారు.

## ప్రశ్నే తప్పు

"ఆత్మ సాక్షాత్కారము కలిగినప్పుడెట్లా ఉంటుంది?" అని ఒకరడిగారు.

"ప్రశ్నే తప్పు; కలగడానికి కొత్తగా ఏమీ లేదు" అన్నారు భగవాన్.

"తెలియ లేదు స్వామీ!"

"యేం లేదు. ఇప్పుడు ప్రపంచంలో నీవు వున్నావు. అప్పుడు ప్రపంచం నీలో ఉంటుంది."



## కోర్కెకు అర్థం

ఒకామె అడిగింది–

"స్వామీ! ఎప్పుడూ మీరిట్లా దర్శన మిస్తుండాలిఅనే నా ప్రార్థన" అని.

"సరే, అట్లానే. అదుగో, అక్కడ చెక్కుతున్నారు రాతితో విగ్రహం (భగవాన్‌ది). అది యిస్తూ ఉంటుంది, ఎప్పుడూ దర్శనం," అని—

తక్కినవారితో—

"ఆమె కోర్కెకు అర్థం యేమిటో తెలుసా? ఎప్పుడూ ఈ దేహంలో దర్శనం చేసుకుంటో నేనిట్లాగే ఉండాలి. దర్శనమిస్తో, ఆమె ఆమె పిల్లలు, మనుమలు అట్లాగే ఉండాలి" అని అన్నారు భగవాన్.

## పెషావరు మౌల్వీ

ఒక ఉదయం హాలులో అందరూ ధ్యానంలో కూర్చొని వుండగా గుమ్మం బయట కఱ్ఱతో ఎవరో తడుముకుంటున్న చప్పుడు అవుతోంది. చలం అది విని బయటికి వెళ్లి చూస్తే ఒక పొడుగాటి ఉత్తర హిందూస్తానపు రకం మహమ్మదీయుడు తలుపు ఎక్కడ వున్నదో అని కఱ్ఱతో తడుముకుంటున్నాడు; ఆయన గుడ్డివాడు. చలం ఆయన చేతిని పట్టుకొని తీసుకొని వచ్చాడు. ఆయన ఉర్దూలో—

"భగవాన్ ఎక్కడ?" అని అడిగాడు.

ఆయనని చలం భగవానుని ఎదురుగా కూర్చోబెట్టి తెలుగులో,

"మీా ఎదురుగా ఉన్నారు భగవాన్, నమస్కరించండి" అన్నాడు.

ఆ మాటలు అర్థమయినాయో లేదో కాని, భగవానుని చూస్తున్నట్లే ఆయన ముఖములో భక్తి, ఆనందం ఆవరించాయి. ఆ మహమ్మదీయుడి భుజములు పట్టుకొని వొంచి భగవాన్‌కి నమస్కరింప జేశాడు చలం. అక్కడ ఉన్న ఉర్దూ తెలిసిన భక్తులు అడుగగా, ఆయన తన కథ చెప్పారు.

ఆయనది పెషావర్ దగ్గర ఒక పల్లెటూరు. ఆయన గొప్ప మౌల్వీ. ఖురాన్ ఇటు నుంచి అటు, అటు నుంచి ఇటు ఒప్పగించగలరు. ఉర్దూలోకి తర్జుమా అయిన భగవాన్ వ్రాసిన పుస్తకము ఒకటి ప్రక్క గదిలో చదువుతూంటే విని, వెంటనే భగవాన్ తనకు జ్ఞానమివ్వగల గురువని నిర్ణయించుకొన్నారు. భగవానుని చూడాలని వెంటనే రైలు ఎక్కి వచ్చేశారు, ఆ గుడ్డి ఆయన పెషావరునుంచి తిరువణ్ణామలై.

"సరే, యిప్పుడేమి చేస్తావు?" అని అడిగారు.

దానికి ఆయన,

"యింకేముంది? భగవాన్ యిష్టం. ఏం చెయ్యమంటే అది చేస్తాను" అన్నారు.

భగవాన్ అంతసేపూ ఎక్కడో చూస్తూ కూర్చునే వున్నారు.

ఆ మహమ్మదీయ విద్వాంసుడి విశ్వాసానికి చలానికి సిగ్గేసింది. బెజవాడ నుంచి ఈ కాస్త దూరం రావాలంటే ఎంతో శ్రమ చలానికి. ఈ గుడ్డి ఆయన ఇన్ని వేల మైళ్ళు,



యిన్ని రైళ్ళు మారి వచ్చారు. ఆ తురకాయన ఈ దక్షిణాది యోగి చేతులలో పెట్టారు. నిస్సంశయంగా తన జీవితాన్ని - భగవాన్ని చూడకుండానే ఆయన వ్రాసిన రెండు వాక్యాలు విని.

చలానికి ఎన్ని సంశయాలు! ఆ సంశయాలను రేపుతున్న మేధస్సుని చూచుకొని ఎంత గర్వం!!

ఫలించని యోగసాధన

ఎచ్చమ్మ భగవాన్ మొదటి భక్తులలో వారు. యితరులెవ్వరూ ఆదుకోనని రోజులలో భగవాన్‌కి, భక్తులకి వొండి అనేక ఏండ్లు కొండమీాదికి తీసుకొని పోయి భోజనం పెట్టింది. తన ఆస్తినంతా ఆ విధంగానే వినియోగించిందట, ఆశ్రమం పెద్దదై వందలాది మంది భోజనానికి భగవాన్‌తో కూర్చొనేటప్పుడు కూడా ఎచ్చెమ్మ వండి పంపిన ప్రసాదము వస్తేనే గాని భగవాన్ భోజనానికి ఉపక్రమించేవారు కారు.

ఆమె చచ్చిపోయినదని వార్త చెబితే భగవాన్ "అల్లాగా" అన్నారుట.

అంతే.

ఆమె దేహాన్ని దహనము చేసి వచ్చి శాంతమ్మ భగవాన్‌తో చెప్పింది ఆ సంగతి. "సరి సరి." అని భగవాన్-

"నేను ఆ యోగసాధనలూ అవీ చెయ్య వద్దంటే విన్నది కాదు. అందుకనే చివరి కాలంలో స్మృతి లేకుండా పోయింది" అన్నారు.

అంతటితో ఆమె సంగతి ఆయనకు యింక పట్టినట్టు లేదు.

## భక్తుడికి దర్శనము

భగవాన్ చివర రోజులు. ఆపరేషన్ చేసి, ఆయనను గదిలో పడుకోపెట్టి కదలకూడదనీ, ఎవ్వరూ ఆయనను డిస్టర్బ్ చేయకూడదనీ కావలి కూడా పెట్టారు. మిట్ట మధ్యాహ్నము ఎక్కడ నుంచో ఒక సాధువు వచ్చి ఆశ్రమం గేటు దగ్గర ఒకరిని అడిగాడు, భగవాన్ ఎక్కడ అని. పరిస్థితి చెప్పి, భగవాన్ దర్శనాలు లేవని చెప్పారు. తాను వెంటనే వెళ్ళిపోవాలనీ, భగవాన్ దర్శనము అయితీరాలనీ అన్నాడా సాధువు. వీలు లేదన్నారు ఆశ్రమం వారు.

ఈ మాటలు భగవాన్‌కి వినపడే ఆస్కారం లేదు. సాధువు మాత్రం వెళ్ళిపోక అక్కడే నిలుచుకొని కళ్ళు విప్పి భగవాన్ పడుకున్న గదివంకే చూస్తున్నారు అంత దూరం నుంచి. సాధువు కళ్ళు వెడల్పుగా తెరుచుకున్నాయి. గదిలో నుంచి వరండాలోకి వచ్చి ఆయనకి దర్శనము యిస్తున్న భగవాన్ వైపు చూస్తున్నాయి ఆయన కళ్ళు. అట్లానే ఒకరు నొకరు నాలుగు నిమిషములు చూచుకున్నారు, నిశ్శబ్దంగా. అంతే. ఆ సాధువు వెళ్ళిపోయినారు. భగవాన్ తన గదిలోకి వెళ్ళి పడుకొన్నారు. మళ్ళీ ఆ సాధువు ఎన్నడూ కనపడ లేదు.

## శివనామ స్మరణ

ఆశ్రమం ఏర్పడ్డ మొదటి రోజులలో హరిజనుడు ఒకడు ఆశ్రమం బయట గుమ్మం దగ్గర నిలుచుని ఉండేవాడు, తనని



లోపలకు రానీయరు కనుక. భగవాన్ బయటికి వెళ్ళినప్పుడల్లా వారి వెంట అతను వెళ్ళేవాడు. తిరిగి భగవాన్ ఆశ్రమం లోకి వెళ్ళేటప్పుడు గుమ్మం దగ్గర నిలచిపోయేవాడు ఆ భక్తుడు. కొన్నాళ్లు అట్లా జరిగింది.

ఒక సాయంత్రం భగవాన్ బయటికి వెళ్ళివచ్చి, బావి దగ్గర నిలుచున్న ఆ హరిజనుణ్ణి తన వద్దకు రమ్మని పిలిచారు. అతను సాష్టాంగపడి నిలుచున్నాడు. భగవాన్ అతనితో—

"శివ శివ అనుకో-పో"

అన్నారు. అతను వెళ్ళిపోయినాడు అంతే. తిరిగి యెవ్వరికీ కనపడ లేదు.

ఒకసారి లీలగారితో భగవాన్ని చూడటానికి వచ్చాడు చలం. అంతకు ముందే చాలకాలం నుంచి భగవాన్ సన్నిధిలో వుంటున్నారు చలం భార్య రంగనాయకమ్మగారు. చలం వాళ్లు కొన్నాళ్ళు ఉన్నారు. తరువాత వెళ్ళదలచుకున్నారు.

భగవాన్ దగ్గర శలవు తీసుకోవాలన్నాడు చలం. లీలగారి బృందం తాము రాము పొమ్మన్నారు. ఆ రాత్రి చలం భగవాన్ని వెతుక్కుంటూ వెళ్లాడు. భోజనమై ఒంటరిగా భోజనాల హాల్లో కూచుని ఉన్నారు భగవాన్. చలం వారికి సాష్టాంగపడి,

"వూరికి వెళ్ళి వస్తాం, భగవాన్!"

అన్నాడు మామూలుగా యెప్పటిమల్లేనే.

భగవాన్ ఉగ్రులై చలం వేపు తిరిగి,

"ఏమండీ వేంకటచలంగారూ! యెవరెవరు వెదుకుతున్నారండీ?"

అని అడిగారు.

చలం హడలిపోయాడు. నోట మాట రాలేదు. చివరకు చెప్పాడు తాను, లీలగారి బృందం వెడుతున్నామని. అట్లానే కోపంగా భగవాన్,

"సరి సరి."

అన్నారు.

తన వళ్ళు తనకే తెలీకుండా బయటికి వచ్చి పడ్డాడు చలం.

ఆ తెల్లారకట్ట వస్తాయన్న బండ్లు రాలేదు. మర్నాడు ఉత్తరం వచ్చింది, దీక్షితులుగారు వస్తున్నారని. కనుక చలం ప్రయాణం మానుకున్నాడు.

దీక్షితులుగారితో ఓ రోజు గడిపి మధ్యాహ్నంనుంచి భగవాన్‌వద్ద తిరిగి శలవ తీసుకొన్నాడు హాల్లోనే. భగవాన్ దయాపూరిత నేత్రులై శలవిచ్చారు.

ఆ తెల్లార కట్ట మళ్ళీ బండ్లు రాలేదు. మర్నాడు సాయంత్రము ప్రయాణం పెట్టుకున్నారు. బళ్ళు ఆలశ్యంగా వచ్చాయి. అందరూ బళ్ళలో యెక్కారు. భగవాన్ దగ్గర శలవు దీసుకోడానికి వ్యవధి లేదు. కాని, చలం వెళ్లాడు.

అయితే భగవాన్ హాల్లో లేరు. కొండ పైకి వెళ్లారు. గడియారం చూసి వొచ్చినట్లు సరిగా వేళకు వచ్చే భగవాన్ ఆరోజు ఆలస్యం చేసి, ఎంతకూ దిగి రాలేదు. రైలు టయిమవుతోంది, అందరూ వెళ్ళిపోయారు రైలుస్టేషనికి. వెళ్ళ కాళ్ళురాక చలం నుంచుని వున్నాడు.



తీరా భగవాన్ వచ్చాక చూస్తే చుట్టూ మనుషులు. చలం ఆయనను సమీపించలేక పోయినాడు. భగవాన్ వొచ్చి హాల్లో కూచున్న తరువాత కూడా, చలం ఆయన్ని సమీపించలేక పోయినాడు. ఆ నాలుగు గజాలు సప్త సముద్రాలైనాయి. పెద్ద భయం పట్టుకుంది నిష్కారణంగా. లోపలికి పోలేక పోయినాడు.

చివరికి శలవ తీసుకోకుండానే వెళ్లాడు. రైలు ఆలశ్యమై అతని కోసం నిలిచి వుంది. రైలెక్కాడు. ఆ నిమిషం నుంచి నాలుగేళ్ళు తిరిగి చలం భగవాన్ని దర్శించుకున్నదాకా అతని అగచాట్లు దైవానికెఱుక.

## విశాలమైన మనస్సుకు లోకం లేదు

ఒకనాడు భగవాన్ చేతిమీద కురుపుకి డాక్టరు కట్టు కడుతూ వుండగా ఒక ఫోటోగ్రాఫర్ భగవాన్ ఫోటో తీసుకొంటున్నాడు. అప్పుడు భగవాన్ డాక్టరుతో-

"కెమేరా సన్నని చిల్లిలోనుంచి, లెన్సులో నుంచి చూస్తే, ఈ లోకం రంగురంగులతో, ఆకారాలతో, దూరాలలో కనపడుతుంది. కాని ఆ చిల్లినే విశాలం చేశామా, యింక లోకం వుండదు. వుత్తకాంతి పడుతుంది ప్లేటు మీద. అట్లానే మనస్సు ఇరుకులోనుంచి చూస్తే లోకం కనపడుతుంది. ఆ మనసునే చించేశావా, అంతా వుత్తకాంతి" అన్నారు.

### కోతిస్వామి

ఒకరు భగవాన్ కోతులతో ఆడుకొంటున్న పటాన్ని రంగులతో చిత్రించి తెచ్చిపెట్టారు భగవాన్ సోఫాదగ్గిర. ఆ పటాన్ని చూచి భగవాన్ పటంలో తన చిత్రాన్ని చూపుతూ-

"వీడు వుత్త కోతి స్వామి" అని నవ్వారు.

### బాలుడై కోతితో ఆటలు

హాల్లో ఒక మధ్యాహ్నం అందరు ధ్యానంలో కూచుని వుండగా పశ్చిమ దేశాలనుండి వచ్చిన ఒక ఆమె తన చేతి సంచి ప్రక్కన పెట్టుకొని కూచుంది. ఆ సంచిలో తాను పెంచుకున్న చిన్న కోతిపిల్లను తెచ్చుకుంది, దాచుకుని బైటకు కనబడకుండా. ఎట్లా కనిపెట్టారో భగవాన్ దాని వునికిని, హాల్లోవున్న చిన్న కుర్రాళ్ళని పిలిచి, ఆ సంగతి వాళ్ళతో వూదారు.

ఇంక ఎంత గోలో! కోతిపిల్ల సంచిలోనుంచి తొంగి చూడడం; కోతి కనపడ్డప్పుడెల్లా పిల్లల అరుపులూ. కోతి సంచిలో దాక్కోడం, పిల్లల పిలుపులు.

ఆ కుర్రాళ్ళతో కలసి భగవాన్ అల్లరీ, చప్పట్లూ, నవ్వులూ...ధ్యానాలు ఎగిరి పోయాయి.

### నమ్మకం లేకపోయినా ఉద్రేకం

దేంట్లోనూ నమ్మకంలేని మిత్రుడు ధర్మపురి భగవాన్ని చూడడానికి వొచ్చాడు. భగవాన్‌కి నమస్కారం చెయ్యకూడదని నిర్ణయించుకొని రోజల్లా అటూఇటూతిరిగాడు.



ఆ యెండాకాలం సాయంత్రం భగవాన్ కుర్చీ బావి గట్టు దగ్గర ఆరుబైట వేశారు. భక్తులు చుట్టూ కూచున్నారు. ఎక్కడో తిరుగుతున్న ధర్మపురి వచ్చాడు అక్కడికి.

ఆ నిమిషాన అతనిలోనుంచి అణుచుకోలేని ప్రోద్బలం బయలు దేరింది, భగవాన్ ముందు సాష్టాంగపడాలని. తన Will తో ప్రమేయం లేకుండానే ఆయన పాదాల ముందు పడిపోయాడు.

అదిచూసి భగవాన్ పెద్దగా నవ్వారు. భగవాన్ యెందుకట్లా నవ్వుతున్నారో అకస్మాత్తుగా. అర్థంకాక భక్తులు చూస్తున్నారు.

### తల్లికైనా శిక్ష తప్పదు

కొన్నేళ్ళు భగవాన్ అరుణాచలంలో వున్న తర్వాత ఆయన ఇక్కడ వున్నారని తెలిసి తల్లి కూడ ఆయనతో వుండడానికి వచ్చేసింది. వచ్చిన నాటనుండి ఆమెకు శిక్షణ ప్రారంభించారు భగవాన్. అసలు సత్యాన్ని మరిపించే మడి ఆచారాల ప్రాబల్యాన్ని ఆమె నుంచి తగ్గించాలనీ, ఆయన తన కొడుకనే గర్వాన్ని అణిచి వెయ్యాలనీ ఆయన చేసే కఠిన చర్యలవల్ల ఆమె చాలా బాధ పడ్డది. అందరితో ఎంతో దయతో మాట్లాడుతూ ఆమెని కసిరి కొట్టేవారు. ఆమె భరించ లేక ఏడిస్తే,

"బాగా ఏడు. ఎంత ఏడిస్తే అంత మంచిది, నా కంత సంతోషం."

అనేవారట. తాను చేసిన తప్పిద మేమిటో తెలియక ఆమె ఇంకా బాధపడేది.

భగవాన్ ఓ ఉల్లి పాయని చేత్తో పట్టుకొని—

"ఉల్లి పాయా! చూడడానికి ఇంతదానివి, పనికిమాలిన దానివిగా వున్నావు, కాని, నీ కెంత ప్రభావం వుందో. మా అమ్మ స్వర్గానికి వెళ్ళకుండ అడ్డం పడుతావట" అని నవ్వే వారట.

## స్త్రీ జనోద్ధారిణి

ఒకసారి తెలుగు దేశం నుంచి ఒక స్త్రీ జనోద్ధారిణి వచ్చింది, భగవాన్ దర్శనానికి. చప్పున లేచి నుంచుని ఒక సభని సంబోధిస్తున్నట్లు బిగ్గరగా ఉపన్యాస ధోరణిలో ప్రారంభించింది—

"లోకమంతా స్త్రీని నీచంగా చూచి అన్యాయం చేస్తోంది, అన్నివిధాలా. తమరూ అంతేనా?"

భగవాన్ ఆమె వైపు తలత్రిప్పి అయినా చూడ లేదు.

"స్త్రీల బ్రతుకు వంటింటిలో, పిల్లల్ని కనడంలో పెంచడంలో గడపవలసిందేనా? ఇంతేనా? ఇంకేం లేదా?"

అని అడిగింది.

కాని, భగవాన్ విన్నట్టే లేదు.

"చివరికి మోక్షంకూడా పురుషులకేనా? తమవంటి వారికి కూడా పురుషులపైన పక్షపాతమేనా? మాకు యోగం, ధ్యానం లేవా? అన్నీ పురుషులకేనా..."



ఆమె ఉద్రేకం, భగవాన్ ఉపేక్ష ఆమెను కండ్లనీళ్ళ వరకు తెచ్చాయి.

ఏమిటి ఇదంతా అన్నట్లు భగవాన్ ఆమె వంక చూశారు. ఆమెకు మాటలు తడబడ్డాయి, అనేక ఉపన్యాస వేదికలపై అదర కొట్టిన ఆమె మాటలు! "భగవాన్! మా స్త్రీలకి ఏమీ ముక్తి మార్గం చూపరా?" అన్నది దీనంగా.

"మోక్షం అంటే ఏమిటి?" అని అడిగారు భగవాన్.

ఆమె ఇక మాట్లాడ లేదు. చప్పున కూచుంది. త్వరలోనే వెళ్ళిపోయింది-హాల్లోనుంచీ, ఆశ్రమంనించీనూ.

## దీక్షితులుగారికి తీరని ఆటంకాలు

అరుణాచలం రుచి మరిగినప్పటినుంచీ దీక్షితులు గారు తాను రిటైర్ కాగానే అరుణాచలంలో సెటిల్ కావాలని ప్లాను వేశారు.

చలం అరుణాచలంలో నివాసాన్ని ఏర్పరచుకుని, అంతకుముందెన్నడో రిటైరైన దీక్షితులుగారినీ తొందర చెయ్యడం ప్రారభించాడు, వచ్చెయ్యమని.

తన చివరి కూతురు పెళ్ళి కాలేదనీ, ఆ దేశం వొదిలి తాను వస్తే సంబంధాలు వెతకడం పడదనీ, ఆమెకి పెళ్ళి కావాలని నిరీక్షిస్తున్నారు దీక్షితులుగారు.

త్వరలోనే, ఆశ్చర్యంగా దీక్షితులుగారి ప్రయత్నం లేకుండానే ఆయనఅమ్మాయికి రమణాశ్రమవాసుల అబ్బాయి

గొప్ప ఉద్యోగంలోవున్న అతని సంబంధం కుదిరింది, భగవాన్ సమక్షంలో ఆయన అంగీకారంతో. అప్పటికీ దీక్షితులుగారు అరుణాచలానికి కదల లేదు.

తర్వాత మళ్ళీ చలం దీక్షితులుగారిని బలవంత పెట్ట సాగాడు, వచ్చెయ్యమని.

అప్పుడు ఆయన తన కొడుకుల చదువులనీ, వాళ్ల పెళ్లిళ్ళు అనీ సాకులు చెప్పసాగారు. పోనీ, ఒకసారి వచ్చి వెళ్ళమన్నాడు చలం.

తన కొడుకు చదివి అలిసిపోయి, హాస్టలు తిండి తిని-తిని, శలవల్లో ఇంటికి వస్తున్నాడని, తల్లి లేని ఆ 25 ఏండ్ల బాలునికి తాను రుచిగా వంటచేసి పెట్టాలనీ జవాబు వ్రాశారు. క్షితులుగారు.

చదివి అలిసిన ఆకుమారుడు శలవల్లో ఇంటికి రాక, ఎవరితోనో కలిసి అరుణాచల సమీపంలోనికి టూరుకి వచ్చాడు దీక్షితులుగారు అరుణాచలం వచ్చివుంటే అతన్ని కలుసుకోడం సులభమయ్యేది.

## మరకదమ్మ ప్రేమ భక్తి

మరగదమ్మగారు భగవాను దర్శనానికి వచ్చినప్పుడల్లా నిలకడ లేకుండా, వారికో సారి నమస్కరించేది. చరచరా వెళ్ళి తిరుగుతూ ఉండేది. మళ్ళీ వొచ్చి నమస్కరించేది. వెళ్ళిపోయేది, ఇట్లా చేసేది.

ఆమెకి భగవానుపై ప్రేమ అధికమై, ఆయన పైపడి



కౌగలించుకోవాలనిపించేదట! అందువల్లనే ఆయన ఎదట నిలకడగా వుండలేకపోయేవారు. ఒక్కొక్కసారి అమాంతం వెళ్ళి భగవాన్ పైన పడిపోయేవారు.

ప్రక్కనున్న పరిచారకులు ఆమెను మొదట లాగేశారు. తరువాత గెంటారు. ఆ తరువాత కొట్టారు కూడాను. కాని, ఆమె మాత్రం భగవాన్ వైపు పరిగెత్తకుండా వుండలేక పోయేది. ఆమె అంటుంది-

“భగవాన్ నా లోపల్నుంచి ఆపుకోలేని ఆకర్షణని పుట్టించేవారు. వొచ్చి తన మీద పడమనిపిలిచినట్లేవుండేది. కాని తన పరిచారకుల్లో నామీద వాళ్ళకే తెలేని కోపాన్ని రేపేవారు. అడుగో, మరగదమ్మ వొస్తోంది, దాన్ని తన్నండి’అని వాళ్ళతో అంటున్నట్లే వుండేది.”

## గమ్యంచేరిన యోగసాధకుడు

బొంబాయినుంచి ఒక బాంకి సొంతదారు వొచ్చాడు, భగవాన్ని చూడడానికి. ఆయన కష్టాల్లో వుంటే, ఒక భక్తుడు ఆయన్ని భగవాన్ దగ్గిరికి వెళ్ళమన్నారు - శాంతి కోసం. కాని, ఈయనకి భగవాన్‌పై విశ్వాసం లేదు. ఇంత మంది బుద్ధిమంతులు భగవాన్ చుట్టూ ఎందుకు మూగారో అని ఒక సయింటిఫిక్ క్యూరియాసిటీతో చూస్తున్నాడు. ప్రతివారిని ప్రశ్నిస్తున్నాడు వారి అనుభవాలకోసం.

భగవాన్ కోసం వొచ్చి కొంతకాలంనుంచి వుంటున్న ఒక యూరోపియన్ రూపం, భక్తి, ఆసక్తి ఆయన కళ్ళని

ఆకర్షించి-ఆయన ఎందుకు వొచ్చాడో అంత దూరంనుంచి, ఎట్లా వచ్చాడో, ఎందుకు వుంటున్నాడో తెలుసుకోవాలని చలాన్ని తనతో రమ్మన్నాడు.

ఆ యూరోపియన్ ఆశ్రమం దగ్గర ఓ కాంపౌన్డులో వుంటున్నాడు. పగలు చిక్కడు, తిరిగ్గా గిరిచుట్టూవున్న మఠాలలో వుండే సాధువులతో, బైరాగులతో వుంటాడుట ఆయన. ఆ కాంపౌన్డులో బంగళాల వెనక కట్టిన గొందివంటి గదిలో ఆయన నివాసం.

మేము వెళ్ళేప్పటికి చీకట్లో ఓ చిన్న పొయ్యి మీద ఏదో వుడుకుతోంది. రాత్రికి ఆయన భోజనమది.

మమ్మల్ని చూసి ఆయన బైటికి వొచ్చి కూచున్నారు మాతో. ఓ పాతికేళ్లు వుంటాయి. ఆయన దుస్తులు ఓ గడ్డము పేలిక వంటి నీలంచెడ్డి. చుట్టూ కీకారణ్యం.నిశ్శబ్దం. ఒకరి కొకరం కనబడం.

నా బొంబే మిత్రుడు అడిగాడు ఆయన్ని, ఆయన పుట్టు పూర్వోత్తరాలు చెప్పమని. మామూలుగా యూరోపియన్లు అనేట్టు "అదంతా నీ కెందుకు పో," అంటాడని భయపడ్డాను ఓనిమిషం. కాని ఎంతో ఆప్యాయతతో మాట్లాడాడుఆయన.

ఆయన నార్వీజియన్ దేశస్తుడు.ఆ దేశంలోయూనివర్సిటీ పరీక్షలకి 'ప్రపంచ మతాలు'అన్నది సబ్జక్టు ఈయనది. ఆ సందర్భంగా హిందూ వేదాంతం చదివినప్పటినుంచి ఈ దేశానికి వొచ్చి, ఇక్కడి యోగుల్ని కలుసుకొని వారినుంచి విజ్ఞానం



పొందాలని ఆశ పడ్డాడు.ఆ దేశానికి వచ్చే హిందువుల్ని అడిగి, ఈ దేశం సంగతులు అతి కుతూహలంతో వినేవాడు.

తన ప్రయత్నంవల్లా, అదృష్టంవల్లా ఉత్తర హిందూస్తానంలో ఓ యూనివర్సిటీలో మతం బోధించే లెక్చరరు ఉద్యోగం సంపాయించి, వొచ్చేశాడు. వొచ్చినప్పటినుంచీ, ప్రతివారినీ అడుగుతున్నాడు, తనకి జ్ఞానమార్గం చూపగల గురువు ఎక్కడ దొరుకుతాడని. గొప్ప యోగులు హిమాలయాల్లో వుంటారనీ, అక్కడికిపోయి వెతికితే వాళ్లలో ఒకరు తనకి జ్ఞాన భిక్ష పెట్టవచ్చునని తెలుసుకున్నాడు.

జీతంలో నుంచి డబ్బు నిలవ చేసుకొని, ఉద్యోగం వొదిలేసి హిమాలయాల్లో తిరగటం ప్రారంభించాడు. అక్కడ చివరికి గురువు దొరికాడు. ఏం జరిగిందో, గురువు ఎట్లా దొరికాడో అదంతా రహస్యం-చెప్పనన్నాడు. ఆ గురువు ఈతెల్ల ఆయనని శిష్యుడిగా అంగీకరించి,సాంఖ్య యోగం ఉపదేశించి, సాధన చేయించాడు కొద్దికాలం. వెళ్ళిపోయి తాను చెప్పినట్లు నాలుగేళ్లు సాధనచేసి తిరిగి రమ్మన్నాడు.

ఈయన అక్కడినించి వొచ్చేశాడు డబ్బు అయిపోయింది. నాలుగేళ్లు ఎట్లా బతకడం? మళ్ళీ ఉద్యోగప్రయత్నం చేశాడు. బెంగుళూరులో ఉద్యోగం దొరికింది. మద్రాసు దాటిం తరువాత రైల్లో ఒక ప్రయాణీకుడితో సంభాషిస్తూ వుంటే, ఆయన గట్టిగా బతిమాలి చెప్పాట్ట, మధ్యలో దాపునే అరుణాచలం వుంది-అక్కడికి వెళ్ళి రమణమహర్షిని చూసి మరీ వెళ్ళి ఉద్యోగంలో చేరమని. అంతే.

అరుణాచలం వొచ్చి భగవాన్ని చూశాడు, వుండి పోయాడు. మరి యింక కదలలేదు. ఉద్యోగం ఏమయిందో తెలీదు.

"యేం చూసి వుండిపోయారు?" అని అడిగాడు ఆయన్ని నా మిత్రుడు.

తన సాధనలో కనిపించిన అద్భుతమైన ఫలితాలవల్ల నన్నాడు ఆయన. హిమాలయ గురువు చెయ్యమన్న సాంఖ్య యోగ సాధనే చేస్తున్నాడు.

## కనపడని ఫోటో

చలం మిత్రులు ఒకాయన భగవాన్ని చూడాలని వచ్చి, భగవాన్‌కి ఫోటో తియ్యాలనుకున్నారు. ఫోటోలు తియ్యకూడదనే ఆశ్రమం నోటీసు చదివారు. కాని, ఆయన ఆశ ఆగలేదు. భగవాన్ అటు వెళ్ళేటప్పుడు ఎవరూ చూడకుండా ఓ snap తీసేశారు. వూరికి వెళ్ళి డెవలప్ చేసి చూస్తే-తక్కిన ఫోటోలన్నీ బాగా వొచ్చాయికాని, భగవాన్‌ని తీసిన ఫోటోలో ఏమీ లేదు!

## కోతుల రాజుకు సత్కారం

భగవాన్ కొండపైన ఉన్నప్పుడు ఆయన భోజనం చేస్తుండగా, ఓ పెద్ద కోతి వచ్చి విస్తరిపక్కన కూచుంది. భగవాన్ మొదటిముద్ద నోట్లో పెట్టుకోబోతూ, ఆ కోతిని చూసి ఆ ముద్దని దానికిచ్చేశారు. ఆ కోతి ఆ ముద్దని తినకుండా విస్తట్లో పెట్టేసి భగవాన్ని ఈడ్చి ఒక లెంపకాయ కొట్టింది.



"ఇదేమిటి, నీకేముందు పెట్టాను కదా! నన్నెందుకు కొట్టావు?" అని అడిగారు భగవాన్.

అని, అప్పుడు అనుకున్నారట భగవాన్,

"ఇతను కోతుల రాజు. ఇతన్ని రాజును గౌరవించినట్లు గౌరవించాలి" అని.

ఆ ప్రకారం అతనికి వేరే విస్తరి వేయించి వడ్డించారు. అప్పుడు అతను సంతోషంగా తిని వెళ్ళి పోయినాడు.

## స్పర్శాదోషం

ఒకసారి ఓ కొత్తవాడు ఆశ్రమానికి వచ్చి ఓ గంగాళంలో నీళ్ళువుంటే, కొంచెం ముంచుకో పోయినారు. ఆశ్రమంలో ముఖ్యులుగా వుండే ఒకామె ఉగ్రంతో వీడికి దూకి-

"ఎవరు నువ్వు? ఎవరి నీళ్ళనుకున్నావు?" అంటూ తోసెయ్యటానికి సిద్ధపడింది. ఆచారం పోలేదు సరే, ఆగ్రహం కూడా పోలేదే, ఆ నీళ్ళు తనవి అనే కాపీనం కల ఆమెకి. ఇంక ఆస్థిపైన ఎప్పటికి వొదలుతుందోనని ఆశ్చర్యం కలిగింది చలానికి.

ఆమెగారే, బ్రాహ్మలు కానివారు తనకి తాకి నమస్కరించినా సరే-ఆ పాపం, ఆ మైల పోవడానికి వెళ్లి భగవాన్ని తాకేది. భగవాన్ చుట్టూ వందలాది ప్రజలు చేరిం తరువాత అయన్ని తాకడం సులభం కాకుండా పోయింది.

ఒక జయంతికి వొచ్చిన గుంపుల్లో ఎవరో అటు

పోతూ ఆమెగారికి తగిలారట. ఆమె వెళ్ళి భగవాన్ ముందు నుంచుంది.

"నన్ను శూద్రులు తాకేరు భగవాన్! మీరు నన్ను తాకితే ఆ దోషం పోతుంది" అంది.

"పో. నేను తాకను" అన్నారు భగవాన్.

"మీ అమ్మని తాకినారే?"

"తాకితే తాకాను. నిన్ను తాకను. వెళ్ళు" అన్నారు భగవాన్, ఆ మహా భక్తురాల్ని.

### ప్రత్యేకత సహించరు

ఎవరికన్నా తనకి అధికంగా ఏమి ఇచ్చినా భగవాన్ ఏమాత్రం సహించేవారు కారు. తనని వొదిలి, వారికే ఎక్కువగా శ్రద్ధచూపమనేవారు. తనకి ఏవి ఎవళ్ళు సమర్పించినా, తనకి ఒళ్లు బావుండనప్పుడు కూడా వాటిని ముందు అందరికీ పంచవలసిందే. తనని, తన భక్తులలో చూడమనేవారు.

ఒకసారి, కొన్నాళ్ళనించి భగవాన్ భోజనంలో మజ్జిగ పోసుకోవటం లేదని గమనించారు వొడ్డించే వారు. భగవాన్‌కి దగ్గిరిగా కూచొని భోజనం చేసే దేవరాజ మొదలియార్ భరించలేక,

"భగవాన్! మేమందరమూ అన్నీ సమృద్ధిగా తింటున్నాము. ప్రతి భోజనంలోనూ మీరేమో ఎప్పుడూను ఏదో ఒకటి సరిగా వెయ్యనీక వర్జించి భోజనం చేస్తూవుంటారు.



చూస్తు చూస్తూ మే మెట్లా తినగలం?" అని అడిగాడు.

దానికి భగవాన్-

"భగవాన్‌కి ఏం తక్కువ? భగవాన్‌కి ఇష్టం వుండినా వుండకపోయినా, వూరికే కారిపోయేట్టు ఇంతింత పోస్తారు. భగవాన్ భక్తులకు పొయ్యాలంటే మాత్రం చేతులు రావు" అన్నారు.

పని చేసేవారిని కనుక్కుంటే అసలు సంగతి తెలిసింది. బెంగుళూరునుంచి ఒక అమ్మాయి ఆశ్రమానికి వొచ్చింది. ఆమె భోజనం చేస్తో ఇంకొంచెం చారు అడిగింది. ఆ సమయాన మజ్జిగ పోస్తున్నారు. వొడ్డించేవారు ఆ అమ్మాయి అడిగింది వినీ లక్ష్యంచేయక, ఆమె తింటున్న చారు అన్నంలో మజ్జిగ పోసేశారు. ఆ ఒక్క సంగతే కాదు, వొడ్డించే వారికి తినేవారిపైన అశ్రద్ధే కాదు, తృణీకారం కూడా వుండేది. భగవాన్‌కి ముఖ్యుల మనుకునే భగవాన్ సమీప వర్తులకి, సంపన్నులకీ శ్రద్ధగా వొడ్డించి- కొత్తగా వొచ్చినవారికి, సామాన్యులకి, భగవాన్‌కి దూరంగా భోజనానికి కూచున్నవారికి నిర్లక్ష్యంగా వొడ్డించేవారు.

తనకోసం వచ్చిన భక్తుల్ని తనవలె చూడమని, సేవ చేయమని, భగవాన్ ఎన్నిసార్లు చెప్పినా తల కెక్కేదికాదు. అందుకని, తనని నమ్మివున్న ఆ ఆశ్రమ సేవకులకోసం వారికి సద్వర్తన, సమదృష్టి నేర్పడానికి భగవానే తాను సరిగా తినడం, తాగడం మానేవారు, వారి దృష్టి నాకర్షించడానికి.

తస్కరాణాం పతయేనమ

ఈశ్వరుడి నామాలలో దొంగల ఈశ్వరుడని అర్థమిచ్చే నామముంది.

"అదేమిటి అట్లాంటి నామం! ఈశ్వరుడు దొంగలకి ఈశ్వరుడా?"

అని ప్రశ్నించారొకరు. భగవాన్ అన్నారు—

"దొంగలు దొంగతనానికి బైలుదేరేముందు ఈశ్వరుడి ఆలయానికి వెళ్ళి, దోపిడిలో దొరికిందాంటో సగం ఈశ్వరుడికి అర్పిస్తామని మొక్కుకుంటారు. ఆ మాట ప్రకారం సగం భాగము ఈశ్వరుడికి అర్పిస్తారు దొంగలు. కాని పెద్ద మనుషులు అట్లా కాదే! ముందు అసలు మొక్కుకోనే మొక్కుకోరు. మొక్కుకున్నా, మొక్కుకున్న ప్రకారం చెల్లించరు. పెద్ద మనుషులకన్న దొంగలే ఈశ్వరుడి నిజమైన భక్తులు."

ఒకసారి ఒక సాధకుడు భగవాన్ దగ్గిరికి పొద్దున్నే వొచ్చినప్పుడు casual గా-

"రాత్రంతా ఓ కుక్క ఒకటే మొరుగుతోంది. నా ధ్యానం భగ్నమయింది"

అన్నాడు. దానికి భగవాన్—

"ఏ కుక్కా మొరగలేదు. మొరిగింది నీ మనసు"

అన్నారు.

ఒక రమణ భక్తుడు తన మిత్రుడితో భగవాన్ మహిమనీ, ఔన్నత్యాన్నీ చాలా రోజులనించి చెపుతో, వెళ్ళి వొక



సారి చూసిరమ్మని బతిమాలాడు. చివరికి ఆ మిత్రుడు భగవాన్ని చూడడానికి వొచ్చారు. భగవాన్ అప్పుడు విరూపాక్ష గుహలో వుండేవారు. భగవాన్ని పుణ్య దినాన దర్శించాలని, ఏకాదశినాడు ఉపవాసముండి, కొండ ఎక్కారు. దూరంనించే భగవాన్ కనపడ్డారాయనకి, ఉల్లిపాయలు తరుగుతో. ఏకాదశినాడు ఉల్లి పాయలు! విపరీతపడి, ఆ మిత్రుడు భగవాన్ భక్తుణ్ణి తిట్టుకుంటో, భగవాన్ దగిరికి వెళ్ళకండానే వచ్చిన దారినే వెళ్ళి పోయినారు.

భగవాన్ ఒకసారి ఆశ్రమంలో వున్నవారి నందరినీ ఆముదం తాగమన్నారు. మురగనార్ అనే ముఖ్యభక్తుడు తను తాగనన్నాడు. ఆ సంగతి భగవాన్‌తో చెప్పారు.

"అతను తాగక పోతే ఏం చేస్తాము? తెండి"

అని తానా ఆముదం తాగేశారు. మురుగనార్‌కి వది విరోచనాలైనాయి. భగవాన్‌కి ఏమీ కాలేదు!

ఒకసారి కురుమద్దాల యోగిని మాలపిచ్చమ్మగారు భగవాన్ని దర్శించడానికి వొచ్చారు. భగవాన్ని చూడగానే అమాంతం ఆయన మీద పడిపోయిందామె. పరివారం ఆమెని లాగి వేద్దామంటే, అంత విగ్రహాన్ని కదల్చడం వారి తరం కాలేదు. చివరికామె లేచి-

"ఎప్పుడూ అంత దూరంలో ఏమిటి చూస్తూ వుంటావ్!"

అని భగవాన్ని అడిగింది.

"నువ్వు చూసేదే నేనూ చూస్తున్నాను."

అన్నారు భగవాన్.

ఒకరు భగవాన్ని అడిగారు-

"నిరాకారుడైన ఈశ్వరుణ్ణి విగ్రహంగా చేసి పూజలు చేయడం అవివేకం కదా?"

అని. దానికి భగవాన్-

"విగ్రహారాధన చెయ్యని వాడెవడు? తెల్లవారి లేచింది మొదలు ఎవరి విగ్రహానికి వారు, పళ్ళు తోమడమూ, స్నానం చేయించడమూ, జుట్టు దువ్వడమూ, మూడుపూటలా నైవేద్యం సమర్పించడమూ...ఆరాధన నించి తప్పించుకున్న వాడెవడు?"

అన్నారు.

ఒక భక్తుడు అడిగాడు.

"ఇంతమంది మీకు సాష్టాంగపడతారు రోజంతా ప్రతిరోజూ. మీరు వారివంక చూడనన్నా చూడరు కద!"

"నీకేం తెలుసు! వారు నమస్కరించక ముందే నేను ప్రతి వారికీ నమస్కరిస్తానని!" అన్నారట భగవాన్.

---

# చలం

స్కూల్లో చదువుకునే రోజుల్లో బాగా శ్రోత్రియంగా వుండే వాడిని. మా పెద్దవాళ్ళ కన్న ఎక్కువ ఆచారమూ నిష్టా వుండేవి నాకు. మూడు పూటలా సంధ్యా వందనం, గాయత్రి జపం, విష్ణు పూజలు, స్తోత్రాలు-ఇన్నీ చేసేవాడిని. కాకినాడ కాలేజీలో చదవడానికి వెళ్ళాక, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి శిష్యుణ్ణయినాను. పాత నమ్మకాలన్నీ ఒక్క వూపుతో పటాపంచలైనాయి. కులమూ, తద్దినాలూ, దేవాలయాలూ-అన్నీ మాని ఇంటా బైటా రొష్టు పడ్డాను. ఏకేశ్వరుణ్ణి హృదయంతో ప్రత్యక్షం చేసుకోవాలని, తపనతో సాధన ప్రారంభించాను. ప్రార్థనలు, భజనలు, సంకీర్తనలు ధ్యానం- ఇట్లా వినియోగించాను నా కాలమంతా. చదువు తరవాత ఆ కాలేజిలోనే ఉద్యోగం చేస్తో నా కాలాన్నంతా బ్రహ్మమత సాధనకి ఉపయోగించాను. మా ఇల్లే ఒక బ్రహ్మమత కేంద్రమయింది.

కాని ఇంతలో నా వ్యక్తిగత జీవితంలో స్త్రీ సమస్యలు ఎక్కువై, ఏ పశ్చాత్తాపమూ, దైవభక్తీ నాకు విరామమూ, విముక్తీ నివ్వక పోయేప్పటికి సెక్సు, రొమాన్సు విషయమై యోచనా, ఆ జ్ఞానం కోసమై పశ్చిమదేశాల సెక్సు పండితుల గ్రంథాలూ చదివి, ప్రచారంలో వున్న నీతిని ప్రశ్నిం



చుకో సాగాను. బ్రహ్మ సమాజం నించి దూరమైనాను. నీతిపై, జీవితపు విలవలపై సందేహాలు నన్ను గట్టిగా ఆలోచింప చేశాయి. దయామయుడైన ఈశ్వరుడికీ; శోక, లోప, సంకట భూయిష్టమైన ఆయన లోకానికీ సమన్వయం కుదరక ఈశ్వరుడు ఉన్నాడా అనే సందేహం గట్టిగా పట్టుకుంది.

ఈ జగత్తుకీ జీవితానికీ ఓ అర్థం వుంటే, వీటి వెనక ఓ సత్యం వుంటే, పరస్పర విరుద్ధమైన ఈ విలవలకి ఓ సమన్వయముంటే, దాన్ని తెలుసుకునే మార్గం లేదనీ, మానవుడి మనసుకి అంత శక్తి లేదు గనక, ఎంత తరిచి చూసినా, అది ఓ గుడ్డి వలయంలో తిరగడం తప్ప, ఇంకేమీ సాధించ లేదని నిశ్చయించుకున్నాను. కాని ఎప్పుడూ అన్వేషించడం మాత్రం మానుకోలేదు. ఎంత అర్థం లేకపోయినా సత్యాన్వేషణ అనేది నా జీవితానికి ఓ ప్రధాన లక్షణమై పోయింది.

ఏదో నా మనసునీ ఆలోచనలనీ మించిన విశ్వాస ముండేది, నాకు దొరకని దేదో solution వుందనీ, ఈ లోకమూ జీవితమూ అర్థ విహీనం కావనీ. ఈ అయోమయ స్థితిలోనే సగం పైగా నా జీవితం గడిచింది. కాని నిరంతరం నాకు తెలియని సత్యం కోసం అన్వేషిస్తోనే వున్నాను. కాని నా అన్వేషణ ముందుకి తోనలేని గుడ్డి సందులో పడ్డట్టయింది. ఏ సంతోషమూ, వెలుగు, తృప్తీ లేకండా చాలా కారణం కనపడని యాతన ననుభవిస్తున్నాను.

అట్లాంటి సమయంలో దీక్షితులుగారు వొచ్చి నన్ను తనతో షికారుగా రమణాశ్రమానికి తీసుకొచ్చారు 1936లో.

తోవలో భగవాన్ కోసం పళ్ళు కొనమంటే కొననన్నాను. ఆయనకి సాష్టాంగ పడమంటే పడనన్నాను, దీక్షితులుగారు మరీ బలవంతం చేసిందాకా. భగవాన్ ముందు నిశ్శబ్దంగా కూచున్న ప్రజలలో కూచోడం నాకు బాధగా వుంది. వొచ్చినప్పటి నించి ఎప్పుడు పోదామని దీక్షితులుగారిని వేధిస్తున్నాను. ఆశ్రమంలో మనుషుల్ని చూసిన కొద్దీ అసహ్యం పుడుతోంది.

"ఈ మహర్షి ఏదో దివ్య పురుషుడంటారు మీరు. మనుషుల్నే మారుస్తాడన్నారు. ఇన్నేళ్ళమట్టి ఆయనని అంటిపెట్టుకొని వున్న వీళ్ళ మొహాలిట్లా వున్నాయేమిటి?"

అని అడిగాను దీక్షితులు గార్ని. ఆనాడే కాదు, ఈనాడు కూడా అంత graceless institution నేను చూడలేదు.

అక్కడనించి దీక్షితులుగారు కదలక బలవంతాన వుంచేశారు నన్ను. రెండో రోజు మధ్యాన్నం, భగవాన్ కొండ మీదికి వెళ్ళి హాలులోకి తిరిగి వొస్తున్నారు. భక్తులు గుంపులుగా నుంచు మాట్లాడుకుంటున్నారు. మాగుంపు వెనక నించి భగవాన్ వొస్తున్నారు. అందరూ పక్కకి తప్పుకొంటున్నారు. నేనే కదలలేదు, "చోటు వుంది. పక్కకి తప్పుకు పోతారులే ఆయన" అనుకుని.

భగవాన్ సమీపించేటప్పటికి దీక్షితులుగారు నన్ను పక్కకి లాగేశారు. భగవాన్ నన్ను దాటి వెళ్ళి చప్పున ఆగి, వెనక్కి తిరిగి నన్ను ఓ గొప్ప చిరునవ్వుతో ఓ నిమిషం చూసి వెళ్ళిపోయినారు. ఆ నిమిషాన నాకేమనిపించ



లేదుగాని, ఇప్పుడు తలుచుకుంటే, ఆ నిమిషం నించే నన్ను జయించేసుకున్నారు భగవాన్ అనిపిస్తుంది.

జయంతినాటి సాయంత్రమే వొచ్చారు గోరా. ఒకరినొకరం ఆశ్రమంలో చూసుకుని ఆశ్చర్య పడ్డాము. ఆయన ఈ స్వామి దొంగ దోపిడిని కనిపెట్టాలని వొచ్చారుట. ఆయనలో వుండే ఆగ్రహాన్ని వినడానికి ఒక సానుభూతిగల సోదరుడు దొరికాడు కదా అన్నట్టు మాట్లాడారు నాతో. ఆశ్రమాన్నీ, భగవాన్నీ వుత్త చోరులని, public fraud అనీ తిట్టడం ప్రారంభించారు. నేను చల్లగా,

"నాకేం మోసం, చౌర్యం కనపట్టం లేదు. డబ్బిచ్చేవారు ఇష్టపడే, మనస్ఫూర్తిగానే సమర్పించుకుంటున్నారు. ఎవరినీ గట్టిగా అడగరే వీళ్ళు!"

అన్నాను.

"ఈ యోగికి ఆ పట్టు పరుపు లేమిటి?"

అని అడిగారు గోరా.

"ఆ పరుపులకీ ఆయనకీ సంబంధం కనపడలేదు నాకు. వాటి మీద కూచోపెడితే కూచున్నారు. తీసుకుపోయి మట్టిలో కూచోపెడితే అక్కడా ఇట్లానే కూచుంటారనిపిస్తుంది. మొన్న మొన్నటి వరకు కొండల్లో రాళ్ళ మీదనే అనేక ఏళ్లు నివసించారట."

అన్నాను. గోరా గారు నా మాటలు వొప్పుకోక,

"ఈ దోపిడిని ఆపాలి"

అంటో వెళ్ళిపోయినారు. ఇన్ని విధాలైన దోపిళ్లు

అన్ని చోట్లా జరుగుతో వుండగా, ఈ Innocent దోపిడి మీదనే అయన కెందుకా ఇంత కోపమనుకున్నాను.

భగవాన్ని గాని, ఆశ్రమాన్నిగాని చూస్తే ప్రత్యేకంగా నాకే గొప్పా అనిపించలేదు, ఎప్పుడు బైటపడదామా అనే ఆవేదన తప్ప. కాని భగవాన్ కదలక గంటల కొలది ఎక్కడో శూన్యంలో చూస్తో కూచున్నప్పుడు, ఆయనలోని నిశ్చలత, నిర్లిప్తత, గంభీరత అన్నీ కలిసి గొప్ప Artistic భావాన్ని లేపేవి నాలో. ఆయన ఆకారం నాకు అందవికారం, ఆయన మాట కంఠధ్వని కరుకు. ఆయనలో ఎక్కడా ఓ సౌమ్యంగాని, దయగాని, ప్రేమగాని కనపడదు.

ఓ సాయంత్రం ఆ ఆశ్రమాన్ని భరించలేక రోడ్డంబడి షికారు పోయి, అనుకోకుండానే గిరి ప్రదక్షిణం చేసి వొచ్చాను. వేద పారాయణ ముగియగానే, నేను అనుకోకుండానే పాడాను. పైగా ఆ పాటలో "ప్రాణ-రమణా" అని పల్లవి. ఆడియన్సు అందరూ చాలా impress అయినారు. భగవాన్ కూడా ముందుకు కూచుని శ్రద్ధగా విన్నారట.

చివరికి బైలుదేరాము. దీక్షితులుగారు భగవాన్ వద్ద శలవు తీసుకోవాలనుకున్నారు. నన్నూ రమ్మన్నారు.

"ఆయనకీ నాకేం సంబంధం? శలవ తీసుకోవడమేమిటి? అట్లాంటివన్నీ నేను పాటించను. వృత్త పూర్వాచారాలు. నేను రాను"

అన్నాను నేను.

"సరే లెండి. మీరు ఈ నాలుగురోజులు ఈ ఆశ్రమ



అతిథులు కదా! వెళ్ళేప్పుడు చెప్పిపోయే మర్యాదకూడ పాటించరా?"

అని అడిగారాయన. సరేనని వెళ్లాను. దీక్షితులుగారు శలవ అడిగారు భగవాన్.

"నేను వెడుతున్నాను."

అని సణిగాను నేను. నన్ను చూసి భగవాన్ మళ్లీ చిరునవ్వు నవ్వారు. ఆ చిరునవ్వుతో నేనేమైనానో! నాకెట్లా అనిపించిందంటే-"నువ్వు వెళ్లిపోతే నాకేం తోస్తుంది ఇక్కడ? నేనెంత వొంటరినై పోతానో!" అని భగవాన్ అంటున్నట్టు.

నా కాళ్లాడలేదు. ఆగిపోదామా అనుకున్నాను. కాని ఆ మనుషులు, ఆ హాలు, ఆ నిశ్శబ్దం జ్ఞాపకమొచ్చి, బైటికి, స్టేషన్ చేరుకుని Hot Toast, poached eggs, Tea cigarattes order ఇచ్చాను, ఆశ్రమం మీది నా కసితీరా, ఇన్నాళ్ళు వాటినుంచి నన్ను దూరం చేశారని.

నేను బెజవాడ వెళ్ళగానే పిల్లలడిగారు ఆ మహర్షి సంగతేమిటని. నేను చూసిందీ, నాకు తెలిసినంతవరకు భగవాన్ చెప్పే వేదాంతమూ చెప్పాను వాళ్ళకి.

"మన మనసుగాక మనలో ఆత్మ అనేది వుందనీ, ఆ ఆత్మని తెలుసుకుంటే మనకింక బాధలుండవనీ, 'నేనెవరు?' అనే విచార మార్గంవల్ల ఆ ఆత్మని తెలుసుకోగలమనీ భగవాన్ అంటారు."

అన్నాను. ఆ మర్నాటి నించి మేము ఆ సాధన

ప్రారంభించాము, దానివల్ల ఏమైనా ఉపయోగం ఉంటుం దేమో చూద్దామని. నా మాటలు సౌరీస్ (మా పెద్ద అమ్మాయి)పైన గట్టి impression చేశాయి.

నాకు విశాఖపట్నం బదిలీ అయింది. అక్కడా ధ్యానా నికి కూచుంటున్నాను. చాలా వెంటనే నా ధ్యానం లోతు కావడం ప్రారంభించింది. త్వరలో ఆ ధ్యానం నా ప్రయత్నం లేకుండా, దానంతట అదే నన్ను పట్టుకుని కూచో పెడు తోంది. మనసు ఆ సమయాల్లో ఆగిపోతోంది. ఇదంతా భగ వాన్ ప్రభావమేనని స్పష్టమై, భగవాన్ పైన పట్టు కుదిరింది. దాంతో నాకు ఆశలు కూడా ప్రారంభించాయి. చాలా త్వరలో నేను గొప్ప స్థితికి పోబోతున్నాననిపించింది. నా కప్పుడు తెలీలేదు- ఆ ధ్యానమంతా భగవాన్ అనుగ్రహ మనీ, ఆత్మ వల్ల కలిగే ఆనందమంటే ఏమిటో రుచి చూపి విశ్వాసాన్ని బలపరచడానికి ఆయన చేస్తున్న సహాయమనీ, ఆ స్థితి నా సొంతం కావాలంటే, నేను కష్టపడి రక్తం కార్చి ఏళ్ళకేళ్ళు సాధన చేస్తేనే గాని లభ్యం కాదనీ నాకానాడు తెలీదు.

ఇంత జరిగినా నా మనసులో ఏ విశ్వాసమూ లేదు భగవాన్ పైన. భగవాన్ చెప్పే వేదాంతంలో అసలు నమ్మకం లేదు. ఆయన నన్ను ఎక్కడికో నడుపుతున్నారు. నడపనీ ఏం జరుగుతుందో చూద్దామనే నా attitude తప్ప.

నా మాటలు విన్నప్పటి నించి షా (సౌరీస్)కీ, ఆమె తల్లి రంగనాయకమ్మగారికీ భగవాన్‌ని దర్శించాలని చాలా



ఉత్సాహం కలిగింది. 1938 మే నెలలో మేము భగవాన్ దగ్గిరికి వెళ్ళాము. భగవాన్‌ని చూడగానే షా వొళ్ళెరగని ధ్యానంలో పడ్డది. భగవాన్ సమక్షంలో కూచుంటే నాకూ ధ్యానం తీవ్రమౌతుందనే ఆశతో ఎప్పుడూ భగవాన్ ఎదు రుగా హాల్లో కూచునేవాణ్ణి. ఏ మాత్రం ధ్యానమూ వొచ్చేది కాదుకదా, పైగా నరాలు పీకి పెట్టేవి. కాని ఏదో ఒరుగు తుందనే పేరాశతో అట్లానే బలవంతాన కూచున్నాను. పాత భక్తులూ, పురానావాళ్లూ భగవాన్‌కి దగ్గిరిగా కూచునేవారు. నేను చిట్ట చివర కూచుని ఆయన కళ్ళలోకే చూస్తూ వుండే వాడిని. ఒకసారి భగవాన్ తన దగ్గిర వున్నవాళ్ళని అడిగారు, అందరూ లేచిపోయినా కదలక కూచున్న నన్ను చూపి,

"ఎందుకు అన్ని గంటలూ అట్లా కూచుంటాడు?"

అని. వాళ్లేదో అన్నారు. అది నా కర్థం కాలేదు. నాకేం కావాలి! ఆధ్యాత్మికోన్నతి. ఆ సంగతి భగవాన్‌కి తెలీదా? అనుకుని మాట్లాడకుండా వూరుకున్నాను. నా తల నొప్పులు కుదిర్చి, నా ఆరోగ్యం బాగుచెయ్యమని అడగాలని వుండేది. కాని అదీ భగవాన్‌కి తెలీదా? ఆయన అవసరమను కున్నప్పుడు ఆయనే కుదురుస్తారని ఆయన్ని అడగనే లేదు. అన్నేళ్లలోనూ ఆయన్ని ఎన్నడూ ఏమీ అడగలేదు.

అటు తరవాత మూడేళ్లు వీలైనప్పుడల్లా భగవాన్ దగ్గరికి వొస్తూనే వున్నాము నేనూ, సౌరీస్. ఎక్కువ సార్లు సౌరిస్

ప్రోద్బలం వల్లనే వొచ్చేవాడిని. అదిగాక నాకూ ఆశ వుండేది—
ఎంత బాధగావున్నా భగవాన్ దగ్గిర కొన్నాళ్లు గడిపితే, నా
ధ్యానం బలమౌతుందనీ, దానిమూలాన ఆనందాలటుంచి, నా
బాధలు తగ్గుతాయని. అరుణాచలం రాగానే సొరిస్ గొప్ప
ధ్యానంలో పడేది. ఇక్కడినించి కదలమంటే ఏమీ ఇష్టం వుండేది
కాదు. భగవాన్ అటునించి వొస్తోపోతో, సొరిస్ దగ్గిర ఆగి చిరు
నవ్వుతో కొంతసేపు చూసి వెళ్లేవారు. నేను బలవంతంగా
హాల్లో కూచునేవాణ్ణి. మళ్లీ ఇంకోసారి అడిగారు దగ్గిరున్నవాళ్లని,

"ఏం కావాలి? ఎందుకట్లా కూచుంటాడు?"

అని. అప్పుడూ నేను మాట్లాడలేదు. "ఏం, భగవాన్‌కి
తెలీదా? ఏం కావాలో?" అనుకుని అహంభావ పడేవాణ్ణి.
ఇప్పుడు తెలుస్తోంది భగవాన్ ప్రశ్నకి అర్థం. "నన్ను చూస్తో
కూచుంటే ఏమొస్తుంది? తనకి తాను సాధించుకోవాలి
కాని" అయివుంటుంది అని.

ఆశ్రమంలో ఆడవాళ్ళు వుండడానికి వీల్లేదు. మాకు
నిలవ నీడ వుండేది కాదు. కొన్ని రోజులో, వారాలో పట్టుమని
భగవాన్ దగ్గిర వుందామని గట్టి నిశ్చయంతో వొచ్చినా పరి
స్థితులు వ్యతిరేకించేవి. లేదా లోపలినించే భరించరాని ఆవే
దన పుట్టుకొచ్చేది. ఆశ్రమం భోజనం జబ్బు చేసేది. ఏదో
రాక్షసి నోట్లో చిక్కినట్టుండేది. ఎప్పుడు పోయి బైటపడదామా
మని కొట్టుకునే వాణ్ణి. అందరూ భగవాన్ దగ్గిర "శాంతి,



శాంతి" అనేవారు. నాకు భరించరాని అశాంతిగా వుండేది.
అరుణాచలంలో ఉన్నంత కాలం ఏ ధ్యానమూ నా వేపు
వొచ్చేదికాదు. ఇంక ఎన్నడూ ఆశ్రమానికి రాకూడదని
ఎన్నో శపథాలు చేసుకున్నా, తీరా వెళ్లిన నిమిషంనించి తిరిగి
ఎప్పుడు భగవాన్ దర్శనానికి వెడదామా అని మనసు పీకేది.
నాకేదో వొరుగుతుందనే నా ఆశే కాక, ఏదో నాకే తెలీని
ఆకర్షణ నన్ను భగవాన్ దగ్గిరికి ఈడ్చుకొచ్చేది.

ఆ మూడేళ్ళూ నా ప్రయత్నం లేకండానే, నన్ను
ధ్యానం నిలేసి కూచోపెట్టింది. కాని ఆ ధ్యానం అంతకన్న
ముందుకి సాగలేదు. ముఖ్యం నా అనారోగ్యం ఆటంకమని
తెలుస్తోంది. ఆ అనారోగ్యాన్ని తీసెయ్యగల నాధుడు లేడు.
ఆ ధ్యానం వల్ల నా బాధలేవీ పోలేదుగాని, నా కిదివరకు
తృప్తినిచ్చే సౌఖ్యాలన్నీ పోయినాయి. దేంట్లోంచీ ఏ సుఖమూ
రాదు. ప్రతిదీ విసుకు. సౌఖ్యాలు తీసేసి బాధలట్లానే వుంచిన
ఆ ధ్యానం పైన కోప మెక్కువయింది. పెద్ద దుర్గతిలో పడి
జీవచ్ఛవాన్నైనా ననిపించింది.

అట్లాంటి స్థితిలో లీలగారు వొచ్చారు. ఆమె వొచ్చి
నప్పటి నించి ఇదివరకున్న జడత్వం పోయి, కొత్త ఆశలూ,
ఏదో జీవితం వెలగబోతూందనే ఉత్సాహమూ కలిగాయి.
కాని త్వరలో తగాదాలు ప్రారంభమైనాయి. ఆమెతో
స్నేహం మూలాన నాలుగేళ్ళు భగవాన్‌ని దర్శించలేదు. చిన

రికి ఆమెని బలవంతం చేసి, ఆమె పిల్లలతో సహా భగవాన్ దర్శనానికి వొచ్చాము. భగవాన్‌ని చూస్తే వాళ్ళెందుకో వొణికిపోయి, ఆయన ఎదట పడకుండా దాక్కునే వారు. నన్ను మాత్రం భగవాన్ ఒకటే పలకరించి, దగ్గిరికి వొచ్చి కూచోమని పిలిచి, హాస్యాలు కూడా చేశారు. నేను దీక్షితులుగారికి రాసిన ఉత్తరాల పుస్తకం తెప్పించి-నా చేతే చదివించి, విని, చాలా enjoy చేశారు. లీలగారు వెళ్ళిపోవాలని తొందరపడుతున్నారు. కాని ఏదో వొక అభ్యంతరంతో ప్రయాణం రోజు నించి రోజుకి ఆగిపోతోంది. చివరికి ఓ రోజు నిశ్చయించుకుని భగవాన్‌ని శెలవ అడగబోతే, అన్నాళ్ళా అంత దయగా ఉన్న భగవాన్, కారణం లేకండానే ఉగ్రులై సరిగా శెలవియ్యలేదు. అందుకని మళ్ళీ రెండు రోజులు ఆగి, చివరికి భగవాన్ నించి సరిగా శెలవ తీసుకోకండానే వెళ్ళాడు చలం, లీలగారివల్ల తొందరపడి.

వెళ్ళి రైలెక్కింది మొదలు నాలుగేళ్ళు నేను పడ్డ అవస్తలకి అంతులేదు.

చివరికి మమ్మల్ని చిన్నప్పటి నించి పోషించి పెంచిన మా వొయ్యి చచ్చి పోయిన తొందరలోనే అరుణాచలం వెళ్లాలని నిశ్చయించుకున్నాము. ఆ నాడు మాకు మిత్రులు లేరు, ఆదాయం లేదు, ఒక్క భగవాన్ తప్ప ఎవరూ కనిపించలేదు. నాకేమో ఆయనపై ఏ విశ్వాసమూ లేదు, మమ్మల్ని రక్షిస్తారని. డబ్బూ, ఆదాయమూ



లేని మేము ఏ విధంగా అరుణాచలంలో వుంటాము? ఏమైనా సరే అక్కడికి పోయే చూద్దామని నిశ్చయించుకున్నాము. పైగా భగవాన్‌కి కూడా చాల జబ్బుగా వుంది. బతక రంటున్నారు. అయినా మా కంతకన్న శరణ్యం లేదు.

1950 మొదట్లో వొచ్చి, ఓ ఇల్లూ పాకా అద్దెకి తీసుకుని వున్నాము. భగవాన్ అంత జబ్బులోనూ, ఎంతో ఆదరంగా చూశారు మా వంక, మా రాకకే ఎదురు చూస్తున్నట్లు. త్వరలోనే భగవాన్ అస్తమించారు. మేం ఆయన ముందు చావాలని వొస్తే, ఆయనే మా ముందు వెళ్లి పోయినారు. భక్తులందరూ వెళ్లి పోయారు. రమణ నగర్ యెడారి అయింది. పగలే దొంగలు ఇళ్ళ తలుపులూ, కిటికీలూ తవ్వి తీసుకు పోతున్నారు. ఆశ్రమం, మేమూ మాత్రమే మిగిలాము. కాని నిర్యాణమప్పుడూ, తరవాత భయం పుట్టించే వొంటరితనంలోనూ భగవాన్ మమ్మల్ని ఆదుకుని, అర్థంగాని ధైర్యమిచ్చి రక్షించారు. భగవాన్ వెళ్లేముందు తాను ఇక్కడే వుంటానన్నారు. ఆ విశ్వాసంతోనే ఇక్కడే వుండి పోయినాము. అదీగాక ఇంకెక్కడికి పోము?

ఏడాది గడిచింది. మా డబ్బూ, నా ఆరోగ్యమూ సన్నగిలాయి. చివరి దశను సమీపిస్తున్నాము. అప్పటికీ నాకు దేవుడిలోగాని, కర్మలో గాని, చావు తరవాత బతుకులోగాని విశ్వాసం లేదు. ఎదన్నా చేస్తే భగవాన్ ఒక్కరే

చెయ్యగలరని విశ్వాసం మాత్రం వుంది. కాని భగవాన్ చేస్తారని ఏ ఆశా లేదు.

అరుణాచలం వొచ్చినప్పటినించి షో చాలా గొప్ప స్థితిలో, వొంటరిగా, సమాధిలో కూచుని వుంటోంది. 1951 ఆగష్టు 15 న షోకి ఈశ్వరుడు ప్రత్యక్షమై, తను చెప్పినట్లు నడుచుకుంటే, ఇంక ఈ ఇంటినీ, మమ్మల్నీ తాను నడుపు తాననీ, దిక్కులేని మమ్మల్ని రక్షిస్తాననీ, భగవాన్ మమ్మల్ని కనిపెట్టమని తనని పంపారనీ చెప్పారు.

---



మొట్టమొదట నేను భగవాన్ ఫోటోని 'Sunday Times' అనే పత్రికలో చూచినప్పుడు "ఎవరబ్బా ఈ అంద వికారమైన మనిషి! పెద్ద పొట్టతో, బట్టలు లేకుండా ఫోటోలు తీయించుకోవడమే కాక, పైగా ఆ ఫోటోలని పత్రికల్లో వేయించుకుంటాడు?" అని ఏవగించుకున్నాను.

ఆయన పేరు భగవాన్ రమణ మహర్షి. ఎంతో కటువుగా artificial గా ధ్వనించింది నా చెవులకి. భగవాన్‌కి, రమణకీ, మహర్షి కీ–ఈ మూడు పేర్లకీ ఎక్కడా సంబంధం లేదు. ఎడ్వర్టైజ్ మెంట్ కోసం, తన గొప్ప చాటుకునేందుకు, ఈ బిరుదులన్నీ తగిలించుకున్నాడనిపించింది.

నా ఆర్టిస్టిక్ feelings ఎంత బాధపడేవంటే చివరికి ఆయన ఫోటో కనపడితేచాలు, భరించలేక ఆ పేజీని త్వరగా తిప్పేసేదాన్ని నా కళ్లముందు నించి.

అప్పుడు నాకు పధ్నాలుగేళ్ళు. కాని ఈ నాడు నేను ఫీలవడమేకాదు–నాకు స్పష్టంగా తెలుసు, భగవాన్ సౌందర్యాన్ని మించిన సౌందర్యం ఈ భూమి మీద ఎక్కడా లేదని! సమ్మోహ పరచే ఆయన చిరునవ్వు, శ్రావ్యమైన కంఠధ్వని, ఆయన తల వూపు, ఈ ప్రపంచపు మాయని చీల్చుకుని ప్రకా



శించే అద్భుతమైన ఆయన కంటిచూపు, ఆయనలో తప్ప ఇంక ఎక్కడ వెతికి చూసినా కానరావు.

నాన్న దీక్షితులు గారితో కలిసి రమణాశ్రమానికి మొట్ట మొదటిసారి వెళ్లి వొచ్చాడు. ఆ రోజు సాయంత్రం నేను తల నెప్పితో పడుకుని వున్నాను. అందరూ నాన్న చుట్టూ చేరారు కబుర్లు వినటానికి. నాన్న రమణాశ్రమాన్నీ అరుణాచలాన్నీ వర్ణిస్తున్నాడు. అరుణాచలం పేరు వినగానే నా హృదయం గొప్ప ఆనందంతో నిండింది. నేను పక్క మీద నించి లేచి, నాన్న దగ్గిర చేరాను. నాన్న భగవాన్ బోధించే ఆత్మ విచారణ సంగతి చెప్తున్నాడు. మనసూ బుద్ధీ, పంచేంద్రియాలూ, దేహం–ఇవన్నీ గూడా నిజం కావనిన్నీ, సత్యమైన "నేను"ని తెలుసుకోమని భగవాన్ బోధిస్తారనీ, అదే ఆయన చెప్పే సాధన అనీ.

"ఆ సత్యమైన 'నేను'ని తెలుసుకోవడమెట్లా?"

అని ప్రశ్నించాడు మా తమ్ముడు వసంత్.

"నే నెవరని నిన్ను నువ్వు ప్రశ్నించుకోమంటారు."

"కాని ప్రశ్నించుకున్నంత మాత్రాన ఆ ప్రశ్న మనని ఆ 'నేను'ని తెలుసుకు నేటట్లు ఎట్లా చెయ్యగలుగుతుంది?"

అని తిరిగి ప్రశ్నించాడు వసంత్.

"ఆయన ఆ విధంగానే సాధించి తెలుసుకున్నారట."

అన్నాడు నాన్న జవాబు చెప్పలేక.

అందరూ అర్థంకాక వింటున్నారు. కాని నేను మాత్రం నాన్న explain చెయ్యాలని చూస్తున్న భగవాన్ బోధని

సులభంగా గ్రాహ్యం చేసుకోగలిగాను. నా చిన్నప్పటినించీ నా చుట్టూ కనపడే ప్రపంచం వాస్తవమా లేక కలా? ఇదంతా నేను కల గంటున్నానా? లేక మేలుకుని వున్నానా? నేను చూస్తున్న ఫీలవుతున్న ఈ ప్రపంచాన్ని నేను వూహించుకుంటున్నానా, లేక నిజంగా వుం—? అని యోచించేదాన్ని. నా మనసు వెనకాల, మనసుతో ఏ సంబంధమూ లేకండా "నేను" అనేది వుందని నాకు చిన్నప్పటి నించీ తెలుసు, ఆ "నేను"ని చేరుకోవాలనీ, తెలుసుకోవాలనీ తంటాలు పడే దాన్ని. struggle అయ్యేదాన్ని. చేరుకోపడానికి వీల్లేకండా మధ్య మనసు అడ్డుగా ఉందనీ తెలుసు నాకు. కాని ఆ మనసుని దాటి, ఆ "నేను"ని ఏ విధంగా చేరుకోవాలో తెలిసేది కాదు. మనసుని దాటగల మార్గం కనపడేది కాదు. నేను వెతుకుతున్న సత్యానికి భగవాన్ బోధ వెంటనే మార్గదర్శిగా గోచరించింది.

నేను వెళ్ళి పక్క-మీద పడుకున్నాను. నాన్న నా దగ్గిర కూచుని, ఆశ్రమం నించి తెచ్చిన విభూతి, నా నుదుటికి పెట్టి చేత్తో మెల్లిగా రాస్తో-

"భగవాన్, భగవాన్" అని ఆయన నామం ఉచ్చరించాడు.

చల్లని శక్తి నాన్న వేళ్ళలోంచి నా నుదిటి మీదికి ప్రవహించడం feel అయాను. వెంటనే నా తలనెప్పి మాయమైంది.



మూడు రోజుల తరవాత, నాన్న మేడమీద ఒంటరిగా కళ్ళు మూసుకుని కూచోవడం చూసి,

"ఏం చేస్తున్నావు?"

అని పిల్లలం మేము అడిగాం.

"భగవాన్ చెప్పిన 'who am I?' సాధన చేస్తున్నాను."

అని చెప్పాడు.

నాకు కూడా సాధన చెయ్యాలనిపించింది. భగవాన్ రాసిన 'who am I ?" అనే పుస్తకాన్ని చదివి, నేనూ సాధన చెయ్యడం మొదలు పెట్టాను. మాతోపాటు వసంత్ కూడా సాధన చేయడం మొదలుపెట్టాడు. ఒక వారం రోజులు తర్వాత అతను,

"లాభం లేదు. 'నేనెవరిని?" అని ఎంత ప్రశ్నించుకున్నా జవాబు దొరకటం లేదు."

అన్నాడు.

"అదంత సులభమైన సంగతి కాదు. మనసు అణిగిపోవాలి, అప్పుడుగాని జవాబు దొరకదు."

అన్నాడు నాన్న.

కాని వసంత్ కి పట్టుదల లేక మానేశాడు. కాని నేనూ, నాన్నా, వొదలకండా పొద్దున్నా, సాయంత్రం సాధన చేసేవాళ్ళం.

భగవాన్ వేదాంత ప్రభావం నా మీద ఎంత గట్టిగా పని చేసిందంటే "నేనీ దేహం కానప్పుడు, దీనిమీద ఎందు

కింత శ్రద్ధ చూపాలి?''అని దేహంమీదా, రోజూ నేను చెయ్య వలసిన పనులమీదా నిర్లక్ష్యం చూపడం మొదలు పెట్టాను.

కాని త్వరలోనే "నేను సన్యాసిని నవ్వాలనుకుంటు న్నానా?" అనే ప్రశ్న నాలో బయల్దేరింది.

నాకు నిశ్చయంగా తెలుసు, నా వాళ్ళని అప్పుడే వొదలపోనటం లేదనీ, ఇంకా జీవితంలో ఎంతో అనుభవించ వల్సింది వుందనీ.

సాధన మొదటలో, నాకు మనసులోంచి ఒక్కొక్క ఆలోచనే తీసేసుకోవాలని నేను ఎంత ప్రయత్నించినా, దానికి బదులు పది ఆలోచనలు మనసులోంచి పుట్టేవి. ఆలోచనలు ఒకదానివెంట ఒకటి సముద్రంలో అలలకి మల్లే విరుచుకుని పడేవి. ఈ ఆలోచనలన్నీ ఎప్పటికి అణుగుతాయి? ఎప్పటికి ఆత్మ దర్శన మౌతుంది? అని నిరాశ కలిగేది.

కాని సాధన మొదలు పెట్టిన పది రోజుల తర్వాత, నేను సాధనలో కూచుని వుండగా భగవాన్ ఆకారం కనిపించింది. నేను ఆయన్ని ఇంతకుముందు చూడలేదు ఫోటోల్లో తప్ప. వెంటనే నా మనసులో ఆలోచనలు అనంతట అవే అణిగిపోయాయి. నా హృదయం ఆనందంతో, ప్రేమతో నిండి పోయింది.

ఆరోజునించి నా మనసు ఆత్మవిచారణని నిరాకరించి భగవాన్ రూపాన్ని ధ్యానించడం మొదలు పెట్టింది. సరైన సాధన నించి తప్పు మార్గంలో నడుస్తున్నా నేమోనని భయపడ్డాను. కాని తరవాత తెలుసుకున్నాను. నా సాధనలో జరిగిన భగ



వాన్ దర్శనం నా మనసు కల్పించిన మాయ కాదనీ, నా సాధనని సులువు చేసి నన్ను ముందుకి నడిపించడానికి ఆయన చూపిన అనుగ్రహమనీ. ఆయన అనుగ్రహం లేనిదే ఎంత సాధన చేసినా వృథా; సముద్రంలో నీళ్లని ఎండించడం ఎంత అసాధ్యమో ఆయన సహాయం లేనిది ఈ మనసుకి ఆలోచనలు లేకుండా చెయ్యడమూ అంత అసాధ్యమైన పనే.

చిన్నదాని నవడం వలన కష్టమైన సాధన నించి త్వరలో తప్పుకునేదాన్నే, కాని చిన్నప్పటినించీ నన్ను బాధిస్తున్న తల నెప్పులు ధ్యానం వలన తగ్గాయి. ఏ బాధలో వున్నా, ఏ కష్టంలో వున్నా "బాధపడేదెవరు? నా మనసా? శరీరమా? నా ఆత్మా?" అని ప్రశ్నించుకోగానే బాధంతా మాయమయేది.

పాల్ బ్రన్టన్- "A Search in Secret India" చదివినప్పటినించి భగవాన్ని చూడాలనే కోర్కె బలమైంది నాలో. "Who am I?" అనే సాధన బదులు, భగవాన్ నామం ఆక్రమించింది నా మనసుని. "Who am I?" అని ప్రశ్నించి ఎంత సాధన చేసినా ఫలితం వుండేది కాదు, గాని ఒక్కసారి "భగవాన్" అని స్మరించగానే నా హృదయం ఆనందంతో, శాంతితో నిండేది. ఉచ్ఛమైన జ్ఞాన మార్గం నించి మూఢమైన భక్తి మార్గంలో పడిపోయానే అని సిగ్గు పడేదాన్ని. భగవాన్ని చూసి తీరాలనే ఆతృతతో గడిపాను ఆ సంవత్సరమంతా.

ఈస్టర్ శలవల్లో అరుణాలానికి బయల్దేరాం నాన్నా, అమ్మా, నేనూ, పకపకా. ఆ రోజు నా పుట్టిన రోజు. అరుణాచలం యాత్ర పుట్టినరోజు కానుక నాకు. రైల్వేస్టేషన్నించి అరుణాచలం కొండని చూడగానే, నా హృదయం ఆనందంతో, ఉత్సాహంతో నిండింది. ప్రొద్దున్న ఎనిమిదింటికి ఆశ్రమానికి వెళ్లి భగవాన్ హాల్లో ప్రవేశించాం. నన్ను చూడగానే భగవాన్ నేను తనకి చిరపరిచితురాలినైనట్టు, చాలా కాలం నించి నా కోసం తను ఎదురు చూస్తున్నట్టు చిరునవ్వు నవ్వారు. నేనూ అదే విధంగా ఆయన్ని చూసి నవ్వాను. నాన్న ఆయనకి సాష్టాంగ నమస్కారం చేశారు. సాష్టాంగ నమస్కారం చెయ్యడం తెలీదు నాకు. అందుకని నాన్నని అనుకరించాను.

భగవాన్ ఎట్లా వుంటారని నేను వూహించుకున్నానో సరిగా అట్లానే ఉన్నారు భగవాన్. ఆయన ముందు కూచోగానే నీళ్లలో పడిన చేపమల్లే వెంటనే గాఢమైన ధ్యానంలో పడి పోయాను.

ఆ రెండు రోజులూ స్వర్గంలో వున్నట్టనిపించింది. మూడో రోజున మధ్యానం భోజనం తరవాత పెద్ద తలనెప్పి వొచ్చింది. నా స్వర్గం నరకంగా మారింది. మేము ఆశ్రమానికి రెండు మైళ్ళ దూరంలో ఉన్న ట్రావెలర్స బంగాళాలో దిగాం. తెల్లవారే ఆశ్రమానికి వొచ్చి రోజంతా ఆశ్రమంలో నే గడిపే వాళ్ళం. వొంటరిగా పడుకుందామంటే జాగా లేదు. మనుష్యులు, గోల, సందడి.



ఆ మధ్యాన్నం చాల బాధ పడ్డాను. సాయంత్రం నేనూ, నాన్నా బావి దగ్గర అరుగు మీద కూచున్నాం. ఎక్కువ సేపు కాళ్లు ముడుచుకుని కూచోవడం అలవాటు లేక నా కాళ్లు నెప్పులుపుట్టి, కాళ్ళని చాచుకుని కూచున్నాను. కొంత సేపటికి భగవాన్ సోఫాని తెచ్చి బావికి అవతలి వేపున వుంచారు ఆయన పరిచారకులు. భగవాన్ వచ్చి సోఫామీద కూచున్నారు.

ఇంతలో ఒకతను మా దగ్గిరికి వొచ్చి అరవంలో బిగ్గిరగా అరవడం మొదలు పెట్టాడు. ఏమంటున్నాడో మాకు తెలీదు. తను అనేది మా కర్థం కాలేదని తెలిసి అతను ఇంకా దగ్గిర వొచ్చి సౌజ్ఞలతో, అరుపులతో తెలియ చేశాడు, నేను భగవాన్ వేపు కాళ్ళని చాచి చాల ఘోరమైన అపచారం చేస్తున్నానని.

తల నెప్పి వలనా, అతని మొరటు ప్రవర్తన వలనా, కొత్త ప్రదేశం అవడం వలనా, భగవాన్ మౌనం వలనా, నా మనసు బాధ పడి ఎదురు తిరిగింది. నేనూ, నాన్నా అక్కణ్ణించి లేచి, భోజనాల హాలు కట్టడానికి తెచ్చి పోసిన ఇసిక కుప్పలమీద కూచున్నాం.

నా మనసు తిరగబాటుతో రగులుతోంది. హాయిగా ఇంట్లో వుండక, ఈ మొరటు మనుష్యుల మధ్యకి ఎందుకు వొచ్చినట్టు? నేను వొచ్చినా, రాక పోయినా భగవాన్‌కి లెక్క లేదు. నేనంటే ఏం లక్ష్యం ఆయనకి! ఎందుకు లక్ష్యం

వుండాలి! ఆయన కోసమని నేను ఇంత దూరంనించి వొచ్చా
నన్న సంగతి గూడా గమనించినట్టు లేరు ఆయన, అటువంటి
భగవాన్ కోసం ఇన్ని బాధలూ,అగచాట్లూ ఎందుకు పడాలి?
ఇక్కడికి రావడమంత వెర్రిపని ఇంకొకటి లేదు...నా మన
సులో రగులుతున్న ఆలోచనల్ని నాన్నకి వెళ్ళబుచ్చాను—

"నా కిక్కడేం బాగాలేదు. భగవాన్ చాల గొప్ప
వారే, కాని ఇక్కడి మనుష్యులూ, ఈ ఆశ్రమ వాతా
వరణం ఘోరంగా వుంది. భగవాన్ గొప్పతనం భగవాన్‌కి
వుండవచ్చు, కాని దానివలన మనకేం వొస్తుంది?" అని.

నే నంతకు ముందు భగవాన్ సమక్షంలో ecstacies
లోకి పోవడంచూసి,తను పడ్తున్న బాధల్ని నా ముందు ఎత్త
డానికి జంకాడు నాన్న. నా తిరగబాటు నాన్నకి ఓదార్పు
నిచ్చింది. ఆ నిమషాన, అక్కడ ఇద్దరమూ ఎన్నడూ ఈ ఆశ్ర
మానికి రాకూడదనీ, అంతేకాదు భగవాన్‌ని Serious గా
తీసుకొని ఆయనలో విశ్వాసముంచడమంత వెర్రిపని ఇంకొకటి
లేదనీ, మా ఆధ్యాత్మిక సాధనని వొదిలేసి, సుఖంగా స్వేచ్ఛగా
జీవితం గడపుదామనీ నిశ్చయించుకున్నాం.

వెంటనే ఆశ్రమం నించి వూరికి వెళ్ళి పోవాలని అను
కుని అక్కడనించి లేచాం. భోజన మయిన తర్వాత, భగ
వాన్ దగ్గిర శలవు తీసుకోవాలసి ఆయన దగ్గిరికి వెళ్ళాం. నేను
మాట్లాడకండా ఆయనకి నమస్కారం చేశాను. అటు వున్న
భగవాన్ వెనక్కి, నా వేపుకి తిరిగి నా కళ్ళల్లోకి చూస్తో,



ప్రేమతో నవ్వారు. ఆ చిరునవ్వు నా హృదయంలో ప్రేమనీ
ఆనందాన్నీ రగిల్చింది.

రైలు ఎక్కిన నిమిషం నించీ మళ్ళీ ఎప్పుడు తిరిగి భగ
వాన్ని చూస్తానా అని ఆతృత పడడం మొదలు పెట్టాను.
అదే భగవాన్ మీద నా మొదటి తిరగబాటూ, చివరి తిరగ
బాటూను. ఆటు తరవాత జీవితంలో భగవాన్ నన్నెన్నో
విధాల కఠినంగా పరీక్షించారు. భరించలేని బాధల్లోంచి
దుఃఖంలోంచి నడిపించారు. కాని నా మనసు ఎన్నడూ
ఆయన మీద ఎదురు తిరగలేదు. ఆయన మీద నా విశ్వాసం
చలించలేదు.

భగవాన్ దగ్గిరికి వెళ్లి వొచ్చిన తర్వాత నా సాధన
తీవ్రమైంది. కొంత భయాన్ని కలిగించింది కూడా. నా
వూపిరి పెద్ద force తో, బుస్‌మనే శబ్దంతో వొచ్చేది. నా
దేహం ఇటూ అటూ వూగిపోయేది. నా తల ఇటూ అటూ
వూగేది. నా మెడ విరుగుతుందేమోననిపించేది. ఒక విసు
రుతో కింద పడిపోయేదాన్ని. ఒక్కొక్కప్పుడు తలకి దెబ్బలు
తగిలేవి కూడాను. ఎవరో నాలో ప్రవేశించడానికి నా
చుట్టూ తిరుగుతున్నట్టు feel అయేదాన్ని. పెద్ద భయం
నన్నావరించేది. నిజంగా ఎవరో నా చుట్టూ తిరుగుతున్నారా
లేకపోతే ఇదంతా వూహించుకుంటున్నానా అనుకునే దాన్ని.

కాని ఆ Presence నా వూహ కాదు, ఆ Presence
శక్తిని స్పష్టంగా feel అయేదాన్ని. అది భగవాన్ Presence

కాదని మాత్రమే తెలుసు నాకు. నాన్న ఇదంతా భగవాన్‌కి రాశాడు. దానికి ఆశ్రమం వాళ్ళు, భయంలేదనీ, ఇవన్నీ త్వరలో సర్దుకుంటాయనీ జవాబిచ్చారు. సరిగ్గా అట్లాగే అవి మాయమైనాయి.

మళ్ళీ ఒక సంవత్సరానికి భగవాన్ని చూడడానికి వెళ్లాం. ఈమాటు దీక్షితులుగారూ, నాన్నా, నేనూ. ఆ ప్రయాణాన్ని గురించే నా 'అరుణాచలం నుండి లేఖ'లో వర్ణించాను.

రాత్రి తొమ్మిది గంటలకి ఆశ్రమం చేరుకున్నాం. భగవాన్ నిద్ర పోతున్నారు, చూడడానికి వీల్లేదన్నారు ఆశ్రమం వారు. కాని దీక్షితులుగారి తియ్యని మాటలు ఆశ్రమం వారి హృదయాన్ని జయించాయి. మమ్మల్ని భగవాన్ సముఖానికి తీసుకుని వెళ్ళారు. నేను భగవాన్‌కి ప్రణామం చేస్తుండగా నా శరీరంలో Thrills pass అయినాయి. వెన్నెముకలోంచి నా రక్తం తలలోకి rush అయింది. ఆశ్రమంలో వున్న నాలుగురోజులు గాఢమైన ధ్యానంలో మునిగిపోయాను. ఒక మధ్యాహ్నం సమాధి స్థితిలో గూడ వున్నాను. అప్పుడు అది సమాధి స్థితి అని నాకు తెలీదు. తరువాత నా అనుభవాల వలన ఆ రోజున నేను సమాధి స్థితిలోకి వెళ్లానని తెలిసింది.

భగవాన్ సముఖంలో గొప్ప ఆనందంలో మునిగి వున్నా ఆశ్రమం వారివలన గొడవలు తప్పలేదు నాకు. ఆశ్రమంలో ఉన్నవారి ఆచారాలూ, వాళ్ళ పూజలూ, వారి sentiments నాకు చాలదూరం. నా పద్ధతులు, నా వేషం వారికి వింత అనుకుంటాను. కొత్త చోటికి వెళ్ళినప్పుడు నాకు అమితమైన బిడియం. సిగ్గు. అందుకని నాన్న వెంటే తిరిగేదాన్ని. నాన్న దగ్గరే మొగవాళ్ళలో కూచునేదాన్ని. భోజనం దగ్గర కూడ నాన్న దగ్గిరే కూచునేదాన్ని.



రోజూ సాయంత్రాలు భగవాన్ హాల్లో అందరికి ప్రసాదం పంచి పెట్టేవారు. ఒకరోజున నేను వొళ్ళు తెలీని ధ్యానంలో వున్నాను. ప్రసాదాలు పంచి పెట్టే ఆయన నా దగ్గిరికొచ్చి బిగ్గిరిగా "వూఁ" అన్నాడు ప్రసాదం ఇవ్వబోతూ. వెంటనే నా చెయ్యిచాపాను. అతను ఏదో కసురుకున్నాడు నన్ను. వెంటనే వులిక్కిపడి కళ్ళు తెరిచి చూశాను. నా చేతి వేపు తన చేత్తో సౌజ్ఞ చేస్తో చూపాడు, నేను ఎడమ చేతిని చాచానని. నాకు పుడకతో ఎడమ చెయ్యి అలవాటు. అతని చేత చివాట్లు తినడమెందుకని సరిగా ప్రసాదాల timeకి, బయటికి వెళ్ళిపోయి ఒక చెట్టుకింద కూచునేదాన్ని.

ఎందుకు నా మీద నిష్కారణంగా ఇంత కోపం వాళ్ళకి? ఎందుకు నా మీద మండిపడతారు? నేనేం చెయ్యందే నా మీద ఎందుకు విరోధం? అని బాధపడేదాన్ని. కాని త్వరలోనే ఇదంతా భగవాన్ నా అహాన్ని అణచడానికి చేస్తున్న పని అని తెలుసుకున్నాను.

అప్పటి నించీ నా దృష్టి మారింది. ఆశ్రమంలో ఏం జరిగినా బాధ పడేదాన్ని కాదు. ఆశ్రమం, ఆశ్రమవాసులూ నా హృదయానికి దగ్గిరయినారు. త్వరలోనే నా యెడల వారి ప్రవర్తన, ఇష్టంగా మారింది. నేను హాల్లో కనపడకపోతే ప్రసాదాలు పంచిపెట్టేఆయన నేనెక్కడ వున్నానో కనుక్కొని నా వొంతు ప్రసాదం నా కివ్వమని నాన్న చేతికిచ్చేవాడు.

పూజలో, ఆరాధనలో నా కర్థం కనపడేది కాదు. పూజార్లు పూజ చేసి హారతి తీసుకొని రాగానే భగవాన్ హారతిని కళ్ళకి అద్దుకుని నొసటికి వీబూది పెట్టుకునేవారు. ఈ ప్రపంచమంతా ఒక వెర్రి ఆటగా కనపడే గొప్ప జ్ఞానంలో, సహజ నిష్టలో వుండే భగవాన్ మూఢాచార బ్రాహ్మణుడి లాగ ఎందుకు ప్రవర్తిస్తారో అర్థమయేది కాదు. ఇందులోనే కాదు, చాలసార్లు భగవాన్ తమ బోధించే వేదాంతానికి వ్యతిరేకంగా, అతి సామాన్యంగా ప్రవర్తించడం చూశాను. నేనప్పుడు భగవాన్ వేదాంతాన్ని ఏ విధంగా అర్థం చేసుకున్నానో దానికి వ్యతిరేకంగా కనపడేది ఆయన ప్రవర్తన. అందుకని ఆయన్ని అర్థం చేసుకోలేక తికమకలు పడేదాన్ని. ఎంత అంటే- చివరికి ఆయన మీద నా ప్రేమ తగ్గిపోతుందేమో కనిపించేది. కాని వెంటనే నన్ను నేను సమాధాన పరుచుకున్నాను. ఆయన ముందు మనమెంత, ఆయన్నిగాని ఆయన ప్రవర్తననుగాని అర్థం చేసుకోవడానికి? అయినా ఆయనేం



మాట్లాడితేనేం? ఏం చేస్తే ఏం? నా కెందుకు? నాక్కావల్సిందల్లా భగవాన్. ఆయన ప్రేమ. భగవాన్ అంత భక్తితో హారతిని కళ్ళకద్దుకున్నా, నాకు హారతంటే భక్తి కలిగేది కాదు. హారతి వలన నా ధ్యానానికి భంగం కలిగేది.

ఒకరోజున చాడ్విక్ హారతిని ఎంతో భక్తితో కళ్ళకద్దుకోవడం, విభూతి కుంకం తీసుకుని నుదుటికి పెట్టుకోవడం చూశాను. ఆ దృశ్యం నన్నెంతో కదిలించేసింది. పుటకతో హిందువునైన నాకు హారతిలో అర్థం కనపడకపోతే, విదేశీయుడైన అతనికి ఎంత అర్థం లేనిదిగా కనపడాలి? అతనికి అందులో ఏదన్నా అంతరార్థం కనపడుతోందా? లేదు. అతనికి హారతి అంత ప్రియం కావటం, భగవాన్ ఎంతో భక్తితో కళ్ళకద్దుకోవటం వలన. ఆ రోజు నించి భగవాన్ చేసే ప్రతి పనిలోనూ నాకు ఎంతో అందం కనపడేది.

భగవాన్ సమక్షంలో నాకు స్వర్గంలో వున్నట్టు వుండేది. కాని నాన్నకి నరకంలాగు వుండేది. వున్నంత కాలం ఎప్పుడు ఇంటికి పోదామా అనే తన ధ్యాస. నాకు భగవాన్, ఆశ్రమం, అరుణాచలమే వాస్తవంగా; ప్రపంచం, ఇల్లూ, మా కుటుంబమూ–అంతా మాయగా కనపడేవి. నాకు భగవాన్ దగ్గిరే వుండిపోవాలని గట్టిగా అనిపించింది. కాని వొంటరిగా ఈ అడవిలో ఎట్లా వుండడం? నాన్న శెలవల్లో తప్ప ఇక్కడ వుండలేదు.

ఆ రోజుల్లో ఆశ్రమం దగ్గిరిగా ఇళ్ళు లేవు. ఇంటి దగ్గిర వుండే సదుపాయాలకి సుఖాలకి అలవాటు పడ్డ నేను, నా తల నెప్పుల వలన నా ఆరోగ్యాన్ని ఎంతో జాగ్రత్తగా చూసుకో వలసిన నేను, ఇక్కడ వొంటరిగా నిస్సహాయంగా, ఈ అడవిలో ఎట్లా వుండగలను? నాన్న—

"భగవాన్నే అడుగు."

అన్నాడు.

"భగవాన్ని అడగడమా?"

అనంతమైన మహా సముద్రాన్నీ, నిరామయమైన ఆకాశాన్నీ, ఎత్తైన అరుణాచలాన్నీ ఎట్లా సమీపించడం? అప్పుడే కాదు, ఎప్పుడూ భగవాన్‌తో మాట్లాడలేదు నేను. నాకా అవసరం కలగలేదు. అటువంటి సమయమూ రాలేదు. ఎందుకంటే–నా సందేహాలనీ, నా సాధనలో అభ్యంతరాలనూ, నా గోడనల్నీ, నాకు కలలద్వారా, దర్శనం ద్వారా తీర్చి, నా మార్గాన్ని నాకు స్పష్టం చేసేవారు భగవాన్.

ఆశ్రమంలో ఉన్న నాలుగు రోజులూ భగవాన్ దగ్గిర అరుణాచలంలో వుండే విధమేమైనా వుందా అనే ఆలోచనలో గడిపాను. ఏదో విధంగా త్వరలో భగవాన్ నేను తన దగ్గిర వుండడానికి ఏర్పరుస్తారు అని నన్ను నేనోదార్చుకున్నాను. ఇంటికి వచ్చాక నా సాధన ఇంకా తీవ్రమైంది.



ఒక రోజున గాఢ సమాధిలో పడిపోయాను కూడాను. ఒక్కరోజు నా ధ్యానం కుదరకపోతే ఆ రోజున చాల దురదృష్టమైన రోజనిపించేది. క్రమ క్రమంగా భగవాన్ నా హృదయాన్ని తన వేపుకి లాగేస్తున్నారు. నా ఆత్మని తెలుసుకోవడానికి కాదు నా సాధన ఇప్పుడు, భగవాన్ని తెలుసుకోవడానికి ఆయన్ని దగ్గిరగా సమీపించాలని, ప్రతి నిమిషం ఆయన్ని నా దగ్గిరగా feel అవాలని. ధ్యానంలో ఆయన presence నా హృదయాన్ని ఆనందంతో నింపేది.

మళ్ళీ సెప్టెంబరులో భగవాన్ ఆశ్రమానికి వెళ్ళాం నేనూ, నాన్నా. రైలు అరుణాచలానికి దగ్గిరైన కొద్దీ కొండలూ, లోయలూ నన్ను ఆనందంతో Thrill చేశాయి. ఈ మాటు రాజ అయ్యర్ ధర్మాన మాకు మంచి బంగళా దొరికింది. ఇంతకు మునుపు సమాధి స్థితిలో వున్నప్పుడు నా కళ్ళముందు కనపడేవన్నీ మాయమైనా, భగవాన్ నా ముందు నించి వెళ్ళినప్పుడు ఆయన ఆకారం మాత్రం కనపడేది.

ఒకరోజున హాల్లో నేను సమాధి స్థితిలోకి వెళ్ళినప్పుడు నా ఎదురుగా వున్న మనుష్యులూ, హాలు గోడలూ, భగవాన్ సోఫా, చివరికి భగవాన్ కూడా మాయమైనారు. భగవాన్ మాయమయ్యేప్పటికి భయమేసింది. నేను మాయమౌతానన్నా

మోక్షాన్ని పొందుతానన్నా నాకు భయం లేదు. కాని భగవాన్ మాయమై పోతారనే సంగతిని భరించలేను.

కొంతసేపటికి భగవాన్ కూచుని వున్న స్థలాన్ని ఒక presence ఆక్రమించింది. క్రమంగా ఆ స్థలం నించి నా వేపుకి బయలుదేరి, చివరికి నా హృదయంలోకి ప్రవేశించింది. వెంటనే నా దృష్టి నా హృదయంలో నిలిచింది. అక్కడ గొప్ప ఆనందంతో నవ్వుతున్న భగవాన్ మొహం కనిపించింది.

మోక్షమంటే "నేను" అనే భావం నశించడమనీ, చివరికి మిగిలేది భగవాన్ అనీ అర్థమైంది నా కప్పుడు.

నేను ఇంటికి తిరిగి వెళ్లినప్పుడు "అరుణాచలం నుండి లేఖ" రాశాను, నా రెండో అరుణాచల ప్రయాణాన్ని వర్ణిస్తో. అంతకు ముందు ఒక కథ రాశాను. తర్వాత ఒక నాటకం రాశాను. ఇది నా మూడో రచన. నా కథనీ, నా నాటకాన్ని, అందరూ చాల మెచ్చుకున్నారు. కాని నా "లేఖ" నా పాఠకుల్ని disappoint చేసింది. అంత మంచి కథను రాసిన సౌరిస్ వృత్త చెత్త రాసిందన్నారు.

డిసెంబరులో నాన్నా, దీక్షితులుగారూ అరుణాచలం వెళ్ళినప్పుడు వాళ్ళతో నేను వెళ్ళలేదు. నాన్న అరుణాచలం నించి నాకు రాశారు—భగవాన్ నా లేఖని భారతిలో చదివి దాన్ని ఇంగ్లీష్‌లోకి, అరవంలోకి translate చేయించారనీ, ఆశ్రమంలో అందరూ చదివి చాల మెచ్చుకుంటున్నారనీ. నే



నది రాసినప్పుడు అది భగవాన్ చదువుతారనే సంగతి కలలో నైనా అనుకోలేదు నేను. నా సంతోషానికి మేర లేదు.

ఆ రోజుల్లోనే మా స్నేహితులు ఒకావె కొడుకు పోయిన దుఃఖంలో భగవాన్ దగ్గిరికి వెళ్ళింది. ఆమెకి నా లేఖని ఇచ్చి భగవాన్,

"నాకు తెలుగు సరిగా అర్థం కాదు, కొంచెం చదివి పెట్టు."

అన్నారుట.

"అపారమైన కరుణ."

అని వాళ్ళు చదివినప్పుడు,

"నా కరుణా? నేనా అమ్మాయిమీద అంత దయ చూపించాను గావును."

అన్నారుట. మళ్ళీ—

"ఆ బిడ్డకు నా మీద అంత ప్రేమ గావును"

అన్నారుట. ఆ లేఖ చదవడంతో ఆమె దుఃఖమంతా మాయమైందిట. మొట్టమొదట నా లేఖని చదివించుకున్నప్పుడు భగవాన్—

"నన్ను దొంగ అన్నది. నేనేం దొంగిలించాను?"

అన్నారుట.

మళ్ళీ మేలో తిరిగి నాన్నా, నేనూ అరుణాచలం వెళ్లాం. మేము ఆయనకి నమస్కరించి కూచోగానే, భగవాన్ మౌన

స్వామితో మమ్మల్ని గురించి మాట్లాడడం మొదలు పెట్టారు. ఏం మాట్లాడుతున్నారో విందామని మేము దగ్గిరికి జరిగేటప్ప టికి మాట్లాడడం మానేశారు. వున్నన్ని రోజులూ భగవాన్ నాతో ఆ విధంగా ఆటలాడారు. నేను నమస్కారం చేసి ఆయన ముందు నుంచున్నప్పుడు నా వేపు కన్నెత్తి చూడ కండా, నేను వెళ్ళడానికి వెనక్కి తిరిగినప్పుడు అందరితో—

"అ అమ్మాయి ఎవరో తెలుసా? సారీస్. ఆ లేఖ రాశింది ఈ అమ్మాయే."

అని చెప్పేవారు.

ఒకరోజు సాయంత్రం నేను బావి అంచుమీద కూచు న్నాను. నాకు కొంచెం దూరంలో భగవాన్‌కి సోఫా వేశారు. భగవాన్ వచ్చి కూచోగానే ఆయన పరిచారకుడు నన్ను అక్కడనించి లేవమని అడిగాడు నేను భగవాన్ కన్న ఎత్తుగా కూచున్నానని. నేను లేవబోతూ వుండగా భగవాన్ సౌజ్ఞ చేస్తో—

"కూచో, కూచో"

అన్నారు నవ్వుతో.

నేను ఆయన వేపే చూస్తూ కూచున్నాను. నేను తన వేపు చూస్తున్నంతసేపూ భగవాన్ ఎక్కడో చూస్తారు. నేను ఆయన వేపు చూడనప్పుడు నా వేపు చూస్తారు. ఈ విధంగా అల్లరి కుర్రాడిమల్లే నాతో దోబూచులాడారు నేను కూచు న్నంత సేపూ.



సింహమంత గంభీరంగా, అరుణాచలమంతా నిశ్చ లంగా, సహజ నిష్టలో వుండే భగవాన్ అల్లరి పిల్లవాడిమల్లే నాతో ఆటలకి దిగడం నేను నమ్మలేక పోయాను.

మళ్ళీ డిసెంబరులో భగవాన్ దగ్గిరికి వెళ్ళాం. అమ్మ satin దిండు మీద రంగు దారాలతో నెమలిని కుట్టి నా చేత భగవాన్‌కి పంపింది. ఆ దిండుని భగవాన్‌కి ఇచ్చినప్పుడు నా వేపు నవ్వుతో చూసి,

"ఏమిటిది? ఏమిటిది?"

అని అడిగారు. నేను మాట్లాడకండా ఆయన చేతికిచ్చి వొచ్చేశాను.

ఆ తరవాత పదేళ్ళవరకూ మళ్ళీ వెళ్ళలేదు భగవాన్ దగ్గిరికి. ఆశ్రమం నించి వొచ్చిన తరవాత ఇల్లు కైదులాగు వుండేది నాకు. భగవాన్ దగ్గిరికి ఎప్పుడు వెడదామని గట్టిగా అనిపించినా భగవాన్ కలల్లో కనపడి నన్ను ఓదార్చేవారు.

"ఎందుకు దిగులు పడతావు? నేనెప్పుడూ నీ వెంటే వున్నాను."

అని. నా సాధన విడనకుండా చేస్తోనే వున్నాను. ఆయన కలల ద్వారా నన్ను guide చెయ్యకపోతే, నేను చాలసార్లు దోవ తప్పేదాన్ని. ఎంతమంది వల్లనో మోస పోయేదాన్ని. ఒకసారి కలలో భగవాన్ కనపడి, నన్ను-

"writing ని choose చేసుకుంటావా? self realisation న్ని hoose చేసుకుంటావా?"

అని అడిగారు. కలలోనే నేను self-realisation న్ని choose చేసుకున్నాను. నా రచనద్వారా సంపాదనతో అరుణాచలంలో వుండవచ్చుననుకుని ఆశపడ్డాను. అదికాక, రచన నాలో emotion outlet. నా మనసుకే స్పష్టంకాని, మాటల్లో వర్ణించి చెప్పలేని భావాలని కాయితం మీదికి ఎక్కించడం వలన మనశ్శాంతి కలిగేది. నా కథలు చదివిన వాళ్ళు—

"ఇప్పు డెందుకు రాయటం లేదు?"

అని అడిగినప్పుడు,

"భగవాన్ మానెయ్యమన్నారు."

అని బదులు చెప్పేదాన్ని. నా వేపు ఎగాదిగా చూసే వాళ్ళు అర్థంకాక.

ప్రతి శలవుల్లోనూ నేనూ, నాన్నా భగవాన్ దగ్గిరికి వెళ్ళడానికి ప్రయత్నించే వాళ్ళం, కాని సాధ్యపడేది కాదు. భగవాన్‌కి నేనక్కడికి రావడం ఇష్టం లేదు. నేను రావాలని భగవాన్ అనుకున్నప్పుడు ఆయన తప్పకండా నన్ను రప్పించుకుంటారు అని సముదాయించుకునేదాన్ని. అంతేకాదు అంత భారాన్నీ ఆయన మీద వెయ్యడానికి ప్రయత్నించే దాన్ని,



నన్ను ఇక్కడ వుంచడమూ, తన దగ్గిరికి తీసికెళ్ళడమూ ఆయనకే వొదిలాను.

రోజు రోజుకీ ఆయన్ని ఎంతో దగ్గిరిగా నాతోనే వున్నట్టు feel అవడం మొదలు పెట్టాను. ఆయన దగ్గిరికి వెళ్లాలనే వాంఛ నాలో తగ్గిపోయింది. నన్ను ఆయనకి అర్పించుకోవడం నేర్చుకున్నాను. రోజురోజుకి నా ఆరోగ్యం చెడిపోవడం మొదలు పెట్టింది. భౌతికంగానూ, మానసికంగానూ, భరించలేని బాధలో అంతులేని దుఃఖంలో గడిపిన అన్ని సంవత్సరాలూ, భగవాన్ నన్ను విడవకండా కనిపెట్టే వున్నారు. అన్ని పరీక్షల్లోనూ, కష్టాల్లోనూ, ఆపదల్లోనూ, నాకు సహనాన్ని, శాంతంతో జీవితాన్ని ఎదుర్కొనే బలాన్ని ఇచ్చారు.

పదేళ్ళ తరవాత, మా guardian అయిన మా పెత్తల్లి చచ్చిపోయారు. ఆమె పోవడంతో, భగవాన్ మరీ దగ్గిరయినారు నాకు. ఆమె పోవడం వలన ఎన్నో కష్టాలు, గొడవలూ వొచ్చిపడ్డాయి మామీద. కాని ఆమె చావు ప్రపంచంతో మాకున్న చివరి బంధాన్ని తెంపింది. భగవాన్ దగ్గిరికి కాక ఇంకెక్కడికి పోతాం?

అందరం అరుణాచలానికి బయల్దేరాం. అప్పటికే భగవాన్‌కి cancer వొచ్చి, మూడుసార్లు ఆపరేషన్లు చెయ్యడమైంది. ఆయన చివరి దశలో ఉన్నారు. మేము మూడు బళ్ళ

సామానుతో దిగేప్పటికి రమణ నగరవాసు లందరూ నవ్వడం మొదలు పెట్టారు. కాని మాకు మాత్రం భగవాన్ దేహంలో వున్నా లేకపోయినా అరుణాచలమే చివరి శరణ్యం.

మేము ఇక్కడ స్థిరపడిన తరువాత, నా ధ్యానంలో మార్పు కలిగింది. ఇదివరకులాగ భగవాన్ భౌతిక రూపాన్ని చూడగానే నా హృదయంలో ప్రేమ వెలగటం లేదు. కాని ఆయనమీద నా భక్తి, ప్రేమా ఏ కోశానా తగ్గలేదు. ఇప్పుడు భగవాన్ ఆకారం మీద కాక అసలు భగవాన్ నిజరూపం మీద నా హృదయం నిలుస్తోంది. ఎందుకావిధంగా జరిగిందో తరవాత అర్థమైంది నాకు. భగవాన్ కావలిసే తన మీది నా ప్రేమలో వుండే బంధాన్ని దొంగిలించి, తన దేహం మీద కాక అసలు తన సత్స్వరూపం మీద నా ప్రేమ నిలిచేటట్టు చేశారు.

భగవాన్ చచ్చిపోవడమనే shok ని నేను భరించగలనా అని బాధ పడేదాన్ని చాలసార్లు. కాని సరిగ్గా ఆ సమయానికి నేను అరుణాచలంలో వుండకపోవటం సంభవించింది. ఆయన మరణవార్తని విన్నప్పుడు నాలో ఏ చలనమూ కలగ లేదు. నా indiffrence ని చూసి నాకే ఆశ్చర్యమేసింది. కాని వెంటనే ఇది ఆయన నా మీద చూపించిన కరుణ అని తెలుసుకున్నాను.

నేను మద్రాసులో వుండగా, నాన్న దగ్గర్నించి



ఉత్తరం వొచ్చింది– భగవాన్ సమాధి దగ్గిర, అసలు భగవాన్ జీవించి వున్నప్పటికన్నా ఎక్కువ spiritul potency ని feel అవుతున్నానని.

నేను ఆశ్రమానికి తిరిగి వొచ్చినప్పుడు ఆశ్రమమంతా ఎడారిలాగుంది. వెంటనే భగవాన్ presence ని feelఅయ్యాను, భగవాన్ కంటికి కనపడనంత మాత్రాన ఈ భక్తులందరూ ఎందుకు ఆశ్రమాన్ని వొదిలి వెళ్ళిపోతున్నారా అని ఆశ్చర్యమేసింది నాకు. సమాధి దగ్గిర కళ్ళు మూసుకుని కూచోగానే భగవాన్ నవ్వుతున్న మొహం ప్రత్యక్షమయ్యేది. కాని ఎంత స్పష్టంగా భగవాన్ని feel అవుతున్నా నా కళ్ళు ఆయన భౌతిక శరీరం కోసం వెతికేవి.

చాల శక్తివంతంగా సాగుతోంది, ఆయన సమాధి దగ్గిర నా సాధన. క్రమంగా నా సాధనని నా చేతులోంచి నా control నించి తీసుకుని, ఒక మహాశక్తి నన్ను guide చెయ్యడం మొదలు పెట్టింది. నేను ఎంతసేపు, ఎక్కడ సాధనకి కూచోవాలో, ఎప్పుడు లేచి వెళ్ళాలో, అంతా ఆ శక్తి నిర్ణయిస్తుంది. నా ధ్యానం తీవ్రమైన కొద్దీ, నా శరీరం బలహీనమై పోతోంది. ధ్యానంలో వున్నప్పుడు నా గుండె గట్టిగా పట్టుకున్నట్టయేది. గుండె దడ మొదలైంది. నా శరీరం దుర్బలమౌతున్నా దాన్ని లక్ష్యపెట్టలేదు నేను.

ఒకరోజు సాయంత్రం ఆశ్రమానికి వెళ్ళలేనంత నీరసంగా వున్నాను. నేను ధ్యానంలో కూచోగానే, ఒక గొప్ప శక్తి నా శరీరాన్నావరించింది. నేను లేచి వెళ్ళి భగవాన్ ఫొటో ముందు కూచుని, తిరిగి ధ్యానంలో పడిపోయాను. ఎవరో నా గుండెను పట్టి ఆపినట్టు feel అయాను. వూపిరాడ లేదు. నా చేతులూ, కాళ్ళూ చల్లపడి పోయాయి. భయం వేసింది. చావో, మోక్షమో - ఈ రెండిటిలో ఏదో జరగ పోతోందనిపించింది. నా నాడి బలహీనంగా వుంది.

నాలుగు రోజులు ఆ స్థితిలో వుండిపోయాను. నీరసం కలిగిస్తోందని ధ్యానంచెయ్యడం నేను మానినా, ధ్యానం నన్ను వొదల లేదు. చివరికి ఓపిక రాగానే, భగవాన్ సమాధి దగ్గిరికి వెళ్ళి నా జీవితాన్ని ఇంకొకసారి భగవాన్‌కి అర్పించేశాను, "నన్ను చంపినా సరే, మోక్షాన్నిచ్చినా సరే, నీ ఇష్టం. నేను భయపడను, నా కర్మనించి తప్పించుకోవాలని చూడను," అని.

ఆ క్షణం నించి నా భయం మాయమైంది. నా గుండె పట్టుకు పోవడం కూడా ఆగింది.

మా వాళ్ళు నా అనారోగ్యాన్ని గురించి ఆదుర్దా పడుతున్నారు. టానిక్‌లు, stimulauts ఇస్తున్నారు. అప్పుడే నా కొక కల వొచ్చింది. అమ్మ భగవాన్ దగ్గిరికి వెళ్ళి, నన్ను



గురించి తను పడుతున్న ఆదుర్దా భగవాన్‌తో చెప్తుంది. అప్పుడు భగవాన్,

"ఏం భయం లేదు. నడుం వరకూ వొచ్చింది. నన్ను మించి వెళ్తుంది"

అన్నారు.

ఆశ్రమానికి కూడా వెళ్ళలేక పోతున్నాను. ఆశ్రమానికి వెళ్ళడమంటే నా కెంతో ఇష్టం. కాని నన్ను guide చేస్తున్న శక్తి నన్ను వెళ్ళనివ్వటం లేదు. భగవాన్ ఫొటో దగ్గిర నుంచుని ఆయనని అడిగేదాన్ని-

"ఆశ్రమానికి పంపించరా?" అని.

"నేనిక్కడ లేనా?" అన్నట్టు నా వంక చూశేవారు భగవాన్ ఫొటోలోంచి.

త్వరలోనే నన్ను guide చేస్తున్న శక్తి నన్ను చీకటి గదిలోకి తీసుకుని పోయింది. అక్కన్నించి కదల లేకుండా రోజంతా వుండిపోయేదాన్ని. నా దేహమంతా వూగిపోయేది. బుస్ మనే శబ్దంతో వూపిరి వొచ్చేది. ఇట్లా నాలుగైదు రోజులు గడిచాయి. ధ్యానం లేదు. ధ్యానం వలన కలిగే ఆనందం లేదు. ఆ చీకటి గదిలో వూపిరాడక అట్లా కొట్టుకుంటున్నాను. ఇంక ఒక్క క్షణం ఆ గదిలో వుండలే నని పించింది. ఆ సమయంలో భగవాన్ నవ్వుతున్న మొహంతో

నాకు దర్శన మిచ్చారు. నా హృదయం ప్రేమతో సంతోషంతో నిండింది.

"ఓ భగవాన్! ఎన్నాళ్ళు నేనీ చీకటి గదిలో ఇట్లా కొట్టుకోవాలి?"

అని అడిగాను. ఆయన నవ్వి,

"నీకు సంపూర్ణ ఆరోగ్యం చేకూరవద్దా? నీకు ఈశ్వర దర్శనం కావద్దా?"

అన్నారు.

"నాకా ఈశ్వరు డెవరో తెలీదు. ఆయన దర్శనం నాకు వొద్దు. నాకాకావలసింది మీరు. నన్ను వొదిలి వెళ్ళకండి."

అన్నాను. ఆయన నవ్వి మళ్ళీ,

"నీకు సంపూర్ణ ఆరోగ్యం చేకూరవద్దా? ఈశ్వర దర్శనం కావద్దా?"

అని మాయమైనారు.

మర్నాడు మధ్యాహ్నం సరిగా భగవాన్ దర్శనమిచ్చిన వేళకే ఈశ్వరుడు నాకు దర్శనమిచ్చారు.

ఈ ప్రపంచాన్ని పరిపాలించే ఈశ్వరుణ్ననీ, భగవంతుడు వున్నాడా లేడా అని సందేహిస్తో, చీకట్లో వెతుకు



తున్న మాకు-ఈశ్వరుడున్నాడనీ, ఆయన దయామయుడనీ, ప్రేమమయుడని నిరూపించడానికి వొచ్చాననీ, తనూ భగవాన్ ఒకరేననే, ఇంత కాలమూ భగవాన్ రూపంలో మేము చూసింది ఈశ్వరుణ్నేననీ చెప్పారు.

"ఇప్పుడు నేను సత్యరూపంలో దర్శనమిస్తున్నాను. కాని నిజానికి నాకు రూపం లేదు, నామం లేదు. ఇంక మీదట నించి నా వాక్కు ద్వారా మిమ్మల్ని నడిపించ బోతున్నాను. మిమ్మల్నే కాదు, నీలోంచి మాట్లాడేది ఈశ్వరుడేనని ఎవరు విశ్వసిస్తే వారిని కూడా నడిపించుతాను,"

అని అన్నారు.

ఆ తర్వాత నా పూర్వ జన్మల్ని గురించీ, ఈ సృష్టిని గురించీ, ఇతర లోకాలని గురించీ, ఆధ్యాత్మికం, వేదాంతం, యోగం-ఇంకా ఎన్నో విషయాలు, వాటి అంతరార్థాలు, నాకు గ్రాహ్యం చేశారు.

భగవాన్ బోధించే వేదాంతాన్ని అర్థం చేసుకుని ఆయన చెప్పిన మార్గంలో నడుస్తున్న నేను ఈశ్వరుడు చెప్పే వాటిని స్వీకరించ లేదు. అందులో భగవాన్, సాధనలో కన పడే visions మీద మనసు నిలపకండి అని warn చెయ్యడం వలనా, నా హృదయం భగవాన్ రూపం మీదనే, ఆయన మీద ప్రేమలోనే లగ్నమవడం వలనా, అత్యంత సుందర

మైన రూపంతో ఈశ్వరుడు నాకు దర్శన మిచ్చినా, ఆయన మీద నిలవలేదు నా మనస్సు.

కాని ఆయన నా మనసు కల్పించిన visionని కాదని ఎన్నో విధాల నన్ను Convince చేశారు. తను చెపుతున్న వన్నీ సత్యమనీ, సందేహించవద్దనీ, కావలిస్తే నీ భగవాన్నే అడగమనీ చెప్పారు. అప్పుడు భగవాన్ నాకు దర్శన మిచ్చి,

"నా తండ్రి చెప్పేదంతా సత్యం, ఆయన చెప్పినట్టు నడుచుకో."

అని చెప్పి మాయమయారు.

ఆ రోజు నించీ ఈశ్వరుడు మా యింట్లో ప్రతివారిని guide చేస్తున్నారు. ఆ రోజు నించీ నా సంకల్పమనేది, నా will అనేది నశించింది. దాని బదులు ఆయన will నన్ను నడుపుతోంది.

మా దగ్గిర స్నేహితులు కొందరు ఈశ్వరుడిని నమ్మారు. ఇంకా దగ్గిరైన స్నేహితులు నమ్మలేదు. భగవాన్ సంగతి విననివాళ్లు కొందరు ఈశ్వరుడిని గురించి, భగవాన్ని గురించీ తెలుసుకుని భక్తులయారు. ఈశ్వరుడి guidance వలన ఆధ్యాత్మిక దృష్టినీ, సహాయాన్ని పొందారు.



భగవాన్ మీద భక్తి వుండి గూడా, తన నాస్తికత్వాన్ని సందేహాలని వొదలని నాన్న, ఈశ్వరుడిని విశ్వసించాడు.

ఆనందమయి 'మా', అరుణాచలం వొచ్చినప్పుడు ఆమెని చూడాలనిపించింది నాకు.

"సరే. ఆమెని కలుసుకుందువు గాని"

అన్నారు ఈశ్వరుడు.

'ఆశ్రమానికి వెళ్ళడానికి అనుజ్ఞలేని నేను, ఆమెని ఎట్లా చూస్తాను?' అనుకున్నాను. దానికి ఈశ్వరుడు—

"భౌతికంగా కాదు spiritual గా కలుసుకుంటావు" అన్నారు.

సాయంత్రం ఆమె మా కాంపౌండ్‌లోకి వొచ్చినప్పుడు ఆమె presence ని నా హృదయంలో feel అయాను. అస్పష్టమైన ఒక స్త్రీ ఆకారం నా కళ్ళముందు కనపడింది. ఆమెకి నమస్కారం చెయ్యాలనుకుంటో వుండగా ఆమె స్థానంలో భగవాన్ నుంచుని ఉన్నారు కర్ర పట్టుకుని. నా దగ్గిరికి వొచ్చి నా ఎదురుగుండా కూచున్నారు. నేను సమాధి స్థితిలో పడిపోయాను. అనందమయి 'మా' కాంపౌండ్లో వున్నంత వరకూ ఆమె presence feel అవుతోనే వున్నాను. ఆమె అక్కడ నించి వెళ్ళినప్పుడు, ఆమె presence ని feel అవడం

మానాను. అప్పుడు నాకు తెలిసింది ఏ రూపమైనా అది భగ వాన్ రూపమేనని, ఆయన నించి ఎవరూ వేరు కాదని, వారిద్దరూ ఒకరే కనక, ఆనందమయి 'మా' బదులు భగవాన్ నాకు దర్శనమిచ్చారని అర్థం చేసుకున్నాను.

ఈ రోజు వరకు గూడా భగవాన్ తన వాక్కు ద్వారా మమ్మల్నందర్నీ guide చేస్తున్నారు. ఈ సంగీతం ఇంకా రాగాలాపనలో వుంది. త్వరలో విశ్వగానమయి ప్రపం చాన్ని ఆవరించ పోతోంది. ఆ గానం మధ్య భగవాన్ నీరవ గానం వినపడుతోనే వుంటుంది. మనతో వుండి మన మధ్య నిరంతరం జరపుతున్న భగవాన్ మహాలీలలకి అంతెక్కడ?

——

ముద్రణ:
క్రాంతి ప్రెస్, 12, ఫ్రాన్సిస్, జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు - 1

